విశ్వసాహిత్యమాల 60.

# జనులు : మహాజనులు

"మహాజనో యేన గత స్స పంథా"

రచన : మైకేల్ ఇలిన్ & ఇ. సెగాల్.

అనువాదం ; మహీధర జగన్మోహనరావు



యద్య దాచరతి శ్రేష్ఠః త త్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువ ర్తతే ॥
(భగవద్గీత 3 - 21)



విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

# THE GIANT WIDENS HIS WORLD

*(The Middle Ages and the Renaissance)*

MIKHAIL ILIN & I. SEGAL

Translated by

## M. JAGANMOHAN RAO

*Published by*

VISWA SAHITYAMALA, RAJAHMUNDRY.

Copious notes & Pictures have been furnished by the translator M. Jaganmohan Rao.

మొదటి కూర్పు ఏప్రిల్, 1955

రెండవ కూర్పు ఏప్రిల్, 1965

రెండో కూర్పు

వేయి ప్రతులు

వెల రు. 20-00

## పాఠకోత్తములకు వినతి,

ఇదిగో! ఇంకో అద్భుత గ్రంథం మీ చేతుల్లో ఉంచుతున్నా శ్రద్ధగా చదవండి! రక్తం ఉప్పొంగుతుంది. హృదయం ద్రవిస్తుంది. మీ మనో నేత్రాలముందు మధ్యయుగాల విజ్ఞానచరిత్ర యొక్క చిత్రవిచిత్రవర్ణ విశోభిత పటం విప్పారుతుంది! మూఢవిశ్వాసాలు, అసహనం, గతాను గతికత్వం అనే గాఢతిమిరంనుంచి శాస్త్రవిజ్ఞాన మనే వెలుగులోకి పాశ్చాత్యదేశాల్లో మానవుడు తడుముకుంటూనే పురోగమిస్తూన్న కాలం అది! తమసో మా జ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతం గమయ! అని ముక్త కంఠముతో మానవుడు యెలుగెత్తి గానం చేసిన దినము లవి! అట్టి రినైజాన్సు యుగ దృశ్యాలు, మానవుని పునరుజ్జీవన యుగం పాఠకుని కనులముందు ప్రదర్శితమవుతూంది. అంతకు వేల సంవత్స రాల క్రిందట భారతీయ ఋషులు ముక్తకంఠంతో గానంచేసిన దాని బలహీనమైన ప్రతిధ్వనియే, ఇది కావచ్చు!

దీనిలో యెన్నో దృశ్యములు, రంగములు, యెందరో కథానాయకులు వున్నారు. ఇండియా, ఇంగ్లాండు, ఇటలీ, బైజాంటియం, ఫ్రాన్సు, సమీప ప్రాచ్యదేశాలు, రష్యా మొదలైన దేశాలకు మనం యాత్రలు సాగిస్తాము. పశ్చిమాన మరో కొత్తఖండాన్నీ, తూర్పున సైబీరియా విశాల ప్రదేశాల్ని కనిపెడతాము పారిస్, ఫ్లోరెన్సు, ఆక్సుఫోర్డు, మాస్కో, బాగ్దాద్, బొఖారా నగరాల్లో మానవులు పరిశోధించడం పఠించడం, పర్యటం చేయడం, వ్రాయడం, గృహనిర్మాణం చేయడం, గుణించడం, గణించడం మొదలైన కృషులలో నిమగ్నులు కావడం చూస్తాం కొపర్నికస్, బ్రూనో, కొలంబస్, ఎర్మాక్, రోజర్ బేకన్, లియోనార్డో ఆదిగాగల మహాజనులతో మనమూ పరిశ్రమిస్తాం, ఆలో చిస్తాం, తపిస్తాం, కలలు గంటాము!

మహారణ్య మధ్యంలో సుందర నగరాలు నిర్మించడం చూస్తాం ప్రపంచ వ్యాపారమార్గాలు అంతకంతకు సమ్మర్ధములగుట పరికిస్తాం. మొట్టమొదటి కర్మాగారాలు బైలుదేరడం కనుగొంటాము తన యింటి మాట ఎటున్నా దేవునికి శిలాదేవాలయాలు నిర్మించడం గమనిస్తాం. పరిసరాలు పరిస్థితులు, మారడంతోబాటు మానవుని భావాలు మారడం చూస్తాము. విశ్వరూపాన్ని గూర్చి, సృష్టి స్వభావాన్ని గూర్చి చెప్పబడుతూన్న పురాతనభావనలను సాహసులైన మేధావంతులు యెదిరించుతూ, శాస్త్రాలోచనాస్వాతంత్ర్యమును నిరోధించువారి ధూర్త పౌష్ట్య మూర్ఖత్వాల నెదిరిస్తూన్న కాలమది ప్రకృతిశక్తుల నర్థం చేసికొని, విజయాన్ని సాధించడంలో మానవుడు పెద్ద ముందంజలను వేసిన యుగమది అట్లు చేయుటలో మానవుని దిఙ్మండలం విస్తృతమై, మన ఆధునిక యుగానికి బాటను సుగమం చేసింది.

ఈ కథంతా మనోహరమైన శైలిలో వ్రాయబడింది ఇదొక వచోగీతం. ఎన్నో ప్రాచీనగాథలు చమత్కారంగా, సజీవంగా చెప్పబడినాయి, ఇందులో. శరత్కాలపు వెన్నెలలా హాయిగా, చల్లగా, మనోరంజకంగా వుంటుం దీ గ్రంథం ఆహ్లాదకరమైన విజ్ఞానోద్యానవనంలో విహరిస్తున్నట్లుంటుంది. యిది చదువుతూంటే శతాబ్దాల క్రిందట జీవించిన స్త్రీపురుషులు యీ నాటి మన యిరుగు పొరుగు మానవులుగా, వారి కృషిని గూర్చి సజీవంగా తోపించే కథలు, గాథలు చెప్పగల దిట్ట, రచయిత ఇలిన్, రుచీపచీ లేని చప్పని చరిత్ర గ్రంథాల్లా గాక దీన్ని ప్రారంభిస్తే కొసకంటా క్రింద బెట్టనీయదు. దీని శైలి, ధోరణి, శక్తి వంచనలేక దీనిని తెలుగులో నేను చెప్పాను. సహృదయులే సాక్షీభూతులు –

తినబోతుంటే రుచి యెందుకు లెండి ! ఇక చదవండి

ఆగండి, మరొక్కమాట ఈ రెండోకూర్పులో–

ఎన్నోన్నో చేర్పులు కూర్పులు చేశాను. సుమారు అరవై బొమ్మలూ చేర్చాను. రసవత్తరంగా జేయాలనే నా కృషి ఎంతవరకు ఫలించినదో పాఠకులే చెప్పాలి మీ అభిప్రాయాలు నాకు తెలుపుతే సంతోషిస్తా.

'జ్ఞానం - విజ్ఞానం' అను దీని పూర్వగ్రంథం కూడా పునర్ముద్ర ణకు తయారుచేస్తున్నాను. దానికి యెన్నో చేర్పులు కూర్పులే గాక నూరు బొమ్మల్ని కూడా చేర్చాలని సంకల్పం. పాఠకు లిచ్చే ప్రోత్సాహంమీదనే అని ఆధారపడి వుంటుంది

'జ్ఞానం - విజ్ఞానం' 'జనులు - మహాజనులు' 'మానవులు - మహీధరములు' ఈ మూడు పుస్తకాలు లేని గృహగ్రంథాలయం అస మగ్రమని మీరు తలచుచో నా కృషి ధన్యమని తలంతును.

రాజమండ్రి,
30—5—1965

ఇట్లు,
మహీధర జగన్మోహనరావు,
ర చ యి త.

# వి ష య సూ చి క.



—o—

# జనులు : మహాజనులు

## మానవుడు భ్రష్టుడైన దెట్లు?

### ఒకటో ప్రకరణం

### కడపటి రోమనులు

ఇటలీ దేశం సర్వనాశనమైపోయింది. ఎన్నో నగరాలు శిథిలములై పోయినాయి. కొన్ని పూర్తిగా నామమాత్రావశేషములైనాయి. ఈ భూమినుంచి శుభ్రంగా తుడిచివేయబడినాయా? అన్నట్లున్నాయి, ఆ నగరాలు. మానవునిమీదికి పంచభూతాలూ ప్రళయోద్దండంగా తిరగబడినవా? అనిపిస్తుంది. ఏ భూకంపమో, జలప్రళయమో మాత్రమే యిట్లాంటి వినాశాన్ని గావించగలవు. నిన్న మొన్నటివరకు సర్వసంపదలతోనూ భోగభాగ్యాలతోనూ తులతూగుతూన్న ప్రాంతాలు యీనాడు సర్వనాశనమైపోయాయి.

సాగులేక పొలాలన్నీ కలుపువేసిపోయాయి. ఉపేక్షించడం వల్ల ద్రాక్షతోటలు మహారణ్యాలుగా గజిబిజిగా అల్లుకుపోయినాయి. భూదేవి తల్లిలాంటిది. వంధ్యగా, నగ్నంగావుండ నిచ్చగించదామె. తన గాయాలను భూమాత [illegible]మైన రీతిగా మాన్చుకో ప్రయత్నిస్తూంది

రోమక సినేటర్ల (ప్రజాప్రతినిధులు) రాజభవనాలు శిథిలాలుగా వున్నాయి. రోములోని సుందరప్రాసాదాల భగ్న స్తంభాలనుంచీ వాటి తాలూకు చలువరాతి తునకలనుంచీ బర్బరులైన నూతనాగంతుకులు తమకోసం కొత్తగా గ్రామాలనూ, గృహాలనూ నిర్మించుకుంటున్నారు. భగ్నములైన దుర్గ కుడ్యముల శిలాఫలకములతో వారు మళ్లా కోటలు లేవదీస్తున్నారు. తమాల వృక్షములతో సల్లగా నున్న తోపుల్లోంచి నిర్దాక్షిణ్యంగా వారు తమ గొడ్డండ్లతో చెట్లను నరికి తెచ్చి, తమ గుడిసెలలో నెగళ్ళు వేసుకుంటున్నారు. ఆ పచ్చిదుంగల పొగతో ఆ బర్బరుల గుడిసెలు పొగచూరి నల్లనై వున్నాయి.

రోమును జయించిన యీ బర్బరులు గోథ్ జాతివారు. గ్రామ వీధుల్లో గోథుల పిల్లలు రోమను శిల్పాల తునకలతో ఆడుకుంటున్నారు. రోమను అంగీలు, ఉత్తరీయాలు, వాటి తునకలు, గోథుమాతలు తమ పురిటింట్లలో శిశువుల పొత్తిళ్లుగా వుపయోగిస్తున్నారు.

గోథులరాజు తన పరివారానికి యీ దేశాన్నంతనీ బహు ఉదారంగా పంచియిచ్చేడు. రోమునగరానికి దగ్గరలో నున్న ఒక భూఖండంమీద గోథురాజపరివారంలోని వాడొకడు జమీందారుగా నూతనయజమానిగా స్థిరనివాసం యేర్పరచుకున్నాడు. ఇటలీలోని సుక్షేత్రాలన్నీ గోథురాజు తన జాతీయులకు పంచిపెట్టి యెంతో ఔదార్యాన్ని ప్రదర్శించేడు. కాని, ఇటలీలోని బానిసల స్థితిలో మాత్రం యే మార్పూ రాలేదు.

రోమనుల పాలన పోయి గోథుల పాలన వచ్చింది, అంతే. యజమాని మారాడే గాని బానిసజనుల స్థితిగతుల్లో అభివృద్ధికలుగలేదు. గోథులరాకను సర్వాత్మనా వాంఛించినవారు రోములోని బానిసలే. రోమునగరద్వారాల్ని దాడిమూకలకు తెరచినవారు నగరంలోని బానిసలే. కాని, యిప్పుడీ నూతనయజమానులు, గోథుప్రభువులుకూడా బానిసలను నాగలి బట్టమనీ, పార కొట్టమనీ పురమాయిస్తూన్నారు !

అక్కడక్కడమాత్రం యింకా కొద్దిమంది రోమను భూస్వాములు మిగిలివున్నారు. వారు తమకు చేతనైనట్లుగా యీ కొత్తపరిస్థితుల్లో జీవిస్తున్నారు. నిజానికి వారెట్లో కాలక్షేపం చేస్తూన్నారనే చెప్పాలి. నూతనమై, క్లిష్టమై, భయంకరమై వున్న అప్పటి పరిస్థితులకు అనుగుణ్యంగా నడుచుకొనేందుకు వారు ప్రయత్నించేవారు. ఏటేటా రవెన్నా నగరానికి, గోథురాజధానికి వెళ్ళి రాచబొక్కసంలో కప్పం చెల్లించి వచ్చేవారు, యీ రోమక భూస్వాములు. తమ రాబడిలో మూడోవంతు మొత్తం కప్పముక్రింద చెల్లించాలి, యీ సామంతులు. మొత్తం రాబడినంతనూ తీసికొనందుకు వారు గోథురాజుకు కృతజ్ఞులై వుండేవాళ్ళు. తల పోకుండా కట్టుపోగులుమాత్రమే పోయినందుకు సంతోషించనివారుంటారా ?

పాతరాజధాని రోమునగరంకంటె కొత్తరాజధాని రవెన్నా విలక్షణమైనది. ఉత్తర ఇటలీలోని కీకారణ్యాల్లో అదొకదుర్గంలాగ ఆకాశమంటుతూ వుండేవి ప్రాచీన దేవాలయ శిఖరాల

మీాదా, విగ్రహారాధనలు చేసేచోట్లా, 'క్రీస్తుసిలువలు' అప్పటికి చాలకాలాన్నుంచే నాటుతూన్నారు. పాతన్యాయస్థానాల్లో, ఒకప్పుడు న్యాయాధికారులు అధ్యక్షులై కొలువు తీర్చినచోట్ల "వేదికలు"నిర్మించబడినాయి. గోధురాజు థియోడోరిక్ ఇప్పుడు తనను 'అగస్టస్' అని పిలిపించుకుంటున్నాడు. ఈ లాటిన్ పదానికి అర్థం, గౌరవనీయుడైన, పవిత్రుడైన వాడు అని. పరదేశ రాయబారులకు దర్శనమిచ్చినపు డీతడు కూడా రోమను సీజరులవలె ఊదారంగు అంగీని ధరించి, ధగధగ మెరిసే కిరీటాన్ని పెట్టుకునేవాడు.

ఊదారంగు నిలువుటంగీ తొడిగి తలపై బంగారు కిరీటం ధరించడం వరకే కాని గోధురాజు వెనుకటి అగస్టస్ సీజర్‌ను యెంత మాత్రం పోలిలేడు! ఇతడు లాటిన్ భాష వ్రాయనూ లేడు; చదువనూ లేడు. ఆజ్ఞలు, తీర్పులు మీాద చివరికి చేవ్రాలుకూడ పెట్టలేడు! ఏ బర్గండీరాజుకో, ఫ్రాంకుల రాజుకో, లేదా మరో రాజుకో యెవరికైనా యేదైనా సందేశం పంపవలసివస్తే, గోధురాజు తన సలహాదారుడూ, కార్యదర్శియైన కాసియోడోరస్‌ను పిలువనంపువాడు. కాసియోడోరస్ సుప్రసిద్ధ రోమనుపౌరుడు, సెనేటరు. రాజాజ్ఞ కాగానే యీాతడు విధేయుడై, చేత నొక మైనపు ఫలకమును గొనివచ్చి, తన యజమాని చెప్పు విషయాలను కార్యదర్శిలాగే వ్రాసేవాడు. ఉద్ధతులైన యీా విదేశీయులకు, బర్బరులకు క్రమంగా కొంచెం జ్ఞానం కలిగించలేకపోననే విశ్వాసం కాసియోడోరస్‌కు వుంది. జ్ఞానం లేనిదే, సంపా

దించనిదే యీ బర్బరు లెంతో దూరం ముందుకి పోలేరని ఆత డెరుగును!

ఈ నూతన 'అగస్టస్'కు, యీ బర్బరనాయకునికి ప్రభుత్వ నిర్వహణ మింకా కొంగొత్తయే. రోమను సలహాదారులు, ఉద్యోగులు లేనిచో నాతడు శాంతి భద్రతలను స్థాపించనే లేక పోను; క్లిష్టమైన ప్రభుత్వవ్యవహారాలను నిర్వహించనూ లేక పోను. గోధులు కేవలం పశుబలంమీద ఆధారపడినవారు. లేక పోతే వారిని బర్బరు లని యెందులకు అంటారు? యోధుని ఘనత ఖడ్గప్రయోగనైపుణ్యంలో వుంది గాని కలమును చేత బట్టుటలో లేదని వారంటారు. ఐతే రాజకార్య నిర్వహణ మెవరికైనను చదువు లేనిదే, వ్రాయుట చేతగానిదే యెట్లు సాధ్యపడును? కలమును చేత ధరించిన కాసియోడోరస్, ఖడ్గ బలంగల బర్బర రాజుకు, తన యజమానికి, సగౌరవంగానే సల హాల నిచ్చేవాడు; ఆ రాజున్నూ, శిష్యుడు గురువువద్ద వింటు న్నట్లు శ్రద్ధధానుడై వింటూండేవాడు.

గోధురాజు ధియోడోరిక్ కు అమల్ సుంధా అనే కుమార్తె వుండేది. చదువెంత ఉపయోగకరమో ఆ తండ్రికంటె కుమా ర్తెకే బాగా తెలుసును. అందుచేతనే అమల్ సుంధా పుస్తక ములను బహు ప్రీతిగా చేతబట్టింది. 'అవిద్యా జీవనం శూన్యం' అని గ్రహించినవామె. ప్రాచీన విజ్ఞాన సంస్కృతులను గురించి ఆమె తెలుసుకుంది. కొద్ది యేండ్లలో ఆమె విశేషంగా జ్ఞానా ర్జన గావించింది. విర్జిల్ మహాకవి కృతుల్ని లాటిన్ భాషలో

నుంచి గ్రీకుభాషలోని కామె తర్జుమా చేయ నారంభించింది. అమల్‌సుంథా కుమారుడు అథలారిక్, మాతామహుని సింహాసనానికి వారసుడు. ఒక బాలశిక్ష పుస్తకం ముందు అథలారిక్‌ను కూర్చుండబెట్టిన దామె. గోథిక్ బిడ్డలకు చదువు నేర్పుట, వారి చట్టముల రీత్యా నిషిద్ధమైనది. ఐననూ విజ్ఞానాపేక్షగల ఆ బర్బర రాజకుమారి సాహసించి తన కుమారునికి అక్షరశిక్ష నొసగ నారంభించినది.

యావరాజ్యాధికారి అథలారిక్ చదువువిషయం చెవులబడ్డ కొందరు గోథు వృద్ధులు, రాజబంధువులైన సామంతులు యీ అనాచారానికి మండిపడ్డారు. తూష్ణీభావంతో వారంతా కలసి రాజును సమీపించి, తమ యింటావంటా లేని యీ అపకీర్తి పనికి స్వస్తిచెప్పాల్సిందని కోరేరు, ధైర్యంచేసి. "తాను గావించిన శాసనములను తానే అతిక్రమించుట రాజుల కెట్టిదో ఆలోచించండి. వీరుడు, ధైర్యశాలి యగుటకు మనిషి చదువను, వ్రాయను నేర్చుకోడం అనవసరం కాదా? అంతేకాదు. చిన్నతనంలో గురువుల బెత్తపు బెదరింపులు రుచి చూచిన పిల్లవాడు, తన జీవితంలో యెప్పుడూ పదునైన ఖడ్గాన్ని చూచి ధైర్యంగా నిలువబడజాలడు గదా!"

పేరోలగములో నీ సామంతుల, రాజబంధువుల, కులవృద్ధుల [illegible]ములను వింటూ, కాసియోడోరస్ మౌనంగాకూర్చుండి[illegible]డు. తన మనస్సులో అతడీ బర్బరులను ద్వేషిస్తూన్నా అనుభవశాలియైన [illegible] ద్రోహి కాలేదు.

గోధుల గత మేట్టిది? వీరు అజ్ఞానులు. క్రూరులు, బర్బరులూ ఐవుండిరి.

జర్మనుల బిడ్డలెట్లు దినమొులలతో, మురికిలో, పశువులు పందులతో బాటు పెరుగుతూంటారో టాసిటస్ వర్ణించి యెంతో కాలం కానేలేదు. గోధులలో దొంగతనం అగౌరవకరమైనదిగా గాక, కుర్రవాళ్ళను తరిఫీదు చేయడాని కొక మార్గంగా చూడబడేదని సీజర్ వ్రాసియున్నాడు! అంతే కాదు, ఒక జర్మన్ తెగను గూర్చిన గాథ, ప్లినీ పండితుడు వ్రాసినది కూడా కాసియోడోరస్‌కు జ్ఞాపకం వుంది. వారు ఉత్తర సముద్రతీరంలో నొకచోట యిటీవలిదాకా నివసిస్తూ, నీటిలో పాతిన గుంజలపై తమ యిండ్లను కట్టుకుని, వ్యవసాయం పేరే మెరుగకుండా కాలక్షేపం చేసేవారట.

థియోడోరిక్ గోధుల చరిత్ర వ్రాయుమని కాసియోడోరస్ నాజ్ఞాపించేడు. ఇదైతే చాల కష్టమైన పని. ఎందుచేతనంటే గోధుల చరిత్ర యింకా భవిష్యత్ విషయమే! కాని కాసియోడోరస్‌కు సంస్కృతి శక్తియందు అకుంఠిత విశ్వాసం వుంది. బర్బరత్వం మీద సంస్కృతికి విజయం లభించి తీరుతుందని ఆయన నమ్మకం. అనుక్రమ వ్యాహృతి పండితోజనః గద!

థియోడోరిక్ వద్ద కాసియోడోరస్ గాక మరొక సలహాదారుడు బోథియస్ అను నాతకుండేవాడు. అతడుకూడ ఉన్నత కులీనుడైన రోమనుడే. ఆయనకు విజ్ఞానాపేక్ష మెండుగా

వుండేది. ఆయన యింట పుస్తకములకే పూజ్యస్థానము! ఇంతెందుకు? బోధియస్ గృహమే ఒక పెద్ద గ్రంథాలయము. ఆయన తీరిక వేళల్లో సంగీతస్వరసమ్మేళనమును గూర్చిన సూత్రాన్ని పరిశీలిస్తూండేవారు. సంఖ్యలకు, ధ్వనులకు గల సంబంధాన్ని గూర్చి తెలుసుకోడానికై ఒక చెక్కమీద తీగెలను బిగించి, వాటిని పొట్టి పొడుగులుగా చేస్తూ, వాటి ధ్వనులలోని మంద్రషడ్జమములను, ఆరోహణావరోహణములను ఆయన గమనిస్తూ వచ్చేడు. సంగీతాన్ని గూర్చి బోధియస్ రచించిన గ్రంథం శతాబ్దుల పర్యంతం నిలిచి వుంది.

బోధియస్‌కు సర్వశాస్త్రమునందే గాక యంత్రశాస్త్రమునందు కూడ అభినివేశం వుంది. అతడొక ఘటికా యంత్రాన్ని నిర్మించి, ధియోడోరిక్‌కు యిచ్చేడు. ఆ గడియారం కాలమును తెలుపుటే గాక ఖగోళముల కదలికనుకూడ చూపించేది. ఈ జల సూర్య కాలయంత్రమునుగూర్చి కర్ణాకర్ణిగా విన్న పొరుగు రాజు బర్గండీ ప్రభువు, తనకు కూడ యిల్లాంటి యంత్రాన్ని తయారుచేయించి యిమ్మని ధియోడోరిక్‌ను కోరేడు. రాజులు నూతనప్రియులని ఊరికే అన్నారా? సరే. బోధియస్ మరొక ఘటికా యంత్రాన్ని తయారుచేయగా ధియోడోరిక్ సనుపున రాయబారులు ఆ యపురూపవస్తువును 'లయాన్స్' నగరానికి గొంపోయి, బర్గండీ ప్రభువుకు బహూకరించేరు.

ధియోడోరిక్ రాజుకు బోధియస్ పండితునిపై అపారమైన అనుగ్రహం కలిగింది. రాజు ఆజ్ఞప్రకారం కాసియో

డోరస్ ఒక లేఖ రాసేడు. దానిలో బోధియస్ శాస్త్రపరిశ్ర మను కొనియాడేడు.

"టాలమీ యొక్క ఖగోళ శాస్త్రమున్నూ, యూక్లిడ్ యొక్క భూమితిశాస్త్రమున్నూ, యిప్పుడు మీరు గావించిన లాటిన్ అనువాదములలో పరించబడుతున్నాయి. ఆత్మవిద్యా వేద్యమైన ప్లేటో పండితుడున్నూ, తర్కశాస్త్రజ్ఞుడు అరిస్టాటిల్ యున్నూ కూడా యిప్పుడు రోమను భాషలో తమశాస్త్ర చర్చలను వినిపిస్తూన్నది మీ కృషివల్ల నేగదా. యంత్ర విద్యావేత్త ఆర్కిమేడీస్ గ్రంథాలు తమచే లాటిన్ భాషలోనికి పరివర్తన గావించబడి, లోకోపకారకమైనాయి. ఉపజ్ఞతగల గ్రీకు విజ్ఞానులు, కళావిజ్ఞాన రంగములలో సాధించిన దాని నంతనీ మీ యనుగ్రహముచేత నే రోమనులు స్వీయభాషలో పఠించ గలిగిరి..." *

ఈ ధోరణిలో వున్న జాబును చదువుకొని, బోధియస్ తల వూపేడు: "నాకు యిందులో కాసియోడోరస్ ప్రతిభయే ద్యోతక మవుతూంది. కాని, బర్బరులైన యీ గోథులు టాలమీ, అరిస్టాటిల్ ప్రభృతుల గ్రంథాలను చదువుటకింకనూ కనీస మొక శతాబ్దమైనా గతించాలి!"

బోధియస్ తన కాలాన్నంతనీ గ్రంథపఠనంలో వినియోగించేవాడు. తనచుట్టూ యీ ప్రపంచంలో యేమి జరుగు

---

* శ్లో. జయంతి తే సుకృతినో। రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తి తేషాం యశః కాయే। జరామరణజం భయం॥

తూందో చూడాలనిగాని, తెలుసుకోవాలనిగాని ఆయన కోరే వాడే గాదు. నాశనరహితమనుకున్న రోము మహానగరానికి గాని, జగద్విఖ్యాత రోమక సామ్రాజ్యానికి గాని యేమి దుర్గతి పట్టిందో కూడా ఆయనకి పట్టదు! బర్బర మూకలు దేశాన్నం తనీ జలమయం గావించేసేయి. యుద్ధబీభత్సంలోంచి యెల్లాగో బ్రతికి బైటపడ్డవాళ్ళని, ఆ గండం గడిచి బ్రతికివున్న వాళ్ళని కరువూ, ప్లేగూ వెంటాడినాయి. యుద్ధదేవత వెంట క్షామ దేవత, మహామ్మారి, అడుగులో అడుగు కలిపి వచ్చినాయి. ఆభిజాత్యంగల రోమను సినేటర్లు, తాము రోమనుల మన్న మాటే మరచి, బర్బరులైన గోథులకు వంగివంగి దండాలు పెడుతూ, తమ ఆస్తిపాస్తుల్లో యే కొంచమైనా మిగుల్చుకోవా లని తాపత్రియ పడేవాళ్లు. ప్రళయోద్దండంగా విరుచుకు వస్తూన్న వరదలను మంచిమాటలతో నిరోధించ దలచినట్లుంది, వారి ప్రయత్నం! జలప్రళయం సర్వాన్నీ దిగమింగుతుంది గదా! రోమనుల ఆస్తిపాస్తుల్నీ, హక్కుల్నీ మాత్రమేగాక, వాళ్ళ తత్త్వశాస్త్రం, కళలు, విజ్ఞానం మొదలైన వాట్లన్ని టినీ కూడా ముంచేసింది, యీ ఔత్తరాహముష్కర మూకల దండయాత్ర.

కాని, యిప్పటికీ యింకా ఆశ లేకపోలేదేమో! వాళ్ళని ఆపడం* యింకా సాధ్యమేమో!

---

* నేటి కాన్‌స్టాంటినోపుల్ నగరం. ఒకప్పుడు మహావైభవం అనుభ వించిన నగర మిది. ఒక నాగరికతకు స్థాన మిది. (19 పుట 2 పంక్తి)

కనుక బోధియస్ రహస్యంగా రోమను సెనేటర్లతో రాయబారాలు ప్రారంభించేడు. బైజాంటియమ్*లో యింకనూ రోమను సీజరులే పరిపాలిస్తున్నారు. అందుచేత అక్కడి కొందరు ప్రముఖులకు బోధియస్ జాబులు కూడా వ్రాసేడు. ఏమో, ఎవరు చెప్పగలరు? ఎక్కడనుంచి విమోచనము రాగలదో? జలప్రళయ తరంగములవంటి యీ బర్బరమూకల దాడులు యింకా తూర్పుదేశాలకు, రోమకసామ్రాజ్యపు తూర్పు ప్రాంతాలకు వ్యాపించి యుండలేదు. బోధియస్ తల పెట్టిన యీ కుట్రయొక్క పాశాలు, గోథుల రాజధానియైన రివెన్నా నుండి సీజరుల పాలనక్రింద నున్న బైజాంటియమ్ వరకూ విసరబడినాయి! కాని, యీ రహస్యం త్వరలోనే కనిపెట్టబడింది. అంతయు బైట పడిపోయింది.

థియోడోరిక్ చక్రవర్తి కోపాద్రిక్తుడై పోయేడు. బోధియస్‌ను బంధించి, ఖైదుచేయ నాజ్ఞాపించేడు. బందిఖానాలోని రాతిగోడల వెనుక మరణశిక్షకు యెదురుచూస్తూ, బోధియస్ పండితుడు తత్త్వశాస్త్ర చింతనలో మునిగి, కాలక్షేపం చేస్తూండేవాడు. 'తత్త్వశాస్త్రపు దుఃఖోపశమనశక్తి' అనే గ్రంథము నాతడప్పుడే రచించేడు. ♦భారములైన బందిఖానా తలుపులు భద్రంగా బంధించి, తాళం వేస్తున్నారు. పోతే కారా

---

♦ శ్లో. అనంతశాస్త్రం॥ బహువేదితవ్యం।
స్వల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః।
యత్సారభూతం తదుపాసితవ్యం।
హంసోయథాక్షీర మివాంబుమిశ్రం

గార రక్షకులకు లంచమిచ్చి, తిరిప్పుకోనుట కూడా అసంభవంగా వుంది. బోధియస్ మిత్రు లెవ్వరినీ అతనిని చూడనిచ్చుట లేదు. ఐతే, ఆయనకింకా బైట మిత్రు లనే వాళ్లున్నారా?

ఏదేమైనా బోధియస్ మాత్రం బందిఖానాలో యేకాకిగా వుండిపోలేదు. ఆయనకు తోడు నీడలుగా యెన్నో పుస్తకాలున్నాయి. తత్త్వవేది, తర్కశాస్త్రజ్ఞుడూనైన సోక్రటీస్ ఆయనకు సన్నిహితుడుగా వున్నాడు. ఆ మహాత్ముడు, సోక్రటీస్ కూడా బందిఖానాలో నున్నపుడు తత్త్వశాస్త్రంయొక్క ఆలంబనమును గొన్నవాడే! ప్రాచీనులలో మహాత్ములైన యితర పండితు లెందరో బోధియస్‌కు బందిఖానాలో ప్రాపుగా వుండి, ఊరట కల్పించేవాళ్ళు. ఐతేమాత్రం, మరణాసన్నుడుగా నున్నవానిని ఊరడించు టేమంత సుకరం గాదుగదా! బోధియస్ విషాదాక్రాంతుడై వుండేవాడు. ఆయనకు ముందంతా గాఢాంధకారమే. నాశనం లేనిది యేదీ లేదని ఆయనకు తెలుసును. ప్రతీదీ క్షణభంగురమూ, నశ్వరమూ గదా. ఈ దృశ్యజగత్తులో సర్వమూ క్షణభంగురమే. ఆఖరికి 'అమరనగరం' కూడా కాలంయొక్క వినాశాత్మక ప్రభావానికి లోబడిపోవలసినదే! కాలము దురతిక్రమమైనదిగదా, ఎవ్వారికైనా. సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం అన్నారు గదా.

బోధియస్ కలం కాగితాలమీద సాగిపోతూంది. ఆయన తన పనిని, కర్తవ్యాన్ని మానలేదు.

మరోపక్క తలారివాడూ పూరికే వుండలేదు. వాడూ తన గండ్రగొడ్డలికి పదును పెడుతూన్నాడు. ఆలోచించగలట్టి, అద్భుత కల్పనలు చేయగలట్టి ఆ పండితుని తలను మొండెము నుంచి వేరుచేయడానికి కాలపురుషుడు వేచియున్నాడు. 'రోమనులలో కడపటివాడు' బోధియస్, ఆఖరికి వధ్యశిలపై ప్రాణములు అర్పించాల్సి వచ్చింది.

ఐతే, మరి కాసియోడోరస్ యేమైనాడు? అతడూ మృత్యువువాతబడెనా? లేక ఏ పాట్లో బడి ప్రాణములు గాపాడుకొనెనా? అతడు రోమనుడు గాడా? అహాఁ! కాకేమి? అతడూ అక్షరాలా రోమనుడే. పౌరుషంలో అతడు రోమనుల కెవ్వరికీ తీసిపోయేవాడు గాడు. బోధియస్ వలెనే కాసియోడోరస్ కూడా ప్రాచీనసంస్కృతి అంటే ప్రాణా లొడ్డుతాడు! కాని, అత డీ రాజకీయతంత్రంలో, కుట్రలలో పాల్గొనలేదు. చరిత్రను క్షుణ్ణంగా పఠించినవా డగుటచేత కాసియోడోరస్‌కు చరిత్రగతి తెలుసు. చరిత్ర మధ్యలో ఆగునది గాదనీ, చరిత్రను ఆపుట యెవ్వరి తరమూ గాదనీ అతడు గ్రహించినవాడు. ఐతే, కానున్నది కాకమాన దని వూరుకొన్నాడా? అబ్బే! లేదు, అతడు కూడ విజ్ఞాన సంస్కృతుల రక్షణకై సర్వశక్తులా పోరాడేడు! తన కుచితమని తోచిన విధానంలో ఆయన యీ పోరాటాన్ని సాగించేడు. అంతే భేదం.

కాసియోడోరస్ రాచకొలువు మాని, దక్షిణ ఇటలిలోని తన జమీాకి వెళ్ళిపోయేడు. అక్కడే ఒక విహారమును, మఠమును

నిర్మించేడు. అది ప్రపంచంలోని మొదటి *విహారములలో నొకటి. దీనికాతడు 'వైవారియమ్' అని పేరు పెట్టేడు. ఈ లాటిన్ శబ్దాని కర్థము 'జీవితాశ్రయము' అని. ఔత్తరాహులైన బర్బర మూకల దాడులలో నాశనం కాకుండా మిగిలియున్న సంస్కృతీ అవశేషములను యిందులో భద్రపరచి రక్షించాలని ఆతడు సంకల్పించేడు. తనతోటి స్వాములు, బ్రహ్మచారులతో కాసియోడోరస్ అనేవాడు : "సంస్కృతిని, చరిత్రను నిక్షేపించి యుంచుటకన్న, రచించుటకన్న మహత్కార్య మింకేదీ లేదు." ప్రొద్దుపొడిచింది మొదలు ప్రొద్దు గ్రుంకువరకూ యెందరో సన్యాసులు, స్వాములు కలములుబట్టి గ్రీకు, రోమక నాగరికతా సంస్కృతులనూ, విజ్ఞానాన్నీ పత్రలిఖితం గావిస్తూండేవాళ్ళు. సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతం అన్నారుగదా.

ఒక్కొక్కటే యెన్నో వసంతాలు గడిచిపోతున్నాయి.

క్రీస్తుపూర్వం ఆరవశతాబ్ద మధ్యభాగం అది. అప్పటికే ఆస్ట్రోగోథుల రాజ్యం అస్తమించి చాలాకాలమైంది! ప్రస్తుతం ఆస్ట్రియా అని పిలువబడే ప్రదేశాన్నుంచి వచ్చినవారు గనుక యీ గోథులను ఆస్ట్రో-గోథులని పిలుస్తాము. గోథుల రాజ్యం

* పశ్చిమదేశాల్లో యిదే మొదటి విహారము గావచ్చునేమో గాని ప్రాగ్దేశాల్లో ముఖ్యంగా భారతదేశంలో అప్పటికి వెయ్యేండ్లు ముందే బౌద్ధులు విజ్ఞానకేంద్రములుగా విహారములను, మఠములను నిర్మించేరు. అతఃపూర్వం వేలయేండ్ల క్రిందట ఋషుల ఆశ్రమములకు నకళ్లే అవి. జను.

పోయి, యిప్పుడు రివెన్నాలో లాంబార్డులు పాలిస్తున్నారు. కాని, దక్షిణ ఇటలీలో 'వైవారియం' విహారంలో మాత్రం జీవితం యథాపూర్వకంగానే నడచిపోతూంది. ప్రశాంతమైన విహారమఠాల్లో గ్రంథరచనా వ్యాసంగం నిరంతరాయంగా ఒక్కదినం కూడా విడువకుండా సాగిపోతూంది. విద్యా మిత్రం ప్రవాసేషు అన్నది నిజం గదా. తేనెపట్టులో తేంట్లకువలె ప్రాచీనవిజ్ఞాన మనే మధువును భవిష్యత్ తరాల వారికై సేకరించి భద్రపరుస్తూన్నారు, వైవారియంలోని పరివ్రాజక బృందం. ఈ పవిత్ర కార్యక్రమానికి ప్రాణతుల్యుడూ, పితృ సముడూ నైన కాసియోడోరస్ అప్పటికే శతవృద్ధు ఆయన తొంభై పైచిలుకు వసంతములను గడపినవాడు. మృత్యుదేవ తను పరామర్శించేందుకే సమయం చిక్కలేదింతవరకూ, ఆయనకు! మృత్యుదేవతకూడా యీ మఠపు గదుల్లోకి ప్రవే సించడానికి గాని, అచ్చట జరిగే పవిత్రకార్యానికి విఘ్నం కలి గించడానికి గాని, విజ్ఞానదీక్షితులైన ఆ సన్యాసుల లేఖనుల నాపుటకుగాని సంశయిస్తూందా? అనేటట్లుంది! అప్పుడప్పుడు కాసియోడోరస్ తన గ్రంథం మీదినుంచి చూడ్కులనెత్తి, సుదూరాన వున్న నీలపు కొండలమీదికి దృష్టి నిలుపువాడు. కాని, ఆ వృద్ధపండితుని నేత్రాలు చూచునవి ఆ పర్వతములు కానే కావు! ఆయన కండ్లయెదుట రోమునగర సుందర రాజ వీథులు, తన బాల్యదినాలు, బంధుమిత్రాదులు, పూర్వ స్మృతులు,-యివే స్వప్నదృశ్యాల వలె గడచిపోయేవి. ఆయ

నకు బోథియస్ కనబడేవాడు. విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం. ఆ మహాపండితుని రచన 'తత్త్వశాస్త్రపు దుఃఖోప శమనశక్తి' తలపుల నిలిచేది.

బోథియస్‌ను చంపినవారు యముని కతిథులుగా బోయి అప్పటికి చాలకాలమైంది. థియోడోరిక్ రాజు తన సమాధిలో దీర్ఘనిద్రామగ్నుడై వున్నాడు. ఆతని కుమార్తె అమల్‌సుంథా కూడా యేనాడో యీ లోకాన్ని వీడిపోయింది. బర్బరులైన రాజబంధువులు, కులవృద్ధులు ఆమెను చంపివేసేరు. ఆమెదోషమల్లా, తాను బర్బరురాలుగానుండ నిరాకరించడమే! అక్షర పక్షపాతిగా నుండడమే!

ప్రాచీన రోము మహానగరమింక లేదు కాని, గ్రంథములు మాత్రం వాటిని సృష్టించిన నగరములకంటె చిరంజీవులు. గ్రంథప్రతిపాదితములైన విజ్ఞాన విషయాలు శతాబ్దాలను మించి జీవిస్తాయి! అవి అక్షరములు! అట్టి జ్ఞానసంపద నంతనూ భవిష్యత్తరాల మానవులకొరకై భద్రపరచి వుంచాలని కాసియోడోరస్ వాంఛ. సాహిత్యం, కళలు మొదలైన వాటినన్నిటిని కూర్చి, విజ్ఞానసర్వస్వము నొకదానిని ఆయన తయారు చేసేడు. ఏడు కళలు, ఏడు శాస్త్రాలు ఆయనకు తెలుసును; వ్యాకరణం, అలంకారశాస్త్రం, తర్కం, గణితం, సంగీతం, క్షేత్రమితి, ఖగోళశాస్త్రం,- యీ ఏడువిద్యలూ ఆయనకు తెలుసును. వీటినన్నిటిని ఒకే గ్రంథంలో యెవడైనా తానొక్కడే సంగ్రథనం చేయగలడా? ఇది కష్టమే కాని అసంభవం

మాత్రంగాదు! కాసియోడోరస్ వృద్ధ హస్తాంగుళులు వణుకుతున్నాయి. ఆయన హృదయం కూడా కష్టాలతో అలిసిపోయింది. తొంభై హేమంతాలలో ఆ హృదయం యెల్లాంటి దారుణ సన్నివేశాలను చూచింది! అనుభవించింది!

తాను అప్పుడే మృత్యువుకు లొంగిపోకూడదని ఆ వృద్ధుడు అనుకొనేవాడు. యువానో విద్యయూ బుధాః అన్నారుగదా. ఈ మహాగ్రంథాన్ని తాను పూర్తిగావించి తీరాలి. ఆఖరికి ప్రాచీన ఋషుల, పండితుల, శాస్త్రవేత్తల, పేర్లనైనా గ్రంథస్థం గావించి వుంచాలి. పోనీ, ముందు తరాల ప్రజలు, వారి పేర్లను విని, ఆ మహాత్ముల విజ్ఞాననిధు లెచ్చట గుప్తంగా వున్నాయో, వాటికై యెచ్చటెచ్చట అన్వేషించాలో తెలిసికోనిండు; అదే చాలు.

ఎట్టకేలకు ఆ మహాగ్రంథం పూర్తయింది. కాసియోడోరస్ శత వసంతములు చూచి, కడపటికి మరణించేడు. కాని, యితరు లాయన ప్రారంభించిన ఉత్కృష్ట కార్యాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. పత్రములపై వంగివున్న ఆ పండితుల, లేఖకుల నడుములు యింకా వంగియే వున్నాయి. తెలిసిన, వినిన విషయములను గ్రంధస్థ మొనర్చుట తక్క విజ్ఞానప్రియులు గావించదగిన దింకొక టేమున్నది? నూతనవిషయాల్ని కనిపెట్టడానికి, నూతనసృష్టికి సమయం గాదిది. పాత అంతా తుడిచిపెట్టుకుపోయి, సర్వనాశనం కానున్న యిటువంటి ఉత్పాతసమయాల్లో కనీసం పాత చరిత్రలను, విజ్ఞానాన్ని, శాస్త్రాలను

నిలిపి వుంచగలిగితే చాలు, అదే పదివేలు! మన పూర్వులు సాధించిన దాన్నైనా ముందుతరాలకై భద్రం చేయాలి. ఇదే వారి ఆవేదన.

ఒక్కొక్క సంవత్సరం గడుస్తూన్నకొద్దీ ప్రపంచాన్ని అజ్ఞానతిమిరం అంతకంతకి అంధకారబంధురం గావిస్తూంది. చదువనూ, వ్రాయనూ నేర్చినవారి సంఖ్య అంతకంతకు అల్పాల్పమైపోతూంది.

"శాస్త్రపరనం మన తరంతో బాటుగానే చనిపోతూంది." అని టూర్సు నగరంలోని బిషప్ గ్రిగరీ తన మిత్రుడూ, మహాకవీశ్వరుడైన ఫార్ట్యునేటస్‌కు వ్రాసేడు.*

తరువాత అన్ని దేశాల్లోనూ విహారములూ, మఠములూ ఎన్నో స్థాపించబడినాయి. కాని, గతంలో కాసియోడోరస్, ఆయన సహచరులైన పరివ్రాజకవర్గం కూడా దేనినైతే తమ పవిత్రధర్మంగా, విధివిహిత కర్తవ్యంగా భావించేరో దానినే యిప్పుడీ మఠాల్లో చేరిన సన్యాసులు మహాపాపకర్మగా పరిగణించ నారంభించేరు! క్రైస్తవమత సర్వాధికారియైన రోమను పోప్, తన క్రింది బిషప్పులలో నొకని కిట్లు వ్రాశాడు.

---

* భారతదేశ చరిత్రలో యిల్లాటి విషమ ఘట్టాలు ఎన్నోమారులు వచ్చి పడ్డాయి. పాషండ, బౌద్ధ, మ్లేచ్ఛ, యవన, మహమ్మదీయ, క్రైస్తవ దాడుల్ని తట్టుకుని ప్రతీసారీ యినుమడించిన శక్తితో మన సంస్కృతి బైటికి వస్తూవచ్చింది.

"నీవు వ్యాకరణశాస్త్రం బోధిస్తూన్నట్లు తెలుస్తూంది. ఈ మాటల నుచ్చరించడమే నాకు లజ్జాకరంగా వుంది. ఇటువంటి విషయం స్మరణకు వచ్చినపుడల్లా నేను విచారసముద్రంలో మునిగిపోయి, నిట్టూర్పులు విడుస్తూంటాను. ఆ పాడుశాస్త్రాన్ని, దైవదూరమైన ఆ పాషండశాస్త్రాన్ని పఠించడం, బోధించడం మానేసినట్లు నాకు తెలియజేయి. అప్పుడు మనం ఈశ్వరున కనేక వందనా లర్పించుదాము."*

శాస్త్రపఠనపాఠనములే గాదు, శాస్త్రమే ద్వేషించబడి, దేశభ్రష్టత్వాన్ని పొందింది. ఇప్పుడింక ఏథెన్సు నగరంలో 'అకాడమీ' లేదు. కడపటి తత్త్వశాస్త్రవేత్తలకు శరణ్యమైన ఆ విజ్ఞానపీఠం తొమ్మిది శతాబ్దాలపాటు జీవించింది! కాని, బైజాంటియంలో చక్రవర్తి జస్టీనియస్ సీజర్ ఆజ్ఞల ననుసరించి అక్కడి తత్త్వవేత్తలందరూ తరిమివేయబడ్డారు. అలగ్జాండ్రియాలోని సెరాపిస్ దేవాలయానికి చెందిన సెరాపిస్ గ్రంథ భాండారాన్ని మడ్డిమూక తగులబెట్టివేసింది. గణితశాస్త్రజ్ఞుడైన థియోన్ పండితుని కుమార్తెను వాళ్లు ముక్కలు ముక్కలుగా చీల్చివేసేరు. మహాపండితుడైన తండ్రి అడుగుజాడల్లో నడుస్తూ, క్షేత్రమితి, ఖగోళశాస్త్రం, గణితశాస్త్రం అభ్యసిస్తూండడమే ఆమెపై నా మడ్డిమూకల క్రోధానికి కారణమైంది!

---

* కావ్యాలాపాంశ్చ వర్జయేత్ అన్నది కూడా యిట్టి భావాలు గలవారే చెప్పిరేమో! కాని, దుష్టకావ్య విషయ మిది యని అభియుక్తోక్తి. మహాభాష్యం వా పాఠయేత్ మహారాజ్యం వా పాలయేత్ అనే సంప్రదాయం భారతీయులది.

(ఇట్టి దుస్థితి భారతదేశంలోనూ యెన్నోసార్లు కలిగినట్లు చరిత్ర చెపుతూంది. సుప్రసిద్ధుడైన భర్తృహరి మహాకవి సమకాలీన పరిస్థితుల్ని గమనించి, బాధపడే యిట్లు చెప్పివుంటాడనుకోవాలి :

శ్లో॥ బోద్ధారో మత్సరగ్రస్తాః। ప్రభవ స్స్మయదూషితాః।
అబోధోపహతా శ్చాన్యే। జీర్ణ మంగే సుభాషితం॥

దీనినే తెలుగులో ఏనుగు లక్ష్మణకవి యిట్లు చెప్పేరు.

తే॥ బోద్ధ లగువారు మత్సరపూర్ణమతులు
ప్రబల గర్వవిదూషితుల్ ప్రభువు లెన్న
నితర మనుజు లబోధోపహతులు గాన
భావమున జీర్ణమయ్యె సుభాషితంబు.

ఇటువంటి ఉదాహరణ లెన్నో యీయవచ్చును.)

చివరకు ఏథెన్సు, అలగ్జాండ్రియా నగరాల్లోకూడా శాస్త్ర విజ్ఞానాలకు స్థానంలేకుండా పోయింది. అన్నపూర్ణ యింటిలోనే అన్నము కరవైనది! సర్వకళాశాస్త్ర నిలయములైన ఏథెన్సు, అలగ్జాండ్రియాలలోనే యీ పరిస్థితు లేర్పడినప్పుడు యితర దేశాల్లో వాటిగతి యేమని చెప్పాలి? జర్మనీ, గాల్ (నేటి ఫ్రాన్సుదేశం) దేశాల మహారణ్యభూముల్లో, మానవులింకా జంతుదశనుంచి పైకిరాని దేశాల్లో శాస్త్రకన్యకు స్థాన మెట్లుంటుంది? ఆమె ముందు మార్గం అగమ్యగోచరంగా, ముండ్లతోను, కష్టాలతోను కూడివుంది. ఎన్నెన్నో అవమానాలు, అమానుషాలు ఆ ముద్దరాలి నెదుర్కొనై వున్నాయి. కేవలం

అనుకంపబుద్ధితో నే శాస్త్రకన్యను విహారాల్లో, మఠాల్లో వుండనిచ్చేరు. అయినా ఆస్తికవాదానికి, మతానికి చెలికత్తెగా, చదువుకున్న దాసిగా మాత్రమే వుండనిచ్చేవారు! ఆలంబనం లేని శాస్త్రకన్య గాఢసుషుప్తిలో మునిగిపోయింది. 'అద్యాధారా నిరాధారా నిరాలంబా సరస్వతీ!' కాని, కాలమంతా ఒక్క రీతిగా వుంటుందీ? కష్టములు కాపురముంటాయా?

శతాబ్దాలు గడిచిపోతాయి. నిద్రించే శాస్త్రకన్య యొక్క ఓరిమికి తగిన ప్రతిఫలం కలిగి తీరుతుంది. ఆమెను బంధించి వుంచిన యినుపసంకెలలను ఛేదించగల దివ్యశక్తులుగల పురుషు డొకడు వచ్చి తీరుతాడు. ఆమెను శిరసావహించి గొంపోయి, రత్నసింహాసనంమీద కూర్చోబెట్టి, రాణిగా పూజిస్తాడు! ఎవరు చెప్మా, ఆ దివ్యపురుషుడు! ఆతని పేరేమిటి? రోగర్ బేకన్? కోపర్నికస్? లియోనార్డో దా విన్సీ? గియోర్డనో బ్రూనో? లేక యింకెవరు? కాలోహ్యాయం నిరవధి ర్విపులా చ పృథ్వీ. ఈ కథలు కడకంట చదువువారు తెలుకో గలరు గాన, ముందుకు సాగుదాం.

## 2. శాస్త్రవిజ్ఞానం శృంఖలాబద్ధయై మతాన్నుంచి మతానికి పరిభ్రమిస్తూంటుంది.

అంతకంతకూ అంధకారం వ్యాపించి, అంతనూ గ్రసించు తూంది. పురోహితుల్లోకూడా చదువనూ, వ్రాయనూ గల వాళ్ళు అరుదుగా కనబడేవారు. అక్కడక్కడ పర్వతాలమీద

మాత్రం విహారాలు, మఠాలు అరుదుగా కనబడుతూన్నాయి. వాటి రాతిగోడలలోపల, చిన్నచిన్న గవాక్షాల లోంచి పోగలి గిన మసక వెలుతురులో సన్యాసులు, బ్రహ్మచారులు ఉదయాస్తమయ పర్యంతం యేవేవో గ్రంధాల ప్రతులు వ్రాస్తూనే వుండేవాళ్ళు.

బర్బరమూకలు అన్ని దేశాల్నీ, రోమక సామ్రాజ్యాన్నంతనీ ఆక్రమించుకున్నాయి. ఎందరో కాందిశీకులై సామ్రాజ్యపు కడపటి కొనకంటా పారిపోయేవాళ్లు. బ్రిటన్, ఐర్లండు దీవులు రోమక సామ్రాజ్యంలో కొట్టకొనసనున్నాయి. నాగరికప్రపంచాన్నుంచి కాందిశీకులు ఇంగ్లీషు ఛానెల్‌ను దాటి వెళ్ళి, అచ్చట తలదాచుకోవలసి వచ్చింది. పాత పడవల్లో, చిల్లులనుంచి పడవలోనికి వచ్చే నీటి నతి కష్టంమీద ఆపుచేసుకుంటూ, సముద్రపు కెరటాలు పడవల నటునిటు విసరివేస్తూంటే, భయభ్రాంతులై స్త్రీలు బిడ్డలు యేడుస్తూంటే, నిరంతర కష్టాలతో నిష్ఠురముఖాలు గల పురుషులు తెగింపుతో ఆ పడవలను నడుపుతూ ప్రయాణించేవాళ్ళు.

తాము యే పరిసరాల్లో పుట్టి పెరిగి అలవాటుపడ్డారో వాటి నన్నిటినీ వదలిపోవాల్సి వచ్చింది. వేలాది కుటుంబాలు ఇండ్లు వాకిండ్లు, జన్మస్థలం, చివరకి బానిసల్ని కూడ వదలిపెట్టాల్సి వచ్చింది. తమకూడా యేవో అత్యావసరమైన కొద్ది వస్తువుల్ని మాత్రమే తీసికొని పోగలిగేవారు, యీ కాందిశీకులు.

అక్కడికే ఆ పాతపడవలు చెక్కుపూళ్ళై నీటిమీద తేలడమే గగనమైపోయింది.

కాందిశీకులు కొందరు తమతో వెండి బంగారాల్ని తెచ్చేరు. మరికొందరు అమూల్య వసనాల్నీ, ఉన్నిదుస్తుల్నీ తెచ్చుకున్నారు. కాని, యీ కష్టసమయంలో కూడా వెండిబంగారాల్నీ, వస్త్రాభరణాల్నీ వదలి, చింకిరి బొంకిరిగా వుండే కొద్ది పుస్తకాల్ని మాత్రమే ప్రాణప్రదంగా మూటకట్టుకుని తెచ్చుకునేవాళ్లు ఆ పడవల్లో కొందరున్నారు! వారికి యీ ప్రపంచమంతట్లోకీ ప్రియాతిప్రియమైనవి గ్రంథాలుమాత్రమే. భయభీతులై, బర్బరమూకలకు వెరచి పారిపోయేటపుడుకూడ వారు తమ కత్యంత ప్రీతిపాత్రులైన కవుల, తత్త్వవేత్తల గ్రంథాలను వదలిపెట్టలేదు! ప్రాచీన పండితుల, విజ్ఞానుల గ్రంథాలపైకి తమ దృష్టిని మరల్చినవారే లేని ఆ బీభత్సపరిస్థితుల్లో పడవలలోని సామానులక్రిందా, ఖిన్నమానవవిగ్రహాల మధ్యా యీ చిన్నచిన్న పుస్తకాలు యెవరి దృష్టినీ ఆకర్షించకుండా, వినీతములై ఒదిగి పడియున్నాయి. తమ కాలం వచ్చువరకు, పరిస్థితులు పక్వమయేవరకూ యెంతవారైనా వేచియుండాల్సిందే గదా. అనువుగాని చోట అధికుల మనరుగదా, ఉత్తములు! అట్టి సుసమయం, పుణ్యకాలం రానే వచ్చింది ..

ఐరిష్ మఠాలలో నొకదానిలో పండిత పరివ్రాజకు డొకడు ప్రాచీనగాథలను గ్రంథస్థం గావిస్తూన్నాడు. విభిన్నమతానుయాయులైన చారణులచే గానం చేయబడే వీరగాథలను, జాన

పదగాథలను గ్రంథస్థం గావిస్తూన్న ఆ పరివ్రాజకుడు కేవలం చారిత్రకుడే గాదు; మహాపండితుడూ, రసజ్ఞుడూ కూడాను. ఐరిష్ నావికుడు మెయిల్ దున్ యాత్రలను గురించిన కథలు వ్రాసేటపుడు ఆయన ఒదిస్యూస్ అనే గ్రీకు పురాణయోధుని పరిభ్రమణములను స్మరించకుండా వుండలేకపోయేడు! మధ్యధరా సముద్రంలోనుంచి అట్లాంటిక్ మహాసముద్రములోనికి సైక్లోప్స్ రాక్షసులనే గాక కాలిప్సో దివ్యసుందరినికూడ తన రచనల్లోకి ప్రవేశపెట్టేరాయన. పురాణ ఐరిష్ గాథలోనికి ఆ పండిత పరివ్రాజకుడు పాలస్తీనా ప్రాచీన రాజశ్రేష్ఠుడైన దావీదు యొక్క సామగీతాలనుంచీ, వర్జిల్ మహాకవి పద్యాలనుంచీ యెన్నెన్నో మహాకవి ప్రయోగాల్ని పొందుపరచేవాడు! "ఏమో! ఒకనాడు దీనినికూడా జ్ఞాపకం చేసికొని, ఆనందాన్ని అనుభవించగలవా రుండకపోతారా?" అని ఆ మహాత్ముని భావన.* ప్రపంచానికి ఒక కొనను, పురాణాల్లో చెప్పబడిన 'అల్టిమా థూలీ' (భూమికి కడపటి హద్దు అని దీనిఅర్థం) కి సమీపంలో, స్వదేశంలోనే విస్మరించబడిన మహాకవుల కంఠాలు యీ విధంగా వినబడినాయి.

కవితాకన్యతో బాటు విజ్ఞానదేవతకూడా బర్బర మానవునికి దూరంగా తొలగి వెళ్ళి, ఐర్లాండు, బ్రిటన్ దీవుల్లోని వివిక్త విహారాల్లోనూ, ఏకాంత మఠాల్లోనూ శరణు తీసికొంది.

* భవభూతి మహాకవి చెప్పిన 'కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ' అను భావం దీనికి సన్నిహితమైనదే.

వయోవృద్ధుడు, గౌరవనీయుడునైన బేడే యను పండితుడు యీ విహార విద్యాశాలలకు పాఠ్యగ్రంథాలు రచించేరు. బోధియస్ సంగీతగ్రంథాన్ని యీాయన తన స్వంతమాటలలో తిరిగి వ్రాసేరు. బ్రిటన్ దేశీయుడైన ఆల్కుయిన్ అను నాతడు బేడే గ్రంథాలనుంచి గణిత, సంగీతశాస్త్రాలు పఠించి, మహాపండితుడయేడు. ఈ విధంగా విజ్ఞాన దీపం ఒకరినుంచి మరొకరికి వ్యాపించింది. అరిస్టాటిల్ నుంచి బోధియస్, బోధియస్ నుంచి మాననీయుడైన బేడే, ఆయననుంచి ఆల్కుయిన్, — యిట్లే పరంపరగా అందించబడుతూ, విజ్ఞానజ్యోతి ఆరిపోకుండా నిలిచింది.

ఆల్కుయిన్ కూడా యీ తేజస్సును తనలోనే వుంచివేసుకోకుండా తరువాతివారి కందియ్యడానికి కృషిగావించేడు. గొప్ప తార్కికుడు, తత్త్వవేత్తా ఐన అరిస్టాటిల్ పండితుడు అలగ్జాండర్ చక్రవర్తికి గురువుగా వున్నట్లే, బ్రిటన్ పండితుడు ఆల్కుయిన్ ఛార్లమేన్ చక్రవర్తికి గురువు, బోధకుడుగా వుండేవాడు.*

---

* పేరుపొందిన చక్రవర్తులందరూ మహాపండితులదగ్గర యేదో విధంగా శిష్యరికం చేసినవారే. "మహాభాష్యం వా పాఠయేత్, మహారాజ్యం వా పాలయేత్" అను భారతీయ సాంప్రదాయ ప్రకారం మహాపండితులు చక్రవర్తులవలె మాననీయులైరి.

శ్లో. విద్వత్త్వం చ నృపత్వం చ నైవ తుల్యం కదా చన।
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే॥

ఛార్లమేన్ లేక ఛార్లెస్ చక్రవర్తి ఫ్రాంకులకు రాజు. ఆయన మహావీరుడు; భీమబలుడు. తన ఖడ్గంతో శత్రువీరుని శిరస్త్రాణాన్ని, శిరస్సునూ ఒకే వేటుతో రెండు చెక్కలుగా చేయగల మహాశక్తివంతుడు, ఛార్లమేన్. ఆయన మహాభుజ దండానికి గంటం అంటే చాలా అల్పమైనదీ, లాఘవమైనదీను. గంటం యెల్లా పట్టుకోవాలో ఆతడికి తెలియదు! ఐనా పట్టుదలతో గంటాన్ని కూడ లాఘవంగా వుపయోగించడం నేర్చుకోదలచేడు, ఛార్లమేన్ చక్రవర్తి. తలగడ క్రింద నొక క్రొవ్వు ఫలకాన్ని, గంటమునూ వుంచుకొనేవాడాతడు. నిద్రపట్టనపుడు వాటిని తీసి, ప్రయత్నపూర్వకంగా లాటిన్ అక్షరాలను నేర్చుకునేందుకు కృషి గావిస్తూండేవాడు. తెరచివున్న గవాక్షం లోంచి గాలివచ్చి, తైలదీపంతో క్రీడించేది. సుదీర్ఘమైన ఆయన గడ్డం క్రొవ్వుపలకమీద పడుతూ, ఆతని వ్రాతకు అడ్డు వస్తూండేది. అక్షరాలు రూపు చెడి, వంకరగా వచ్చేవి. గడ్డం మీసం వచ్చిన ఆ విద్యార్థికి చిరాకు కలిగేది. ఐనా ఆయన తన పట్టు విడిచేవాడుగాదు. గంటం తిరగేసి, బండకొనతో క్రొవ్వుపలక మీద తాను వ్రాసిన గీత లన్నిటినీ చెరిపేసి, పలకను స్నిగ్ధంగా చేసి, మళ్ళా అక్షరాలు వ్రాయడం మొదలుపెట్టేవాడు.

ఛార్లిమేన్ తీవ్రకృషి గావించేవాడు. చదువను, వ్రాయను నేర్చియుండుట ఒక మహాసామ్రాజ్యాధిపతికి ఎంత అవసరమో ఆతడు గ్రహించినవాడు. వ్రాయసగాండ్రు, రాజసభలు, తాణాలు, ఆజ్ఞాపత్రాలు, శాసనాలు, రాయబార కార్యాల

యాలు మొదలైనవి లేకుండా యే రాజ్యపాలనా జరుగనేరదు గదా ? ఛార్లమేన్ రాజ్యం చాలా పెద్దది. అంతేగాక అది దినదినాభివృద్ధి చెందుతూన్నది కూడాను. అతడు ఖడ్గంతోనూ, అగ్నితోనూ యెన్ని దేశాల్ని ఆక్రమించేడనుకున్నారు! ఎందరు ప్రజల్ని లొంగదీసుకున్నాడనుకున్నారు !

క్రీస్తుశకం 800 వ సంవత్సరం క్రిస్మసు రోజు ఛార్లమేను జీవితంలో చిరస్మరణీయమైంది. ఆ నాడు రోమను పోప్ లియో, సర్వక్రైస్తవలోకగురువు, రోమక చక్రవర్తుల స్వర్ణకిరీటాన్ని ఛార్లమేన్ శిరస్సుపై వుంచి పట్టాభిషిక్తుణ్ణి గావించేడు. మహాసామ్రాజ్యాధిపతియైన వాడు నిరక్షరకుక్షిగా వుండడం యెంత విచిత్రంగా వుంటుంది !

ఆచెన్‌లోని తన రాజభవనంలో ఛార్లమేన్ యెందరెందరో పండితులను కలుసుకుంటూండేవాడు. వారిలో దిగ్దంతులనదగిన ఆల్‌కుయిన్, చరిత్రకారుడు ఇయిన్‌హార్డ్, కవి ఆంగిల్‌బెర్ట్ మొదలైన వారెందరో మహానుభావులు వుండేవాళ్లు. చక్రవర్తి తన కుమారులను, కూతుండ్రను, చెల్లెండ్రను పిలిపించి, పండితవర్యుల సంభాషణములను వినమని ఆదేశించేవాడు.* ఈ సభలలో నీ పండితులందరూ తలొక పేరూ పెట్టుకునేవాళ్లు. ఆంగిల్‌బెర్ట్ యీ సభలో హోమర్‌గానూ, ఆల్‌కుయిన్‌ను రోమను నామధేయం ఆల్‌బీనస్ అనో, లేదా రోమన్ మహాకవి

---

* శ్లో. పండితైః సహ సాంగత్యం పండితైః సహ సంకథా।
పండితైః సహ మిత్రత్వం కుర్వాణో నావసీదతి॥

హొరేస్ యొక్క రెండో పేరు ఫ్లాక్కస్ అనో వ్యవహరించే వారు. చివరకు దావీదు రాజుకూడా యీ సభలో వుండేవాడు. గ్రీకు, రోమక మహాజనసభలో యూదురాజు దావీదు వుండడం అసంగతంగానూ, ఆశ్చర్యకరంగానూ లేదూ? కాని, ఛార్లమేను చక్రవర్తికి ఆ సభలోని వారిచ్చిన నామధేయాంతరమే దావీదు రాజు!

ఆ విద్వద్గోష్ఠులలో కవులు పద్యాలు చదివేవారు; పండితులు చర్చలు, వాగ్వాదాలు చేసేవారు; మరికొందరు ఉపన్యాసముల నిచ్చేవారు. వాగ్యుద్ధములలో ఒకరినొకరు మించుటకై యత్నించేవారు. చమత్కారమైన వాక్యాల్నిగాని, సమర్థమైన జవాబును గాని వినినప్పుడు ఛార్లమేన్ ప్రహృష్టాంతరంగుడై, 'సెబాస్! మంచి దెబ్బ!' 'ఇదీ నిజంగా యుద్ధమంటే!' అనీ మెచ్చుకొనేవాడు.

ఆ వాగ్వాదాలు నిజంగా క్రీడలుగానే వుండేవి. వాటిలో పాల్గొనేవాళ్ళు అత్యంతాభినివేశంతో, దానిని నిజంగానే ఒక ముఖ్యకార్యంగా, ప్రామాణిక వ్యాపారంగా భావించేవాళ్ళు. అందులో పాల్గొనేవాళ్ళ చిన్నగుంపును ప్రాచీన గ్రీకు సాంప్రదాయానుసారంగా 'అకాడమీ' యనీ, ఛార్లమేన్ చక్రవర్తిని ఆధునిక ఏథెన్సునగరస్రష్టగానూ పిలుచుకుని, ఉప్పొంగిపోయే వాళ్ళు. మనం విద్యాపోషకులైన వారిని 'అపరభోజు'లనీ మహాపండితులూ, కవులూ చాలమంది కూర్చున్న సభలను 'భోజసభ' యనీ పిలిచినట్లే సన్నమాట. కృష్ణదేవరాయల

విద్యాప్రియత్వాన్ని బట్టీ, ఆయన సభ భువనవిజయంలో అష్టదిగ్గజముల కీర్తిని బట్టీ తెలుగువారు వానిని స్మరించు తూంటారు.

కాని, ఆ చెన్‌కూ ఏథెన్సుకూ పోలికయే లేదు! ఏథెన్సు మహానగర మెక్కడ? కీకారణ్యామధ్యంలో దారుకుటీర నిర్మిత మైన ఆ చెన్ పట్టణ మెక్కడ? ఆ చెన్ రాజమందిర వాతాయన ములనుండి యెటు చూచినా మహారణ్యమే. అదీగాక దాన్ని నిజంగా రాజభవన మనడానికే లేదు! దళమైన రాతిగోడలు, అక్కడక్కడ చిన్న గవాక్షాలు, యినుప కవాటాలు, వీటితో అదొక సేనాని వేశంగా, దుర్గంగా తోస్తుందేగాని రాజభవనంగా తోచదు. సాయంసమయాల్లో నెగడిచుట్టూ ప్రవర్తిల్లిన యీ వాగ్వాదాలకు 'అకాడమీ'* యను పేరు అసలే చెల్లుబడికాదు! దాన్ని అకాడమీ అనలేము గాని, పిల్లలకూ – పెద్దలకు కలిపి పెట్టిన పాఠశాల అంటే సమంజసంగా వుంటుంది. నూతనసిద్ధాం తాలు గాని, నూతన ప్రతిపాదనలు గాని యిక్కడ మీరేమీ చూడలేరు. అక్కడి మానవులు కేవలం తమభావాలను వ్యక్తీ కరించ యత్నిస్తూన్నారని చెప్పవచ్చునేమో! అంతే. ఊఁ హుఁ! అదీ గాదు. వారు వ్యక్తీకరించే భావాలైనా వారి స్వకీయములు గాదేమో!

* ఈనాడు మన దేశంలోనూ సర్వత్రా అకాడమీలు వెలు స్తూన్నాయి. అంతకంటె ప్రాచీన విద్యా సంప్రదాయం గల భారతదేశంలో ఇట్లు చేయుట అనుచితమే. అంధానుకరణమే.

వీరు అకాడమీకి తగియున్నవారు కారు. వీరికిచ్చట కేవలం ఒక పాఠశాలమాత్రమే అవసరం! ఎటుచూచినా, కొన్ని యోజనాల పర్యంతం చదువనూ, వ్రాయనూ తెలిసిన ఆసామీయే దొరకడు!

శతాబ్దాలు గడచిపోతున్నాయి. విజ్ఞానదీపిక ఒక చేతినుంచి మరొక చేతికి అందించబడుతూ, అంతకంతకు గాఢతర మవుతూన్న అంధకారంలో మినుకు మినుకు మంటూంది. *

ఛార్లమేన్ తరువాత ఆతని సామ్రాజ్యం ఛిన్నాభిన్నమైంది. ఆయన జీవిత కాలంలో దేశాల నొకచేత జయిస్తూ, రెండోచేత దేశాల్నీ, ప్రజల్నీ తన క్రింది నాయకులకూ, సామంతులకూ పంచిపెడుతూ వచ్చేడు. ఈ నాయకులూ, సామంతులూ తమ తమ ప్రాంతాల్లో తామే సర్వాధికారులమని భావిస్తూండేవారు. ప్రతీ చిన్న ప్రదేశమూ ఒక చిన్న రాజ్యంగా, చిన్నసైజు సామ్రాజ్యంగా వుండేది. దేనికి అదే ఒక ప్రత్యేక ప్రపంచం!

## 3. విశాలమవుతూన్న ప్రపంచం మళ్ళీ సంకుచితమై పోయింది.

ప్రతీ చిన్న రాజ్యమూ కూడా ఒక ప్రత్యేక ప్రపంచమే. తన చుట్టూవున్న వన్నీ విలుప్తమైపోయినా యిదిమాత్రం తన వునికిని యథాతథంగా అట్టేబెట్టుకో గలదు. రాజుకొక రక్షణ దుర్గం, దానిచుట్టూ జనావాసాలు, యిదీ సాధారణ స్వరూపం. మహాసముద్రంలోని ద్వీపంవంటి దే యిదీను.

---

* శ్లో. ఇదమంధంతమః కృత్స్నం। జాయేత భువనత్రయం।
యది శబ్దాహ్వయం జ్యోతిః। ఆసంసారం న దీప్యతే॥

దాసులు తమకూ, తమ యజమానియైన ప్రభువర్గానికీ కూడ వస్త్రాలను నేసేవారు; చర్మాలను శుభ్రంచేసి, పదును బెట్టేవారు. పాదరక్షలు తయారు చేసేవారు; మద్యములను పులియబెట్టేవాళ్ళు, ధాన్యాదులను పిండిగా విసరేవారు. చేపలను బట్టేవాళ్ళు

వారు బానిసలు గారు; దాసులు మాత్రమే.

వేల సంవత్సరాలుగా వుండిన బానిసవిధానం రోముతో బాటుగానే విధ్వంసం గావించబడింది.

ఇప్పుడొక నూతనవిధానం, జమీందారీ విధానం, రూపొందుతూ, ప్రపంచంలో పాదుకొంటూంది.

భూస్వాముల జమీలలో యింకాకొందరుబానిస లుంటూనే వున్నారు. కాని, ఆ జమీలు ప్రధానంగా దాసుల శ్రమమీదనే ఆధారపడి వుంటున్నాయి, గాని బానిసల శ్రమపైన గాదు.

దాసు లంటే యేమిటి? దాసులు యే యజమానియొక్కా ప్రత్యేకాస్తి కారు. బానిసలనువలె దాసులను విక్రయించుటకు వీలులేదు. దాసుడు, తాను సాగుచేయు భూమికి చెందినవాడు. అతడు దానితోబాటు, ఆ కమతానికి చెంది వుంటాడు. బానిసకు లేని స్వేచ్ఛ యీతనికి వున్ననూ, దాసుడు కూడా ఆ జమీ యొక్క ఆస్తిపాస్తుల జాబితాలోనివాడే! వ్యవసాయ పరికరాలు, గొడ్లు, గోదలు మొదలగువానితోబాటు కమతంలోని దాసులు కూడ సదరు జమీకి చెందివుంటా రన్నమాట.

బానిస, యెప్పుడూ పనిని అసహ్యించుకునేవాడు. కాని, దాసుడు అట్లుగాదు. తాను పనిచేయకపోతే జీవనయాత్ర గడప లేనని గ్రహించినవాడు, దాసుడు. దాసుడు తన శ్రమఫలిత మైన పంటలో సగానికో, మూడోవంతుకో మాత్రమే యజ మాని. దానిమీదనే ఆతనికి అధికారం వుంటుంది. కాని, యేమైతే నేమి, అతడు కూడ యెంతో కొంతకి యజమానే. తనకోసం, తన ప్రభువుకోసం కూడా దాసుడు నిరంతరాయంగా పనిచేస్తూనే వుండేవాడు. బానిసలకు 'తనదీ' అనే దేదీ లేదు. కాని, దాసులకు 'స్వంత' పనిముట్లు అనేవి వుండేవి. దాసుడు తన కృషిసాధనాలను,- నాగలీ, దంతెనా, గొడ్డలీ మొదలైన వాటిని సరియైన స్థితిలో వుంచుకోడానికే ప్రయత్నించేవాడు.

ఆ రోజుల్లో ఫ్రాన్సు, జర్మనీ మొదలైన దేశాలన్నీ మహా రణ్యాలతో నిండివుండేవి. దట్టమైన యీ అరణ్యాలలో తోడేళ్లు, యెలుగుగొడ్లు గుంపులుగా తిరుగాడుతూండేవి. సము ద్రాలలో దీవులున్నట్లు, యీ మహారణ్యాలలో మధ్యమధ్య పాగుపొలా లుండేవి ఇవి ఆ యా జమీలకు చెందివుంటూ, దాసుల శ్రమమీదనే ఆధారపడి వుండేవి. భూస్వామి యెప్పు డేనా అరుదుగా మాత్రమే తన దుర్గమునుండి సపరివారంగా బైలుదేరి, వేటకుక్కలను తోడుచేసికొని, బూరాలు, డప్పులు వగైరా వాద్యఘోషములతో ప్రాంతీయారణ్య భూముల్లో వేటాడబోతూండేవాడు. కొమ్ముబూరల క్రేంకారములూ, కుక్కల మొరుగులూ, డప్పుమోతలూ కలిసిపోయి, అరణ్యా

ప్రశాంతతను భగ్నంచేస్తూ. చాలదూరంవరకూ వినిపించేవి. వాటి ప్రతిధ్వనులతో దిక్కులు పిక్కటిల్లేవి. తరువాత మళ్ళా అరణ్య మంతటా నిశ్శబ్ద మావరించేది.

మనుష్యు లెప్పుడో గాని తమ నివాసస్థానాలనుండిదూరంగా పోయేందుకు సాహసించేవారుగాదు. బాటలు అసలు లేకపోవ డమో, లేదా దుర్గమములుగా వుండడమో జరిగేది. పశువుల మీదనో, గాడిదలమీదనో, గుర్రాలమీదనో వెళ్ళడానికికూడ మార్గాలు వీలుగా వుండేవిగావు. మార్గమధ్యంలో యేదైనా పెండ్లి ఊరేగింపో, శవవాహకులో యెదురుపడితే మార్గస్థులు వైతొలగి తప్పుకోవాలంటే చాల యిబ్బందిగా వుండేది.

దీర్ఘ ప్రయాణాలమీద బైలుదేరేందుకు యెవరికో గాని యిష్టమూ వుండేదిగాదు, ధైర్యమూ వుండేది గాదు. అసలు అటువంటి అవసరాలు కూడ అంతగా వుండేవేగాదులెండి. బాటల పొడుగునా అచ్చటచ్చట రక్షణస్థానాలు, దుర్గాలూ వుండేవి. ప్రతి దుర్గమూ కూడ దారులు కొట్టే బందిపోటు గుంపులకు స్థావరముగా వుండేది. మార్గస్థులు సాయుధులై వేయికండ్లతో అనుక్షణమూ బందిపోటుగుంపులను కనిపెట్టి చూస్తూనే ప్రాణా లరచేత బెట్టుకొని ప్రయాణాలు చేయాల్సి వస్తూండేది. బందిపోటు గుంపులకు నాయకులు సాధారణముగా ఆ యా దుర్గాధిపతులే. ఈ క్రూరుల చేతుల్లో పడినవారి గతి యేమి కానున్నదో యెవరి కెరుక ?

మార్గమధ్యంలో బండ్లనుంచి గాని, కావడినుంచి గాని జారి పడిపోయిన వస్తువులన్నీ పోయిన ట్లేనని చట్టములుండేవి. మోసి

కొనిపోయే వస్తువుల్లో చాలాభాగం చేయిజారిపోయేటట్లు చేయడానికి తెరవాటుకాండ్రూ పుష్కలంగానే వుండేవాళ్లు,

రాజమార్గాలను సాధ్యమైనంతవరకు తప్పుకునే తిరిగేవారు. ప్రజలు, వర్తకులు గుంపులు గుంపులుగా కాలినడకనే, తమ సరకులను వీపులపై మోసికొంటూ పోతూండేవాళ్లు. వర్తకులింత శ్రమపడి తమ భుజాలమీద వలాసములలో మోసికొని పోవునవేమిటో తెలుసా ? ఏవైనా అవి అమూల్యములైనవే ఐవుండాలి. ఆఁ-ఔను. సుదూరస్థములైన ప్రాగ్దేశాలనుంచి గొనితేబడిన లవంగాలు, మిరియాలు, ఏలకులు, శుంఠి, జాజికాయ, జాపత్రి మొదలైన సుగంధద్రవ్యాలు, ఫ్రిజియను దేశపు మృదువైన పట్టుగుడ్డలు, రమణీమణులకొరకై రంగురంగుల పట్టుపీలికలు,-యిల్లాంటివే వర్తకుల వీపులమీది వలాసాల్లో ఉండేవి.

కాని, మళ్లా ప్రపంచ మంతకంతకు సంకుచితమైపోతూ, పరిమితమైపోతూ వచ్చింది. ఆస్ట్రియను సన్యాసులు తమ రచనలలో 'నార్మనులు, ఆంగ్లేయులు, పరాసులు అజ్ఞాతులైన ఒకానొక జాతి మనుజు'లని వ్రాసేవారు ! ఇంగ్లాండు, ఫ్రాంసు దేశాల్లో యెవరూకూడా ఆస్ట్రియా అనే దేశ మొకటి ఉన్నదనే యెరుగరు !

విదేశీయు లంటేనే జనులు అనుమానంతో చూసేవారు. విదేశీయ వర్తకులు కేవలం విపణి ప్రదేశాల్లో మాత్రమే కనబడేవాళ్ళు. సంతలు యేవో కొన్ని పట్టణాల్లో మాత్రమే

అదైనా అరుదుగా మాత్రమే జరిగేవి. విదేశవర్తకులతో యే చిన్న తగువు వచ్చినా తరచుగా ఖడ్గపోరాటంగానూ, న్యాయమైన వర్తక వ్యాపారం తరచుగా బందిపోటుదొంగతనంగానూ మారిపోయేది! వర్తకులు తరచుగా ఒండొరుల అంగడులను మాత్రమే గాక బుర్రలనూ బ్రద్దలుకొట్టుకునేవాళ్ళు.

జనులు తిరుగ నీ భూగ్రహాన్ని గూర్చి, తమకు నివాసమైన యీ భూగ్రహాన్ని గూర్చి అజ్ఞానంలో బడిపోయేరు. సుదూరస్థమైన యేదో నక్షత్రాన్ని గూర్చి వారికెంత తెలియునో, తమ పాదాల క్రింది భూగోళాన్ని గూర్చి వారికంతే తెలుసును. జనుల్లో అత్యధిక సంఖ్యాకులకు కడుపే కైలాసం. ఈ సృష్టిలో యేదెల్లా పోతే యెవరికి కావాలి ? వాటిని గూర్చిన పరిజ్ఞానం లేకపోతే తమకు రోజులు జరుగవా ఏమిటి ? జీర్ణప్రక్రియా విజ్ఞానం లేకుంటే తిన్న అన్నం జీర్ణంకాదా ? ఆకలి వేయదా ?

ఎక్కడా ఒక్క పుస్తకం గాని, అఖరికి అక్షరరూపం గాని కనబడేది గాదు. అక్కడక్కడ మఠాల్లోనూ, విహార మందిరాల్లోనూ మాత్రం అపురూపంగా ఒక్కొక్క పుస్తకం అతి గుప్తంగా కనబడుతూండేది. సన్యాసులు, పరివ్రాజకులు గాని వారెవరూకూడ పుస్తకాలను చదువరాదని నిషేధముండేది. ఆఖరికి పవిత్రవాక్యమైన బైబిల్ కూడ సాధారణ జనులు చదువకూడదు.

జనులు అజ్ఞానాంధకారంలో మునిగివుండేవాళ్ళు. ప్రపంచం మరల సంకుచితమైపోజొచ్చింది.

క్రమంగా చివరకు పండితులుకూడా తమ తమ భావాల్లో యీ ప్రపంచాన్ని ఓ చిన్న భూఖండంగా, చతురంభోధిపరీత మైన దానినిగా రూపొందించుకొన సాగేరు. భూమిని చుట్టివున్న చతుస్సముద్రములయొక్క వెలుపలి అంచుల్లో ఈ ప్రపంచపు గోడలు వుండేవని వారి నమ్మకం. ఆ కుడ్యములు పైకి ఆకాశం లోకి వంపుగా లేచి, దృఢమైన చాందినీగా యేర్పడుత వనీ, దానిమీాదనే దేవుడూ, దేవతలూ, మహర్షులూ నివసిస్తూంటా రనీ అనుకునేవాళ్ళు!

ఈ చిన్న భూఖండంలో, ప్రపంచంలో మధ్య నొక్క సము ద్రమే, — ఇదే మధ్యధరా సముద్రం, — ఉన్నదనీ, మూాడే సింధుశాఖలు, మూాడే పెద్దనదులూ, — నైలు, టైగ్రిస్, యూఫ్రటిస్ నదులు, * — వున్నాయనీ, ప్రపంచపు సరిహద్దుల కావల, సముద్రాల కవ్వలితీరంలో మరొక భూమి, — అదే స్వర్గసీమ,— ఉన్నదనీ వారి నమ్మకం! భూమి—స్వర్గము, — వీటిని గూర్చిన యిల్లాంటి దృశ్యాన్ని, పటమును, ఒక ప్రాచీన ఐగుప్త సన్యాసి, కాస్మాన్ అను నాతడు క్రీస్తుశకం 6 వ శతా బ్దిలో వ్రాసిన 'క్రిష్టియన్ టొపోగ్రఫీ' యను గ్రంథంలో యిచ్చేడు.

---

* ప్రధానంగా పాశ్చాత్యదృష్టి యిదైతే భారతీయ దృష్టిలో సప్తసింధు అని మన దేశాన్ని పిలిచినా సప్తద్వీపా వసుంధరా అనీవారు. మన ప్రాచీనులు యీ ప్రపంచాన్ని కాస్త విశాలంగానే భావించేరు. కాని యింత చిన్నచూపు ఉన్నట్టులేదు.

ఐగుప్త సన్యాసి కాస్మాస్ విస్తృతంగా దేశాటనం గావించేడు. ప్రపంచాన్ని పరికించినవాడు. ఎన్నెన్నో దూరదేశాలకు పోయినవాడు. 'భారతదేశయాత్రికుడు' అనే పేరు ఆయనకూరకనే రాలేదు! ఐతే నేమాయె. ఈ సన్యాసి చదువును నిరసించేవాడు. కావ్యాలాపాంశ్చ వర్జయేత్. ఎందుచేతనో తెలుసా? చదువు గర్వాన్ని పెంపొందిస్తుందనీ, గర్వంవల్ల పాపం కలుగుతుం దనీను. అందువల్ల చదుపుకోడాన్ని పరిహరిస్తే మంచి దని ఆ సన్యాసి భావం. సూర్యచంద్ర గ్రహణము లెందువల్ల కలుగుతున్నవో శాస్త్రజ్ఞులకు తెలిసివుండవచ్చును. కాని, అట్టి పరిజ్ఞానంవల్ల జనులకు ఒరిగిం దేమిటి? అనే దే ఆయన ప్రశ్న. "నేను నా స్వబుద్ధిచేతనే మాట్లాడటం లేదు. నేను చెబుతూన్నది నా స్వకీయాభిప్రాయం కాదు; పవిత్ర గ్రంథాలనుంచి నేను నేర్చిన జ్ఞాన మిది." అన్నాడు కోజ్మా (కాస్మాస్) పరివ్రాజకుడు వినీతుడై.

ఇప్పుడింక పండితులు ప్రకృతిని గూర్చి పరిశీలన, పరనము గావించ గోరుటలేదు. వారు కేవలం పవిత్ర గ్రంథాలను మాత్రమే పఠించుట కాతురత జెందుతూన్నారు. పసిమిరంగు చర్మములమీాదవ్రాసిన పవిత్రమతగ్రంథాలను పరివ్రాజకులు, పండితులు, మొగమంతా కళ్లుచేసుకొని చూస్తూండేవాళ్ళు. చదవడంతో అలిసిపోయిన కళ్ళను ఆ గ్రంథాలమీాదనుంచి మరల్చి, చుట్టూవున్న ప్రపంచంమీాదకు బరపినప్పుడు వారికి వస్తువిషయాదులు కనిపించేవిగావు. తమ చుట్టూప్రకృతి, చెట్టు

చేపలు, పువ్వులు, పశుపక్ష్యాదులు గాక యేవేవో సాంకేతికములైన గీతలు సంజ్ఞలు మాత్రమే కనిపించేవి. పవిత్రములైన మతగ్రంధాల్లోని విషయములను దృఢీకరించేందుకే యీదృశ్య ప్రపంచవిషయాలున్నవని పండితులు భావించేవారు.

ఒక విహారస్థమైన మఠంలో, మసకగా వున్న ఒకానొక గదిలో గురువు తన శిష్యులకు పాఠాలు బోధిస్తున్నాడు. ఆ పాఠ్య గ్రంథం పేరు 'బెస్టియరీ.' ఇది అపురూపమైన జంతుజాలాన్ని గూర్చి విపులీకరించే గ్రంథం. ఏనుగులను గూర్చి యీ గ్రంథం యేమి చెపుతూందో చూద్దాము. "ఏనుగుల మోకాళ్లు వంగవు. గాన యివి ఒక తూరి క్రిందపడిపోతే యింక లేవలేవు. ఏనుగులు యెప్పుడూ నిలబడే నిద్రపోతాయి. ఏ ఓకు చెట్టునకో జేరగిలబడి అవి నిద్రిస్తూంటాయి. వీటి యీ ప్రకృతిని గమనించిన వేటగాండ్రు ఱంపాలతో ఆ చెట్లను సగం సగం కోసి ఉంచుతారు. ఏనుగు వచ్చి నిద్రబోవడానికి ఆ చెట్టును జేరబడగానే అది విరిగిపోతుంది. పడిపోతూ యేనుగు గీ పెడుతుంది. ఈ ఆర్తనాదం విని తోడ్పడ వచ్చిన మరొక యేనుగుకూడ పడిపోతుంది. కూలిన రెండు యేనుగుల అరపులూ విని, మరో పండ్రెండు యేనుగులు వచ్చినా, పడిపోయిన వాటిని లేవదీయ లేక పోతాయి. చివరకు ఆ దారినే ఒక చిన్న యేనుగు వస్తుంది. ఇది తన తొండమును పడివున్న యేనుగుల క్రింద దూనిపి, వాటిని లేవదీసి నిలబెడుతుంది."

ఏనుగులను గూర్చి వింటూన్న పిల్లలు పరమాశ్చర్యంతో, విస్ఫారితనేత్రులై, తన్మయులై వుండేవాళ్ళు. కాని, ఏనుగులు నివసించే ఆ దూర దేశాలను గూర్చి ఆ పిల్లలు కలలు కనుటను గూర్చి గురువులు సహించేవారుగారు. ఈ కథలో యేదో నిగూఢార్థం వుందనిన్నీ, యిందులో వాడిన మాట లన్నిటికీ మరో అర్థం వుందనిన్నీ ఆ పండితులు చెపుతూండేవాళ్ళు. పడిపోయిన యేనుగు అసలు యేనుగే కాదనిన్నీ, సనాతన ధర్మము, పురాతన యూదు శాసనమే ఆ విధంగా పతనము కాగా, ఈశ్వరుడే తన పుత్రుని రక్షుడుగా పంపేడనిన్నీ, ఆ ఏసు క్రీస్తే రక్షకుడుగా అవతరించి,పతితమానవులకొరకై ప్రాయశ్చిత్తంగా ఆత్మబలిదానం గావించేడనిన్నీ,- ఆ విషయాన్నే యీ కథలో ఆలంకారికంగా చిత్రించేరనిన్నీ బోధించేవారు.

కుతూహలజనకమైన యేనుగుల కథను యీవిధంగా చాతుర్యంతో బైబిల్ ధర్మబోధనగా మార్చివేసేవారు.

దూర దేశాలనుంచి ఆ నోట నానోట వచ్చిన గాథ లంతకంతకు మహర్షిసత్తముల బోధనలతో కలగాపులగం చేయఃబడజొచ్చేవి. పరివ్రాజకులు యెన్నెన్నో చిత్ర విచిత్ర గాథలను చెప్పేవారు. బ్రెన్ డెన్ మహర్షీ, ఆయన తోడి యాత్రీకులూ తమ యాత్రలో ఒక పెద్ద ద్వీపాన్ని చూసేరు. ఓడనుండి వారు ఆ ద్వీపంమీాదకు దిగి, మకాం చేసేరు. హఠాత్తుగా ఆ ద్వీపం తోక ఝాడించి, యీాది వెళ్ళిపోయిందిట! అదొక బ్రహ్మాండమైన చేప!...మరొక కథ. దానిలో తూర్పు దేశాలకు చెందిన

ఒక గొప్ప పురోహితుని గూర్చి చెప్పబడింది. ఆ పురుషుని పేరు ప్రెస్టర్ జాన్. ఆయన సింహాసనాసీనుడై పరిపాలన చేస్తూండే వాడు. ఆ సింహాసనం అంతా రత్నాలు, పచ్చలు, ముత్యాలతో పొదగబడినదట! ఆయన మహారాజభవనంలో నివసించేవాడు. రాజభవనంలో జరిగే విందుల్లో ముప్పైవేలమంది అతిథులు భోజనం చేసేవాళ్ళు. ప్రెస్టర్ జాన్ క్రింద సామంతులుగా యేడుగురు రాజులు, అరవైయిద్దరు మాండలికులు, రెండువందల అరవై ఐదుగురు దుర్గాధిపతులు ఉండేవాళ్ళు. ఆయన కుడియెడమలలో పన్నెండుగురు బిషప్పులు నిలబడి ఉండేవారట!

జను లందరూ యీ కథలను నమ్మేవాళ్ళు. రాజులు, మాండలికులు, దుర్గాధిపతులు, బిషప్పులు మొదలైనవాళ్ళ సంఖ్య అంత ఖచ్చితంగా యిచ్చినప్పుడు సందేహించడం ఎల్లాగో చెప్పండి? మానవులు మళ్ళా ఒక చిన్న ప్రపంచంలో తన చుట్టూ గోడలు కట్టుకుని కాపురముంటూ, తమ గూటి వెలుపల జరుగుతున్న సంఘటనలను గూర్చి చిత్రవిచిత్రమైన కథలు చెప్పుకుంటూండేవాళ్ళు.

స్త్రీలు ఏకులు వడుక్కుంటూ, రాట్నముల దగ్గర కూర్చుని పాటలు పాడుకునేవాళ్ళు. భూమండలానికి పొలిమేరల్లో వున్న ధూలీదేశం పాలించే రాజును గూర్చిన పాట కథ వాటిల్లో ఒకటి. ఆ వృద్ధరాజు తన దుర్గంలో నివసిస్తూ, యోధవర్గంతో విందులు గుడిచేవాడట. ఆ దుర్గపాదములను సముద్రుడు తన

తరంగములతో శూళనం గావిస్తూండేవాడు. ప్రాచీనకాలంలో గ్రీకులు తమ నౌకాయానపు దినాల్లో కథలు అల్లి గానంచేసిన ధూలీదేశం, దాని చరిత్రలకూ ప్రతులే, నకళ్ళే యీ జను లిప్పుడు పాడుకునేవి కూడా!

పవిత్ర క్షేత్రాలకు బోవు తీర్థయాత్రికులను గురించిన గ్రంథాలలోని బొమ్మలను పిల్లలు యెంతో కుతూహలంతో చూచేవాళ్లు. ఒక గ్రంథంలో భూమినీ, స్వర్గాన్నీ చూపించే పటం ఒకటి వుంది: భూమిమీద పర్వతాలు, లోయలు, అర ణ్యాలు, పంటపొలములు వుంటాయి. చిన్నతోపుల మధ్యలో మరములు, దేవాలయాలు, దుర్గములు కనబడతాయి. వీటి శిఖరాగ్రములమీద కలశములు ఆకాశంలోనికి చొచ్చుకుని కనబడుతూంటాయి. భూమిమీద ఆకాశం చాందినీలా వ్యాపించి వుంది. దానిమీదనే నక్షత్రాలు, సూర్యచంద్రులు వుంటారు. ఏకకాలంలోనే రాత్రింబగళ్ళు స్వర్గంలో వుంటవన్న మాట.

స్వర్గపు చాందినీకి ముందువంచన పవిత్రయాత్రీకు డొకడు పరివ్రాజక దుస్తులు ధరించి, చేతిలో దండంతో చాందినీ నొక ప్రక్కకు తొలగించి, దాని వెనుక నేమున్నదా? యని సాశ్చర్య నయనుడై చూస్తూ మోకరిల్లి వుంటాడు. అక్కడ స్ఫటిక సంకాశదివ్యగోళములు, ప్రపంచపు సరిహద్దుల కావల కనబడు తున్నాయి. ఆ యా గోళములను త్రిప్పుతూ బ్రహ్మాండమైన చక్రాలు కూడా వున్నాయి. ఈ పటంలో ప్రపంచం బహు చిన్నదిగాను, ప్రపంచపు సరిహద్దు చాల దగ్గరగాను కనబడింది.

ఈ పటాన్ని చూస్తూ పిల్లలు తాముకూడ ప్రపంచపు కొన వరకు బోవ నువ్విళ్ళూరుతూ, కలలు గాంచుతూండేవాళ్లు!

ప్రపంచపు సరిహద్దులను విస్తృతం గావించేందుకు ప్రాచీన కాలంలో మానవుని కెంత కష్టం ఐనదనుకున్నారు! అటువంటిది, యిప్పుడు మళ్ళా అదంతా వృధాయై, ప్రపంచం చాలాచిన్నది గాను, సంకుచితంగానూ తయారైనది. ప్రతి చిన్న రాజ్యము, జమీ కూడ తన ఉత్పత్తిమీద నే జీవిస్తూ, చిన్న దుర్గంలాగ, బందిఖానావలె తయారైంది.

కాని, చిన్నదే కానీండి, యీ చిన్నప్రపంచంలో కూడ మానవుని కృషి సాగుతూనేవుంది. మానవుడు తన జీవితాన్ని పునర్నిర్మించుకునే యత్నం యీ సంకుచిత పరిధుల్లో కూడ జరుగుతూనే వుంది.

సంకుచిత హద్దుల్లో గర్భీకృతమై అణిగిపోయివున్న యీ కృషి వెల్లడిలోనికి, వెలుతురులోనికి వచ్చేకాలం యింకా ముందు వుంది. అప్పుడింక యీ ప్రపంచపు సరిహద్దులు యెంతో విస్తృతం అవుతాయి. మానవుని బంధించివున్న చుట్టుగోడలు యెంతో దూరం వెనక్కి నెట్టివేయబడతాయి.

## 4. తూర్పుదిక్కున మాత్రం ఇంకా కాంతిపుంజం తేజరిల్లుతూంది.

పశ్చిమదేశాలన్నీ గాఢాంధకారంలో, అజ్ఞానతిమిరంలో మునిగిపోయి ఉన్నపుడు తూర్పుదిక్కున మాత్రం చిన్న వెలుగు

మినుకుమంటూ యింకా మిగిలివుంది. అస్తాద్రి చాటున కు పోతూన్న సూర్యుడు తన అరుణకిరణ జాలంతో పర్వతాగ్రాలను కాంతివంతంగా చేస్తూంటే క్రింది లోయ లన్నీ తిమిరాచ్ఛాదితములై వుండవా?

కాన్‌స్టాంటినోపుల్ రేవుకు ఓడలు చేరుతూనే వున్నాయి. ఇది తూర్పున వున్న రోమక సామ్రాజ్యానికి ముఖ్యపట్టణం. సుదూరస్థ దేశాలనుంచి వచ్చి చేరు వర్తక బిడారులతో నగర పరిసరాలు సమ్మర్దములుగా వుంటూనే వున్నాయి. అరేబియా నుంచి అత్తరులు, ఇండియానుంచి మిరియాలు, లవంగాలు, మజ్లినులు, రత్నములు, అబిసీనియానుంచి ఏనుగు దంతములు, వీటిని గొనివచ్చే బిడారులు యెడ తెగకండా వస్తూనేవున్నాయి.

ఒక బైజాంటైన్ పరివ్రాజకుడు చీనాకు యాత్రగావించేడు. ఆయన తన చేతి దండమును గుల్లగా దొలిచి, దానిలో పట్టు పురుగులను భద్రంగా దాచి, యెన్నో ఆటంకాల నధిగమించి, కాన్‌స్టాంటినోపుల్‌కు వచ్చి చేరేడు. బైజాంటియమ్‌లోకూడా పట్టుపురుగులు అభివృద్ధి చెందినాయి. నేర్పరులైన పనివాళ్లు కాన్‌స్టాంటినోపుల్‌లోనే పట్టుబట్టలను నేయ నారంభించేరు.

పశ్చిమాన రోమక సామ్రాజ్యం నాశన మైపోయినా, తూర్పున రోమక సామ్రాజ్యం యింకా నిలిచి, అభివృద్ధిజెందుతూండడానికి కారణ మేమిటి? తూర్పున బైజాంటియమ్ బానిస విధానానికి స్వస్తి చెప్పింది గనుకనే తాను జీవించి యుండ గలిగింది.

రోమునగరపు ఫోరమ్ (రాజవీధి) లో, చతుష్పథంలో గడ్డి మొలిచింది. అదే సమయాన కాన్‌స్టాంటినోపుల్‌లో నూతన రాజభవనాలు, సుందర దేవాలయాలు కొత్తగా నిర్మిస్తూ న్నారు! సెయింట్ సోఫియా కెథ్రెడల్ శిఖరకలశము గాలిలో లేచింది. మానవ హస్త వినిర్మితమైన ఆకాశానికి వలెనే యిది కనబడుతూంది! దానిక్రింద చుట్టూ ప్రకాశమానములైన కిటి



ఆర్కిమెడీస్

కీల వరుసలు అందంగా కానవస్తూన్నాయి. ఈ దేవాలయ కల శాన్ని నిర్మించేందుకు యెందరెందరో శిల్పులూ, వాస్తుశాస్త్ర జ్ఞులూ ప్రాచీన విజ్ఞానాన్ని పఠించాల్సి వచ్చింది. సమతుల, ఆధారము మొదలైన వాటినిగూర్చి, ఆర్కిమెడీస్ పండితుని విజ్ఞానశాస్త్ర సూత్రాలను శిల్పులు క్షుణ్ణంగా పఠించాల్సి వచ్చింది. తెల్లని స్ఫటిక శిలాస్థంభాలమీద శిరోభాగముఖా లను శిల్పుల పనిముట్లు అతిసున్నితంగా మనోహరంగా నగిషీ

పనులతో తీర్చిదిద్దేవి. దేవాలయ కుడ్యములమీద క్రీస్తు ప్రభువు, ఆయన భక్తుల చిత్రాలు రంగురంగుల స్ఫటిక శిలా ఖండాలను పొదిగి, నీలిబంగారు రంగు భూమికలమీద యెంతో పనితనంతో చిత్రించేవారు.

ఈ ఏసు అభిషిక్తుడు! క్రీస్తు అంటే అభిషిక్తుడని అర్థం. మహావైభవోపేతంగా స్వర్గసింహాసనాసీనుడై యున్న యీ స్వర్గ ప్రభువుకూ, అసలు ఏసుకూ పోలికే లేదు! ఏసు నిజజీవితంలో వినీతుడు, బానిసల మిత్రుడు, బిచ్చగాండ్ల తోడునీడ, అనాధులకు ఆధారభూతుడు, దీనులకు దిక్కైనవాడు. ఆ మహాత్ము డెక్కడ? సింహాసనాసీనుడైన యీక్రీస్తు ఎక్కడ? మానవ హృదయపీఠాల్లోనే ఆ ఏసు స్థానం. కళాకారులు గావించిన మరో కల్పన యేమిటో తెలుసా? బైజాంటియం చక్రవర్తి చక్కని జరీ బంగారు దుస్తులు ధరించి, అమూల్యరత్న ఖచిత కిరీటధారియై చేతులు చాచి, తలవంచి, మోకరించి స్వర్గప్రభువు ముందున్నట్టుగా వారు కల్పన గావించేరు! ఇదే రీతిలో సుప్రసిద్ధులైన బైజాంటియం కులీనులు, ప్రభువంశీకులు, సామంతులు రాజసభలో చక్రవర్తి ముందు మోకరిల్లి, ప్రభువు పాదములను ముద్దిడుకొనేవాళ్లు! ఆహా! ఏమి విపరీతము' ఒకానొకప్పుడు, మొదటి క్రైస్తవులు మరణశిక్షకు కూడా వెరువక రోమక చక్రవర్తిని దేవాంశసంభూతు డని పిలువ నిరాకరించేరు. అటువంటిది యిప్పుడు వారు తమతోటి మానవులలో నొకనిని దైవసమానునిగా జేసివైచిరి! ఇప్పుడు వారు తమ

చక్రవర్తి బొమ్మలను తలచుట్టు కాంతిమండలముతో, పరివేష ముతో చిత్రించ నారంభించేరు !

బైజాంటియమ్‌లో యెన్నెన్నో విషయాలు ప్రాచీన రోమక సామ్రాజ్యాన్ని జ్ఞాపకం చేస్తూండేవి. ప్రాంతీయ జనులు బైజాంటియను గ్రీకులను రోమకులని పిలిచేవారంటే మనం ఆశ్చర్యపడవలసిన పనిలేదు ! ప్రాచీనకాలపు శాసనాలు, శాస్త్రాలు, కళలు, శిల్పములు మొదలైన పెన్నిధులలో మిగిలి యున్నవాటిని నాశనమైపోకుండా నిలబెట్టినవారు బైజాంటియను గ్రీకు లొక్కరే.

అచ్చటచ్చట చెర్చిలలో దేవదూతల విగ్రహాలు, చిత్రాలు వుండేవి. విగ్రహారాధకుల దేవుళ్ళవలెనే అవికూడా దివ్య సుందరములుగా వుండేవి. సామగీత లనునవి క్రైస్తవుల ఆరాధనా గీతములు. పాలస్తీనాను ప్రాచీనకాలంలో పాలించిన దావీదురాజు యీ సామగీతములను నిర్మించెనని చెపుతారు. 'సామగీతములు' అను గ్రంథాలలో హార్పు అను జంత్ర వాద్యమును చేతగొని భక్తిపరవశుడై గానంచేస్తూన్న దావీదురాజుయొక్క బొమ్మ వుండేది. పురాతన గ్రీకుల, విగ్రహారాధకుల గాథలలోని దివ్యగాయకుడు * ఆర్ఫియస్‌ను ముమ్మూర్తులా పోలివుండేవాడు యీ దావీదురాజు !

---

* భారతీయుల పురాణములలోని నారదునికి గ్రీకుపురాణములలోని ఆర్ఫియస్‌కు సామ్యం వుంది. నారదుడు దివ్యగానం చేయగలవాడే గాక సంగీత శాస్త్రాచార్యుడుకూడాను. భక్తాగ్రగణ్యుడుగాను, అనేక విద్యలలో నిష్ణాతుడుగాను యీతడు పరిగణింపబడుతూన్నాడు — అనువాదకుడు.

దావీదు రాజుయొక్క భుజాల వెనుక మూసీ ♦ దేవతయును, ఆయన పాదముల సన్నిధిని అర్ధనగ్నుడైన పాన్ † దేవత గొఱ్ఱెలు, మేకలుచే పరివేష్టించబడి యుండుటను చూస్తాము.

వెనుకటి కళల తాలూకు అవశేషాలే యివి. ఋషుల, దేవతల విగ్రహాల ముఖాలు అంతకంతకు మోటుగా, కళావిహీనములై వుంటూవచ్చేయి. ప్రతీ నూతనశిల్పమూకూడ యేదో ఒక పురాతన శిల్ప ప్రతిమకు అనుకరణయే, నకలే. శిల్పమును వాస్తునుగూర్చి మెన్నెన్నో విధినిషేధాలను, శాసనాలను గావించేరు, క్రైస్తవమత పీఠాధిపతులు. వీటిని అతిక్రమించి పాపంచేయడానికి శిల్పులు, కళాకారులు సంకోచించేవాళ్ళు. మతనియమాల నే సంకెళ్ళకు లోబడివుండాల్సిన స్థితి శిల్పకళాది విద్యలకు పట్టింది.

క్రైస్తవ పీఠాధిపతుల పాదాల దగ్గర కళలు, విజ్ఞానము దోసిలొగ్గి, తలవంచి, మోకరిల్లినాయి. 'హీయర్సి' అను మాట తరుచుగా వినబడజొచ్చింది. ఈ గ్రీకు పదానికి అర్థం

---

♦ మూసీదేవత, జ్యూస్ దేవుని తొమ్మండుగురు పుత్రికలలో నొకతె. ఈ తొమ్మండుగురున్నూ సంగీతము, కవిత, అలంకారశాస్త్రము, శబ్దశాస్త్రము, శిల్పము మొదలైన తొమ్మిది లలితకళలకు అధిష్ఠాన దేవతలు. భారతీయుల సరస్వతికి యిది నకలుగా వుంటుంది — అను.

† పాన్ అనునది గ్రీకు పురాణ వనదేవత, సంగీత ప్రియ. సగం ఊర్ధ్వభాగం స్త్రీ శరీరమూ, అధోభాగం మేక దేహంగానూ వుంటుంది. చెవులు, కొమ్ములుకూడా మేకవిగా నున్నట్లు ఒక్కొక్కప్పుడు చిత్రిస్తారు. — అను.

‘స్వీకరించుట’ లేక ‘ఇష్టమైనదాన్ని స్వీకరించుట’ అని. ఇప్పుడీ మాటను విని జనులు భయభీతులై గడగడ వణుకుతూన్నారు. సాంప్రదాయికంగా వస్తూన్న అభిప్రాయాలకు వ్యతిరేకంగా తమ స్వీయభావాలను కలిగియుండడాన్ని ‘హియర్సీ’గా, మహాపాతకంగా, చెర్చి అనగా మతపీఠాధిపతులు నిర్ణయించేరు. ఏ విషయాన్నిగూర్చియైనను వుండగల రెండు అభిప్రాయాల్లో తమ కిష్టమైన దానిని స్వీకరించు స్వేచ్ఛను యెవరికి యివ్వడానికీ చెర్చి అంగీకరించేదికాదు. అభిప్రాయ స్వేచ్ఛను వారు సహించరు. భావస్వేచ్ఛ కావలనేవారిని ‘హియర్సీ’ క్రింద నిర్దాక్షిణ్యంగా బాధించడం అంతకంతకు పెచ్చుపెరిగిపోయింది. భావవరణమును ఖండించడానికే యిప్పుడు మతధర్మశాస్త్రజ్ఞులు ప్రాచీన తత్త్వశాస్త్రాదులను పఠించుతూన్నారు. వారిప్పుడు ప్రాచీన గ్రీకు తత్త్వవేత్త యగు దెమోక్రితస్ సిద్ధాంతాల్ని చదవడంలేదు. పై పెచ్చు దెమోక్రితస్ సిద్ధాంతాల్ని ఖండిస్తూ అలగ్జాండ్రియను బిషప్ దియోనిస్యూస్ వ్రాసిన ఖండన గ్రంథాల్నే చదువుతున్నారు. దియోనిస్యూస్ బిషప్ సిద్ధాంతం యేమిటో చూద్దాం. ఈ ప్రపంచం యేదో గందరగోళంనుంచి పుట్టినది కాదనీ, విశ్వస్రష్ట ఒకడు వుండేతీరినా డనీ, గృహాన్ని నిర్మించేందుకు గృహనిర్మాత యే విధంగా అవసరమో అట్లే యీ విశ్వాన్ని సృజించేందుకు విశ్వస్రష్ట ఒకడుకూడా వుండే వుండాలనీ,— ఆయన వాదించేవాడు. గ్రహతారకాదు లన్నీ వాటి వాటి నిర్ణీతపథములలో ఈశ్వరుని యిచ్ఛానుసారంగానే

నడుస్తూన్నాయనీ, యోగ్యులు, ధార్మికులున్నైన జనులు యీ విషయాన్ని విశ్వసిస్తూనే వున్నారనీ దియోనిస్యూస్ అన్నాడు. పాపాత్ములు, అవిశ్వాసులు యీ విషయాల్ని అంగీకరించినా, అంగీకరించకపోయినా యిది మాత్రం సత్యమని ఆయన నొక్కి వక్కాణించేవాడు.



అరిస్టాటిల్

చెర్చి గ్రంధాలలో పురాతన తత్త్వవేత్తల అభిప్రాయాలన్నీ వక్రంగా చెప్పబడ్డినాయి. వారు పతితులుగా చిత్రించబడజొచ్చేరు. క్రోధనులైన పరివ్రాజకులు తరుచుగా పురాతన తత్త్వవేత్తలను విధర్ములని దూషిస్తూ, క్రైస్తవేతరులని పేర్లొని నిరసిస్తూ వ్రాస్తూండేవారు. ఒక పవిత్రుడు, అరిస్టాటిల్

రచనలు సముద్రఫేన సదృశములై క్షణభంగురములని వ్రాస్తే, మరొక బుద్ధిమంతుడు 'అధముడైన డెమోక్రిటస్' అని పేర్కొన్నాడు.

విగ్రహారాధకులైన ప్రాచీన గ్రీకుల దేవాలయాల్లోని శుద్ధ స్ఫటిక స్తంభాలు వినీలాకాశంలోనికి వ్యాపించి, యెంత దేదీప్యమానంగా వుండేవి! గ్రీకు పండితుల, కవుల సృజనాత్మక భావాలు యెంత మహోజ్జ్వలమైనవి! ఆ కాలం గడచి పోయింది. విజ్ఞాన సూర్యుడు పశ్చిమాన అస్తంగతుడవుతూన్నట్లుంది. సంధ్యాసమయపు నీలినీడలు పొడవుగా పరుచుకుంటూన్నాయి. బైజాంటియం దేవాలయాల్లోని బంగారు వెండి దేవతా విగ్రహాల్లో ప్రాచీనకళల కడపటి ఛాయలు యింకా ప్రస్ఫుట మవుతూన్నాయి. ప్రాచీన విగ్రహారాధకుల దేవాలయాల తాలూకు శిధిల స్ఫటిక శిలా స్తంభాలు యిప్పుడు క్రైస్తవ చెర్చిల గుమ్మటాలను భరిస్తూన్నాయి. భస్మావశేషములైన ప్రాచీన గ్రంథాల్లోంచి ఉదహరించే వాక్యాలు ప్రాచీనుల విజ్ఞతను దిఙ్మాత్రంగా చూపుతూన్నట్లున్నాయి. పురాతన తత్త్వవేత్తలను ఖండిస్తూ వ్యతిరేకులు వ్రాస్తూన్న ధర్మశాస్త్ర గ్రంథాల్లోని ఖండనాప్రసంగాలే ప్రాచీనుల విజ్ఞానానికి పతాకలుగా వున్నాయి.

బైజాంటియమ్‌లో ప్రాచీన విజ్ఞానపు సాయంసమయప్రభలు తమ కాంతిని బరకినాయి.



# రెండో ప్రకరణం

## 1. విశ్వరంగంమీదికి నూతన పాత్ర లవతరించేయి

మానవ చరిత్రయొక్క విశాల రంగంమీదకు నూతన పాత్రలు అవతరించేయి. కొందరు జనులు యీ నూతనులను 'స్లావులు' అన్నారు. మరికొందరు వీరిని 'ఆంటిస్'—అంటే మహాకాయులన్నారు. ఆంటిస్‌లు నిజంగానే దీర్ఘకాయులు, మహాబలులు ఐవుండేవాళ్ళు. గుర్రాలు కూడ యీ మహాకాయుల భారం మోయజాలక అణగారిపోయేవట!

ఎవరీ ఆంటిస్‌లు? మహారష్యనులు, తెల్లరష్యనులు, యుక్రేనియనులు మొదలైనవారి పూర్వీకులు యీ ఆంటిస్‌లు. వీరు సిధియన్ కర్షకుల తెగకు చెందినవారు, హెరోడోటస్ అను ప్రాచీన గ్రీకుచరిత్రకారుడు తన పరిభ్రమణములలో కొంతకాలం వీరి దేశంలో గడిపేడు. సిధియనులలో ఒక ప్రాచీన గాధ వుంది. దాని ప్రకారం పురాతనకాలంలో ఒక బంగారు నాగలి, కాడి, పరశువు, శరావము,— యీ నాలుగూ స్వర్గాన్నుంచి తమ భూమిమీద పడినవని చెపుతారు, వీరు.

అనేక శతాబ్దములకు తర్వాత ద్నీస్టర్, ద్నీపర్ నదుల మధ్యస్థ ప్రదేశంలో నేటి పురాతత్త్వవేత్తలు సాగించిన త్రవ్వకాలలో రెయిన్‌డీర్ కొమ్ములతో చేసిన గుద్దళ్ళు, ఎముకతో చేసిన కొడవళ్లు, గోధుమలను విసరే రాళ్లు, ధాన్యం దాచే పెద్ద మట్టి బానలు (శరావములు) మొదలైనవన్నీ దొరికి

నాయి. ఆంటిస్ తెగలకు పూర్వులైన ఆదిమ కర్షకుల పనిముట్లు, యివి.

హెరొడోటస్ తర్వాత చాలా కాలం గడచింది. డ్నీస్టర్, దాన్ నదుల మధ్యస్థమైన ఆ విశాల భూభాగంలోని జనులు యీ కాలము నంతనూ వృథా పుచ్చలేదు. భూమి నింకనూ బాగుగా సాగుజేయడం వారు నేర్చుకున్నారు. తమ యిండ్లు నింకా చక్కగా నిర్మించుకోడం వారు నేర్చుకున్నారు. వారి కెన్నో నగరాలుండేవేమో, విదేశీయులు వారి దేశాన్ని 'నగర దేశం' అని పిలిచేవారు. * బ్రహ్మాండమైన ప్రహరీ గోడలమధ్య పెద్ద బురుజులచే సురక్షితమైన యీ నగరాల్లో నిపుణులైన కార్మికులు తమ తమ దుకాణాల్లో రకరకాల వస్తువులు తయారు చేస్తూండేవాళ్ళు. కార్మికులు, లోహకారులు, కుంభకారులు, స్వర్ణకారులు, వడ్రంగులు, తంతువాయులు మొదలైన వివిధ వృత్తులలో నిపుణు లుండేవాళ్ళు. వెండి బంగారు మూర్తులు. కమ్మర పటకారులు, పోతఅచ్చులు, మూసలు, గండ్రగొడ్డళ్ళు, తామ్రవలయాలు, రకరకాల కుండలు, పాత్రలు, అనేక యితర పనిముట్లు మొదలైనవాటిని భూదేవి తన గర్భంలో దాచి, యీనాటివరకూ కాపాడి, మనకందించి, చరిత్ర నిర్మాణానికి చేయూత నిచ్చింది.

---

* మూడు పెద్ద పట్టణములు గల దేశాన్ని పాలించేవారేమో త్రిపురాసురులు, వారి దేశం త్రిపురదేశం అయింది. మూడు పెద్ద పెద్ద గర్తములు లేక లోయలు గలది త్రిగర్తదేశం అయింది. ప్రాచీన దేశాలపేర్లు వాటి భౌగోళికాది వివరాల్ని తెలుపునవిగా వుండడం తరచుగా కనిపిస్తుంది—

అప్పటికి చాలా కాలం క్రిందటనే గ్రీకులు రష్యాదేశాన్ని ఎరుగుదురు; రష్యన్‌లు గ్రీసుదేశాన్ని ఎరుగుదురు.

క్రిమియాలో గ్రీకుల వలస లుంటూండేవి. వాటికి అనతి దూరంలోనే సిథియన్‌ల నగరాలుండేవి. శత్రుదాడులనుంచి నగరాన్ని రక్షించే మహా బలిష్ఠములైన ప్రాకారములు, శిలా నిర్మిత కుడ్యపంక్తులు విదేశీయుల నాశ్చర్యనిమగ్నులను గావించేవి. గ్రీకుల వలసలలో అట్టి రక్షకప్రాకారా లుండేవి గావు. సిథియన్ రాజుల భవనాల్లోనూ, సమాధులలోనూ గోడల నిండ ఎన్నెన్నో చిత్రములను నేర్పరులైన చిత్రకారులచే వ్రాయించేవారు. ఈ కుడ్యచిత్రాల్లో అనేక సన్నివేశాలు చిత్రించబడి వుండేవి. హయారూఢులైన యోధులు, అడవి పందులను బల్లెములతో గ్రుమ్ము వేటకాండ్రు, లైర్ అను తంత్రీవాద్యములను ఒడులలో పెట్టుకొని పాడుతూవున్న దాడీవాలా చారణులు,- నాటి నిత్యజీవితాన్నుంచి వివిధ సన్నివేశాల నా చిత్రాల్లో మనం చూస్తాము. పర్వతశ్రేణుల్లో పెద్ద పెద్ద గుహాలను తొలచి, వాటిలో ధాన్యాదుల నపరిమితంగా నిలవచేసేవారు. సిథియను లీ ధాన్యాదులను గ్రీకులకు విక్రయించేవారు. ఖెర్సన్ మొదలైన గ్రీకు వలసలనుంచి నల్లసముద్రం మీదుగా యీ ధాన్యం గ్రీసుకు గొంపోతూండేవారు. సిథియా, గ్రీసు దేశాలకు సముద్రయాన మార్గాలుండేవి.

ఈ మార్గాన గ్రీకులు ఉత్తరాభిముఖంగా సిథియన్‌ల దేశానికి వెళ్ళేవాళ్ళు. ఆ తరువాత కాలంలో సిథియను రష్యనులు

కూడ తరుచుగా గ్రీకుల రాజధానీ నగరాన్ని సందర్శించడానికి వెడుతూండేవారు......

సిథియన్‌ల తరువాత యెన్నో శతాబ్దాలు గడిచినాయి. అప్పటికి ఆంటిస్‌లు (సిథియనులు) తమ ఆయుధాలను ప్రయోగించడంలో యెంతో నేర్పు గడించేరు. వారు చాల ధైర్యశాలురు. విల్లంబులు, పరశువు,— యివి వీరి ప్రధానాయుధాలు. వీరు యుద్ధానికి మూకలుగా బోవువారుగారు. పదులు, వందలు, వేలుగా దళవిభజన గావించుకొని, క్రమపద్ధతిలో యుద్ధరంగానికి తరలువారు. వారికి నేర్పరులు, అనుభవజ్ఞులూ సైన్యనాయకు లుండేవాళ్ళు. పెద్దలు పిన్నలకు పూర్వవీరుల గాథలు చెప్పేవారు. సముద్రంమీదా, భూమిమీదా కూడ మహాయుద్ధం చేయు నేర్పుగల మహాయోధుడు "జొబ్రొగస్తా"ను గురించిన గాథలు యువకు లెంతో శ్రద్ధతో ఆలకించేవారు. బైజాంటియన్ చక్రవర్తి స్వయంగా జొబ్రొగస్తా కనేక గౌరవ బిరుదాల నిచ్చి, పాంటస్ తరంగాలమీద ప్రయాణంచేసే గ్రీకుఓడల కన్నిటికీ అధిపతిని గావించేడు. నల్లసముద్రాన్నే ఆ కాలంలో పాంటస్ అని పిలిచేవాళ్ళు. ఆంటిస్ లేక స్లావ్ వర్తకులు దక్షిణాన బైజాంటియంతోనూ, తూర్పున ఖజారులతోనూ కూడ వర్తక వ్యాపారాలు సాగించేవారు. సుదూరస్థమైన అరేబియా దేశాన్నుంచి బైలుదేరిన మొదటి బిడారు (దీనినే సార్థ మంటాము) ఖజారుల దేశంగుండానే స్లావుల భూభాగానికి వచ్చింది. అరేబియన్ యాత్రీకులు వ్రాసుకున్న

దినచర్య పుస్తకాల్లో ద్నీపర్ నదిమీాద నున్న దేశాన్ని గురించీ, అక్కడవున్న కీవ్ అనే నగరాన్ని గురించీ ప్రసక్తి వుంది. దాని తరువాత స్లావియా దేశం, నొవోగొరోద్ రాజ్యం, యింకా పోతే పశ్చిమంగా నోల్హిలియా దేశం (యుక్రెయిన్ లోది) వున్నా యని వారు వ్రాసేరు.

కాలక్రమేణా రష్యాలోని చిన్నచిన్న రాజ్యా లన్నీ కలిసి, యేకరాజ్యాధిపత్యం క్రిందికి వచ్చేయి. అదే కీవ్ రాజ్యం- కీవ్ నగరం ప్రధాన రష్యన్ నగరమై, రష్యన్ నగరా లన్నిటికీ తల్లియైనది.

స్లావులు మొట్టమొదట దక్షిణదిశలో ముందుకు సాగి నపుడు వారికి ప్రాచీన గ్రీకు, రోమక సంస్కృతులు కళ్ళబడి నాయి. జర్మను గోథులు రోమక సామ్రాజ్యాన్నీ, సంస్కృతినీ ధూళిలో కలిపేసేరు. రష్యన్ స్లావులు కూడ బైజాంటియం విషయంలో బర్బరులుగానే ప్రవర్తించేరా? వారు బైజాంటి యంను, తూర్పు రోమక సామ్రాజ్యానికి శత్రువులుగానే వుండిరా? లేక మిత్రభావంతో రక్షకులుగా వుండిరా? ప్రాచీన గ్రీకు-రోమక సంస్కృతికి స్లావులు వారసులైనారా? నాశకు లైనారా? మానవ సంస్కృతీ వాహినికి వారు ప్రవర్తకులైరా, దాహకులైరా?

దీనికి యిదమిత్థ మని ఒక్కమాటలో జవాబు చెప్పడం కష్టం. ఇరుగు పొరుగున వున్న యీ రెండు దేశాలకూ ఒకసారి మిత్రత్వం, మరొకసారి శత్రుత్వం వుంటూ వచ్చేయి. జయాప

జమానాలు అటునిటు మారుతూ వచ్చేయి. స్లావులు తమ గుండెలమీద కుంపటివంటి వాళ్ళని బైజాంటియను గ్రీకులకు తెలుసును. కీవ్ రాజు లనేక పర్యాయములు పెద్ద పెద్ద సైన్యాలతో దండెత్తివచ్చి, తూర్పు రోమక సామ్రాజ్యాన్ని తాకుతూ వచ్చేరు. పదో శతాబ్దంలో ఇగోర్ రాజు నౌకా దళంలో పదివేల పడవ లుండేవి; కీవ్ రాజు స్వియతోస్లావ్ అరవై వేల పటాలానికి అధిపతి.

బైజాంటియను చరిత్రకారుడు 'డీకన్ లియో' స్లావులను గూర్చి యిల్లా వ్రాసేడు : " ఈ జాతియొక్క బలవీర్యము లమేయములు. వారు కంఠంలో ప్రాణ మున్నంతవరకు శత్రువు లకు లొంగరని ప్రతీతి. అతివ్యాప్తి దోషానికి పాల్పడి, పిచ్చి వాళ్ళనిపించే టంతటి దుస్సాహసులు వారు." స్లావు సైన్యాల్లో స్త్రీలుకూడా వున్నారని ఆయన వ్రాసేడు. యుద్ధభూమిపై వీరోచిత పోరాటం గావించి మరణించినవారిలో స్త్రీలు కన బడినందుననే యీ విషయం నిర్ధారణగా తెలిసిందని ఆ చరిత్రకారుడు వ్రాసేడు.

లియో చారిత్రక కథనం ప్రకారం, ఒకసారి బైజాంటియను చక్రవర్తి జాన్ జిమెస్కెస్ పెద్ద సైన్యంతో దండయాత్రకు వస్తున్నానని స్వియతోస్లావ్ రాజును బెదరించేడు. ఈ బిభీషిక కాలిడిల్లు ప్రత్యుత్తర మిచ్చేడట "మీరీ సుదీర్ఘ ప్రయాణం గావించే శ్రమ పడనవసరంలేదు. బైజాంటియమ్ ద్వారంధగ్గ రనే మేము త్వరలో మా స్కంధావారాన్ని యేర్పాటు

చేస్తాము; నగరాన్ని చుట్టుముట్టి బలంగా యెదిరించగలము–రోమక చక్రవర్తి మాతో పోరాడదలచినట్లైతే ధైర్యంగా యుద్ధభూమిలోనే మే మాయనను యెదుర్కోగలము.'

ఒకసారి యుద్ధంలో స్లావు సైన్యం శత్రువులచే చుట్టుముట్టబడింది. సర్దారులు చాలమంది స్వియతో స్లావ్ రాజును వెనక్కి తిరుగమని సలహా యిచ్చేరు. కాని అతడిల్లా చెప్పేడు : "అనేక రాజులను సునాయాసంగా జయించిన రష్యను సైన్యాలు, ఒక్క రక్తపుబొట్టు కార్చకుండా దేశాలకు దేశాలనే స్వాధీనం గావించుకొన్న రష్యను సైన్యాలు యిప్పుడు పౌరుషాన్ని గోల్పోయి శత్రువుకు లొంగితే మన కీర్తి మాసిపోతుంది. మన పూర్వుల పౌరుషాన్ని గుర్తుకు దెచ్చుకోండి; మన రష్యను యోధు లింతవర కెక్కడా పరాజయ మనేదే యెరుగరని జ్ఞాపకం వుంచుకోండి; మీ కీర్తిప్రతిష్ఠలకై, మీ జీవితాలకై ధైరంతో పోరాడండి. శత్రువుకు వెన్నిచ్చి, మన దేశానికి మరలిపోవడం ద్వారా ప్రాణరక్షణ గావించుకోడం మన సంప్రదాయంకాదు. మనం జయంపొంది, రాజ్యభోగాలను, కీర్తిని అనుభవించడమో, లేదా యుద్ధభూమిలో బాహుబలపరాక్రమాలు ప్రదర్శించి, వీరస్వర్గమును పొందడంగాని చేయాలి." *

---

* ప్రాచీనకాలాన్నుంచీ భారతీయుల క్షాత్రసంప్రదాయముకూడా 'యశోవా మృత్యుర్వా' అనేదే. భారతయుద్ధ సమయంలో శ్రీకృష్ణుడు అర్జునునితో 'హతోవా ప్రాప్స్యతే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీం' అన్నాడు. ఇట్టి వుదాహరణలు భారతదేశ చరిత్రలో అసంఖ్యాకములు–

స్వ్యియతోస్లావ్ రాజును గురించి శత్రుశిబిరానికి చెందిన బైజాంటియను చారిత్రకుడు వ్రాసిన దిది! ప్లూటార్క్ రచించిన మహాపురుషుల చరిత్రల మాదిరిగా చారిత్రకుడు లియో కూడ మధురవాక్ఫణితిలో తన రచన సాగించేడు.

ఈ సంఘటననే రష్యాను చరిత్రకారుడు మరింత క్లుప్తంగా చెప్పేడు. "స్వ్యియతోస్లావ్ రాజు తన సైనికులను 'బిడ్డలారా!' యని సంబోధించి యిల్లా చెప్పేడు. 'మన రష్యాను భూమికి కళంకం తేకండి! చావవలసివస్తే యుద్ధం చేస్తూనే చావండి. అట్లు చావడంలో అవమానంలేదు. మనం ధైర్యంగా, దృఢంగా నిల్చి పోరాడాలే గాని వెన్నిచ్చి పారిపోకూడదు. నేను ముందు నిలబడి మిమ్మల్ని తీసుకుని వెడతాను, నడుపుతాను!"

ఒకే సంఘటనను గురించి యిరుపక్షముల చిత్రణములూ యింత దగ్గరగా పోలియుండడం విశేషం కాదూ?

బైజాంటియమ్ చక్రవర్తి జిమిస్కెస్‌కు సంధిగావించుకోవాలనే వుంది. రష్యానులనుంచి తన సామ్రాజ్యానికి ముప్పు వాటిలుతుందని ఆయన నమ్మకం. బైజాంటియను లప్పటికే రష్యానుల బలాన్ని చవిచూచేరు. చక్రవర్తి ఖజానాకు పెద్ద మొత్తాలుగా సుంకములు చెల్లించిన తర్వాతనే విదేశ వర్తకులు తమ సరకులను తేవడానికి అనుమతించబడేవాళ్ళు, అటువంటిది యే పన్నులూ చెల్లించనవసరం లేకుండానే రష్యానులు తమసరుకులు బైజాంటియమ్‌లోనికి తెచ్చుకోడానికి వీలు కల్పించబడింది.

స్వియతోస్లావ్ పెద్ద సైన్యంతో బైజాంటియమ్ మీదికి వస్తూన్నాడని తెలియగానే జిమిస్కెస్ చక్రవర్తి సేనాసమేతుడై శత్రువు నెదుర్కోడానికి దాన్యూబ్ నదీతీరానికి వెళ్లేడు. చక్రవర్తి బంగరుజరీచొక్కాలు ధరించి, ధగధగ మెరిసే కవచాలు ధరించిన అంగరక్షకులతో, అమూల్య భూషణ భూషితమైన అశ్వము నధిరోహించి వచ్చేడు కాని, సమావేశ స్థలానికి స్వియతోస్లావు చిన్న దోనెలో వచ్చేడు. వచ్చేకనైనా ఆతడు తీరానికి బోనేలేదు. దోనెలోనే చిన్న బెంచిమీద సావధానంగా కూర్చుని వున్నాడు. చక్రవర్తి పాదాల్ని ముద్దెట్టుకోడానికి యితర రాజులు వెడితే వెళ్లుదురుగాక. అది తన పని గాదని స్వియతోస్లావ్ భావించేడు.

బైజాంటియమ్ ప్రభుసామంతవర్గాలు రష్యన్ రాజును బహు విచిత్రంగా చూడ నారంభించేరు స్వియతోస్లావ్ రాజు నిరవద్యుడైనా బంగారు కవచాదులను ధరించలేదు! సామాన్య యోధులు, సరంగులు ధరించినట్లే శుభ్రమైన తెల్లని బట్టలు కట్టుకుని వున్నాడు. ఆతని ఒక చెవినుంచి బంగారు వలయం వ్రేలాడుతూంది. ఆ కర్ణాభరణంలో ఒక రత్నం, చుట్టూ ముత్యములు పొదువబడివున్నాయి. విశాల వక్షం, నీలికండ్లు, అధోముఖములైన దీర్ఘశ్మశ్రువులు, నున్నని తలపై పిలక,-యిదీ స్వియతోస్లావ్ రాజు రూపం. ఆతడు గంభీరంగా కూర్చుని వున్నాడు. ముఖం అమ్లానంగా వుంది. స్వియతోస్లావును చూస్తూవుంటే బైజాంటియనులకు ఆతని

ధైర్య సాహసబలాదులను గూర్చి విన్న విషయాలు జ్ఞాపకం వచ్చేయి. ఉద్రేకి, సాహసి, తెగువగలవాడూనైన స్వియతోస్లావు కీవ్ రాజ్యపు సరిహద్దుల నెంతో విస్తృత పరచేడు. అత డనేక యుద్ధాల్లో పాల్గొన్నాడు. వోల్గా నదీతీరంలోని ఖజార్ దుర్గకుడ్యముల దగ్గరా, కాకసస్ పర్వతపాదభూము ల్లోనూ, వియాట్స్కి అరణ్యాల్లోనూ, హిమమయమైన కామా నదిపైనా, బాల్కను పర్వతచరియల మీాదా ఆతడు కనిపించేడు. దండయాత్రలలో వున్నప్పుడు ఆతడు అలసటయే యెరుగడు. జీనునే తలగడగా చేసికొని, ఆరుబైటనే నిద్రించే వాడు. ఎవరూ అనుకొనని సమయాల్లో, ఊహించియుండని చోట్లలో ఆతడు చిచ్చరపిడుగు పడినట్లు ప్రత్యక్షమయేవాడు. అట్లని ఆతడు యేమరుపాటున శత్రువుపై పడువాడని భావించ కండి. నిజమైన వీరునివలె స్వియతోస్లావ్ శత్రువును హెచ్చ రించే మీాద పడేవాడు. "నీతో యుద్ధం చేయాలని కోరు తూన్నాను. సంసిద్ధుడవు గమ్ము!' అంతే. యుద్ధాల్లో యెల్లప్పుడూ విజయలక్ష్మి స్వియతోస్లావ్‌నే వరించేది.

బైజాంటియన్ చరిత్రకారుడు యీా సమావేశాన్ని గూర్చి యేమని వ్రాసేడో చూద్దాం. "పడవమీాది బెంచిపై కూర్చునే స్వియతోస్లావ్, చక్రవర్తితో సంధినిగురించి కొంచెంసేపు మాట్లాడేడు. తరువాత స్వదేశాభిముఖుడై తిరిగిపోయేడు." స్వియతోస్లావ్ పడవవాండ్లు తెడ్లు వేస్తూంటే లయబద్ధంగా నీటిని మథిస్తూన్నట్లుంది. చక్రవర్తి బంగారు రికాబులతో

గుర్రాన్ని అదలించగానే ధూళిమేఘాన్ని రేపుతూ బైజాంటి యమ్ వైపు తరలిపోయింది.

యుద్ధము - శాంతి,- యీ రెంటిమధ్యనూ ఊగిసలాడుతూ యీ రెండు ప్రపంచములూ, — ప్రాక్ - పశ్చిమ సంస్కృతీ ప్రపంచాలు రెండూ, - తరచు కలుస్తూనే వుండేవి. బైజాంటి యనులు, రష్యనులు కూడా శాంతిని కాపాడేందుకు అనేక సార్లు ప్రతిజ్ఞలు తీసుకొనేవాళ్లు. "సూర్య చంద్ర నక్షత్రాదు లున్నంతవరకూ, ప్రపంచం నిలిచివున్నంతవరకూ మేము శాంతిని నిలబెడతాము. మన మైత్రికి భంగంచేసినవాళ్లు భగ వంతునినుంచి గాని, పీరున్ నుంచి గాని యెట్టి సాయాన్నీ పొంద కుందురుగాక! అంతేగాదు. అట్టివారిని వారి డాళ్లుకూడా రక్షించలేకపోవుగాక ! అంతేగాదు; వారి ఖడ్గములే వారిని ఖండతుండెములుగా ఖండించునుగాక ! అంతేగాదు; వారు యెప్పుడూ భవిష్యత్తునందుకూడా బానిసలుగా వుందురుగాక!" శపథం గావించేటపుడు రష్యనులు తమ కవచాలను తీసి, వారి దేవుడైన పీరున్ పాదములకడ భూమిపై వుంచేవాళ్లు; బైజాంటియనులు తమ శిలువలను ముద్దిడుకొనేవాళ్ళు.

కాని, ప్రతిజ్ఞలను మీరుట బైజాంటియనులకు చాల తేలి కగా వుండేది. వాటిని ఉల్లంఘించడానికి వారేమీ సంకోచించే వాళ్ళుగారు. ఈసారి కూడా అంతే జరిగింది. శత్రుత్వం ఆఖ రైందని భావించి స్వ్యటోస్లావ్ రాజు తన సైన్యాలను ఒక

వారిని రాజధానికి పంపించి, తాను కొలదిమంది యోధులతో స్వదేశాభిముఖుడైనాడు, స్లైప్పీ లంటారు. అచ్చటి పచ్చిక మైదానాలను. ఆ పచ్చిక బీళ్ళలో పశువులను మేపుకుంటూ జీవించే ఒక తెగ పశుపాలురు పిఛినెగ్ లనేవాళ్లు వున్నారు. వాళ్ళు డ్నీపర్ నదీతీరాన స్వియతోస్లావ్‌ను యెదిరించడానికి కనిపెట్టుకుని వున్నారు.

భయంకరమైన యుద్ధఘోషములతో పిఛినెగ్ అశ్వికులు తండోపతండాలుగా రష్యనులమీాద పడి క్రమ్మివేసేరు.

స్వియతోస్లావ్ తన రాజధానికి యీా మార్గాన మరలిపో తూన్నట్లు పిఛినెగ్ పశుపాలురకు తెలిపిన దెవరు? ముమ్మాటికీ బైజాంటియనులే ఐవుంటారు. మహాభయంకరులైన యీా పశు పాలురను రష్యనులమీాదికి ఉసుకొల్పడానికి తగిన అవకాశం కోసం బైజాంటియనులు యెప్పుడూ యెదురుచూస్తూండేవాళ్లు. రష్యనులతో 'నేను మీాపై యుద్ధానికి వస్తూన్నాను!' అని జిమిస్కెస్ చక్రవర్తి హెచ్చరించలేదు. కాని అతడు కూట నీతితో రష్యన్ రాజును పిఛినెగ్‌లచేత చంపించేడు. స్వియతో స్లావ్‌ను దారికాచి చంపినందుకు పిఛినెగ్‌లకు చక్రవర్తి యెంత ధనం యిచ్చేడో మనకు తెలియదు. కాని, తాము ప్రత్యక్షంగా కదనరంగంలో చంపజాలనివారిని లంచమిచ్చి హంతకులచే చంపించుట బైజాంటియనుల కాచారమై వుండేదని తెలుసు.

ప్రతిజ్ఞా భంగం గావించబడింది.

కాని, సూర్య చంద్ర నక్షత్రాదులు నిలిచే వున్నాయి! ప్రపంచం నాశనం కానేలేదు! *

ఏదైమైనా బైజాంటైన్, రష్యా రాజ్యాలు పరస్పర సహాయం లేకుండా మనలేవు. బైజాంటియమును శత్రువులు చుట్టుముట్టినపుడు రష్యను రాజుల సాయం కోరేవారు, చక్రవర్తులు, రష్యనురాజులు తమ యోధులను సాయం పంపేవారు. పశుపాలురైన పిఛినెగ్‌లంటే బైజాంటియనులు హడలి బేజారెత్తిపోయేవాళ్ళు. బైజాంటియనులను పిఛినెగ్‌లనుంచి రష్యనులు కాపాడుతుండేవాళ్ళు. రష్యనులు పంపగల మార్టిన్, శాబుల్ చర్మాలు, గోధుమలు, తేనె, మైనం మొదలైనవి బైజాంటియనులకు కావాలి. రష్యన్ మైనంతో బైజాంటైన్ చర్చిల్లో దీపావళులు వెలగాలి. బైజాంటియమ్ యెగుమతిచేసే వస్త్రాలు, బంగారు, ముత్యాలు, పండ్లు మొదలైనవి రష్యను రాజకుటుంబాలకు, భూస్వాములకు-వీరినే బోయరులంటారు-కావాలి. ఇరుగు పొరుగున వున్న యీ రెండు దేశాలూ ఒకరి వస్తువు లింకొకరు తీసుకోకుండా వుండడం సాధ్యం గాదు గదా!

---

* కార్యసాధనయే రాజనీతికి కావలసినది. వారాంగనేవ నృపనీతి రనేకరీతిః అన్నారుగదా. అందుచేతనే 'రాజ్యాంతే నరకం ధృవం' ఎంత మంచిరాజూ, చివరకి ధర్మరాజు కూడా నరకం చూడవలసి వచ్చింది. ఈ నీతిని మరచిన తర్వాతనే భారతీయులు దాస్యాంధకారంలో పడ్డారు.

## 2. చిన్న నౌకలో ప్రపంచ ప్రదక్షిణం

ఏటేటా శీతకాలంలో పర్వతాలమీదుండే పెద్ద పెద్ద ఓకు చెట్లు పడగొట్టి, ఒక్కొక్క మ్రానుతో ఒక్కొక్క దోనెను తయారు చేసేవారు, రష్యనులు. మ్రాకును దొలుచుటయే గాని యితర మార్గాలు వారి కప్పటికి లేవు. వసంతోదయం కాగానే పర్వతములమీది మంచు కరుగ నారంభించి, సెలయేళ్లు ఉర వడితో పరుగులెత్తుతూంటాయి. తాము మ్రాకుల్ని దొలిచి తయారు గావించిన దోనెలను యీ పర్వత ప్రవాహాల్లో వేసే వారు. వసంతపు వరదల నవకాశంగా తీసికొని, డ్నీపర్ నదిలో పడి ప్రయాణించి, కీవ్ నగరం చేరుకునేవాళ్ళు. కీవ్‌లో యీ పడవలను ఒడ్డు కెక్కించి, తెడ్ల నమర్చడానికి వలసిన చెవులు వగైరాలు యేర్పాటు చేసేవారు. కీవ్‌లో గోధుమలు, తేనె, మైనం, చర్మాలు మొదలైన వస్తుసామగ్రిని వేసుకుని వచ్చిన బండ్లు వరుసలుగా వచ్చి వీళ్ళని కలిసేవి. ఈ సామగ్రిని పడవల్లో నెక్కించి, నీటిలోపలికి నెంటి, నది దిగువకు ప్రయాణం సాగించేవారు. వందలకొద్దీ పడవలు గుమిగూడి, దళాలుగా డ్నీపర్ నదీ ప్రవాహం వెంబడే దిగువకు ప్రయాణించేవి. ఒంటరిగా ప్రయాణం గావించడం ఆ కాలంలో బహు ప్రమాదకరం.

నదీప్రవాహం కొండల్లో జొరబడినచోట్ల సుడిగుండాలు, వడులు వుండేవి. పెద్ద పెద్ద బండలు, గండశిలాతలములు పైబడిన నీరు బుసబుసలాడుడూ పొంగులు వారుతుంది. ఇల్లాంటి వడు

లున్నచోట్లు నదీయానానికి బహుప్రమాదకరములు. గాన వర్తక సమూహాలు తమ పడవల నెగువనే ఆపి, సరకులను దించి, పడవలను కూడ గట్టుమీదకు లాగి, మూపులమీదనో, వీపులమీదనో వాటి నన్నిటినీ మోసికొనిపోయి, వడులకు దిగువగా నదీప్రవాహంలో తిరిగి తేలవేసేవాళ్లు. డ్నీపర్ నదిమీద యిల్లాంటి వడులున్న ప్రమాదకర స్థలాలలో మొదటిదాని పేరు 'నే-స్పీ'. ఈ పదాలకు అర్థం యేమిటో తెలుసా ? 'నిద్రబోకు !' అని. దీనికి సార్థకమైన పేరేగదా యిది! డ్నీపర్ నదీప్రవాహానికి అధిష్ఠానదేవుడైన స్లావ్రూటిచ్ కి యిక్కడనే వారు ప్రార్థనలు గావించి, బలు లర్పించేవాళ్ళు. నదీతరంగములమీద పరజలను, నీటిలో బాతులను భద్రంగా రక్షించినట్లే తమ చిన్న పడవలను గండశిలామయములైన యీ ఉరవడులలోంచి భద్రంగా కాపాడి దాటించు మని స్లావ్రూటిచ్ ని ప్రార్థనాపూర్వకంగా వేడుకొనేవారు.

ఈ ప్రమాద ప్రదేశాల్లోనే తరుచుగా పిఛినెగ్ గోపాలురు భీకరాట్టహాసాలతో విరుచుకుపడి, వర్తకులను, యాత్రీకులను దోచుకొని, చాలమందిని చంపిపోయీవాళ్లు. ఈ అత్యాచారుల చేతుల్లోబడి ధనప్రాణాలు గోల్పోయిన దురదృష్టవంతుల అస్థికలు ఆ ప్రదేశమంతటా గుట్టలు గుట్టలుగా పడివుండేవి.

నే స్పీ కొండవడి దాటిన తరువాత ప్రయాణీకులు తిరిగి డ్నీపర్ జలాల్లోకి తమ పడవలను చేర్చినపుడు వాళ్ళ హృదయాలు ఆనందతరంగితములై ఉప్పొంగేవి. డ్నీపర్ నదీ

ముఖద్వారంలో ఒక చిన్న లంక, దానిమీద ఒక పెద్ద ఓకు చెట్టూ వున్నాయి. ఆ ఓకువృక్షము బహు ప్రాచీనమైనది. ఆ చెట్టుమ్రానుచుట్టూ బాణాలతో కోళ్ళు, కోడిపిల్లలు గ్రుచ్చి వుంటాయి. అవన్నీ పడవలవాళ్ళు బలిగా సమర్పించిన వన్నమాట. జను లా ముసలి ఓకుచెట్టుకు ప్రార్థనలు గావించే వాళ్ళు. ఎందుకంటే అదే వారి పడవలను వడులలోంచి దాటించి, రక్షించినది! ఓకుమ్రాకులను దొలిచి నిర్మించిన చిన్న పడవల నా మహా ప్రవాహంలోంచి సురక్షితంగా కాపాడినది ఆ ఓకువృక్ష దేవతయే కాకుంటే మరెవ్వరు ? ఆ పైని ప్రయాణం సాగించే ముందు పడవలకు చాపకొయ్యలమర్చి, తెరచాప లెత్తేవాళ్లు.

వారి ముందునుంచి సముద్రఘోష వినిపిస్తూండేది. పర్వతోన్నతములైన మహాతరంగాలు తెల్లని నురుగులుగ్రక్కుతూ తీరంమీదకు విరుచుకు పడుతూండేవి. వాయువు విజృంభణగా విసరుతూండేది. ఇక ఆ ఘట్టంలోకి వచ్చేక వర్తకులు, నావికులు వాయుదేవునికి ప్రార్థనలు గావించేవాళ్ళు. స్ట్రిబోగ్ దేవుని మనుమలే వాయుదేవుళ్ళు. వీరే యీ విసీల సముద్ర జలాలమీద సురక్షితంగా తెమ్ము గొంపోవాల్సింది! నావికులు తమ పడవలను వీలైనంతలో తీరానికి దగ్గరగానే పోనిచ్చే వాళ్ళు. గట్టుమీదనుంచి పడవలను వెంబడించేవాళ్ళు, పిఛినెగ్ ఆశ్వికులు; పిఛినెగ్‌లూ తమ దేవుళ్ళని ప్రార్థనలు చేసేవాళ్ళు సుమండీ! తుఫానులు పంపించి, రష్యనుల పడవల్ని ఒడ్డుకు

తరిమివేయమని వారి దేవుళ్ళకి పిఛినెగ్‌లు మొరలుపెట్టుకునే వారు! మానవులలోని ఆశాలోభములు వారి దేవుళ్ళకుకూడా యీ రీతిగా సంక్రమిస్తూండేవి!



రష్యనుల పితృపితామహులు ద్నీపర్ నది దిగువకు రాని కాలంకూడ ఒకప్పు డుండేది. ఆ కాలంలో యీ ప్రపంచంలో ద్నీపర్ గాక మరో నది యేదీ లేదనుకునేవారు, ఆ ప్రాంత వాసులు. ఆ కాలంనాటి స్మృతుల నింకనూ రష్యనుభాష తనలో భద్రంగా దాచుకొని వుంది! రష్యాలో యెన్నో నదు లున్నాయి. ఉదాహరణకు దాన్యూబ్, దాన్, ద్నీపర్, దోనెట్జ్, ద్వీనా మొదలైనవి. ఈ నదీ నామాలన్నీ పరస్పరం పోలిక కలిగియుండడం కేవలం యాదృచ్ఛికమనుకుంటున్నారా? అబ్బే! కాదుసుమండీ! ఒకానొక కాలంలో జనులు తమ

రెరిగియున్న నదుల్ని కేవలం 'నది' యనే పిలిచేవాళ్ళు. తమ నదియొక్కటే యీ లోకంలో 'నది' యని వారనుకునేవారు! ఆ నాటి మాటలే యివి! కాకసస్ పర్వతాల్లోని ఒస్సీటియనుల భాషలో నేటికీ నదిని 'దాన్' * అనే పిలుస్తారు. వారి పూర్వీకులు దాన్ నదీతీరాలనుంచి కాకసస్ ప్రాంతానికి తరలివచ్చిన ప్రాచీన కాలపు స్మృతి చిహ్నమే యిది యని చెప్పవచ్చును కదా !

ఈ రీతిగా మానవులు స్థానికంగా తమ తమ నదీ తీరముల వెంబడే, తమ తమ సంకుచిత హద్దులలోపలే జీవించేవారు. అదే వారి 'ప్రపంచం.' కాని అక్కడి నదీ ప్రవాహములే వారికి ప్రయాణం చేయడం నేర్పినాయి. అవి అంతకంతకి జనులను దూరానికి, యింకా దూరానికి గొనిపోనారంభించినాయి. ఒక ప్రజ యితర ప్రజలను విధిగా తెలుసుకోవలసి వచ్చేది. ఎన్నెన్నో తెగల ప్రజలు యీ భూమిమీాద వున్నారని ప్రతివారూ తెలుసుకోవాల్సి వచ్చేది. నదీ సాగర సంగమ ప్రదేశానికి వచ్చినపుడు వారికి మహాసముద్రం ప్రత్యక్షమయాది. నదీ ప్రవాహంమీాద యెగువకు బోయినపుడు వారు అరణ్యాల్లో అనేక యితర నదులు పుట్టిన చోట్లను కనుగొనేవారు.

---

* దాన్ అనేదే సంస్కృతంలో నది యనబడింది, వర్ణవ్యత్యయ సూత్రేణా, కాని ప్రవాహబహుళమైన భారతదేశంలో నదులకు వేర్వేరు పేర్లు వేదకాలంలోనే ఉన్నాయి.

దినదినాభివృద్ధి గాంచుతూన్న జనసంఘాలకు నదీతరంగాల మీాద వూగే సాగే దోనెలే డోలలైనాయి. మానవుని శైశవ దశలో పడవలే ఊయలతొట్లయి ఆతనిని సుఖమయ స్వప్నాలకు గొంపోతూ వచ్చినాయి. ఓకు వృక్షమువలెనే డ్నీపర్ నదికూడా తన శాఖలను తూర్పు పడమరలకూ, ఉత్తరానికీ వ్యాపింప జేసింది.

ఆదిమచరిత్రకారులు తమ గ్రంథాల్లో, డ్నీపర్ నదిమీాదుగా మనం అన్ని దేశాలకూ, అన్ని జాతులకూ పోయి రావచ్చునని వ్రాసేరు. డ్నీపర్ నది జన్మస్థానానికి వెడితే అక్కడి గహనారణ్యాల్లోనే ద్వీనా, వోల్గానదుల జన్మస్థలాలుకూడా వున్నాయని తెలుసుకొంటాము. గొలుసు కట్టుగా వున్న నదులు, సరస్సులు మీాదుగా మనం బాల్టిక్ సముద్రంలోనికి యాత్ర గావించ వచ్చును. బాల్టిక్ సముద్రాన్నుంచి రైన్ నదిలోనికీ, దానిమీాదుగా పోయి, ఆల్ప్సు పర్వతాలు దాటి ఇటలీ దేశానికీ, రోముకూ, అక్కడినుంచి మధ్యధరా సముద్రం మీాదుగా బైజాంటియం చేరుతాము. అక్కడినుంచి నల్లసముద్రంగుండా, డ్నీపర్ నదిమీాద సాగి, తిరిగి కీవ్ నగరం చేరుకుంటాము.

ఈ విధంగా ప్రాచీన చరిత్రకారులు, తా మెరిగిన ప్రపంచమంతనూ చుట్టి రావడానికి తగిన మార్గ మొకదానిని విశదీకరించేరు. అది పూర్వముకంటె చాల విస్తృతమైనదే. ఒక్క నదీ లోయకు పరిమితమైనదిగా గాక యిది అనేక నదులు, సముద్రాలు, సరోవరాలు కలుపుతూ పెద్దవల వలె అల్లుకు

పోయివుంది. బాల్టిక్ సముద్రము లగాయితు మధ్యధరా సముద్రంవరకూ వేలకొలది పడవలు అటునిటు వస్తూపోతూ వుండేవి. ఈ పడవ లన్నీ యేకదారునిర్మితములే. పడవలకు అగ్రభాగంలో తమ తమ యిష్టదైవమైన పక్షితలవలె చెక్కి తయారు చేసేవారు. కొన్ని నావలు డ్రేగన్ (కల్పితమైన భయంకర జంతువు) తలలుగా వుండేవి. ఈ పడవలమీదనే సామంతులనుంచి కప్పములు వసూలు చేసికొనేందుకు రాజులు ప్రయాణాలు గావించే వాళ్ళు. పడవలమీదే వర్తకులూ, యాత్రికులూ ప్రయాణాలు చేసేవారు. సముద్రాంతర దేశాల నుంచి అపురూప వస్తుసామగ్రులను తెచ్చిన వర్తకులను ఆహ్వానించి, వాళ్ళదగ్గరనుంచి తమకు కావాల్సిన వస్తువులను తీసికొని, వాటికి బదులుగా చర్మములు, తేనె, ధాన్యాదులు యిచ్చి పనుపువారు, రష్యను రాజులు.

ఈ చిన్న దోనెలు నల్లసముద్రపు పశ్చిమతీరం వెంబడే రోజుల తరబడి ప్రయాణం గావించి, యెట్టకేలకు బైజాంటియం నగరానికి చేరేవి. సెయింట్ సోఫియా చెర్చి కలశం చాలా దూరాన్నుంచే చూచి వినమ్రులై, భక్తితో పడవలమీది వా రెల్లరూ మోకరిల్లేవారు.

పర దేశీయులను తీరానికి రానిచ్చేవారే గాని, నగరంలోనికి రానిచ్చేవారుగారు, బైజాంటియనులు. రాజోద్యోగులు పర దేశుల నామాదికములను తీసికొని, వారి సామగ్రినంతనూ పరి శీలించి, అనుమా నున్న దేమో నని వెతికేవారు. అనుమాన

కరమైన వేపీ వారివద్ద లేవని నిర్ధారణ గావించుకున్న తర్వాత నే నగర ద్వారాలు తెరిచేవారు. పరదేశులకు నగరప్రవేశానికి అనుమతి దొరికేది. అప్పుడైనా అంతా ఒక్కసారిగాక యేబది మంది చొప్పున జట్లుగా పోనిచ్చేవారు. రష్యనులను సగౌరవం గానే చూచేవారు, బైజాంటియంలో. అది ఆచారంగా వచ్చేది. జర్మనులు నొవొగొరోద్ (కొత్తకోట, నవదుర్గం) నగరానికి వచ్చినప్పుడు రష్యనులు కూడ వారిని సగౌరవంగానే చూచే వారు.

తమ కాదరపూర్వకంగా ఆతిధ్య మిచ్చినవారిపట్ల రష్యనులు సగౌరవంగానే ప్రవర్తించేవారు. ఒడంబడికల ననుసరించి వారు తినగలిగినంత రొట్టె, మాంసం మొదలైన ఆహారపదార్థాలూ, త్రాగగలిగినంత మద్యమూ సమకూర్చేవారు, బైజాంటి యనులు. గ్రీకు స్నానగృహాల్లో వారు సంతృప్తిగా స్నానాలు చేయవచ్చు; ఆవిరి పట్టించుకోవచ్చు; అభ్యంగన స్నానాలు చేయవచ్చు.

తిరిగి స్వదేశానికి బోయేటప్పుడు రష్యనులకు సామ్రాజ్యపు గిడ్డంగులనుండే అన్ని సరఫరాలూ జరిగేవి. ఆహారపానీయ ములే గాక నౌకాయానానికి కావాల్సిన త్రాళ్లు, తెరచాపలు, లంగరులు వగైరాలన్నీ చక్రవర్తి గిడ్డంగుల్లోంచి యిచ్చేవారు. తమ్ము ఆదరించిన గృహస్థులకు వందనాదికము లర్పించి, రష్యను వర్తకులు స్వదేశాభిముఖులై బైలుదేరేవారు. ఇప్పుడు వారి పడవల నిండుగా అమూల్యవస్తుసంపదలు,

బంగారు, జరీవస్త్రాలు, వివిధ ఫలములు, సారాయములు మొదలైనవి వున్నాయి. ఈ వస్తువులకు స్వదేశములో చాల గిరాకీ వుంటూండేది, వారికి.

రష్యనులు వారి యిండ్లకు బోయేకకూడా సుసంపన్నమూ, సమృద్ధమూనైన బైజాంటియమ్ నగర వైభవాన్ని తలచుకుంటూ, అక్కడి దేవాలయాల్లోని పురోహితుల చక్కని జరీదుస్తుల్నీ, రాజభవనాల వింతలనూ జ్ఞాపకం చేసుకుంటూ వుండేవాళ్ళు. ఏది మరచినా ఒక్క వింతమాత్రం ప్రతివారూ తమ ప్రసంగాల్లో చెప్పక విడిచేవాళ్ళుగారు. రాజభవనంలో చక్రవర్తి సింహాసనానికి రెండువైపులా రెండు బంగారు సింహ ప్రతిమలు తమ వదనగహ్వారాలను తెరచుచు, మూయుచు, తోకలను ఝుళిపించుతూండేవి. వాటి నట్లు యంత్రసహాయంతో చేసేవారు! ఈ వింతను రష్యను వర్తకులు, యాత్రికులు నిద్రలో కూడ మరచువారు గాదు!

## 3. రష్యాదేశంలో విజ్ఞానోదయం

బైజాంటియంలోని రాజప్రాసాదములు, దేవాలయములు అత్యద్భుత శిల్పకళా సౌందర్యము గలవి. వాటి కీర్తి దేశదేశాల్లో వ్యాపించింది. రష్యనుల రాజధాని కీవ్ నగరంలో కూడ శిల్పకళామతల్లికి వన్నె తేగల భవనరాజములు లేకపోలేదు. కీవ్‌లోని రాజభవనాల కుడ్యములు కూడ నిపుణులైన చిత్రకారుల కుంచెలచే అలంకరించబడినవే. ఆ ప్రాసాదముల

ద్వారబంధములు చలువరాళ్ళతోనూ, అగ్నికుండములు చుట్టూ పింగాణీ బిళ్ళలతోనూ పొదుగబడి మనోహరముగా వుండేవి. శీతల దేశ మగుటచేత ప్రతిగదిలోనూ తప్పనిసరిగా అగ్నికుండము లుండేవి. జను లంతా విధిగా నిత్యాగ్నిహోత్రులుగా వుండాల్సిందే, బ్రతికి సుఖించాలంటే! అన్ని అగ్నికుండములచుట్టూ పరిచేందు కెన్ని పింగాణీ బిళ్ళ లుండాలి! అంతే గాదు; ఈ పింగాణీ బిళ్ళలు చేయడానికి యెంతో నేర్పూ కృషీ అవసరమయేవి. ఏ యే పాళ్ళు వేస్తే గాజు తయారవుతుందో, రజితవర్ణపు రేఖలు వేయుటకు సీసము నెట్లుపయోగించవలెనో, రాగితో ఆకుపచ్చరంగు వేయు టెట్లో, యింకా యితర రంగులు వచ్చేటందుకు ఏ యే పదార్థము లుపయోగింపవలెనో తెలుసుకొంటేనే గాని ఆ పింగాణీ బిళ్ళలను చేయలేరు. తరువాత నీ పెంకుల్ని యెంతో హెచ్చైన తాపక్రమమునకు కాల్చాలి. ఇసుముకూడ కరిగిపోయేటంత హెచ్చు వేడిమి కావాలి, పింగాణీని కాల్చేందుకు. ఎర్రగా కాలిన యీ బిళ్ళల మీద పింగాణీద్రవమును పోయాలి. ఇట్లు చేయడానికి యెంతో జాగ్రత్త నేర్పు అవసరం. పింగాణీని యెక్కువ వేడిచేస్తే రంగు చెడుతుంది. పింగాణీ బిళ్ళలను చల్లబరచడానికి కూడ యెంతో నేర్పు కావాలి. ఒకసారిగా వాటిని చల్లబరిస్తే, పింగాణీనిండా బీటలు యేర్పడతాయి. వాటిని క్రమంగా, కొంచెకొంచెంగా చల్లారుస్తూ పోవాలి. ఈ పనికై ప్రత్యేక నిర్మాణంగల కుంపట్లూ, మట్టి మూసలూ కావాలి. అవి హెచ్చు తాప

క్రమానికి నిలవగలిగినవై వుండాలి. అగ్నిని మహోష్ణస్థితిగతులకు ప్రజ్వలింపజేసే తిత్తులు కావాలి. ఆ తిత్తులు యింతటి తాప క్రమాలకు తగులబడకండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. ఇంత సరంజామా ఆ కాలంలో వుండేదా? ఆc! ఉండేది!

అటు తర్వాత వెయ్యేండ్లు గడచిపోయినాయి. కీవ్ నగర ప్రాచీన శిధిలాలను త్రివ్వి, సరిగ్గా యిల్లాంటి యిటుకల కార్ఖానాలు జనులు కనుగొని బైటికి తీసేరు. అందులోని జాడీలు, మూసలు మొదలైన వాట్లని పరిశీలించి, యీ ప్రాచీనకళాఖండాల్ని గూర్చి అత్యాశ్చర్యంతో మాట్లాడేరు, పురాతత్త్వశాస్త్రవేత్తలు. వేయేండ్లకు పూర్వమే మానవులు లోహములయొక్క, గాజుయొక్క స్వభావాన్ని యెంత బాగుగా అర్థంచేసుకున్నారా! అని ముక్కుమీద వ్రేలేసుకున్నారు.

ప్రకృతిని గురించిన భాష్య గ్రంధాలు ఆనాటికే రహస్యనుల కండ్లముందర తెరచి వుంచబడ్డాయి. అల్లాగని వారిక వ్రాత కోతలు వచ్చుననుకోనేరునుమా! కలంతో గాని, ఘంటంతో గాని వ్రాసిన పుస్తకాలు చదివేశక్తి వారి కప్పటికి లేనేలేదు. కాని, ప్రకృతి సూత్ర వివేకాన్ని, పదార్థవిజ్ఞానాన్ని స్వానుభవం ద్వారాను, యితర జాతులను చూసీ, స్లావ్లు వెయ్యేండ్ల క్రిందటనే నేర్చుకోనారంభించేరు. పదో శతాబ్దంలోనే వ్రాతపూర్వకమైన మరణ శాసనాల్ని తమ సంతతికి వదలి వెళ్ళిన రహస్యను లున్నారు! లిఖిత పత్రాల నిచ్చి విదేశాలకు రాయ

బారుల నంపిన రష్యను రాజు లున్నారు. చదవడం, వ్రాయడం అనేవి రష్యను జనులకు వారి యిరుగు పొరుగు ప్రజలనుంచి సంక్రమించినాయి. రష్యను స్లావులకు పశ్చిమ దక్షిణ దిశలలో నున్న మొరావియా, జెచియా, బల్గేరియా రాజ్యాల్లోని స్లావు జనులనుంచే అక్షరజ్ఞానం కలిగింది.

ఆనాడు రష్యన్ లెటువంటి అక్షరాల నుపయోగించేవారు? ప్రాచీన కాలంలో నిలువు-అడ్డగీతలు గల అక్షరాల నుపయోగించేవారని మనకిప్పుడు నమ్మకమైన ఆధారా లున్నాయి. కొయ్యచెక్కలమీదా, రాతి పలకలమీదా గీతలను, చిహ్నలను అంటే అక్షరాలను చెక్కేవారు. ఆ పిమ్మటి కాలంలో, చర్మములపైన వ్రాస్తూండి వుంటారు. తమ భాషనే గ్రీకుల అక్షరములతో వ్రాస్తూండేవా రనడానికి నిదర్శనా లున్నాయి. కాని, వాళ్ళ నొక విషమసమస్య యెదుర్కొనేది. రష్యను భాషలోని కొన్ని ఉచ్చారణలను వ్రాసేందుకు తగిన అక్షరాలు గ్రీకు వర్ణమాలలో లేవు. రాజలేఖకులు, దుబాసీలు, యితర రాజులతో ఒడంబడికలు వ్రాసుకునేటప్పుడూ, వర్తకులు ఋణపత్రాలను వ్రాసేటప్పుడూ రష్యను భాషలోని త్స్, ష్, ఛ్, ఝ మొదలైన వర్ణముల నెట్లు వ్రాయాలో తెలియక తికమక పడేవారు. రష్యను భాషకు ప్రత్యేక మొక వర్ణమాల, అక్షరమాల కావలసిన అవసరస్థితి యేర్పడింది.

క్రీస్తుశకం 9వ శతాబ్దిలో థెస్సలోనికా అనే గ్రీకునగరంలో కిరిల్ అను పేరుగల పండిత పరివ్రాజికు డొక డుండేవాడు,

ఆయనకు రష్యను భాష వచ్చును. ఒక పర్యాయమాయన కొంతకాలం నల్లసముద్రతీరంలో వుండడం తటస్థించింది. అక్కడొక రష్యను గృహస్థు యింటిలో నీ పరివ్రాజకుడు కొన్ని పుస్తకాలు చూసేడు. రష్యను వర్ణక్రమంతో వ్రాయబడిన గాస్పెల్స్ (క్రైస్తవ మతగ్రంథం సువార్త) ను, సాల్టర్ (ప్రార్థనాగీతములు) ను, అవి. కిరిల్ జీవిత చరిత్రనుంచి యీ విషయాలు మనకు తెలిసినాయి. ఆ అక్షరము లెటువంటివో మాత్రం మనకు యీ నాటికీ తెలియదు. వాటికి మారుగా కిరిల్ పండితుడు వేరొక అక్షరమాలను కనిపెట్టేడు.

క్రీ. శ. 10 వ శతాబ్దంలో నూతన మతంగా వ్యాప్తిచెందుతూన్న క్రైస్తవమతంతో బాటుగా కిరిల్ పరివ్రాజకుని అక్షరమాల తిరిగి కీవ్ నగరానికి వచ్చి చేరింది. మొదట్లో యీ కొత్తమతం అంతవరకూ ప్రజల్లో వ్యాప్తిలో వున్న పాతమతాలతో బాటుగా యిరుగు పొరుగున వుంటూ వచ్చింది. క్రైస్తవులు చెర్చిల్లో ప్రార్థిస్తూంటే ప్రాచీన మతాలు, విశ్వాసాలూ గల జనులు పాతపద్ధతిలోనే తమ తమ ఆరాధ్య దేవతా విగ్రహాల ముందు మ్రొక్కుతూండేవాళ్ళు. పశువులే ప్రధాన సంపదగా వుండేది, ఆ కాలంలో. అందుచేత గోపాలక దేవతయైన వోలోస్‌ను, యింకా వెండిబంగారములను, సంపదలనూ యిమ్మని వర్తకులు ప్రార్థించేవాళ్ళు. వోలోస్ పశువులకు, వస్తువులకు కూడ అధిష్టాన దేవత. లోహాదులు యింకా కనిపెట్టబడని ఆ కాలంలో పశుసంపదయే మానవుల ప్రధాన

ధనంగా వుండేది. వెండి బంగారములు వాడుకలోనికి వచ్చేక కూడా చాలాకాలంవరకూ వెండిబంగారములు, వాటితో బాటు పశువులూ కూడ ప్రధాన సంపదగా పరిగణించబడుతూ, ఒకే అధిష్టాన దేవతక్రింద వుంటూండేవి. యోధులు తమకు యుద్ధాల్లో విజయం కలుగజేయమని పీరున్ అనే దేవతకు ప్రార్థనలు గావించేవారు. పీరున్ పిడుగులు వర్షించే దేవుడు. * పీరున్ దేవుని విగ్రహం ఒక పురాతన రాజభవనం ముంగిట వుండేది. అది కొయ్యతో చేయబడినది; తలకు వెండితొడుగు, బంగారు మీసాలు కలిగివుండి, యెత్తైన కొండమీద, రాజ ప్రసాదం యెదుట ప్రతిష్టించబడి వుండేది. కాని, రానురాను యిల్లాంటి ప్రాచీన దేవతా విగ్రహాలన్నీ నదీ తీరానికి గొనిరాబడి, నదిలో వాలారించబడిపోతూండేవి. దేవుళ్ళు గనుక నదిలో ముంచివేసే రనకూడదు; వాలారించే రనాలి. ఈ రీతిగా కొత్తమతం వచ్చి పాతమతాల్నీ, దేవుళ్ళనీ జయించింది.

కీవ్ యువరాజు వ్లాడిమిర్ క్రైస్తవమతం స్వీకరించి, బైజాంటియను రాజకుమారి అన్నాను వివాహమాడేడు. వ్లాడిమిర్ యువరాజు, స్వియతోస్లావ్ కుమారుడు. రష్యా రాజ్యం కొత్తమతంలోని శక్తినీ, బలాన్నీ వాంఛిస్తూంది, ఆనాడు. ఎందుకంటే వివిధములైన రష్యను తెగలనూ, చిన్న రాజ్యాలనూ కీవ్ రాజ్యంచుట్టూ గాఢంగా ఆకర్షించి,

---

* భారతీయుల ఇంద్రుడు మేఘనాధుడు వర్షాధిపతి. వజ్రం అంటే పిడుగుతో శత్రువులను నాశనం చేసేవాడున్నూ

అనుబంధించి యుంచి, రాజ్యాధికారాన్ని బలవత్తరంగా చేస్తుంది గనుక. ఇతర ముఖ్య రష్యాను నగరాలైన స్మోలెన్స్క్, నొవోగొరోద్‌లనుంచి వచ్చి జనులు యిప్పుడు 'మీ భాష మిమ్మల్నిప్పుడు కీవ్ దాకా గొంపోతుంది!' అంటూండేవారు. ఆ చుట్టుపట్ల జనులు యిప్పుడు తామంతా ఒక్కటనీ, తామింక మ్లేచ్ఛులు, కాఫిరులు కామనీ, ఓఛినెగ్‌లు మొదలైన వాళ్ళవలె తామింక అపవిత్రులు గామనీ భావించేవాళ్లు. నిజానికి రష్యాను వ్యవసాయకుడు చాలాకాలంవరకూ 'క్రిస్తియానిన్' అనగా 'క్రిస్టియను రైతు' అని పిలువబడేవాడు. చిన్న చిన్న తెగల నుంచి విశాలమైన జాతు లేర్పడేటందుకు యిట్లాంటిదే మార్గం. దీనినుంచే మొత్తం మానవజాతి అంతా ఒక్కటయేటందుకు దారి సుగమం కాగలదు.

బైజాంటియనులు, రష్యనులు యిప్పుడింక ఒకే దేవుని మీద ఒట్టుపెట్టుకుంటున్నారు. వారిద్దరి మతవిశ్వాసాలూ యిప్పుడు ఒకటే. ఇద్దరూ కలవడానికీ, ఒకరినొకరు అర్థం చేసుకొనేందుకూ యిప్పుడు మరింత వీలేర్పడింది. కాలం గడుస్తూన్న కొద్దీ క్రైస్తవ యూరోపు దేశాలన్నింటితోటి రష్యనులకు ఈ నూతనమతంద్వారా పరిచయం, సాన్నిహిత్యం యేర్పడుతూ వచ్చింది. కీవ్ రాజులు తమ కుమార్తెలను యితర దేశాల రాజులకు, యువరాజులకు వివాహం చేయ నారంభించేరు. వ్లాడిమిర్ స్వ్యాటోస్లావిచ్ మనుమరాలు ఫ్రెంచిరాణి యైనది. మరొక మనుమరాలైన ఎలిజబెత్

కుమారి, నార్వే రాజును, మహాసాహసుడని పేరుగాంచిన హెరాల్డ్‌ను వివాహమాడింది.

దారు నిర్మిత దేవాలయాలకు బదులుగా శిలలతో దేవాలయాలను నిర్మించడం ఆరంభించేరు, రష్యనులు. కీవ్‌లో మొదటి చెర్చిని వివిధ దేశాలనుంచి తేబడిన రాళ్ళతో రష్యన్ శిల్పులు అతి నేర్పుతో కట్టేరు. క్రిమియానుంచి ఇంద్రప్రస్థర శిలలను, బైజాంటియంనుంచి స్ఫటికశిలలను, కార్పేథియను పర్వతముల నుంచి అంజన శిలలను, - యిల్లాగే రకరకాల రాళ్ళను వివిధ ప్రదేశాలనుంచి తెచ్చి చేర్చేరు. చెర్చిని సువిశాలంగా నిర్మించేరు. విశాలమైన చెర్చి స్కంధ భాగంమీద గుండ్రని కంఠం మనోహరంగా రూపొందింది. కంఠభాగంలో చుట్టూ చక్కని గవాక్షాలు కంఠాభరణంలా వున్నాయి. ఈ కంఠభాగంపైన శిరస్సువంటి కలశం గుండ్రంగా గుమ్మటంలా లేచింది. శిరస్సులాంటి గుమ్మటాన్ని శరీరంలాంటి మంటపభాగానికి బంధిస్తూ వున్న గ్రీవభాగం చక్కని పనితనంతో మలచినట్లుంది. పైన గాలిలో వ్రేలాడుతూ, పరవంజాలమీద రాతిపనివాళ్ళూ, సున్నం పనివాళ్ళూ పనిచేసేవాళ్లు. అంత మెత్తునుంచి క్రిందికి చూచినప్పుడు వాళ్ళ గుండెలు పీచుపీచు మనేవి. పరవంజా త్రాళ్లు తెగినా, వాసాలు విరిగినా, కాలుజారినా యింక వాళ్ళకి ప్రాణాలమీద ఆశ వుండదుగదా!

ఎట్టకేలకు శరీరం మీద తల భద్రంగా, కట్టుదిట్టంగా వుంచబడింది. ఔను! అది నిజంగా తలలాగా, దానిమీది

శిఖరం కిరీటంలాగా కనబడుతూంది! శిల్పులు, వాస్తు కార్మికులు కలశపు ముందుభాగాన్ని 'నుదురు' అని నిజంగానే పిలుస్తారంటే ఆశ్చర్య మేమున్నది?

చెర్చిలో నేలంతా రంగురంగుల స్ఫటికములతో తాపడం చేయబడింది. గోడలలోనూ, లాజులలోనూ మహాత్ముల, మహర్షుల బొమ్మలు, విగ్రహాలు పెట్టి కట్టేరు. ఇంత పెద్ద చర్చిని కొయ్యతోగాక శిలలతో నిర్మించడం చూసి జనులు ఆశ్చర్యపడేవాళ్ళు. రాతి పనితనాన్ని చూసి, శిల్పుల నేర్పునకు కీవ్ జనులు ముక్కుపై వేలు వేసుకునేవారు. అంతవరకు ఫ్యారిస్ పట్టణంలోనే వుండేది, రాతితో కట్టిన కెథెడ్రల్. ఇప్పుడింక కీవ్‌లోకూడా రాతి చెర్చి వుంది.

కీవ్ చర్చిని చూసి, అక్కడికి వచ్చే గ్రీకులు అత్యాశ్చర్య పడేవాళ్లు. బైజాంటియంలో వున్న సెయింట్ సోఫియా చెర్చిలా లేదు, యిది. బైజాంటియం చెర్చిలో పెద్దలాజులమీద ఒకే బ్రహ్మాండమైన గుమ్మటం నిలిచివుంటుంది. కాని కీవ్ చర్చిలో పెద్ద గుమ్మటం ఒకటే గాక దానిచుట్టూ యిరవై నాలుగు చిన్న గుమ్మటాలున్నాయి. ఈ చెర్చి, చుట్టూ గుమ్మటాలచే పరివేష్టించబడిన పెద్ద పిరమిడువలె ఆకాశంలోకి వ్యాపించి వుంది.

చాలా కలశాలు, చాలా తలలు వున్న యీ శిల్పపద్ధతికి మూల మేది? గ్రీకులు నొవొగొరోద్ నగరాన్ని గనక

చూచివుంటే యీ శిల్పపద్ధతికి మూలం యెక్కడుందో గ్రహించగలిగేవాళ్ళు; కట్టడపు పనివాళ్ళకి నొవోగొరోద్ ప్రసిద్ధి. నొవోగొరోద్‌లోని జనులందరూ వాస్తునిపుణులూ, దారుశిల్పంలో, గృహనిర్మాణంలో అత్యంతదక్షులూ నని వాడుక వుండేది. వాళ్ళూ దేవాలయాలు కట్టేవాళ్ళు. కాని, రాళ్ళతో మాత్రం కాదుసుమండీ. ప్రాచీన రష్యను సాంప్రదాయానుసారంగా ఓకుమ్రానులతో దృఢంగా కట్టేవారు, ఆ దేవాలయాలను. మహారణ్యాల్లో నూరేళ్ళు పైబడిన వృద్ధ ఓకు, దేవదారు వృక్షములను వెతికి పడగొట్టేవారు. అంపములు, సమ్మెటలు, మేకులు మొదలైన సాధనా లేవీ లేకుండానే కేవలం ఒక్క చేగొడ్డలితోనే రష్యను వడ్రంగులు పెద్ద యిండ్లనూ, భవనాలనూ కట్టేవాళ్లు. పెద్ద మ్రాకులను, దూలాలను అంపములేకుండా సమమైన నున్నని బల్లలుగా చీల్చడం సులభమనుకుంటున్నారా ? కాదు. కాని, యీ రష్యను వడ్రంగులు అతిచాతుర్యంగా మ్రానులనుంచి బల్లలను తయారు చేసేవాళ్ళు ! చేగొడ్డలితోనే కొయ్యచీలలను తయారుచేసి, వాటిని దూలములలోనికి దిగగొట్టి, దూలముల నిచ్చవచ్చిన మందానికి చీల్చేవాళ్ళు. గొడ్డలితోనే యీ చెక్కలను గాడులుకొట్టి చట్రంగా బిగించేవాళ్ళు. దాని తోనే వాసాలు చెక్కేవాళ్ళు. మందమైన చెక్కలతో ఆ ఇళ్లు మాంచి దృఢంగా నిర్మించేవాళ్ళు. శీతకాలమందలి మంచుజడులు, పొగమంచు, వేసవియందలి కుంభవృష్టులు,

శిశిరమందలి జంఝూమారుతములు, వసంతమునందలి వరదలు,—యేవి వచ్చినా యీ యిండ్లు చెక్కు చెదరకండా చిరకాలం నిలబడేవి.

ఇండ్లమీది కప్పు అటునిటు మంచి వాటంగా నిర్మించేవాళ్లు. మంచు కురిసినప్పుడది కప్పుపైన నిలువబడకండా క్రిందికి జారిపోయేటట్లుండాలి. కప్పుపైన మంచు నిలచినదంటే తొట్లె యిచ్చేసి, దిగబడిపోయే ప్రమాదం వుంది. జంఝూమారుతము



కప్పును యెగురగొట్టకండా దానిని బలమైన చట్రంమీద దృఢంగా బిగించేవాళ్లు. చూరు చెక్క చుట్టూ అశ్వశిరో రూపంలో అలంకార తోరణమును బిగించి నిలబెట్టేవారు. వరదలు యింటిని ముంచివేసే ప్రమాదాన్నుంచి తప్పించుకునే టందుకు నేలలో దించిన దూలాలమీద యిళ్లు కట్టడం మామూలు. పై అంతస్థులోని వాసయోగ్యమైన గదులను

'గోర్నిస్తీ' అనేవారు. 'గోరా' అను రష్యను మాటకు పర్వత మని అర్థము. ఈ మిద్దెగదులకు గోర్నిస్తీ అనేపేరు ఆ శబ్దాన్నుంచే వచ్చింది. పైకెక్కడానికి నిర్మించిన మెట్లవరుసమీద కూడా పైకప్పు వుంటుంది. జడిమంచు పిలువని పేరంటంగా యింట్లోకి జొరబడకండా చేయాలి. అందుచేత గృహనిర్మాణములో చాతుర్యం చూపేవారు. ముందు జడిమంచు నడవలోకి వచ్చి, కాస్త వెచ్చబడి, అటు తరువాతనే గదుల్లోకి ప్రవేశిస్తుంది. గోడలు చాలా దళంగానూ, కిటికీలు మరీచిన్నవిగాను వుంటాయి. గృహనిర్మాణం ద్వారానే వడ్రంగులు, మానవునికి వ్యతిరేకంగా వున్న ప్రకృతిశక్తు లన్నిటితోనూ పోరాటం సాగించేవాళ్ళు. చేగొడ్డలి, పరశువు కేవలం ఒక పరికరం మాత్రమేగాక ప్రకృతితోటి పోరాటంలో మానవుని కొక ఆయుధంగా కూడ వుండేది.

ఇప్పుడు వాస్తుశిల్పులు, వడ్రంగులు పరిష్కరించాల్సిన సమస్య యింకోటి వుంది. ఇళ్ళను కట్టినట్లే దేవాలయాలను కూడ నిర్మించాలి. గ్రీకు శిల్పులనుంచి వీరు అనేక విషయాలను నేర్చుకున్నారు. వాళ్ళని చూచే, దేవాలయాలలో ఒక బలిపీఠమూ, దాని పై భాగముననే ఒక పెద్ద కలశమూ వుండాలని గ్రహించేరు. గ్రీకు శిల్పులనుంచి నేర్చుకున్న విషయాల్ని రష్యను శిల్పులు తమ స్వకీయపంథాలో వ్యాఖ్యానించుకున్నారనుకోండి వీరు దేవాలయాలను పదమూడు కలశాలతో, గుమ్మటాలతో నిర్మించనారంభించేరు. రాజభవనాలను అనేక

కలశములతో అలంకరించడం రష్యాను శిల్పులకు అదివరకే అలవాటు గనుక యిప్పుడీ మార్పును చెర్చి శిల్పంలో ప్రవేశ పెట్టేరు ఉన్నత ప్రదేశంలో, స్తంభాల వరుసలమీాదనే చెర్చిలను కట్టేవాళ్ళు. గ్రీకు వాస్తు శిల్పములలో వుండే ముఖమంటపము లనే రష్యనులు తమ ధోరణిలో మార్పులు గావించి, ప్రవేశ ద్వారంగా, ముందునడవగా చేసేరు. పై కలశములను కూడ కూచిగా, కొయ్య కుటీరముల కప్పుల మాదిరిలో తయారు చేసేరు. దారు నిర్మితములు, శిలానిర్మితములూ నైన దేవా లయాలు లేక చెర్చిలు ఒక్కొక్క పట్టణంలోనే క్రమంగా రష్యాయంతటా బైలుదేరజొచ్చినాయి. ప్రతీ చెర్చి నిర్మాణం లోనూ విదేశీయమైన బైజాంటియన్ గ్రీకు శిల్ప సాంప్ర దాయాలతో దేశీయ రష్యను శిల్ప సాంప్రదాయాలను మేళవింపజేసేరు. గ్రీకు శిల్ప సాంప్రదాయంలోని 'బాసిలికా' (అతి దీర్ఘంగా, రెండువరుసల స్తంభాలతో, ఒకవైపున గుండ్రని ముగింపుగల నడవ' అను వాస్తు నిర్మాణం) నమూనాయున్ను, రోమన్ శిల్ప సాంప్రదాయంలోని 'పాన్‌థియోన్' (వర్తులము లైన అనేక స్తంభములమీాద నిలిచిన పెద్ద గుమ్మటం గల దేవాలయం. దీనిలో అనేక దేవతలను స్థాపిస్తారు ) నమూనా యున్ను కూడ యీా నూతన రష్యన్ శిల్పానికి బీజప్రాయము లైనాయి. గ్రీకు బాసిలికాయొక్క దీర్ఘమైన నడవ కొనలో, పూర్వం న్యాయాధిపతులు ఆశీనులై ధర్మాధర్మ నిర్ణయం గావించే చోట యిప్పుడు క్రైస్తవచెర్చితాలూకు బలివేదిక

అమర్చి వుంది. గ్రీకు శిల్పరీతిలోని బాసిలికాను బోలిన కట్టడం మీగాద రోమకమైన పాన్‌థియోన్ రీతిగా పెద్ద గుమ్మటం నిర్మించ బడింది. ఇక్కడ కీవ్, నొవోగొరోద్ నగరాలలో గ్రీకు బాసిలికా, రోమను పాన్‌థియోన్, రష్యను రాజభవనములు మూటియొక్కా శిల్పరీతు లన్నీ మేళవించబడినాయి. సామరస్య సమ్మేళనా శిల్పంలో కొత్తచాలు బైలుదేరింది. బహు స్తంభయుతమూ, బహుకలశయుతమూనైన రష్యను చెర్చి నిర్మించబడింది.

కీవ్‌ల్లో నూతన శిలా దేవాలయం నిర్మించబడింది.

దేశంలోని ప్రముఖు లందరికీ రాజు ఆహ్వానాలు పంపేడు. బోయరులు, బర్గో-మాస్టరులు, నగరపెద్దలు, చుట్టుపట్ల పట్టణాలు, పల్లెలు నుంచి ధనికులు, భూస్వాములు యెందరో దేవాలయ ఆవిష్కరణోత్సవానికి ఆహ్వానించబడి వచ్చేరు. కెథిడ్రల్ సంపూర్తిగావించబడిన దినం, పండుగ సెలవుగా ప్రకటించబడింది. మూడువందల పెద్ద తొట్టెల నిండుగా మద్య పానీయములను సంసిద్ధపరచి వుంచేరు. కెథిడ్రల్‌లో ప్రార్థనలు, పూజలు గావించేరు. మూసిన తలుపులలోనుంచి, గర్భగుడిలో నుంచి దీర్ఘప్లుత స్వరంతో సామగీతం వినిపించింది. చెర్చియే పాడుతుందా? అన్నట్లుంది, ఆ గీతము! అది పట్టపగలు. ఎండ బాగా కాస్తూంది. చుట్టూ వెచ్చని యెండ, జిగేల్ మనిపించే వెలుతురు వున్నాయి. మైదానాలమీాదినుంచి గడ్డిపూల వాసన

లను వెచ్చని * గాలి మోసుకునివస్తూంది. కాని, కెథీడ్రల్ లోపల అది రాత్రి! నిశాకాశంలో నక్షత్రాలకువలె విశాల మైన కెథీడ్రల్ లో దీపాలు వ్రేలాడుతూన్నాయి, గుత్తులు గుత్తులుగా. కొవ్వొత్తి దీపాలు గర్భగుడిలోని మసకలో మినుకు మినుకు మంటున్నాయి. కదలుతూ వణకుతూన్న దీపముల కాంతిలో మహర్షులూ, దేవదూతలూ రంగురంగుల దుస్తుల్లో మెరుస్తూ, వెలుస్తూ కనబడుతూన్నారు. మేరీకన్య నిశ్చల నేత్రాలు ఒక్క క్షణం పాటు జీవకళ లుట్టిపడుతూ మెరుస్తాయి; మళ్ళా అంతలోనే ఆ మసకలో పాలిపోయిన ఆమె ముఖం అదృశ్యమవుతూంటుంది.

సజీవమై, సత్యమైన ప్రపంచం అత్యంత సన్నిహితంగా, యీ దేవాలయపు గోడలకు బైటనే, చిన్న గవాక్షములకు వెలుప లనే వున్నా కానీ, లోనివారి కది యెంతో దూరంగా, యెక్క డనో వున్నట్లు తోస్తుంది! అంతేగాక, చెర్చిలోని వాసనలు కూడా విలక్షణమైనవి. ఇక్కడ ఆకులు, గడ్డి, దుమ్ము, ధూళి వాసనలు లేవు. దీపములకు కరుగుతూ కాలుతూన్న మైనపు వాసనా, దీపధూమ పరిమళములూ, అగరుధూపముల మత్తు వాసనలూ, — యివే దేవాలయాంతర్భాగమంతా సురభిళంగా

---

* శీతలదేశాల్లో 'వెచ్చని' యను విశేషణం సుఖకరమనే అర్థాన్ని యిస్తుంది. ఉష్ణప్రదేశమైన మనదేశంలో 'చల్లని' యను పదంవలెనే శీతల దేశాల్లో 'వెచ్చని' యను పదం వాడతారు. మనం 'కడుపుచల్లగా' అంటే వారు 'కడుపు వెచ్చగా' యంటారు. — అనువాదకుడు.

చేస్తుంటాయి. దళమైన రాతిగోడలు చెమ్మగా వుండి, సమాధుల్లో మాదిరిగా విలక్షణమైన వాతావరణం వుంటుం దక్కడ. మేళగాండ్రు పాడే పాటలలో మరో లోకాన్ని గూర్చిన ప్రశంసలే వినబడుతాయి. చెర్చి ప్రాంగణంలోని కడుగిడగానే తాము మరో ప్రపంచంలోనికి ప్రవేశిస్తూన్నట్లు అనిపిస్తుంది, ఎవరికైనా!

నూతనస్నాతులై క్రైస్తవమతంలోనికి ప్రవేశించిన వారి ముందు యిప్పు డొక నూతనప్రపంచం, విలక్షణమైనది నిలిచి వుంది. చెర్చిగోడలు, ఒక నూతనగ్రంథంయొక్క అట్టలవలె లోని విషయాలను దృక్పథాన్నుంచి గుంభితంగా వుంచుతున్నాయి. అట్ట తెరిస్తే గ్రంథస్థ విషయలోకంతో పరిచయం కలిగినట్లే, దేవాలయ ప్రాకారాన్ని అధిగమించి లోపలికి ప్రవేశిస్తే నూతనలోకాన్ని చూస్తాము.

పుస్తకాలు యెంతో దూరం, యెంతో కాలం ప్రయాణించి రాగలవు. దిక్కాలములను అధిగమించగల శక్తి గ్రంథములకు—అంటే వాటిలోని శబ్దసంచయానికి గలదు. ఎన్నో శతాబ్దముల కాలంలో యెన్నెన్నో దేశాలగుండా పరిభ్రమిస్తూనే వుంటాయి, గ్రంథములు. తాము విన్నవీ, కన్నవీ జనులకు చెప్పడంలో గ్రంథాలకూ, యాత్రీకులకూ చాల పోలికలున్నాయి! దూరస్థదేశాలనుంచి వచ్చిన యీ గ్రంథాలు చెప్పే విషయం యేమిటి? మహాదాశయాలకై మానవులు గావించే పవిత్రమైన ఆత్మత్యాగ కథనములే చాల గ్రంథాలో

వుండేది. * ఈ గ్రంథాలవల్లనే రష్యను జనులు, వివిధ దేశాలు, నగరాలు, కాలములు, వివిధజనుల ఆచారవ్యవహారాలు, వారి వేర్వేరు మత విశ్వాసాలు మొదలైన వాట్లనుగూర్చి తెలుసుకుంటూ వచ్చేరు.

ఆ కాలంలో కీవ్ నగరంలో పుస్తక మంటే చాలా అపురూపంగా వుండే వస్తువు! గ్రంథాలు యెక్కడా కనబడేవేగావు. సకృత్తుగా ఒకటో రెండో పుస్తకాలు యే రాజభవనంలోనో, దేవాలయంలోనో అతిగుప్తంగా, బహుభద్రంగా దాచబడి వుండేవి. పుస్తకాలే అరుదనుకుంటే, పుస్తకాలను చదువగల వాళ్లు మరీ అపురూపంగా వుండేవాళ్లు! కాని, ఆనాటికే చదువు యెంత ఉపయుక్తమైనదో, విజ్ఞాన మెంత శక్తిగలదియో రాజులు గ్రహించేరు!

ఒక పురాతన జానపదగాథలో కీవ్ రాజు వ్లాదిమిర్ తన బోయరులతో (సామంతులు) యిల్లా అన్నట్లు వర్ణించబడింది:

"మాకై చక్కని చుక్క నొక కన్యకను,
తెలివిగల మంచి కార్యదక్షురాలిని,
మన రష్యను బాసలు పలుకగలదాన్ని,
దేవాలయ గీతము లాలపించగలదాన్ని,

* న ప్రజయా న ధనేన త్యాగే నైకేన అమృతత్వ మానశుః। కేవలం త్యాగమువల్లనే మానవులు అమరులైనారని భారతీయ తత్త్వ వివేచకులు వేల సంవత్సరాలుగా తమ ఉద్గ్రంథాల్లో ఘోషించేరు.

జనులందరూ తల్లిగా తలచగల దాన్ని,
రాజ్యానికే రాణ తేగలట్టి రమణిని,
రాణిగా తెమ్మని కోరువాడనయ్యా...
.. ........................"

మరొక ప్రాచీన చారణుడిల్లా వ్రాసేడు : "వ్లాదిమిర్ రాజు, విగ్రహారాధకుల దేవాలయాలను, దేవుళ్ళను నాశనం గావించి, వాటి స్థానంలో క్రైస్తవ చెర్చిలను నిర్మించుకోమని తన జనుల కాజ్ఞాపించేడు. అప్పటినుంచీ నగరాల్లో చెర్చీలు, పురోహితులు కనబడ నారంభించేరు. పట్టణప్రజలు, జనపదాల జనులు క్రైస్తవమతంలోనికి గొనిరాబడుతూన్నారు. విహారము ల్లోనికి, మఠముల్లోనికి కులీనుల, ప్రభువర్గాల బిడ్డలను తీసికొని పోయి వారికి చదువు, వ్రాత నేర్పమని వ్లాదిమిర్ రాజు ఆజ్ఞాపించేడు. బిడ్డలను రాజాజ్ఞచే మఠాలకు గొంపోతూంటే తల్లులు తమ బిడ్డలు చనిపోయినట్లుగా యేడ్వజొచ్చిరి. ఎందు కంటే ఆ తల్లులు విజ్ఞానపు విలువ నెరిగినవారూ గారు, నూతన మతమునందు విశ్వాసం కుదిరినవాళ్ళూ గారు..."

ఈ రీతిగా రాజాజ్ఞచే మొట్టమొదటి పాఠశాల కీవ్‌లో స్థాపించబడింది. ఇందులో విద్యార్థులకు చదువను, వ్రాయనే గాక విజ్ఞాన శాస్త్రాల్నికూడా బోధించేవారు. రష్యాకు చదువుకొన్నవాళ్లు కావలసి వచ్చింది...*

---

* దేహబలం, అంగబలం, సంఖ్యాబలం, ధనబలం మొదలైనవే ప్రధానంగా లోకం భావించేది, ప్రప్రథమంలో. కాలక్రమాన బుద్ధిబలం, విద్యాబలం కూడ గుర్తించబడినాయి. ఉపాయంతోనూ, నేర్పుతోనూ

## 4. స్వర్ణప్రాంగణంలోని గ్రంథభాండారము

మనమిప్పుడు కొన్ని ప్రాచీనగాథల పుటలను తిరగవేద్దాం. ఛప్పన్న దేశాల్లో రష్యాకూడా ఒకటి. అక్కడా మానవుడు తన కృషిని వివిధ రంగాల్లో విస్తరింపజేస్తూ వచ్చేడు. ఈ ప్రాచీనగాథ నిరాడంబరమైన కవితా ధోరణిలో రష్యా చరిత్రను చెపుతూ పోతుంది. చరిత్రకారుడే కొన్ని సంఘటనలను జ్ఞాపకము వుంచుకున్నాడు. గ్రామవృద్ధులు ♦ చెప్పే కథలు మరికొన్ని వృత్తాంతాల్నీ, జానపద గాథలూ, గీతాలూ, యింకో కొన్నింటినీ గుర్తు చేస్తుంటాయి.

---

అధికసంఖ్యాకులను ఓడించడమేగాక, ప్రకృతి శక్తులను లోబరచుకోడం కూడ మానవుడు నేరుస్తూ వచ్చేడు. ఈ దశలో బుద్ధిబలానికీ, దానికి పదును బెట్టే విజ్ఞానశిక్షణకూ మానవలోకం అత్యధికవిలువ నీయ నారంభించింది. ఐరోపా చరిత్రలో యిది గత రెండువేల యేండ్లుగా జరిగింది. భారతదేశ చరిత్రలో యిట్టి మార్పు, అభివృద్ధి అంతకు చాల పూర్వమే జరిగినట్లు తోస్తుంది. 'ధిక్ క్షత్రబలం, బ్రహ్మవిద్యాబలం బలం' అని విశ్వామిత్రుడన్నట్లు వింటూంటాము. శాస్త్రవిజ్ఞానబలమును నైతికశక్తినీ మిగతా బలములన్నిటికంటె మించినదాన్నిగా బుద్ధిమంతులు చిరకాలం క్రిందటనే భారతదేశంలో గుర్తించుట యింకెన్నో ఉదాహరణలద్వారా తెలియగలము.

♦ భారతదేశంలో జానపదగాథల ద్వారా యెంతో గత చరిత్రను తెలుసుకోవచ్చును. కాళిదాసు మహాకవి తన మేఘసందేశ కావ్యంలో ఒకచోట "ఉదయన కథా కోవిదాన్ గ్రామవృద్ధాన్" అని చెప్పివున్నాడు. దేశభాగోట్టా తెలుసుకోడానికి గ్రామవృద్ధులు పరంపరగా చెప్పే కథలు సంప్రదాయకమైనవి ఉపయుక్తములు—అను.

కీవ్ నగరాన్ని బలపరచిన రాజుల కథలను యీ చరిత్ర చెప్తుతూంది. ప్రతి గీతమూ ఒక యేడాదినీ, ప్రతి పుటా ఒక తరమునూ గూర్చి గానం చేస్తూంటూంది.

వ్లాదిమిర్ రాజు మరణించేడు. ఆయన కుమారుడు యరోస్లావ్ రాజయి, కీవ్ సింహాసనాన్ని అధిష్ఠించేడు.

క్రీస్తు తరువాత 1038 వ సంవత్సరంలో యిల్లా జరిగిందని గాథ చెప్తుతూంది: "యరోస్లావ్ రాజు స్వర్ణద్వారాలతో నొక మహా నగరాన్ని నిర్మించేడు. సెయింటు సోఫియా పేరిట నొక పెద్ద చెర్చిని నిర్మించేడు. ఆయన విజ్ఞానప్రియుడు. రాత్రింబగళ్లు గ్రంథపఠనం గావిస్తూండేవాడు. ఎందరో రచయితల గ్రంథాలను సేకరించి, వాటినన్నిటినీ గ్రీకుభాషనుంచి స్లావు భాషలోనికి అనువాదం చేయించుతూండేవాడాయన. అనేక అపురూప గ్రంథాలను తెప్పించి, వాటికి ప్రతులు వ్రాయించేడు. జనులా గ్రంథాలనుండి యెన్నో పారమార్థిక విషయాలను, పవిత్ర విషయాలను నేర్చుకొనుచుండిరి. యరోస్లావ్ రాజు యీ అమూల్య గ్రంథ ప్రతుల నన్నిటినీ ఒక చోట చేర్చి, చెర్చిలో నొక గ్రంథ భాండారమును స్థాపించేడు. ఈ సెయింట్ సోఫియా చెర్చి నాయన వెండి బంగారములతో, వివిధాభరణములతో సర్వాలంకృతం గావించి, యెన్నో పవిత్ర కలశముల నక్కడ నిక్షేపించెను..."

కీవ్ నగరంలో సెయింట్ సోఫియా దేవాలయంలో మొట్టమొదటి రష్యను గ్రంథాలయం యీ విధంగా స్థాపించ బడింది.

స్వర్ణద్వార సమీపంలో, బహుకలశ గోపుర విరాజమానమైన సెయింట్ సోఫియా చెర్చిలోనే యీ గ్రంథాలయం ఏర్పరచ బడింది.

రష్యాను జను లిందులోని గ్రంథాలను చదివి, తామెన్నడూ చూడని దూరదేశాలను గురించి ఒక అస్పష్టమైన రూప కల్పనను, దూర సముద్రాలను గురించి అస్పష్టభావాలను కల్పించుకుంటూండేవాళ్ళు.

"పవిత్ర క్షేత్ర యాత్రాపరుడై సెయింట్ అలెగ్జియస్, నౌకపై రోమునుంచి సిరియా దేశానికి పోయేడు. అక్కడా యన పందెపు గాడిదల మంద నొకదాన్ని తోలుకు బోతూన్న జనసమూహాన్ని కలుసుకొని, వాళ్ళతోకూడ స్థల మార్గాన ప్రయాణం గావించి, మాసిడోనియా దేశంలోని ఎడెస్సా నగరము చేరుకున్నాడు. కాని, అక్కడితో ఆయనయాత్ర ముగియలేదు. ఎడెస్సా రేవునుంచి సముద్ర మార్గాన బైలుదేరి, 'ఈశ్వరానుగ్రహం వల్లనూ, అనుకూల వాయువుల వల్లనూ' తిరిగి రోము నగరం చేరుకున్నాడు..."

రష్యాను పాఠకుడు ఆ గ్రంథాన్ని క్రిందబెట్టి, మరొక గ్రంథాన్ని తెరుస్తాడు. అందులో పవిత్ర భూమిపైన పాలస్తీనా అభివర్ణించ బడింది. జోర్డాన్ పవిత్ర నదీ తీరములందలి దట్టమైన ఱెల్లు దుబ్బులు, వాటిలో చిఱుతపులులు, వాటిప్రక్కనే బడి అరేబియా దేశాన్నుంచి గోధుమలు మొదలైన వివిధ వస్తు సంభారములను మోసికొంటూ భారంగా నడిచి వస్తూండే

ఒంటెల బిడారులు, బిడారు వెనకనే పాదచారియై పుణ్య జోర్డాన్ నదీతీర్థమును కలశమునందు బట్టుకొని యేదో విహార మఠానికిపోతూన్న పవిత్ర పరివ్రాజకుడు,—యిటువంటి వెన్నో దృశ్యాలు కళ్ళకు గట్టినట్లు కనబడతాయి.



గ్రంధాలు పాఠకులను పరదేశములకే గాక కాలాంతరము ంకు కూడ గొంపోయి విడువగలవు ! మాసిడోనియా రాజు అలగ్జాండరు కథలనుంచి ఆనాటి గ్రీకుబాలురు పఠించే విద్య లను గూర్చిన భోగట్టాలను రహ్యనులు తెలుసుకో కలిగేరు. సంగీతశాస్త్రము, నక్షత్రశాస్త్రం లేక ఖగోళశాస్త్రం, భూమితి శాస్త్రం లేక భూవైశాల్యమును కొలిచేశాస్త్రం, శబ్దశాస్త్రం లేక అలంకారశాస్త్రం, పరమార్థ జ్ఞానం లేక తత్త్వశాస్త్రం మొదలైన వివిధశాస్త్రాలు ఆనాటి గ్రీకులు పఠించేవాళ్లు.

రహ్యను పాఠకులకు గ్రీకు తత్త్వశాస్త్రవేత్త అరిస్టాటిల్ బోధనలనుగూర్చి, ట్రోజనుల కథలను గానంచేసేన్న డెల్ఫీ దేవా

లయ శకున వాక్యములను గురించీ, ఒలింపియా పర్వతాగ్ర నివాసియైన జ్యూస్ దేవుని ఆలయమును గూర్చీ, ఐగుప్తునగరాలైన మెంఫిస్, అలగ్జాండ్రియా నగరాలను గురించీ, బాబిలన్ రాజ్య విశేషాన్ని గూర్చీ, బ్రాహ్మణుల నివాస భూమియైన హిందూదేశాన్ని గురించీ ఆ గ్రంథాలు చెప్పేవి!



"మరియును అలగ్జాండరు అతి మనోజ్ఞమైన వివిధ ఫలవృక్షములతో గూడిన ఆరామవాటులం గాంచెను. క్షీర సదృశమైన నిర్మల జలములచే నొప్పారు నొక నదిచే నా దేశము పరివేష్టితమై యుండెను. ఎన్నెన్నో ఖర్జూర వృక్ష వనములున్నూ, గోస్తనీ ఫల గుచ్ఛప్రభా వినమ్రములైన ద్రాక్షారామములున్నూ అచ్చోట శోభిల్లు చుండెను..."

ఎన్నో శతాబ్దములక్రిందట అలగ్జాండరు గాంచిన అత్యద్భుత దేశాల్నిగూర్చి రష్యన్‌లు పరమాశ్చర్య కుతూహలమనస్కులై పఠించేవారు. కొన్ని దేశాల్లో జనులు 'కుక్కలవలె మొరుగుదు' రట! మరికొన్ని దేశాలలో జనులకు కండ్లూ, నోరూ ముఖమందుగాక యెదురు రొమ్ముమీద వుంటాయట! ఇంకొక దేశంలో అసలు సూర్యుడు ప్రకాశించనే ప్రకాశించడట! మరో దేశంలో సూర్యుడు ఉదయించనిదేనే పట్టపగలుగా వుంటుందట! ఇల్లాంటి చిత్రవిచిత్ర దేశాల్ని గురించిన భోగట్టా అలగ్జాండరు ప్రయాణగాథల్లో చదివేవారు.

ప్రకృతి విశేషాల్ని గూర్చిన పురాతనగ్రంథాల్లో రష్యను పాఠకు డెన్ని విచిత్రాలను చదివేడు! చిత్ర విచిత్రములైన పక్షులు, మృగములు! వీటిలో కూడ యదార్థములూ, కల్పనలూ కలగా పులగంగా వున్నాయి. ఏనుగు, సింహం బొమ్మలకు ప్రక్కనే ఊహాకల్పనములైన అర్థ వృషభం-అర్థ దంతి; సగం యేనుగ-సగం అడవిపంది; సగం ఒంటె- సగం చిఱుత పులి;-యిల్లాటి విచిత్ర సమ్మేళనా రూపాలుండేవి! ఒక్క గుటకలో ఏనుగునే కబళించి వేయగల నీటిజంతు వొకదాన్ని గురించిన విచిత్ర కథలుకూడ వుండేవి.

రష్యను పాఠకులు ప్రాచీన గ్రీకు పురాణ గాథలనే గాక గ్రీకు తత్త్వశాస్త్రాన్ని కూడ చదివేరు. "మధుకోశం" అనే గ్రంథంలో పైథాగొరస్, సోక్రటీసు, డియోజనిస్, అరిస్టాటిల్, ఎపిక్యూరస్ మొదలైన వాళ్ళని గురించి చదివేరు. వారు ఎంపి

డోకిలస్ పండితుని నాలుగు తత్త్వాలు, పృథివి, జలము, తేజస్సు, వాయువులు, యీ నాలుగు తత్త్వాలనుంచీ జగత్తంతా యెల్లా నిర్మించబడిందో అనేది చదివేరు. ఆ తరువాత అరిస్టాటిల్ పండితుడు యీ నాలుగు తత్త్వాలకు తోడు మరొకదాన్ని, ఐదవదిగా ఆకాశం లేక ఈథర్ అను దానిని చేర్చేడు. ధూమంవలె ఆకాశతత్త్వం భూమిని పరివేష్టించి



పైథాగొరస్

వుంటుందనీ, అది అన్నివైపులా భూమినుంచి సమానాంతరంగానే వున్నదనీ అరిస్టాటిల్ వ్రాసినది రష్యను పాఠకులు చదివేరు.

ఈ భూమి గోళాకారంలో వున్నదని చదివిన రష్యన్ పాఠకుడు అత్యాశ్చర్య నిమగ్నుడయేడు. కీవ్‌లో పగలైనపుడు

దానికి సరిగ్గా భూగోళానికి రెండో ప్రక్కన నిశిరాత్రిగా వుంటుందని తెలుసుకొని ఆతడు విభ్రాంతు డైపోయేవాడు! సూర్య చంద్ర గ్రహణ కారణములను ఆతడు తెలుసుకొన్నాడు. సూర్యునికీ భూమికీ మధ్య చంద్రుడు అడ్డురావడంవల్ల సూర్య గ్రహణమున్నూ, సూర్య చంద్రులకు మధ్య భూమి అడ్డురావ డంవల్ల చంద్ర గ్రహణమున్నూ కలుగుతున్నాయని పాఠకుడు తెలుసుకున్నాడు. ఒక ఋషి యెంతో తర్కయుక్తంగా కొన్ని సిద్ధాంతాలను గావిస్తూ రచించిన గ్రంధాన్ని అతడు చదివేడు. 'అవినాశ్యములూ, అవిభాజ్యములూ ఐన కణములు' కలి యుటచే జగత్తు యేర్పడిందని ఆయన వాదం. డెమోక్రితస్ పండితుని పరమాణువాదమే యిది. *

ఈ గ్రీకు తత్త్వవేత్తల గ్రంధాలను చదువుతూంటే రష్యను లకు యీ విశ్వ మెంత బ్రహ్మాండమైనదో విస్పష్టం కాజొచ్చింది. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' ఐన దేవునీ, 'గొప్ప వాటిలో అల్పుడూ, అల్పమైన వాటిలో గొప్పవాడూ' నైన మానవునీ గూర్చి అత డాలోచించ నారంభించేడు. సృష్టిలో

---

* గౌతమ మహర్షి రచించిన న్యాయ దర్శనము యిల్లాంటిదే. భారతీయ ద్రష్టలు నిశిత మేధాసంపన్నులై ఈ విసృష్టి కారణాన్వేషణ గావించి, వివిధ సిద్ధాంతాలను వచ్చేరు. అవే మన షడ్దర్శనములున్నూ; సూక్ష్మాతి సూక్ష్మ కణ సమ్మేళనము వల్లనే జగత్తు నిర్మితమైన దని యీ దర్శనము చెపుతూంది. ఇది చాల ప్రాచీనమైనది. కణాదుని వైశేషిక దర్శనంలో కూడ జగదుత్పత్తినిగూర్చి యిటువంటి సిద్ధాంతములే గావించ బడినాయి.

ప్రతీ కార్యక్రమమూ భగవదిచ్ఛానుసారంగా గాక 'అవసర' మునుబట్టి (విశాలార్థంలో దీనినే కర్మనుబట్టి యని చెప్ప వచ్చును. అను) జరుగుతూన్న దని చెప్పి మహామేధావులైన పండితులగూర్చి కూడ ఆతడు పరించేడు. తప్పించుకోరాని ఈ 'అవసరము' ను బట్టే సంపదలు, దారిద్ర్యము, ఆరోగ్యము, రోగము, స్వేచ్ఛ, శాంతి, యుద్ధము మొదలైన వన్నీ కలుగు తున్నాయి. లోకంలో సర్వమూ యీ అవసరాన్ని బట్టే జరుగుతూంది. చివరకు సూర్య చంద్ర గ్రహ నక్షత్రాదులైన ఖగోళముల పరిభ్రమణాదులు కూడా యీ 'అవసరము' వల్లనే కలుగుతున్నాయని తెలుసుకున్నాడు.

ఈ సువిశాల విశ్వంలో తన స్థాన మేమిటి? అని రష్యను మానవుడు అంతకంతకు అధికాధికంగా తెలుసుకుంటూ వచ్చేడు. కోస్మాస్ పరివ్రాజకుడు వ్రాసిన గ్రంథం చదివి, వారు యీ భూప్రపంచం యొక్క మూడు విభాగాలైన ఆసియా, లిబియా, చీనాలను గూర్చి, అక్కడ నివసించే జను లను గూర్చి చదివేరు. చీనా దేశం పట్టు వస్త్రాలకు ప్రసిద్ధియని వారు తెలుసుకున్నారు. కోస్మాస్ గ్రంథాన్ని రష్యాభాషలోనికి అనువాదం చేసిన యాతడు యీ ప్రపంచ దేశాల జాబితాకు రష్యాను కూడ చేర్చుతూ యిల్లా వ్రాసేడు; 'పశ్చిమాన రూస్ అని పిలువబడే గొప్ప దేశ మొకటి కూడా వున్నది.'

అన్ని దిక్కులనుంచీ మానవ విజ్ఞాన సిద్ధాంతాలూ, అనుభ వాలూ ప్రవాహరూపంగా రష్యా భూమికి వచ్చి చేరుతూనే

వున్నాయి. బాబిలోనియన్ గాథలనుంచీ, అలగ్జాండ్రియా కథలనుంచీ, గ్రీకు తత్త్వశాస్త్రములనుంచీ, బైబిలు చరిత్రల నుంచీ వివిధనాగరికతా సంస్కృతీవిజ్ఞానాలు రష్యన్ పాఠకుడు గ్రహించుతూ వచ్చేడు. ఎదుగుతూ వున్న రష్యన్ సంస్కృతి, యీ వైదేశిక విజ్ఞాన సంస్కృతీ ప్రవాహాలను స్వీయసంస్కృతీ విజ్ఞానాలతో సమ్మేళనం కావించుకో జొచ్చింది.

స్వర్ణ ప్రాంగణంలోని గ్రంథ భాండారం అంతకంతకు అధిక సంఖ్యలో రష్యను గ్రంధాలను సంతరించుకుంటూ వచ్చింది. దేశీయ - విదేశీయ సంస్కృతీ విజ్ఞానాల సామరస్య సమ్మేళనములే యీ గ్రంథాల్లో ప్రతిబింబిస్తూ వుండేవి. కథలు, సూక్తులు, దేవతా గాధలు, జానపద కథా గీతాలు, దండయాత్రల-యుద్ధాల కథనములు,-అన్నీ కలిసిపోతూవచ్చాయి. ఈ గ్రంధాల్లో ఆదిమ చారిత్రక గాథలు, ఇల్లారియన్ యొక్క ధర్మ ప్రవచనములు, బోరిస్-గ్లెబ్ కవుల పద్య కావ్యాలు, వ్లాదిమిర్ మొనోమాక్ రాజు రచనలు మొదలైనవాటన్నింటిలోనూ రష్యా వాఙ్మయం జన్మించింది. ఒక విధమైన రష్యను సారస్వత భాష సృష్టించబడింది.

'పరమ పవిత్రుడూ, పండితుడూ, ఉపవాస వ్రతతత్పరుడూ' నైన కీవ్ నగర ప్రధాన పీఠాధిపతి ఒక గ్రంధాన్ని రచించేరు. దాని పేరు 'వ్రత ధర్మ దీపిక.' * ఆ గ్రంథంలో 'దిగంత విస్తార కీర్తియైన స్వీయతో స్లావు రాజు పుత్రుడూ, రష్యను రాజ

* The Word of Law and Benefaction—

కుమారులలో అత్యుత్తముడూ, బోధకుడూ, ఆచార్యుడూ నైన వ్లాదిమిర్ రాజు'ను కొనియాడి, యిల్లా వ్రాసేరు :
"...ఆ ధరాధిపుడు పాలించిన వొక అనామక అజ్ఞానయుత దరిద్ర దేశము గాదు. భూమండల మంతటా కీర్తించబడి. సంభావించబడిన ఋషియా మండలమునే వ్లాదిమిర్ పరిపాలించెను."

పీఠాచార్యుడు ఇల్లారియన్ ఋషియా దేశాన్ని హృదయ పూర్వకముగా ప్రేమించేవాడు. ఆ దేశాన్నిగూర్చి వ్రాసినప్పుడెల్లా ఆయన మహాభినివేశంతో వ్రాసేవాడు. మృతుడైన వ్లాదిమిర్ రాజును ఉద్దేశించి ఆయన యిల్లా వ్రాసేరు: "కీర్తివంతుడా! లెమ్ము. నీ సమాధినుంచి లెమ్ము! ని న్నావహించిన నిద్రావస్థను విదళించివేయుము. నీవు మరణించ లేదు. ఊరక నిద్రిస్తున్నావు. సమస్త జీవులూ పునరుత్థాపన జెందు రోజువరకు నే నీ నిద్ర...నీ నిద్రను విదళించుము. కన్నులు తెరువుము. ఆ పరమ ప్రభువు నిన్నెట్టి గౌరవాస్పదునిగా చూస్తూన్నాడో, నీ ప్రజలలో, పుత్రులలో నిన్నెట్టి కీర్తివిస్తారునిగా చేసెనో కనుగొనుటకైనను నీ కండ్లు తెరువుము...కీవ్ నగరమును చూడుము. సూర్యరశ్మిలో ధగ ధగ మెరుస్తూ, సుసంపన్నములగుచున్న చెర్చిలను, దినదినాభివృద్ధి జెందుతూన్న క్రైస్తవ మతమును చూడుము! సుకీర్తివంతములైన విగ్రహోత్తమములు గల యీ పట్టణమును కనుగొనుము. ఇదంతయు చూచి సంతసించుతూ, మహానందముం జెందుము."

ఏళ్ళు గడుస్తున్నాయి. కాలం గడుస్తున్న కొద్దీ రష్యను లధికాధికముగా 'పుస్తకము లందలి మనోజ్ఞ హృద్యతల నాస్వాదించ' జొచ్చిరి.

జెరూసలేమ్ బిషప్ సైరిల్ యిల్లా వ్రాసేరు. 'తేనె మధురమైనదే, చక్కెర మధురమైనదే! కాని, గ్రంథ పఠనము యీ రెంటి కంటెనూ మధురతరమైనది!"

మనకు లభిస్తున్న ఆధారములను బట్టి చూస్తే, చెర్చిలలోని "గదులు పుస్తకాలతో నిండి యుండేవి." సన్యాసుల గదులలో "దేవతా విగ్రహాలు, పుస్తకాలు తప్ప మరేవీ కనబడేవికావు." రాజుల, బోయర్ల భవనాల్లో 'శిలువగది' అంటూ ప్రత్యేకంగా ఒక గది వుండేది. దానిలో ఒక గ్రంథ పీఠం, దానిమీద పుస్తకాల దొంతరా, వాటిపైన దేవతా విగ్రహాలూ వుండేవి. ప్రతీ విహారంలోనూ, మఠంలోనూ గ్రంథాలయం విధిగా వుండేది. అక్కడ నివసించే సన్యాసులు కొందరు గ్రంథాలకు ప్రతులు వ్రాసేవాళ్ళు, మరికొందరు సంపుటముగా బంధించుతూండేవాళ్ళు.

కీవ్ నగరంలోని పిచేర్స్కీ విహారంలో నెస్తోర్ అను సన్యాసి "గాథలు" అనే గ్రంథాన్ని వ్రాసేడు. ఈయన "రాస్తోవ్ మండల కర్షకు" డని విఖ్యాతి గాంచినవాడు. రైతుల భూమిని దున్ని, విత్తనాలు చల్లుతారు కాని యీయన జనుల హృదయక్షేత్రాలను దున్ని దివ్యభావము లనే విత్తులను చల్లువాడు! ఈయన దృష్టి తన గదిలోని పరిమిత ప్రదేశమునే

గాక వెలుపల చాల దూరమువరకూ చూడగలిగేది. ఈ పరి వ్రాజకుడు రష్యా దేశమునే గాక ఆనాటికి తెలిసియున్న దేశా లన్నింటినీ దర్శించేడు.* కీవ్‌నుంచి బాల్టిక్ సముద్రం వరకూ, అక్కడినుంచి రోమ్‌కు, రోమ్ నగరాన్నుంచి బైజాంటియమ్‌కు, అచ్చటినుంచి తిరిగి కీవ్‌కు యీాయన యాత్రలు గావించేరు. స్లావు జనుల నందరనూ, తెగల నన్నింటినీ చూచి, వీరంతా ఒకే కుటుంబమునకు చెందినవారని ఆయన విశ్వసించేడు. స్లావు లందరూ ఒకే భాషను మాట్లాడుతూ, ఒకే లిపిని వాడుతూ వుండేవాళ్లు.

రషియను జను లీ రీతిగా ప్రబోధము జెందుతూండేవాళ్లు. ఇచ్చటనుండి కూడ ఒక సంస్కృతీ మహానది పుట్టి, పెరిగి, ప్రవహించ నారంభించింది. ఒక్కొక్క వసంతం గడుస్తూన్నకొద్దీ యీా నదీప్రవాహం విశాలతరమూ, గంభీరతరమూ, పరిపూర్ణమూ అవుతూ వచ్చింది. ప్రపంచ మానవసంస్కృతి యనే మహాంభోనిధికి ఉపాయనములుగా అతిసుందరములూ, మహత్తరములూనైన వాటి నెన్నిటినో సమర్పించుకొన్న దీ నదీమతల్లి.

ప్రాచీన చారిత్రకు డొకడు వ్రాసినట్లు గ్రంథాలనుండి మనం జ్ఞానమును సంపాదిస్తాము. మానవునిలో సార్వత్రికముగా వుండే

---

* శ్లో. యస్తు పర్యటతే దేశాన్ । యస్తు సేవేత పండితాన్ ।
తస్య విస్తారితా బుద్ధిః । తైలబిందు రివాంభసి॥

దాహాము నుపశమింపజేయు ప్రవాహజలమే గ్రంథజాల మని చెప్పవచ్చును. *

ఈయన భావంపైన జెప్పిన దానితో యేకీభవిస్తూంది గదా ?

---

* శ్లో. అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠాః । గ్రంథిభ్యో ధారిణో వరాః ।
ధారిభ్యో జ్ఞానినః శ్రేష్ఠాః । జ్ఞానిభ్యో వ్యవసాయినః॥

అనునట్లు అజ్ఞానులకంటె గ్రంథముచూచి చదువగలవాడు, కంఠతః ఉన్నవాడు, అర్థజ్ఞానం గలవాడు, ధర్మాచరణశీలి క్రమోత్తరంగా ఉత్తము లని భారతీయుల భావన.



# మూడో ప్రకరణం

## 1. తూర్పుదేశాల సంపదలు

ఈ పృథ్వీమీద ఏకకాలంలోనే రాత్రింబగళ్ళు, ఉదయాస్తమయములు వుంటూన్నాయి. భూగోళంమీద ఒక ప్రక్కనున్న అరణ్యములు, క్షేత్రములు అస్తంగతు డవుతూన్న సూర్యుని ఆఖరి కిరణాల్ని ఆలింగనం గావించుకుంటూంటే, రెండో ప్రక్కనున్న ప్రాణికోటులు బాలసూర్యుని లేతకిరణాలకు స్వాగతం యిస్తూంటాయి.

సంస్కృతి విషయంలోకూడా సరిగ్గా యిల్లాగే జరుగుతుంది.

ప్రాచీన సంస్కృతీ జ్యోతి ఇటలీ, బైజాంటియములలో కొండెక్కుతూ వుండగా రష్యాలోని కీవ్‌లో నవోదయ మవుతూంది. ఇంకా సుదూరాన వున్న అరేబియాలో, ప్రాగ్దేశాల్లో విజ్ఞానజ్యోతి దివ్యప్రభలతో ప్రజ్వలిస్తూనేవుంది!

బహు పురాతన కాలమునుంచీ వర్తక బిడారులు అరేబియా దేశంగుండా పోతూ వుండేవి. హిందూదేశాన్నుంచి వర్తకులు సుగంధ ద్రవ్యాలనూ, వెలలేని రత్నాలనూ, సన్నని వస్త్రములనూ తీసికొని, ఒంటెల మూపురములపై నెక్కించుకుని వచ్చేవాళ్ళు. చీనానుంచి పట్టుబట్టలను, ఉష్ణమండలమైన నూబియానుంచి యేనుగు దంతములను తీసికొని వర్తక బిడారులు అరుణ సముద్రాంత రాలనుంచి వచ్చేవి.

ఈ సార్థములు (వర్తక బిడారులు) యెప్పుడూ మక్కా పట్ట
ణముమీదుగా పోతూండేవి. మక్కా పట్టణము ఒక ప్రధాన
మైన మజిలీగా వుండేది. అక్కడ దేవాలయ ప్రాంగణంలో,
పవిత్ర స్థలంలో బిడారులు మకాం చేస్తూండేవాళ్ళు. అక్కడి
దేవాలయంలోని కాలాంజనశిలకు జను లందరూ భక్తి విన
మ్రులై, ప్రార్థనా పూర్వకంగా మ్రొక్కేవాళ్ళు. ఆ నల్లటి
రాతిని "కాబా" అని పిలుస్తారు. ఈ నల్ల రాయి ఒకానొకప్పుడు
స్వర్గాన్నుంచి పడిందని ప్రతీతి. అరేబియాలోని అన్ని తెగల
వారూ మందసమువంటి యీ నల్లరాతిని అతిపవిత్రమైన
దాన్నిగా తలచి పూజ లర్పించేవాళ్ళు. ఎడారి ప్రదేశమైన ఆ
దేశంలో అటునిటు పోవు ప్రయాణీకులకు మార్గసూచకమైనవి
ఆకాశమండలి సూర్య చంద్ర నక్షత్రములూ, భూమిమీద
గండ శిలలూ మాత్రమే. ఆ యెడారిలో గండ శిలలు చాలా
అపురూపం. గాన నల్లని యీ పెనుబండ, ఆ యెడారి ప్రదేశం
లోనికి దైవదత్తంగా స్వర్గాన్నుంచి పడిందని అందరూ నమ్మే
వాళ్ళు. ఇదేదో నక్షత్ర ఖండం ఐవుంటుందని ఆ అంజనశిలను
"కాబా" యని పరమ పవిత్రంగా భావిస్తూ, చివరకి దేవుడు
గానే పరిగణిస్తూ వచ్చేరు! కాబా శిలను ఆరాధించేటందుకు
అన్ని దిక్కులనుంచీ యాత్రీకులు మక్కాకు వచ్చేవారు.
సుదూరమండలి నీటిపట్టు (ఒయేసిస్ అంటారు వీటిని) లనుంచి
కర్షకులు దండులుగా యాత్రకు వచ్చేవారు. ఎడారి ద్రిమ్మరులైన
బిడౌయినులు తమ గొఱ్ఱెల మందలతో సహా మక్కా

నగరానికివచ్చి, వీధుల్లోంచి మందలను తోలుకుంటూ పోయి, కాబా దేవాలయపు వెల్లగోడల ముందు తెల్లని తమ గుడా రాలను వేసికొనేవాళ్లు.



ఎడారిలో మందలు కాచుకుంటూ ద్రిమ్మరేవాళ్ళను బిడా యిను లంటారు. ఒయేసిస్సుల దగ్గర వ్యవసాయం చేసికొం టూండే రైతులకు యీ బిడాయిను లంటే శత్రుభావం వుండేది. ఎడారి మార్గాలలో పోయే వర్తక సమూహాలకు కూడా యీ బిడాయిను లంటే కంటగింపుగానే వుంటూండేది. మక్కా—పట్టణంలో మాత్రం వర్తకులు మంచి రక్షణ ననుభ వించేవారు. మక్కా—లో ప్రతిదినమూ పవిత్రమైనదిగానే, సెలవుదినంగానే పరిగణించబడుతూండేది. పండుగ దినములలో తప్పకుండా తీర్థములూ, తిరునాళ్ళూ జరగడం సాంప్ర దాయికమేగదా.

మక్కా— వర్తకుల పట్టణము. అక్కడి జనులలో కర్షకులూ లేరు, కార్మికులూ లేరు. అక్కడ జరిగేదల్లా వివిధ సరకులను అమ్మడం, కొనడం మాత్రమే. ఎవరైనా, యే సరకునైనా

కొనవచ్చు, అమ్మవచ్చు నిక్కడ. బైజాంటియమ్ నాణెము లైన బెజాంటు లను బంగారునాణెములు అక్కడ చెలామణీలో వుండేవి. వడ్డీకి అప్పులను తీసికోవడం కూడ అక్కడ జరిగే ముఖ్యవ్యాపార మే.

మక్కా బజారు లన్నీ యెంత యెండ వేళల్లోనూ కూడా యెంతో సందడిగా, గడబిడగా వుండేవి. వీథులు చిల్లర బేర గాండ్ర కేకలతోనూ, బరువులు మోసే గాడిదల ఓండ్రింపుల తోనూ గొడవగా వుండేవి. అటునిటు నడయాడే జనసమూ హాంపైన ఒంటెల మూపురాలు కదిలే గోపురాల్లా కనబడేవి. సన్నని యిరుకు వీథులలో, తెల్లని మట్టిగోడల మధ్యగా యెడతెగని కుచ్చు తలవాగాలు ప్రవాహంగా పోతూండేవి. అక్కడి యిండ్లు బైటికి చాల పేదవిగా కనబడేవి. ఇండ్లకు గవాక్షాలు వుండవు. కాని, ఆగంతుకుడు యిరుకైన ముంగలి ద్వారం తెరచుకొని, చీకటిగా వున్న నడవఃగొంచి పోయి మంగువాలోవి కడుగిడతాడు. అక్కడి దృశ్యం కళ్ళబడగానే అతడు ఆశ్చర్యపడతాడు. తన కళ్ళను తానే నమ్మలేడు! తెల్లని, సన్నని స్థంభాలు! మూడు స్థంభాలమీాద నిర్మించిన లాజులు అత్యంత సుందరంగా వుంటాయి. మండువామధ్య నొక జలశీకర యంత్రం చల్లని తుంపురులతో చుట్టూవున్న స్ఫటిక శిలా కుట్టిమమును తడుపుతూంటుంది. మండువా చుట్టూ వరుసగా గదు లున్నాయి. అచ్చటి వాతావరణ మంతా ధూపకరండముల నుంచి వచ్చే సువాసనా ధూమముతో

సురభిళంగా, నీలిమగా వుంటుంది. సూర్యతాపానికీ, వేడిమికీ వేగిపోతూన్న పట్టణంలో యిక్కడొక ఒయేసిస్సు, జలవాపి, చల్లదనాన్నిస్తూ, సువాసనా ధూపములతో గుబాళిస్తూ వుంది! ఈ ఒయేసిస్సులో ఖర్జూర తరు కాండములకు బదులుగా తెల్లని స్థంభములు, సీటిపట్టుకు మారుగా కేళాకూళి వున్నాయి. పుణ్యక్షేత్రమైన మక్కానగరంలోని వర్తకులు యిల్లాంటి వైభవోపేతములైన భవనములలో సుఖంగా జీవించేవాళ్లు. సరుకులన్నింటిలోనూ ప్రియమైన సరుకు బంగారు నాణెములే కదా? వాటితో వ్యాపారం చేసేవాళ్ళు మరీ సంపన్నులుగా వుండేవాళ్ళు.

ఇంత సుఖంగా, సుసంపన్నంగా వున్న మక్కావాసులు అదృష్టవంతులుగదా! ఐతే మరి వీరు యిటీవల అంతకంతకు దిగాలుపడి పోతూన్నట్లున్నా రెందువల్లనో? వచ్చేపోయే వణిజులకు మక్కావాసులైన సంపన్న వడ్డీ వ్యాపారులు వడ్డీలను తగ్గించడానికి గాని, చెల్లించాల్సిన మొత్తములకు గడువులు పొడిగించడానికి గాని అంగీకరించడం లేదు; ఎందువల్ల చెప్మా?

మక్కాకు దుర్దినములు సంప్రాప్తములైనాయి. రోమను సీజరులు, బైజాంటైన్ చక్రవర్తులు తమచేత బంగారు నుంచుకొని, వర్తకులకు హెచ్చు సౌకర్యములను కలిగిస్తూ, వారిని తమవైపున కాకర్షిస్తూనే వున్నారు. ఇరుగు పొరుగువారైన పెరిష్యనులు తూర్పుదేశాలకు, హిందూదేశం, సువర్ణభూమి, జావా మొదలైన వాటికి తమ మార్గాల నేర్పాటు చేసికొనే

యున్నారు. అరేబియా యిప్పుడొక ప్రక్కగా అయిపోయింది. అరేబియా మీదుగా పోవు బిడారు లంతకంతకు పల్చబడి పోతున్నాయి. ఎర్రసముద్రంమీద నౌకలు అంతగా తిరగాడడం లేదు. చివరకు మధ్యధరా సముద్రంమీద కూడా ఓడల వ్యాపారం క్షీణించి పోయింది. ఇటలీలో ఔత్తరాహులైన బర్బరులు స్థిరపడడంతో రోముతో తూర్పుదేశాల వ్యాపారం మందగించింది. హిందూదేశాన్నుంచి బైలుదేరే వస్తువుల-ప్రవాహం అరేబియా–మధ్యధరా సముద్రమార్గమును వదలివేసి, పెరిష్యా–బైజాంటియమ్‌ల మీదుగా పోయే మార్గాంతరమును వరించింది. మక్కా మారుమూలై, మరపున బడిపోసాగింది.

ప్రపంచానికి ప్రళయం సమీపిస్తూందా ? అనుకో సాగేరు, మక్కా మొదలైన నగరాల ప్రజలు. తన లేమియే లోక దారిద్ర్యంగా జనుడు భావిస్తా డని కవి యన్నమాట నిజమే ! బహుధనవంతములైన వాణిజ్య కేంద్రాలుకూడా నిర్జనములు కాజొచ్చినాయి. ఎల్లప్పుడూ సందడిగా వుండే నగర వీధుల్లో, చతుష్పథములలో వర్తక బిడారు లిప్పుడు నడవడంలేదు. సాగుచేయక బీడుపెట్టిన పొలాలకి వలెనే నగరాలుకూడా నిర్జనములుగా వుంటున్నాయి. ఎడారి యిసుక తెరలు తెరలుగా వచ్చి మహావైభవోపేతంగా వుంటూ వచ్చిన వణిక్ప్రముఖుల భవనరాజముల స్ఫటిక శిలా కుట్టిమముల మీదా, ఓడు బిళ్ళలమీదా పేరుకొని, వాటిని మ్లానములుగా చేస్తూంది.

మక్కానగరలక్ష్మి బూడిద కొట్టుకొని మ్లానముఖిగా వుంటూంది; ప్రాచీన సంపదలను ముందు తరాల వారికై భద్రపరచగలది శైథిల్యం మాత్రమే నేమో!

మక్కా మొదలైన అరేబియా దేశపు వాణిజ్య కేంద్రాలకు అది ప్రళయకాలమే. ముక్తి, మోక్షం యెక్కడనుంచి రాగలదో నని జనులందరూ ఆరాట పడిపోతూన్న కాల మది.

ఇంతవరకు మహాధనవంతులైన వర్తకులకు పరిస్థితు లంత పాడుగా లేవు. వారు భద్రపరచి యుంచుకొన్న సంపదలు కొన్ని తరాలవరకు తరుగనివి! వారు తమ నిలువధనాన్ని తోటి తెగల వర్తకులకూ, చిల్లరవ్యాపారులు, రైతులు, బెడౌయిన్ ద్రిమ్మరులకూ వడ్డీకి ఋణములు యిచ్చి వున్నారు. ఋణాల్లో మునిగినవారి దినాలు బాగులేవు. ఆర్థిక మాంద్యం ముందుగా వీరినే క్రుంగదీస్తుందిగదా. ఋణపాశం వారికుత్తుకల ను త్తరించుతూంది. ఋణము నిర్విరామంగా అహోరాత్రాలు పెరుగుతూనే వుంది. జనులంతా మనసారా ఋణదాతలను శపించ నారంభించేరు. ఒక్క బెజాంటు అప్పిచ్చి, తిరిగి మూడు బెజాంట్లు గూబలు పిండి వసూలుచేసే ఋణదాతలను క్రూరు లనీ, ఆశాపాతకు లనీ శపించుతే తప్పేమిటి?

దేవాలయం వద్దకు జను లంతకంతకు యెక్కువగా చేర జొచ్చేరు. పరమపవిత్రమైన 'కాబా' శిలకు మహాభక్తితో నిరంతరప్రార్థనలు చేస్తూ, విముక్తికై యెదురుచూస్తూండే వాళ్లు. కాని, ఆ నల్లరాయి నల్లరాయిలాగ మాట్లాడకండా

ప్రారుకుంది. అదివరలో సార్థవాహుల గుడారాల్లో చేరి విదేశీయులైన ఆ వర్తకులూ, పరిచారకులూ చెప్పే కథలను చెవి యొగ్గి వింటూండేవాళ్లు, మక్కా మదీనా వాసులు. విదేశ సరకులతో బాటు విదేశీయుల మతములూ భావాలూ గాథలూ కూడ అరేబియా మొదలైన దేశాల్లో ప్రయాణిస్తూనే వుండేవి. మక్కా మొదలైన బిడారు కేంద్రాల్లో వివిధ మతస్థుల విశ్వాసాలూ వినిపించేవి. యూదులు తమ మెస్సయా (దేవదూత-రక్షకుడు) వస్తాడనీ, క్రైస్తవులు పాపులకొరకై ఆత్మబలిదానం గావించిన ఏసుక్రీస్తు (అభిషిక్తుడు) ను గురించీ చెప్పేవాళ్ళు. వివిధ తాత్త్వికధోరణులు హిందూదేశాన్నుంచి వచ్చిన సార్థవాహులూ కథలుగా చెప్పేవాళ్లు.

ఎందరో దేవదూతలు, దీర్ఘదర్శులు, యోగులు, పవిత్ర ఋషులు, పుణ్యపురుషులు బైలుదేరి, తమ తమ సందేశాలను వినిపిస్తూ, జనులలో పరిభ్రమిస్తూండేవాళ్లు. వారి బోధనలలో విదేశీయ తాత్త్విక భావాలు, స్వంతవ్యాఖ్యానాలు కలగాపులగంగా వుంటూండేవి. వీరంతా కూడా రానున్న స్వర్గ రాజ్యాన్నిగూర్చి చెపుతూ, సంఘంలోని ధనికులను, నాయకులను వారికి రాబోవు శిక్షనుగురించీ, జరుగనున్న ప్రతీకారాన్ని గురించీ హెచ్చరిస్తూండేవాళ్లు.

ఇల్లాంటి ధర్మబోధకులలో, దీర్ఘదర్శులలో మొహమ్మద్ అను నాతడొకడుండేవాడు. ఆతడు ఇస్లామ్ అనునొక మతాన్ని గూర్చి ఉపన్యసిస్తూండేవాడు. ఇస్లామ్ అనగా శాంతి

యని అర్థము. ఈ బోధనల నాచరణలో బెడితే మానవులలో శాంతి యేర్పడ గలదనీ, బాధలన్నీ తొలగిపోగలవనీ ఆతడు విశ్వసించేడు. ఈ బోధన లాతని కెందరో శిష్యులను, భక్తులను ప్రోగుచేసి బెట్టినాయి.

మక్కా-వాసియైన మొహమ్మద్ బోధనలు అక్కడి ధనిక వర్తకులకూ, సంఘపెద్దలకూ కంటకముగా వుండేవి. తమ తాత ముత్తాతల పవిత్ర విశ్వాసాలనుంచి దూరుడైన యీ స్వమత ద్రోహిని వారంతా అసహ్యించుకొనేవాళ్ళు. వారిమూలమున మొహమ్మద్‌నకు, అతని శిష్యులకు అనేక బాధలు కలుగ జొచ్చినాయి. క్రీస్తుశకం 622 వ సంవత్సరంలో మొహమ్మద్ మక్కానుంచి ఆత్మరక్షణార్థం మదీనా పట్టణానికి పారిపోవాల్సి వచ్చింది. ఈ పలాయనదినం మొదలుకొనే ఇస్లాం మతస్థులు తమ పంచాంగాన్ని లెక్కపెడుతూంటారు. * చాల దీర్ఘ పోరాటం గావించిన తరువాత నే మొహమ్మద్ తన ప్రతికక్షులపై విజయాన్ని సాధించేడు.

క్రైస్తవమతంవలెనే ఇస్లాం మతంకూడా యితరు లందరినీ తనలో చేర్చుకుంటుంది. సమస్తమతాలవాళ్ళనీ, జాతులవాళ్ళనీ స్వీయమతంలోకి స్వీకరిస్తుంది. దేవు డొకడే యని ఇస్లాం

---

* ఈ పలాయనమును హిజరా అని పిలుస్తారు. మొహమ్మద్ మక్కానుంచి మదీనాకు పారిపోయినది క్రీ. శ. 622 జూలై 15 న. అది మొదలుకొనే మహమ్మదీయులు తమ శకసంవత్సరగణనను గావిస్తూంటారు. దీనినే ఫసలీ లంటారు.—అనువాదకుడు

మతమూ చెపుతుంది. కానైతే మక్కా దేవాలయంలోని నల్లరాయి వుండే 'కాబాశిల'-దాని దైవాంశ సంభూతత్వాన్ని నిరాకరించదు! పైగా యీ మతం, యూదుమత ప్రవక్తలకూ, ఏసుక్రీస్తుకూ, తదనంతర వారసుడూ, ప్రవర్తకుడూ మొహమ్మద్ ప్రవక్తయే నని చెపుతుంది! ఈ మతం బీదలకు సమస్త స్వర్గసౌఖ్యాలనూ, ధనికులకు యిహలోక సంపదలనూ వాగ్దానం గావిస్తుంది.

యావత్తు ప్రపంచమునూ జయించేందుకు పవిత్ర యుద్ధం సాగించాలని యీ మతం తన అనుయాయులకు పిలుపునిచ్చింది. ఇస్లాంమత ధర్మస్థాపనకై జరిగించే యీ యుద్ధాన్ని జీహద్ అని పిలుస్తారు. సరే, జైత్రయాత్రా దుందుభి మ్రోగింది. గతంలో పశ్చిమంలో ఐతే యీసారి తూర్పున సమరసంకల్పం జరిగింది.

మక్కా నగరం అంతా ఇస్లామ్ మతమును స్వీకరించింది. ఇటీవలిదాకా పరస్పర శత్రువులుగా వున్న ధనికులు - బీదలు యేకమై, ఇస్లాంయొక్క ఆకుపచ్చని చంద్ర ధ్వజం క్రింద మసలుతూ, తూర్పుదేశాల్ని జయించేందుకు ఉత్సాహంతో సాగేరు. వర్తక బిడారుల మార్గం అరేబియానుంచి వైదొలగి ప్రస్తుతం పెరషియా, తురుష్క, బైజాంటైన్‌ల మీదుగా పోతూంది. ఈ తూర్పుదేశాల్ని జయిస్తే, ఐహిక సంపదలు తమ చేతుల్లోకి పడతా యనే ఆశతోనే వీరు ముందున కురికేరు. ఇస్లాం ధర్మవ్యాపన అనేది యీ ఐహికవాంఛా

పరిపూర్తికి కావలసిన మానసిక భావ రూపకల్పన మాత్రమే. అదిన్నీ నెరవేరినప్పుడింక ఇస్లాం జెండా క్రిందనున్న జనులకు ఆ దేశమూ, బలమూ కూడ వున్నట్లే.

ఆనాడు అరబ్బులు తమచుట్టూ వున్న ప్రపంచాన్ని చూసేరు. ఐదు పెద్ద దేశాలు, రాజ్యాలు భూమిమీద వారికి కనిపించేయి. పశ్చిమదిశలో రూమ్‌రాజు-అంటే బైజాంటైన్ చక్రవర్తికి అరబ్బులు పెట్టుకొన్న పేరు - పారిపాలిస్తున్నాడు; రూమ్‌రాజు 'యోధులకు నాయకుడు.' రోమను చక్రవర్తి - రూమ్ లేక బైజాంటైన్ చక్రవర్తికి పొరుగున నిధులకు రాజైన పెర్షియా చక్రవర్తి రాష్ట్రాలు వ్యాపించి వున్నాయి. పెర్షియా చక్రవర్తి 'ధనపతి'. ఉత్తరదిశలో 'అశ్వపతి' యైన తురుష్కఖాను డున్నాడు. ఆతడు తుర్కీ మైదాన భూముల్లో సంచరించే తుర్కీ అశ్వపాలకులకు ప్రభువు. తూర్పుదిశలో 'జనపతి' 'కళలకు పోషకుడు' 'రాజ్యాంగ పాలనా దక్షుడు' యైన చీనా చక్రవర్తి పాలించే విశాల దేశం వుంది. దక్షిణదిశలో 'గజపతులు' 'విజ్ఞానపోషకులు' ఐన రాజులచే పరిపాలించబడే హిందూ దేశం వుంది. మక్కానుంచి సింహావలోకనం చేస్తూంటే అరబ్బులకు కనబడిన వర్తమాన తత్కాల ప్రపంచ స్వరూప మిట్టిది.

మొహమ్మద్ చనిపోయేక ఆతని వారసులు 'ఖలీఫా'లనబడే వారు అరబ్ తెగల నన్నిటినీ ఐక్యపరచి, దిగ్విజయ యాత్రకు బైలుదేరేరు. ఉత్తర దక్షిణాలకు, తూర్పు పడమరలకు వారి జైత్రయాత్రలు సాగినాయి. వారు పెర్షియాను జయించేరు;

బైజాంటియం సామ్రాజ్యాన్నుంచి ఐగుప్త దేశాన్ని ఆక్రమించు కున్నారు; యిట్లే ఒక్కొక్క దేశాన్నే జయిస్తూ వారు ముందుకు సాగిపోతూన్నారు. గొప్ప గొప్ప రాజు లందరితోనూ వారు పోరాటాలు సలిపేరు. హిందూదేశమందలి రాజులతో, బైజాంటైన్ చక్రవర్తితో, ద్రిమ్మరులైన టర్కుమన్ ఖానులతో, మధ్యాసియా హద్దులలో చీనాచక్రవర్తి సైన్యాలతో వారు యుద్ధాలు చేసేరు. స్పెయిన్ దేశాన్ని జయించి ఆక్రమించేరు. ఇంతటి విస్తృతమైన దండయాత్రలను, దిగ్విజయ యాత్రను అరబ్బులు యేభై యేళ్ళలోనే పూర్తిగావించేరంటే ఆశ్చర్యంగా వుంటుంది. ఏడో శతాబ్దపు కడపటిభాగం - ఎనిమిదో శతాబ్ది ప్రారంభంలోనూ వారీ యుద్ధాల నన్నిటినీ గావించేరు.

జయించిన ప్రతి దేశంలోనూ అరబ్బులు సైనిక నివేశనాలను స్థాపించి, దుర్గములను నిర్మించేరు. ఈ సైనిక నివేశనములే క్రమంగా పట్టణములుగా అభివృద్ధి జెందాయి. ఇస్లాం ధర్మానికి చెందిన వీరుల అడుగు జాడల్లోనే వర్తకులు, వ్యాపారులు బైలుదేరేరు. అరబ్బులు, మధ్యధరా సముద్రంలోని దీవుల నన్నిటినీ వశపరచుకుని, అలగ్జాండ్రియా రేవు నగరంలో స్థావరం యేర్పరచుకుని, బైజాంటైన్ సామ్రాజ్యపు నౌకలను బీభత్సం చేయ నారంభించేరు.

అరేబియను బిడారులు ప్రపంచ రహదారు లన్నిటిమీద కనబడుతున్నాయి. ఉన్ని, పట్టు పీతాంబరాలు, తివాచులు, చర్మములు మొదలైన సరకులను గుర్రాలు, ఒంటెలు,

గాడిదలపై వేసుకుని, గొర్రెల మందలను తోలుకుంటూ పోతూండేవాళ్ళు. వర్తకులు ఆర్మీనియా, జార్జియా ప్రాంతాల నుంచి విలువగల చర్మములు, ఉన్ని మొదలైన వాటిని తెచ్చేవారు. కాశ్యప సముద్రతీర ప్రాంతాలనుంచి మట్టినూనెను తెచ్చేవారు. ఈ మట్టినూనె (కిరోసిను ఆయిలు) అరబ్బులు తమ ఆగ్నేయాస్త్రాలకు ఉపయోగించేవారు. మండుతూన్న నూనె కుండలను శత్రుసైన్యాల మీదకు విసరే యంత్ర సాధనాలే ఆగ్నేయాస్త్రాలుగా వుండేవి, ఆ కాలంలో.

అరబ్బు వర్తకులు చర్మములను, గష్యాను సిల్కు అనబడే లినెన్‌ను స్లావియానుంచి, నొవోగొరోద్ రాజ్యంనుంచి గొని పోయేవాళ్ళు. బాల్టిక్ సముద్రతీర ప్రాంతాల్లోనూ, స్వీడను తీరానికి దూరాన సముద్రంలో వున్న గౌట్‌లాండ్ దీవుల మీదనూ కూడ వీరు కనుపించేవారు! సింహళద్వీపం, చీనా దేశం, ఆఫ్రికా ఖండంలోని సూడానుకు కూడ అరబ్బుల బిడారులు పోతూండేవి.

అరబ్బు దండయాత్రల, బిడారుల, యాత్రీకుల స్మృతి చిహ్నాలను దేశపటములు కలిగి వున్నాయి ఈనాటికీ! 'సహారా' అంటే తెలుసుగా? ఎడారి అని అర్థమిచ్చే అరబ్బుమాటనుంచే దానికా పేరు వచ్చింది! అరబ్బీ భాషలో 'సూడన్' అంటే 'నల్లని జనుల దేశ' మని అర్థం. చివరకు 'జావా' అనేదికూడా అరేబియను భాషాపదమే!

అరబ్బులకు తెలిసిన ప్రపంచం క్రమంగా విస్తృత మవుతూ వచ్చింది. ఈ ప్రపంచాని కొక కొనను మంచు క్రింద కప్పబడి వుండే నొవొగొరోద్ దేశం, స్లావియా వుంది; అచ్చట మహా రణ్యాలు, దారు నిర్మితములైన నగరాలు, దారు నిర్మితములే యైన ప్రాకారాలు, బహు కలశ శోభితములైన రాజభవనాలు, రాగిరంగు వెంట్రుకలు, నీల నయనాలు గలిగి, బొచ్చు-చర్మ ముతో కుట్టిన సిలువుటంగీలూ, టోపీలూ ధరించిన జనులు వుంటున్నారు. రెండవ వైపున నల్లని శరీరములు గల జనులు, శరీరమంతటా పచ్చబొట్లు పొడిపించుకొన్నవాళ్ళు నివసించే దేశం వుంది; వీరు తాటియాకు కప్పిన చిన్న కుటీరాల్లో వుంటారు; అత్యుష్ణ దేశ మది. మహారణ్యములూ, విశాలమైన నదులూ వుంటా యిక్కడ. ఇచ్చటి యెండ వేడిమిని భరించ జాలక హిప్పోపొటోమస్‌లు అంటే నీటి గుర్రములు దినమం దత్యధిక భాగమును నీటిలోనే గడుపుతుంటాయి. ఇటువంటి దేశం రెండో వైపున వుంది.

అరేబియను వర్తకులు యీ అన్ని దేశాలకూ వెళ్ళేరు. ఉత్తరాన శీతల దేశాల్లో స్లెడ్జి లనే సరుగుడు బండ్లలోనూ, మహోగ్రమైన ఉష్ణమండలపు ఎడారుల్లో ఒంటెల మూపురాల పైనా, సముద్రాలమీద తాలోత్తుంగ తరంగాలలో యెత్తైన నౌకలమీదా, హిందూదేశపు సాంద్రారణ్యభూములలో యేనుగులపైనా ప్రయాణాలు గావిస్తూ, అరబ్బులు అన్ని దిశలకూ వ్యాపించేరు. వారు తమతో వర్తక వ్యాపారాలను

ఎక్కడికి వెడితే అక్కడికి గొనిపోయేవాళ్లు. సిల్కులు, సన్నని వస్త్రాలు, మిరియాల గోనెలు, పంచదార, శర్కర, లవంగాలు, సుగంధ ద్రవ్యాలు, అమూల్యమ్మైన దంతం, లోహాలు, కత్తులు—వీటిమీద మొహమ్మద్ సూక్తులు చెక్కబడి వుండేవి;— ఒక టేమిటి వర్తకపు సరకులను సర్వత్రా గొంపోయీవాళ్ళు. అరేబియా దేశపు వెండి నాణెం ఆనాడు ప్రపంచంలో ప్రధానమైన మారకపు సాధనమైంది. అరబ్బు శబ్దాలు అన్ని భాషల్లోకీ, రష్యన్, జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలైన ఐరోపా భాషల్లోకీ, ప్రాగ్దేశపు భాషల్లోకీకూడా ప్రవేశించినాయి. కారవాన్, మేగజైన్, టేర్, అడ్మిరల్ * మొదలైన మాటలు మిరియాలు, లవంగాలు, శొంఠి మొదలైన సరకులతో బాటుగా యూరోపు లోనికి అరబ్బులు తీసికొని వచ్చినవే!

జర్మనీ రాష్ట్రములలో బేరన్‌లు, బ్రిటన్ ద్వీపాల్లో లార్డులు తమ దుర్గాల్లో దృఢమైన ఓకు బల్లలముందు కూర్చుని విందులు గుడిచేవాళ్ళు వారి భోజనములలోని వ్యంజనము లన్నింటి లోనూ సుగంధద్రవ్యాలు, మిరియాలు, శొంఠి మొదలైనవి వాడబడేవి అవి తూర్పున వున్న హిందూదేశం, సింహళం, జావా మొదలైనచోట్ల నుంచి స్థల జల మార్గాల్లో బహు

* కారవాన్ = బిడారు లేక సార్థము. మేగజైన్ = గిడ్డంగి, సరుకులు నిలవచేయు కొట్టు. టేరు = తారము, సరుకునుంచు పాత్ర బరువు. అడ్మిరల్ = నౌకా దళాధిపతి, ముఖ్యుడు. అను—

దీర్ఘ ప్రయాణాలు గావించి ఐరోపా దేశాలకు వచ్చేవి. ఆనాడు వాటిని గొనివచ్చినది, అరబ్బు వర్తకులే. యూరోపులో ప్రభువులు తమ తమ ఎస్టేట్లలోనే అన్ని వస్తువులనూ కొనుక్కోవచ్చును. ఆతని క్రిందవున్న దాసులు వారానికి కావలసిన ఆహార పదార్థాల నన్నింటినీ సమకూర్చేవారు. దాసులే రాజకుటుంబాలకు కావలసిన దుస్తులు, పాదరక్షలూ



కూడా తయారుచేసి సమర్పించుకొనేవారు. కాని జఠరాగ్నికి దీప్తి కలిగించేదీ, జిహ్వాను చుర్రు మనిపించేదీ ఐన మిరియం మాత్రం ఆ దేశాల్లో పండదు. అదృష్ట పూర్వమైన యేదో అద్భుత దేశాన్నుంచి రావాల్సిందే, అది! అక్కడికి పోవడమే కష్టం. ఎడారులూ, పర్వతాలూ, సముద్రాలూ గడచిపోవాలి, మిరియం పండే దివ్య భూమికి! దానికై పెద్ద మూల్యం చెల్లించాలి. ఐతేనేమి? మిరియంలేనిదే తిన్న తిండి, తిండే

కాదు! అది లేకపోతే వంటకాలన్నీ చప్పగా, జిహ్వ చచ్చే ట్లుగా వుంటాయి. ఆఖరికి, పందిమాంసం బొమ్మ ముక్కలు వేపి, వేడిగా ఆవిరులు వస్తూంటే తెచ్చినదైనా సరే, లేదా మొత్తంగా కాల్చిన పెద్ద బాతు కానీ, యెంత రుచిగలదైనా మిరియపుపొడి లేనిదే వొట్టి పిప్పిలా వుంటుంది! అదంతే! అంతే గాదు. మిరియం ఆరోగ్యానికి, జఠరదీప్తికి చాలా మంచిదికూడా నని చెపుతారు!

ఐతే, యిల్లాంటి సద్గుణాలు గల మిరియాలు యెక్కడినుంచి రావాలి? అవి చేయాల్సిన యాత్రి యెల్లాంటిది?



హిందూదేశపు దక్షిణ భాగాన్నుంచి మిరియం సముద్ర యానం గావించి. అరేబియా తీరానికి వెళ్ళేది. అక్కడినుంచి ఒంటెలమీద సవారుచేసి, మక్కాకు చేరేది. ఒంటెలను గొంపోయే వాళ్ళంతా యాత్రికులు; యాత్రికులే వర్తకులు! పుణ్యతీర్థాభిగమనంతోబాటు కాస్త కాంచనలాభాన్ని గూర్చి కూడా ఆలోచించిడం పాపం కాదు. మక్కానగరం మళ్ళా

ధనవంతమై, జనసంకీర్ణమైంది. ఆ పవిత్రనగరంలో అన్ని వర్ణముల వర్తకులూ – ఎరుపు, నలుపు, తెలుపు, పసుపు, చామనచాయ మొదలైన సమస్తవర్ణముల వారూ, సమస్త దేశాలవారూ, పవిత్ర దేవాలయప్రాంతభూమిలో కూర్చునే వాళ్ళు.

మిరియం మక్కానుంచి మళ్ళా ప్రయాణమై పశ్చిమాభిముఖంగా వెళ్ళి, బాస్ఫరస్ జలసంధిమీద నున్న కాన్‌స్టాంటినోపుల్‌కు పోయేది. ఈ బాస్ఫరస్ జలసంధి మాత్రమే ఆసియా నుండి యూరోపును విడదీస్తూంది. కాన్‌స్టాంటినోపుల్ లోనే హిందూదేశజన్యమైన మిరియం బైజాంటైన్ చక్రవర్తి చేతుల్లోకి మారేది. ఆనాడు పాశ్చాత్య ప్రపంచం అంతట్లోకీ బైజాంటియం రాజభవనము అత్యంతశోభాయమానంగా వుండేది. బైజాంటియం చెర్చిలలోని దేవతావిగ్రహాలు స్వర్ణమయ పీఠాలమీద నిలబెట్టి వుండేవి! పందలకొలదిగా వ్రేలాడే దీపకళికలు చుట్టూవున్న గోడల్లో అమర్చిన రత్నాల్లో ప్రతిఫలిస్తూండేవి!

ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. బైజాంటియం చక్రవర్తియే ప్రపంచంలో మహాధనికుడైన బేహారి ఐనప్పుడు, రాజభవనం ఇంద్రసభలా వుందంటే ఆశ్చర్యం యెందుకు? చక్రవర్తి భాండారాల్లో ధాన్యపురాసులు, పట్టుబట్టల మేట్లు, మద్యభాండాలు, ఆలివ్ నూనె గూనలు, తూర్పు దేశాల సుగంధ ద్రవ్యాల సంచులు అంతులేకుండా వుండేవి. మిరియమే

వాటన్నింటిలోకీ అతి ముఖ్యమైనది. బైజాంటియం నుంచి వర్తకులు యీ దినుసులను కొని, సముద్రంమీద నౌకల్లో,



గుర్రాల నెక్కి భూమిమీదుగా, కొండలపైన, కనుమలగుండా దీర్ఘప్రయాణాలు గావించి, మార్సెలీస్, పారిస్, రైన్ తీరం, ఫ్లాండర్స్ మొదలైన చోట్లకు బోయేవాళ్ళు.

## 2. ఖలీఫాల రాజభవనం, గ్రంథవిక్రేత దుకాణం.

ప్రపంచంలో సుప్రసిద్ధ సుందర నగరాల సుదీర్ఘ జాబితాలో మరొక కొత్తపేరు వినబడింది-- అదే బాగ్దాద్!

'వేయినొక్క రాత్రుల కథ'ను వినని వారుండ రనుకుంటా!

మహమ్మదీయ మతానికి ప్రధానపీఠాధిపతి, మహమ్మదీయ ప్రపంచానికి చక్రవర్తీ కూడ ఒక్కరే;-- ఆతనినే 'ఖలీఫా' అంటారు. ఆనాటి ఖలీఫాల రాచనగరులనుగూర్చి, అచ్చట

కన్నుల పండువుగా వుండే స్తంభాలు, కమానులు, తెరలు మొదలగువాటి మీాది అత్యద్భుత శిల్ప సౌందర్యాన్ని గూర్చి విననివా రెవరు? ఎడారిలో మరీచికా జలమువలె భ్రమాజనక మైన ఆ ప్రాసాదముల శోభను ప్రశంసించనివా రెవరు? శిల్పిచేతిలో సజీవ గండ శిలా ఫలకాలు తమ భారాన్నీ, స్థాణుత్వాన్నీ గోల్పోయి, సజీవములైనాయి. కేళాకూళుల నుంచి జలశీకరములు స్వచ్ఛ స్ఫటిక శిలా కుట్టిమములమీాద పడుతూంటే, జలములు స్ఫటిక శిలలుగా మారినవో? స్ఫటిక శిలలే ద్రవించినవో? అనే సందేహం చూపరులకు కలుగక మానదు! అంత విశాలమైన రాచనగరులోనూ ఒక్క దేవతా విగ్రహం కాని, మానవప్రతిమ గాని కనబడదే! ఇస్లాం మతము విగ్రహములను, ప్రతిమాశిల్పాన్ని నిషేధించింది గనుక నే కదూ? కాని, ప్రతీ కుడ్యమూ, స్తంభమూ, సరంబీ కూడ చక్కని లతలతో అల్లిబిల్లిగా పెనవైచుకొన్న ఖొరాన్ సూక్తులు చెక్కబడి యెంతో మనోజ్ఞముగా వుండేవి. అరబిక్ లిపి అనేక లతావితానంలాగ, చక్కని కల్పనా శిల్పానికి అనువుగా వుంటుంది! వాటితోబాటు చిత్రవిచిత్రములైన చెక్కడపు లతలు యెవరూ విడదీయరాని అక్షర పుష్ప మాలికలా! యను నట్లుంటాయి!

ఖొరానులోనుంచి తీయఁబడిన యీా సూక్తు లేమి చెపు తున్నాయి? అవన్నీ ఈశ్వరుడైన 'అల్లా' నూ, ఆయన ప్రవక్త 'మొహమ్మద్' నూ పొగడుతూనూ, ఖలీఫాల ప్రాసాదం యీా

భూలోకంలో అన్నిటికంటెనూ అతిలోకసుందరమైన దని వర్ణిస్తూనూ వుంటాయి.

రాజప్రాసాదం గూసేముగదా! గనుక ఒక్కసారి బాగ్దాదు రాజవీధిలోని నదీమ్ దుకాణానికి పోయి వత్తము. నదీమ్ పుస్తక విక్రేత. దుకాణంలో పుస్తకాలు కుప్పలు తిప్పలుగా వున్నాయి వాటి వెనుకనున్న దుకాణదారుడు మనకు కనబడనే కనబడడు! పుస్తకాలకి విలువ యేమిటి? పుస్తకాలు కూడా సంపద క్రింద లెక్కేనా? ఏమో, చూస్తాంగదా ఈ పుస్తకాలు ఖరీదైన మేకపిల్లల చర్మాలమీద వ్రాయబడినవీ గావు. ఐగుప్త దేశపు పాపిరసు పైన వ్రాసినట్టివీ గావు; చీనానుంచి వచ్చిన చౌక కాగితంమీద వ్రాసినవే, యిక్కడి గ్రంథాలు! ఆ దుకాణంలో పుస్తకాలే గాక బోలెడంత దుమ్మూ ధూళీ కూడా వున్నాయి! ఏదేమైనా ఖలీఫాల రాజప్రాసాదంలో కంటె యీ పుస్తకాల అంగడిలోనే యెన్నెన్నో చిత్రవిచిత్రాలున్నా యని చెప్పాలి.

దుకాణదారుడు నిన్ను అతి మర్యాదగా 'మీ కేపుస్తకం కావాలి?' అని ప్రశ్నిస్తాడు. తాను తయారు చేసిన పుస్తకాల జాబితానుకూడా అతడు నీకు చూపిస్తాడు. అరబిక్ భాషలో వున్న పుస్తకాల జాబితా, అది చాలా దీర్ఘమైనదే! పెర్షియన్ కావ్యాలు, గ్రీకు తత్త్వశాస్త్రాలు, వారి పాండిత్య ప్రకర్షా ద్యోతకములైన వ్యాఖ్యానాలు;- యిల్లాంటి వన్నీ ఆ జాబితాలో నువ్వు చూస్తావు. వీటిల్లో ఏ గ్రంథం చూడాలనే

కుతూహలం వుంది, నీకు? హిందూదేశపు గణితశాస్త్రమా? లేక జియోగ్రాఫియా? అంటే భూప్రపంచం, దానిమీద జనుల్ని గురించిన శాస్త్ర మన్నమాట! లేక నీకు యిష్టమైనది, బహుశః ప్రవక్తల, మహారాజుల చరిత్ర లున్నది కావాలా? వీటిలో తబరీ రచించిన దొక పెద్ద పుస్తకం వుంది. యావ త్ప్రపంచ చరిత్రనీ వివరించేది; అందులో అనేక దేశాల మహా జనులనుగూర్చి, యూదు ప్రవక్త మోజెస్‌నుగూర్చి, యోధా గ్రణి అలగ్జాండరు చక్రవర్తిని గురించి, పెరిష్యా సార్వభౌముడు సైరస్‌నుగూర్చి. అగస్టస్ చక్రవర్తిని గురించి, మరెందరో మహానుభావుల్ని గూర్చి చదువగలవు.

ఈ అంగడిలో కొన్ని చారిత్రక గ్రంథాలూ వున్నాయి. ఆ యా గ్రంథకర్తలు వీలైనంత యదార్థంగా, సత్యంగానే తను కథనములను సాగిస్తూవచ్చేరు. చరిత్రకారుడు, తను ఆ భోగట్టా అంతా యెవరివల్ల తీసుకొన్నాడో చెపుతాడు. మొట్టమొదటే ప్రతి గ్రంథంయొక్క మొదటి పుటమీద 'నే నీ కథను ఫలానా వారివల్ల విన్నాను.' 'ఫలానావారు ఫలానా వారితో, ఫలానా రీతిగా చెప్పిరి.' 'అతడు యిల్లా చెప్పేడు.' 'ఫలానా ఫలానావాడనైన నేను.. వ్రాస్తూన్నాను.' ఇదీవరస. అక్కడనుంచి కథాక్రమము యెవరో ప్రత్యక్ష సాక్షి చూచిన దంతా గ్రంథకర్తకు చెప్పినట్లుగానే వ్రాయబడుతుంది...ఆదియుగంబునందు పరాశరాత్మజుండైన కృష్ణ ద్వైపాయనుం డను బ్రహ్మర్షి... వేదవ్యాసుండై తన శిష్యు

లయిన పైలవైశంపాయన సుమంతు జైమినులకుం ..చతుర్యుగ మహర్షి రాజచరితంబులును...భారత వీరుల మహాగుణంబు లును తన విమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబున వెలుగు చుండ...విశ్వజనీనమై చేసె భారతంబు...వ్యాస శిష్యుండైన రోమహర్షణునకు బుత్రుండైన ఉగ్రశ్రవసు డను సూతుండు సుపౌరాణికుండు నైమిశారణ్య పుణ్యక్షేత్రమున గులపతి శౌనకుండు పరమ మాని బ్రహ్మర్షి గణసముపాసితుండై యుండ...లోకహితార్థంబుగా...ధర్మ శాస్త్రార్థ తత్త్వంబు లును...ఆదిక్షత్ర చరిత్రంబులును గల మహాభారతేతి హాసం బునుం...పురాణ పుణ్యకథా కథన రతుండై జెప్పె...తొల్లి వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన రీతి...సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పెనని...ఇదీ కథాక్రమం!

నీకు జ్ఞాన సేకరణాపేక్ష వుందా? ఉంటే, ఇదిగో! ఇదొక పెరిష్యన్ పండితుని గ్రంథం, ఆయన సమస్త మతధర్మములను గూర్చి, అన్ని విజ్ఞానశాస్త్రాలను గురించీ చాలావరకు ప్రామా ణికంగానే, నిష్పక్షపాతంగానే వ్రాసి, నీకు అందించేడు!

నీకు యీ భూమీ, ఆకాశమూ యెల్లా నిర్మించబడ్డాయో తెలుసుకోవాలని వుంటే, అదిగో! అల్మజెస్ట్ టోలమీ రచించిన యీ మహాగ్రంథం ముప్ఫై సంపుటాలూ కూడా అరబిక్ భాషలోకి అనువదించబడి సిద్ధంగానే వుంది.

ఖలీఫాల రాజసభాభవనంలో నీకు ఖలీఫా భవన సంబంధ మైన విశేషాలే కనబడతాయి. కాని, యిక్కడ యీ ధూళి




టాలెమీయ ఖగోళవ్యవస్థ : భూకేంద్ర సిద్ధాంతం.

ధూసరిత అంధకార బంధుర గ్రంథ విక్రయ స్థానంలో యావత్తు ప్రపంచాన్ని గూర్చి, సముద్రాంతరాలను గూర్చి, ఖగోళాదులను గూర్చి కూడా బోలెడంత భోగట్టా సేకరించ బడి వుంది. అనేక సహస్రాబ్దాల జ్ఞానవిజ్ఞాన మంతా, అనేక తరాల సంచితజ్ఞాన మంతా యిక్కడ రాసిగా చేయబడి వుంది! స్ఫటిక శిలా నిర్మాణాలూ, అమూల్య రత్న ముక్తామణి సంచయములూ కంటె యీ విజ్ఞానసేకరణమే కష్టతరము! ధూళిధూసరితమై వినీతంగా కనబడుతూన్న యీ గ్రంథనిధి విలువ కట్టరానిది!

ఒక ఖలీఫా యిల్లా అన్నాడు: "పండితుని మషీరసం (సిరా) యోధుని రక్తంవలెనే మహాగౌరవ భాజనము" దీనిలో అతిశయోక్తి లేదు.

ఖలీఫా లందరూ గ్రంథముల విలువను గ్రహించని మాట నిజమే అనుకోండి. ఖలీఫా ఓమర్‌కి పెర్షియా విజయయాత్రా సందర్భంలో ఒకచోట యెన్నో గ్రంథాలు కనపడినవట. వాటి నేమి చేయమన్నా రని అతని సేనాధిపతి అడిగేడు "మనం కొల్లగొనిన వాటన్నిటితో బాటుగా యీ గ్రంథాలనుకూడా నిజమైన దైవవిశ్వాసులకు పంచిపెట్టమని సెలవా?" దీనికి ఖలీఫా ఓమర్ యిల్లా జవాబిచ్చేడు: "ఈ గ్రంథాల్లోని విషయం ఖొరానులో వున్నదే ఐతే యివి నిరుపయోగమే కదా! లేక ఖొరాన్‌లోని విషయాలు గాక తదితరములే పెట్టిల్లో వుంటే యివి బహుదూష్యములూ, ప్రమాదకరములూ

గదా. అందుచేత. ఏ పక్షంలోనూ యివి తగులబెట్ట వలసినవే!”
ఇల్లాంటివాళ్లనే గదా రాక్షసులని ప్రాచీనులు పేర్కొంటూ
వచ్చినది!

కొందరు ఐతిహాసికులు యీ సంఘటన పెరిష్యాలో గాక
అలగ్జాండ్రియాలో జరిగిందంటారు. అక్కడా, యిక్కడా,
యింకా యెన్నోచోట్ల యిల్లాంటి ప్రబుద్ధులు అనేక కాలాల్లో
మనకు కనబడతారనేది మరీ సత్యం. అలగ్జాండ్రియా నగరం
లోని గ్రంథాలయాలు యెన్నోసార్లు తగులబెట్ట బడినాయి.
సీజర్ పటాలాలచేత, మొదటి క్రైస్తవ మతోన్మాదులచేత,
కులపతి థియోఫిలస్ ఆశీర్వాదంతో, ఆయన అనుచరులచేత,-
ఆ యీ గ్రంథాలయాలు నాశనం గావించబడినాయి. ఏదైనా
మిగిలివుంటే అవీ, తరువాత సేకరించబడినవీ యావత్తూ కూడ
అరబ్బులు అలగ్జాండ్రియాను జయించినప్పుడు సర్వనాశనం
గావించేసేరు!

ఇదంతా బహుశః జరిగి వుండవచ్చు. కాని, ఆకాలం గతించి
పోయింది. అరబ్బులు యిప్పుడు విజ్ఞానాన్ని గౌరవించడం
నేర్చుకున్నారు. ప్రతీ ఒక్కరూ తన యిచ్ఛవచ్చినట్లు ఆలోచిం
చేందుకూ, స్వకీయ విశ్వాసాలు గలిగి వుండడానికీ అరబ్బులు
యిప్పుడు అనుమతిస్తూన్నారు! ఖలీఫాల రాజ్యమందంతటా,
అన్ని నగరాల్లోనూ డమాస్కస్, బాగ్దాద్, బొఖారా,
ఉర్గెంజ్ మొదలైన పట్టణాల్లో పండితులు స్వేచ్ఛగా ప్రకృతిని
గూర్చి పరిశోధిస్తూ, యీ సృష్టి యెట్లేర్పడినదా? యని దీక్ష

చర్చలు గావిస్తూన్నారు. వీరిలో అరబ్బులు, పెరిష్యనులు, ఖారెజ్మియన్‌లు, యూదులు అన్ని జాతులవారూ, మతాల వారూ వున్నారు.

శతాబ్దాలు గడిచిపోతున్నాయి. తొమ్మిది, పది, పదకొండు ..

అరబ్బులైన ఖలీఫాల రాజ్యం ముక్కలైంది. కాని, ఇందు మూలంగా శాస్త్రజ్ఞుల, పండితుల కార్యక్రమానికి అంతరాయం కలుగలేదు. పండితులు, తామే జాతికీ, మతానికీ చెందినా, యెక్కడ వున్నా తాము ప్రపంచపౌరుల మని, మానవజాతికి చెందినవాళ్ళ మని భావించేవారు. స్పెయిన్‌లోని కార్డోవాలో వుండనీ, మెసపొటేమియాలోని బాగ్దాద్‌లో వుండనీ, మధ్యాసియాలోని బొఖారాలో, ఉర్గెంజ్‌లో వుండనీ, మరెక్కడ వుండనీ అంతా వారికొకటే. పండితులు ఒకచోట శోభిస్తారు, మరొకచోట శోభించరు అనేది లేదుగదా! * ప్రతి అమీరూ, ఖానూ, ఖలీఫా తన ఆస్థానానికి సుప్రసిద్ధ పండితులను ఆకర్షించాలని ప్రయత్నించేవాడు. రాజధానులకు, పట్టణాలకు దివ్యభవనాలకంటె పాఠశాలలూ, గ్రంథభాండాగారములు, నక్షత్రశాలలూ మొదలైనవే అధికతర శోభ నిస్తా యని భావించబడేది. చివరికి బైజాంటైను చక్రవర్తికూడా మహాపండితులను, శాస్త్రవేత్తలను-ఖలీఫాల ఆస్థానాల్లో ప్రశస్తిగాంచిన వారిని-కాన్‌స్టాంటినోపుల్ లోని తన రాజసభకు ఆకర్షించాలని

* శ్లో. స్వగృహే పూజ్యతే మూర్ఖః స్వగ్రామే పూజ్యతే ప్రభుః।
స్వదేశే పూజ్యతే రాజా । విద్వాన్ సర్వత్ర పూజ్యతే॥

తాపత్రయ పడేవాడు. రాజాధిరాజులైనా రత్నములకోసం అన్వేషణ చేస్తారు గాని రత్నాలు ఎవరికోసమూ వెతుక్కోవు గదా. న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్.

సుదూరంలోని మధ్యాసియా సైకత ప్రదేశములలో, ఉర్గెంజ్ నగరం వుంది. అక్కడి నక్షత్ర శాలలలో పండితులు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఖగోళ-వేధ గావిస్తూ, విశ్వరూప విచారణ గావిస్తూండేవారు. ఆనాటి ఉర్గెంజ్ నగరం బాపతు యీనాటికి మిగిలిన దల్లా నిర్జనమైన యెడారిమధ్య నొక శిథిల స్తంభం



మాత్రమే. కాని, ప్రాచీనకాలంలో ఉర్గెంజ్ ఒక మహానగరం, సంపదల కాలవాలము. ఖార్మెజ్ 'షా' లకు రాజధాని. ఖార్మెజ్ షాలు మధ్యాసియా, పెరిష్యాల పరిపాలకులు. ఖార్మెజ్ నుంచే ప్రాచీన యాత్రికుడు ఆల్ బెరూనీ హిందూ దేశానికి బైలుదేరినది. దర్శన శాస్త్రాలకూ, అపూర్వ శిల్పాలకూ, పాడిపంటలకూ, వెండి బంగారాలకూ, వెలలేని రాళ్ళకూ, విచిత్ర వృక్ష జంతు సంతతులకూ, సుగంధ ద్రవ్యాలకూ పుట్టినిల్లైన ఆ మహావిచిత్రదేశాన్ని (భారతదేశం), భూ-తల స్వర్గాన్ని గూర్చి స్వయంగా తెలుసుకునేటందుకూ,

చూాచేటందుకూ అల్ బెరూనీ దుష్కరమైన యీ యాత్ర గావించేడు.

హిందూ దేశపు మతాలకు భిన్నమైన మతానికి చెందిన విదేశీయుడు, అల్ బెరూనీ. హిందూ దేశానికి ఉత్తరాన వున్న ప్రాంతా లన్నిటా యీ విమతస్థులు ఆక్రమణలు సాగించేరు. అల్ బెరూనీ నిరాకారుడైన ఏకేశ్వరుని యందు నమ్మకం గలవాడు. హిందూ దేశంలోనో, జనసంఖ్యకంటె వారు కొలిచే దేవుళ్ళ సంఖ్యే హెచ్చు! అల్ బెరూనీ విగ్రహాముల ముందు మ్రొక్క నిరాకరించే మతానికి చెందినవాడు. హిందూ దేశం, పెద్ద పర్వతాలే బుద్ధదేవాది విగ్రహాలుగా చెక్కబడి నట్టిది! చతుర్భుజుడైన శివుని * ఆలయంలో వందలకొలది దేవదాసీలు రాత్రింబగళ్లు నాట్యం చేస్తూంటారు.

తమ మత విశ్వాసాదులు యెల్లాంటివి గానీండి, హిందూ దేశీయులు ఇస్లాం యాత్రీకుడైన అల్ బెరూనీకి సగౌరవంగా స్వాగతమిచ్చేరు. విజ్ఞానాన్వేషణలో తమతోడి సహచరుడుగా అల్ బెరూనీ పండితుణ్ణి అక్కడి బ్రాహ్మణులు గౌరవించేరు. స్వదేశానికి తిరిగి పోయేక అల్ బెరూనీ ఒక గ్రంథంవ్రాసేడు. ♦ దానిలో తనకు విచిత్రంగాను, కుతూహలంగానూ తోచినట్టి

---

* విష్ణువు ఐవుంటాడు. సర్వసాధారణంగా విష్ణువే చతుర్భుజుడుగా చిత్రించబడతాడు, హైందవ సాంప్రదాయంలో — అనువాదకుడు

♦ అల్ బెరూనీ గ్రంథాన్ని విశ్వసాహిత్యమాల త్వరలో ప్రచురిస్తుంది

హిందూదేశపు ఆచార వ్యవహారాలు, మతాలు, భావాలు మొదలైన వాట్లను గూర్చి ఆయన వ్రాసేడు.

విజ్ఞానజ్యోతి పశ్చిమంలో బలవంతంగా ఆర్పివేయ బడు తూంటే, తూర్పుదేశాల్లో మాత్రం యీ మహాజ్యోతి దేదీప్య మానంగా వెలుగుతూ, దిగ్విజయం గావిస్తూంది. విద్వాంసు లైన గ్రీకు తాత్త్వికుల గ్రంథాలు ఒక పుస్తకం నుంచి మరో పుస్తకం, ఒక భాషనుంచి యింకో భాషలోకీ వ్రాయబడు తూన్నాయి. అరిస్టాటిల్ జయభేరి ప్రాగ్దేశాల్లో మ్రోగించేడు. మహావీరుడైన అలగ్జాండరు ఖడ్గంతో జైత్రయాత్ర గావిస్తే, అట్లుగాకండా కేవలమూ కలంతోనే మహాపండితుడైన అరిస్టాటిల్ యీ విజయయాత్రను సాగించేడు! *

టోలమీ వ్రాసిన ఆల్మాజెస్టు, ♦ సిరియా, పెర్షియా, ఖార్జెజ్ దేశాలద్వారా హిందూదేశానికి చేరుకుంది. ఐగుప్త

---

* హిందూదేశీయులకు అరిస్టాటిల్ గ్రంథాలు వచ్చినవా యనే విషయంలో సందేహం లేదు, గాని హిందువుల జ్యోతిశ్శాస్త్రం, ఆయుర్వేదం, దర్శన శాస్త్రాలు, శిల్పం, భాషాశాస్త్రం, కళలు మొదలైనవన్నీ అంతకు చాల ముందునుంచీ ఇరాన్, అరేబియా, పాలస్తీనా, మెసపొటేమియా, గ్రీసులకు వెడుతూనే వున్నాయనీ, అనేక గ్రంథాలను ఆయా భాషలలో అనువాదాలుగా చూడగలమనీ పరిశోధకులు, పండితులు వ్రాస్తూన్నారు.

♦ క్రీస్తుశకం 140 ప్రాంతంలో ఐగుప్త జ్యోతిశ్శాస్త్రజ్ఞు డగు టోలమీ రచించిన ఉద్గ్రంథం. ఆల్మాజెస్ట్ అను మాట కర్థం మహాగ్రంథం అని. ఇందులో క్షేత్రమితి, ఖగోళశాస్త్రం మొదలైన గణిత శాస్త్ర విషయాలమీద ఆనాటికి తెలిసిన విజ్ఞానమంతా వ్రాయబడింది. ప్రాచీన

విద్వాంసుడు ఇబిన్ అల్ హాసన్ రచించిన చిన్న శాస్త్రీయ గ్రంథంలో గ్రీకుల భూమితిశాస్త్రం, హిందువుల బీజగణితం కూడా వున్నాయి. అరబ్ గణితశాస్త్రజ్ఞులు గ్రీకు ఆర్కిమెడీస్, హిందూ ఆర్యభట్టు గ్రంథాలను సాకల్యంగా పఠించేవారు.

తూర్పునుంచి తిరిగి పశ్చిమాభిముఖంగా ఒక యెదురు ప్రవాహం బైలుదేరింది. హిందూ గణితశాస్త్రం నుంచి అంకములను అరబ్బులు యూరోపు ఖండానికి తీసికొనిపోయేరు. ఈ ప్రయాణంలో అంకెల పేర్లుమారి, చివరికి యూరోపు చేరేసరికి అవి అరబ్ అంకెలైనాయి. విద్వాంసుడైన గుర్బర్ట్ పరివ్రాజకుడు యూరోపులో యీ అంకెల నుపయోగించడానికీ, అబాకస్ అనే గణనా సాధనము నుపయోగించడానికీ ప్రప్రథముడు.

అయస్కాంత సూచి, కాగితము;- యివి రెండూ చీనా నుంచి అరబ్బులద్వారా నే యూరోపు చేరినాయి. అప్పటినుంచీ సముద్రయానం చేసే ఇటలీ ఓడలు యీ అయస్కాంతసూచి (కంపాస్) వల్లనే దిక్కులు తెలుసుకొని, తమ ప్రయాణాలు సాగించేవి. అప్పటికి ఇటాలియనులు క్రైస్తవులు. గాన అయస్కాంతసూచిలో నుంచి గడ్డిపోచను అడ్డంగా గుచ్చి, శిలువ మాదిరిగా చేసి, దానిని చిన్న నీటిగిన్నెలో తేల్చి

---

భారతీయ మహాపండితుడైన వరాహమిహిరుని 'బృహత్సంహిత' వంటిదే యిది. నేటి ఎన్సైక్లోపీడియా-విజ్ఞాన సర్వస్వములలో వలె అప్పటికి వున్న విజ్ఞానం-జ్ఞానం అంతా దీనిలో సమీకృతము—అనువాదకుడు.

వుంచేవాళ్లు. నీటిగిన్నెలో యీ శిలువ తేలుతూ, అయస్కాంత సూచిగా ఉత్తర దక్షిణ దిక్కులను చూప్తతూండేది. అంతవరకు గొర్రెపిల్లల చర్మములను వ్రాత కుపయోగించే వారు. వాటికి మారుగా కాగితముల నుపయోగించుటకు కూడా యూరోపులో ఇటాలియనులే ప్రప్రథములు. సిరియా నుంచే యీ కాగితములు చేయుటను (ఇటాలియనులు) నేర్చుకొన్నారు.

మానవ భావధోరణుల వివిధ ప్రవాహాలు కలిసి, ప్రపంచ మానవ విజ్ఞాన మనే విశాల సముద్రం యేర్పడజొచ్చింది. ఈ భావధోరణులు తమ అభివృద్ధి పథంలో యెన్నెన్నో ఆటంకముల నధిగమించాల్సి వచ్చింది. వివిధ భాషలు, ఆచారాలు, వస్తువులను చూచుటలో గల దృక్పథభేదాలు;- యిట్లాంటి వెన్నో ఆటంకాలుగా వుండేవి, మొట్టమొదట్లో. తరువాత అసహిష్ణుత వల్ల కలుగు కుహనా ఆటంకములు వుండనే వుంటాయి!

నూతన భావములను ధైర్యంగా సమర్థించ గల ధైర్యశాలురు యెప్పుడూ యెక్కడా వుంటూంటారు. వారి కృషివల్లనే నూతన భావస్రవంతులు అన్ని ఆటంకాలను బ్రద్దలు కొట్టుకొని గాని, వాటి నధిగమించి గాని నదీప్రవాహాల్లాగ సాగరగాములై పురోగమిస్తాయి.

మానవుడు విజ్ఞానరంగంలో నూతన విజయములను సాధించు ఘట్టములో యిప్పుడు తిరిగి అడుగు పెట్టేడు.

భూగోళం చుట్టూ నౌకలో తిరిగి ప్రదక్షిణం చేసి వచ్చిన మొదటి నావికుడు మెగల్లాన్ అని చదువుతుంటాం. మెగల్లాన్ భూమి గుండ్రంగా వుందని ఋజువు గావించేడు. అతనికి చాల పూర్వమే అబుల్ ఫిదా యను సిరియను దేశీయుడు. భూప్రదక్షిణం గావించు యాత్రీకుడు తాను బోవు దిశనుబట్టి



కొపర్నికస్

పంచాంగ తిథులకు ఇరువై నాలుగు గంటలు ముందుగాని, వెనుకగాని వుంటాడని ఋజువు చేసేడు.

ఖగోళశాస్త్రవేత్తయైన కొపర్నికస్‌కు చాల పూర్వమే తాజిక్ విద్వాంసుడైన అల్ బెరూనీ, -నక్షత్ర చలనక్రమ

వ్యవస్థను సూర్యునిచుట్టూ భూమి గావించే భ్రమణం ఏ విధంగానూ ప్రతిరోధించడం లేదని ప్రకటించేడు! ఆయన ఒక పట్టికను తయారు చేసేడు. సూర్యునికి సాపేక్షంగా భూమియొక్కా నక్షత్రాలయొక్కా పరిభ్రమణమును చూపుతూ గణితమును వేసే రాయన. దీనికి మెచ్చి షా, ఆల్ బెరూనీకి ఒక ఏనుగునూ, అది మోసినంత వెండినీ బహూకరించేడు! కాని, ఆల్ బెరూనీ పండితుడా పారితోషికమును అంగీకరించక, త్రిప్పి పంపివేస్తూ యిల్లా చెప్పేడట! "నాకు వెండి బంగారము లవసరము లేదు. ప్రభూ! నాకు కావలసినంత సంపద, జ్ఞాన సంపద వుంది. చాలు. ఆశకు అంతు యెక్కడ?"

మరొక పండితుడు, ఆల్ హసన్ అను నాతడు కొన్ని గణితములు వేసి, సూర్యాస్తమయ సమయానికే సూర్యబింబం దిఙ్మండలానికి దిగువ 52,000 అడుగులు క్రిందికి దిగివుంటాడనీ, అప్పటికి గాని సూర్యకిరణాలు మనకు కానరాకండా పోవడం లేదనీ ఋజువు గావించేడు. ఈనాడు ఆధునిక ఖగోళ శాస్త్రజ్ఞులు గావించే పరిశోధనా ఫలితాల కీ లెక్క దాదాపు సరిపోతూంది.

కొందరు శాస్త్రజ్ఞులు బ్రహ్మాండ గోళగతుల్ని గుణిస్తూ, అనంతాకాశాన్ని కొలుస్తూంటే, మరి కొందరు పరమాణు ప్రపంచాన్ని గూర్చి పరిశోధనలు సాగించేవారు. అరిస్టాటిల్ సిద్ధాంతాలు వీరికి కొట్టిన పిండే. అలగ్జాండ్రియన్ పండితుల గ్రంథాలనూ వీరు పఠిస్తూండేవాళ్ళు. ప్రపంచంలో ప్రతి

వస్తువూ మారుతుందని వారికి తెలుసును. అల్లాగైతే రాగిని బంగారంగా యెందుకు మార్చలేము ? భూగర్భంలో బంగారం తయారవడానికి లక్షుల యేండ్లు పడుతూందని వాళ్ళకి తెలుసును. కాని, ప్రకృతి లక్షుల యేండ్లలో చేస్తూన్నదానిని మానవుడు యుక్తిచేత కొద్ది గంటలలో సాధించ లేడా ? అనేదే వాళ్ళ ప్రశ్న. అరేబియను రసవాదులు యీ ప్రశ్నకు జవాబు నన్వేషిస్తూ, అలగ్జాండ్రియను పండిత ప్రకాండులు వ్రాసి పెట్టిన 'పాపిరస్' కాగితపు చుట్టల నన్నిటినీ తిరగేస్తూండే వాళ్ళు !

ఐగుప్తీయుల సాంప్రదాయం ప్రకారం యీ రసవాద తంత్ర గ్రంథా లన్నీకూడా నశ్వర మానవులచే వ్రాయబడినవి గాక, వారి దేవుడైన తోత్ రచించినవే. ఐగుప్తీయుల 'తోత్' దేవుణ్ణే గ్రీకులు 'హెర్మిస్' అని పిలుస్తారు. అందుచే నీ రసవాద శాస్త్రమును తత్ప్రవర్తకుడైన హెర్మిస్ దేవుని పేర 'హెర్మిటోలజీ' అని పిలిచేవారు. ఈ శాస్త్రాన్ని గురుముఖతః ఉపదేశం పొందినవారే గాని యితరు లెవ్వరూ చూడగూడదు, చదువగూడదని ఖచితంగా ఆదేశించబడింది ! *

---

* హిందూదేశంలో కూడ కనీసం 3000 సంవత్సరాలుగా రసవాద శాస్త్రం వుందని పరిశోధకులు చెపుతున్నారు. రసవాద ప్రవర్తకుడు ఈశ్వరుడనీ, ఈశ్వరుగు తన భార్యయైన పార్వతికి మొదట యీ శాస్త్రాన్ని చెప్పేడనీ, తరువాత మహర్షులకు యిది ఉపదేశించబడిందనీ హైందవ సాంప్రదాయం. పాదరసముకే రసమని వాడుక. రసము ప్రధాన ద్రవ్యంగా, దానిచుట్టూ నిర్మించబడిన శాస్త్రము గాన దీనికి రసవాద మని

అట్టి రసవాద గ్రంథం ఒకదానిలో వ్రాసిన యీ క్రింది విషయం చూడండి. "ఒకే మూలకారణాన్నుంచి సృష్టి సమస్తమూ వచ్చినట్లే, ఒకే మూలపదార్థాన్నుంచే యితర పదార్థా లన్నీ సృష్టించబడినాయి. దాని తండ్రి సూర్యుడు, తల్లి చంద్రుడు, వాయువు దానిని తన గర్భంలో మోసింది. భూదేవి దానిని పాలిచ్చి పెంచిన దాది. ఘన పదార్థంనుంచి పొగ వచ్చినట్లు పృథ్వీ భూతాన్నుంచి తేజోభూతం వేరుచేయు

---

పేరు. రసం ఈశ్వరబీజ మనీ, దానిలో మహాశక్తి యిమిడివున్న దనీ, దాని చంచలత్వ తారళ్యములను పోగొట్టి, స్థాపనచేసి, దాని నింకా అనేక రసాయనిక ప్రక్రియలకు లోనుగావించినట్లైతే అది మానవులకు సేవన యోగ్యమై వ్యాధిజరామృత్యువులను తొలగించే దివ్యౌషధ మవుతుందనీ, స్వర్ణయోగంకూడ దీనివల్ల సాధ్యమనిన్నీ విశ్వసించేవారు. అనేకమంది ఋషులపేర యెన్నో రసవాద గ్రంథాలు సంస్కృతంలో వున్నాయి. రసరత్న దీపిక, రసరత్న సముచ్చయము, రస ప్రదీపిక, రసేంద్ర సంగ్రహము, రస రత్నాకరము, రస తంత్రము, రస సింధు;- ఇత్యాదులు ఈ శాస్త్రాన్ని గురూపదేశం పొందిన వారే అభ్యసించాలని నియమం వుంది. బౌద్ధులకాలంలో రసవాదం మరింత వ్యాప్తినొందింది. నాగార్జునుడు గొప్ప రసవాది. రసవాద శాస్త్రంలో అనేక క్రొత్తవిషయాల్ని కనిపెట్టిన వాడు. ఆయుర్వేదానికి రసవాదాన్ని జతపరచి అనేక నూతన ఔషధ యోగములు కనిపెట్టేరు. ఎన్నో రసవాద గ్రంథాలు అరబ్బీ, హెబ్రూ, గ్రీకు భాషల లోనికి పరివర్తన గావించబడినాయి. హిందూ రసవాద, ఆయుర్వేద, గణిత శాస్త్రవేత్తలను ఖలీఫాలు తమ ఆస్థానానికి ఆహ్వానించి, గౌరవించి, అనేకగ్రంథాల్ని పరివర్తన చేయించడమే గాక నూతన పరిశోధనలు కూడా చేయించేవారు. చైనీయులు కూడ హిందూరసవాద గ్రంథాలను గొనిపోయి, తమ భాషలోనికి పరివర్తించుకొన్నారు. చూడుడు. పి. సి. రే రచించిన 'హిస్టరీ ఆఫ్ ది హిందూ కెమిస్ట్రీ' మొదలైన గ్రంథాలు.

బడుతూంది. అప్పుడే నీకు యీ ప్రపంచ మంతట్లోకీ అమూల్య మైన పదార్థం లభిస్తుంది..."

దీనిభావ మేమి, తిరుమలేశ ? అమాయకులూ, చదువుకోని వాళ్ళూ యీ సమస్యను విడగొట్టేందుకు బుర్రలు బ్రద్దలు కొట్టుకొనే వాళ్ళు. కాని, గురూపదేశం పొందిన వాళ్ళకి మాత్రమే దీని అర్థం తెలుసు! సూర్యు డంటే బంగారం, చంద్రు డంటే రజితం, శని అంటే సీసం, బుధుడు అంటే పాదరసం;- యిదీ వరస. అంతా సంకేతమయం!

అలగ్జాండ్రియను రసవాదుల పరిశోధనలను, ప్రయోగాలను పునః పునః అరేబియను శాస్త్రజ్ఞులు కొనసాగించేరు. వివిధ లోహాల్ని కరిగించేవాళ్ళు. పుటాలు పెట్టి భస్మాలు చేసేవాళ్లు, మర్దనం, స్వేదనం, స్థంభనం, దహనం, జారణం, మారణం అంటూ యెన్నో క్రియలు చేసేవాళ్ళు. ఇవన్నీ వారు యెందుకు చేసేవారో తెలుసా ? సూర్యుణ్ణి దొరికించుకునేందుకే! అంటే బంగారం చేసేందుకన్నమాట! వారు రాగిని యెన్నెన్నో యితర పదార్థాలతో యెత్తిచ్చి కరిగించేవాళ్లు. కొందరకు యేదో తెల్లని పదార్థం, మరికొందరకు పసిమిరంగుపదార్థం లభించేదనుకోండి. అందుచేత కొందరు 'ఆహా! ఇక నేం! రాగి రజితంగా తయారు గాబోయే టట్లుందే!' అనుకుంటే మరికొందరు 'అబ్బో! లోహాలకు రాజు, బంగారం తయా రయేందు కింకెంతో లేదు!' అనుకునేవాళ్ళు.

ఇక సూక్ష్మవస్తు ప్రదర్శనంలో శాస్త్రజ్ఞ లోక నీడకోసం, అదృశ్యభూతం కోసం అన్వేషిస్తూన్నట్లుండేది. అది చేతికి దొరుకకపోయినా వారికి యీ అన్వేషణలో నిజమైన పెన్నిధు లెన్నెన్నో దొరికేయి. నైట్రస్ ఆక్సైడ్‌ను, సల్ఫ్యూరిక్ ఆసిడును కనుగొన్నారు; లోహాలను ద్రావణీయములుగా జేసి, లోహలవణములను పొందు విధానములనూ తెలుసు



కున్నారు. రసవాదులు, గంధకం, పాదరం, పాషాణం మొదలైన వాటి గుణగణాలను నిర్ధారణగా తెలుసుకుంటూ వచ్చేరు.

మసక మసకగా వుండే పరిశోధనాగారాల్లో, విచిత్రమైన పాత్రాదికముల మధ్య – రెండు మూతుల సీసాలు, పొడవైన మెడగల బకయంత్రాలు, మూకుళ్లు, బానలు, మృత్పాత్రలు, లోహపు కడ్డీలు, సిబ్బెలు మొదలైన వాటి మధ్య రసవాద

ప్రయోగాలనుంచి ఒక నిజమైన విజ్ఞాన శాస్త్రం, రసాయన శాస్త్రం జన్మించింది.

మానవులు తమ నేత్రాలకు కానరాని అతి సూక్ష్మకణము లనుకూడ పట్టుకుని, వాటి విషయంకూడా తెలుసుకో ప్రయత్నిస్తూన్నారు. సూక్ష్మకణములను పట్టుకునేందుకు అతి నేర్పుగా బోనులు ఒగ్గేరు! ఈ కణముల మార్గములో వడబోత సాధనాలను పన్నేరు. వేటగాడు జంతువుల్ని తానొగ్గిన మాటులోనికి తరిమినట్లు, శాస్త్రజ్ఞులు యీ సూక్ష్మకణాల్ని ఒక సన్నని గొట్టంలోని చిక్కు దారిగుండా తరిమేవారు. ఒక పదార్థాన్ని చూర్ణంచేసి, మరొకదానితో కరిగించి, వాటినొక ద్రావకములోంచి పంపించి, మరో పాత్ర అడుగున సున్నితమైన స్ఫటికములుగా యేర్పడేటట్లు చేసేవారు, శాస్త్ర పరిశోధకులు.

ఇదిగో! ఇంకొంచెం...అంతే...బస్...దొరుకుతుంది! కావలసింది యింకొంచెం వ్యవధి...అనిపించేది.

కాని, కాలం యెదురు తిరిగింది. తూర్పుకూడా విజ్ఞాన జ్యోతిని ఝంఝూమారుతములు వీచి, దడదడ లాడించ జొచ్చాయి. అన్ని దిక్కులనుంచీ చీకట్లు అలముకుంటూ వస్తూన్నాయి. బర్బరులైన శత్రుమూకలు క్రమ్మివేస్తూన్నారు. తుర్కిష్ శల్యూకులు, క్రైస్తవ ధర్మయోధులు సర్వనాశనం గావిస్తూన్నారు. ప్రతి పట్టణంలోనూ చతుష్పథాలు ప్రాచీన గ్రంథాల భోగిమంటలతో వెలుగుతున్నాయి.

కాని, పుస్తకాల్ని మంటబెట్టగలరు గాని విజ్ఞానాన్ని మంటబెట్టడం ఎవరికి సాధ్యం? బాగ్దాద్ నుంచి తరిమివేస్తే స్పెయిన్‌లోని కార్డోవా నగరంలో తలదాచుకుంది, విజ్ఞాన దేవత. తనను గౌరవించి, ఆరాధించే వాళ్లెక్కడ వుంటే అదే తనకు కాణాచిగా చేసుకుంటుంది, విద్యాదేవి! ఖలీఫాలు ఒక్కొక్క వ్రాతప్రతికి వేయి బంగారు దీనారముల నిచ్చిన దినాలను కార్డోవా వర్తకులు మరువలేదు.

బాగ్దాదులో అల్ ఘుజ్జలీ యనే పేరుగల ఫకీరొకడుండే వాడు. జ్ఞానం వ్యర్థమైన ఆడంబర మనిన్నీ, కార్య కారణ వివేకం నిరుపయోగ మనిన్నీ సిద్ధాంతీకరిస్తూ ఆయన ఒక గ్రంథం వ్రాస్తూన్నాడు. అదే సమయంలో సుదూర మందున్న కార్డోవాలో అవెర్రోస్ అనే తత్వవేత్త వుండేవాడు. ఆయన అరిస్టాటిల్ అనుయాయి. విజ్ఞానముయొక్క అవసరాన్ని, గొప్పతనాన్నీ యీతడు ధైర్యంగా సమర్థించేవాడు. 'తెలియరాని ఆ పరమశక్తిస్వరూపునికి' మ్రొక్కుటలో గాక ప్రతి విషయాన్నీ తెలుసుకొనే ప్రయత్నం గావించడంలోనే మానవునికి ఆత్యంతిక సుఖానందము లున్నా యని అవెర్రోస్ నిరూపించేడు. అది పన్నెండో శతాబ్దం.

అవెర్రోస్ పండితుడు, మానవ వివేచనాశక్తియొక్క యేకత్వమునుగూర్చి ప్రసంగించేవాడు. మానవ వ్యక్తులు మరణించ వచ్చునే గాని మానవజాతి మరణించదు. ఒక వ్యక్తి కొద్దికాలం మాత్రమే జీవించగలడు. ఆ యల్ప జీవితంలో

అత్యధికంగా విజ్ఞానోపార్జన గావించేందుకు కాతని కెట్లు సాధ్య మవుతుంది ? కాని, మానవజాతి యన్నదో అమరమైనది. మానవ వివేచనాశక్తి చిరస్థాయిగా వుండునది. వివేచనాశక్తి ద్వారా పొందరాని దేదీ వుండదు. దానికి హద్దులు లేవు. పరిమితులు లేవు.

మానవుడు తన్నుదాను సముద్రంలోని నీటిబొట్టుగా, బ్రహ్మాండంలోని అణువుగా భావించుతూ, అదే సమయంలో తనొక మహాకాయునిగా, అమేయశక్తివంతునిగా కూడ భావించనారంభించేడు.

'నేను' అను అక్షరముల సంకుచిత సరిహద్దులలోనే మానవుని ఆత్మ బందీగా వుండిన రోజు లొకప్పు డుండేవి. ఐగుప్తీయులు 'జనులు' అని చెప్పేవారు. కాని, కేవలం తాము మాత్రమే మానవుల మని వారి అభిప్రాయం. ఐగుప్తీయుడవు గానిచో మానవుడవే గా వన్నమాట !

ఇప్పుడు మానవుడు యీ 'నేను' యొక్క గోడలను తొలగించి, దాని హద్దులను విశాలమొనర్ప నారంభించేడు. జనులంతా యెక్కడున్నా యే జాతికి చెందినా జనులే యనీ, అంతా కలసినదే మానవజాతి యనీ అందరూ గుర్తించ నారంభించేరు. తత్త్వవేత్త అవెరోస్ తాను కార్డోవా నగర వాసియైన స్పానిష్ ఆరబ్ మాత్రమే గాదనీ, తాను మానవు లలో నొకడ ననీగూడ గ్రహించేడు...

శతాబ్దాలు గడుస్తున్నాయి. స్పెయిన్‌లో అరబ్బుల పరిపాలన అంతమైపోయింది. స్పానిష్ అరబ్బులనే మూరులని అంటాము. మూరులను స్పెయిన్ దేశాన్నుంచి క్రైస్తవ యోధులు తరిమివేసేరు. ప్రాచీన విజ్ఞానం మళ్ళా గండ కత్తెరలో పడింది. విజ్ఞానం నశించి పోనున్నదా ? యనిపించింది.



యూక్లిడ్

గ్రీకు తత్త్వవేత్తల గ్రంధాలు మాయమవుతూన్నాయి, స్పెయిన్‌లోకూడా. కాని, యీ సమయంలో కూడా మళ్ళా గ్రంథసంరక్షకులు, విజ్ఞాన ఉపాసకులు అవతరించేరు! స్పెయిన్, దక్షిణ ఫ్రాన్సు, ఇటలీలలో యూదువైద్యులు, జ్యోతిష్కులు, తత్త్వవేత్తలు బైలుదేరి, అరిస్టాటిల్, అవెర్రోస్, యూక్లిడ్,

టాలమీ ప్రభృతులైన మహాజనుల రచనలను హెబ్రూ, లాటిన్ భాషలలోనికి అనువదించుతూ వుండేవారు.

యూదు పండితుడు జూడా ఇబన్ టిబ్బాన్ అను నాయనను 'అనువాదక చక్రవర్తి' అని పిలిచేవాళ్లు. ఆయన కుమారుడైన శామ్యూల్, వైద్యుడు, తత్త్వవేత్త; ఈతడు అరిస్టాటిల్ వ్రాసిన వాతావరణ శాస్త్రమును (మిటియారోలజీ) అనువదించేడు. 'శామ్యూల్ కుమారుడు మోజెస్ వైద్యుడు, రచయిత; యూక్లిడ్ వ్రాసిన 'మూల పదార్థములు' (ఎలిమెంట్సు) అనే గ్రంథాన్ని, అవెరోస్ గ్రంథాలను, తార్కిక్ పండితుడైన అవీ సెన్నా (ఇబన్ సీనా) రచనలను అనువదించేడు. జూడా మునిమనుమడు, జాకోబ్. ఇతనినే క్రైస్తవులు డాన్ ప్రొఫియట్ టిబ్బన్ అని పిలుస్తారు. ఈయన ఫ్రాన్సులోని మాంట్ పిలీయర్ వైద్యకళాశాలలో ఆచార్యుడుగా పనిచేస్తూ, యూక్లిడ్ రచన లన్నిటినీ అనువదించేడు.

ఈ కుటుంబంలో అంతా అనువాదకులే, పండితులే. వీరికి యీ లోకంలో గ్రంథముల కన్న ప్రియతమ మైన దింకొకటి లేనే లేదు. ఏదైనా ప్రాచీన గ్రంథ మొకటి యెక్కడేనా వుందని వీరు వింటే, యెంత కష్టానికైనా ఓర్చి దాన్ని అన్వేషిస్తూ బైలుదేరేవారు. దాన్ని పట్టుకునేందుకు భూప్రదక్షిణం చేయాల్సి వచ్చినా వెనుదీసేవారు గారు! కొన్ని పాత

పుస్తకాలకై మోజెస్ ఇబన్ టిబ్బాన్, మార్సెలీజ్ నుంచి అలగ్జాండ్రియాకు యెంతో కష్టపడి వెళ్ళేడు! అప్పటి కింకా అలగ్జాండ్రియాలో ప్రాచీన వ్రాత ప్రతులు లభిస్తూండేవి. పాపిరస్ అనబడే ఒక విధమైన రెల్లు కాగితపు చుట్టలమీద వ్రాసిన గ్రంధాలవి. సుదీర్ఘమైన యాత్రాకాలమునుకూడ మోజెస్ వృధాపుచ్చ లేదు. ప్రయాణకాలంలో యీ మహా పండితుడు తాత్త్విక పరిభాషాపద నిఘంటువును తయారు చేసేడు!

ఈ కుటుంబానికి మూల పురుషుడైన జూడా ఇబన్ టిబ్బాన్ తను మరణిస్తూ, పుత్రునికి యిచ్చిన ఆస్తి ఏమిటో తెలుసా? బంగరు బుంగలు కావు. కాని, పాత పుస్తకాల కవిలె కట్టలు మాత్రమే! ఆయన మరణ శాసనంలో యిల్లా వ్రాసేడు:

"నేనొక పెద్ద గ్రంథ సముదాయం సంపాదించేను. దాన్ని అతి భద్రంగా జాగ్రత్త పెట్టు, నాయనా! ప్రతి బీరువాలోని పుస్తకాలకు జాబితా వుంచి, ప్రతి గ్రంథమూ యధోచిత స్థానంలో వుండేటట్లు చూస్తూండాలి. పుస్తక పీఠములను అందమైన తెరలతో కప్పి వుంచుము. ఇంటి కప్పుమీంచి పడు నీటినుంచి, కీటకాలనుంచీ, ఎలుకలనుంచీ, ఇతర ఆపత్తులనుంచీ, పుస్తకముల నెపురక కాపాడుతూండు. ఎందుకంటే యీ గ్రంథములే నీకు పెన్నిధులు; నీ బంధు మిత్రులుకూడ యివే. సువిశాలమైన తోటలోని ఫలవృక్ష పాళికంటె చక్కని బీరువా

అరలలో అమర్చిన సద్గ్రంథ సముదాయమే పండితుడైన వానికి ప్రాణప్రియమైనట్టిది.” *

జూడా ఇబన్ టిబ్బాన్ గ్రంథ భాండారం ఏమైనదో మనకు తెలియదు. యజమాని అంత ప్రీతి పూర్వకంగా కాపాడినట్టివి, తన వారసులనుకూడ భద్రపరచ మని శాసించినట్టివి యైన యీ గ్రంథాలు బహుశః అస్తిత్వంలోంచి లుప్తమై పోయి వుండవచ్చు. కాని, టిబ్బాన్ పండితుని వంటి మహాజనులు తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకున్నారు, పరంపరగా వస్తూన్న సనాతన విజ్ఞానాన్ని భద్రపరచి, తరువాత తరాలవారికి భద్రంగా అందించేరు, వారు.

పాపిరస్ కాగితాలమీాదనుంచి చర్మముల మీాదకు, గ్రీకు భాషనుంచి అరబిక్ భాషకు, అరబిక్ నుంచి హెబ్రూలోకీ, హెబ్రూ భాషనుంచి లాటిన్ భాషకూ-యీ రీతిగా విజ్ఞానం చుట్టు తిరిగి తిరిగి పడమటికి వెళ్ళింది. ఈ పరివర్తనాక్రమంలో ఒక్కొక్కప్పుడు గ్రీకు గ్రంథకర్తను అరబ్బుగా భావించేవారు, పాశ్చాత్యులు. ఉదాహరణకు ఆస్ట్రియాలో గావించబడిన అనువాదాల్లో ‘ఆర్కిమెడీస్’ ను ‘ఆర్షిమెహీంద్’గా చేసేసేరు. ఎందుచేతంటే ఆర్కిమెడీస్ గ్రంధాలు సరాసరిగా యూరోపు చేరక, గ్రీసు నుంచి అరబ్బు దేశాలగుండా చుట్టుతిరిగి వెళ్ళినాయి.

---

* శ్లో. జ్ఞాతిభిః వంచ్యతే నైవ చోరేణాపి న నీయతే ।
దానేన నక్షయం యాన్తి విద్యారత్నం మహాధనం॥

ఏమైతే నేమి, జనులు విజ్ఞానజ్యోతిని ఆరిపోకుండా రక్షించు కుంటూ వచ్చేరు. ఆ జ్యోతిని ఒక చేతినుంచి మరొక చేతికి బహుపదిలంగా ప్రాణప్రదంగా అందించుకుంటూ వచ్చేరు, విజ్ఞానప్రియులైన మహాజనులు.

## 3. ప్రాగ్దేశాల్లో పరిస్థితు లిట్లుండగా పశ్చిమాన ఏమి జరుగుతూంది ?

ఈ కాలంలో పశ్చిమానకూడా మానవుడు ఊరికే కూర్చో లేదు. ఒక్కొక్క శతాబ్దంతో బాటు అతడూ ముందున కడుగిడు తూనే వున్నాడు.

ఒక్కొక్క రాజ్యమూ, మహాసముద్రంలోని ఒక చిన్న ద్వీపం మాదిరిగా వుండిన కాలం వుండేది. ఈ చిన్న ద్వీపాల్లో జనులు రాబిన్సన్ క్రూసోల మాదిరిగా జీవయాత్ర గడుపు తూండేవాళ్లు. దాసులే చాకిరీ చేస్తూ, తమకూ, రాజుకూ, పరివారానికీ కావాల్సిన సమస్తమూ ఉత్పత్తి గావించేవాళ్లు.

దాసు డంటే బానిసవంటి వాడు గాదుసుమా. బానిస యెప్పుడూ పని యెగగొట్టేందుకు యత్నించేవాడు. కాని, దాసుడు తన వొళ్ళు దాచుకోకండా, నిరంతరం కష్టపడి పని చేసేవాడు. దాసుడు అడవులు నరికీ, బాడవ నేలల మురుగు పారించీ, బండరాళ్ళను గట్లకు దొర్లించీ నేలను సాగుకు దెచ్చేవాడు. ఈ నిరంతపరిశ్రమ ఆతనికి మేలునే కలిగించేది. ధాన్యాదులు అంతకంతకి పుష్కలంగా పండేవి. తాను పండించే

ధాన్యములో కొంతభాగం మాత్రమే దాసునికి మిగిలే దన్నమాట నిజమే. అతని పంటలో చాలభాగము భూమీశుడైన రాజుకే ముట్టేది. దాసుడు చిన్న కుటీరంలో, పూరింట, నల్లగా పొగచూరిన దానిలో అతిబీదరికంలో కాలం గడుపుతూండేవాడు.



రాజభవనంలో పరిస్థితులిందుకు పూర్తిగా భిన్నమైనవి. సువారంలో పదార్థాలన్నీ సమృద్ధిగా ఉండేవి. రాజకుటుంబీకుల భోజనాల బల్లలు ఆహారపదార్థాదులతో వంగిపోయి పిటపిటలాడుతూండేవి. రాజు లెందరో అతిధుల నెప్పుడూ పంక్తిని పెట్టుకునే భోజనం చేసేవాళ్ళు. అతిధుల పొట్టలు పగులునట్లు మేపి, బుర్రలు తిరిగి పోయేటట్లు త్రాగించడం

రాజులకు సరదా, యిష్టం. కోటలోని సేవకులు కూడా బాగానే బ్రతికేవాళ్లు. కోటలో యెందరెందరు నౌకర్లుండేవాళ్ళని! సైనికులు, ఆయుధధారులు, యోధులు చాలమంది ఉండేవాళ్లు. వారు గాక వందిమాగధులు, చారణులు, పరిచారకులు, అశ్వపాలకులు, మద్యాగార పర్యవేక్షకులు, వేటగాళ్లు, శునక పాలకులు, భారవాహకులు, గోపాలురు, తోటకూలీలు, ఫలానా పని యని నిసుబులేని సాధారణ గృహసేవకులు, దాసీలు;- యిల్లా యెందరో ఉండేవాళ్లు.

కొందరు మాత్రమే రాజు సంక్తిలోనూ, మిగిలిన వారందరూ కందాలోనూ సాపడేవారు. వారికి వడ్డించేవారు, యితరులు.

ఇక వంటకము లన్నారా? కొల్లలు! ఉప్పులో ఊరబెట్టిన సూకర మాంసం, తొడమాంసం, ఇతర జంతువుల ప్రక్కమాంసం, క్రొవ్విన హంసలు, బాతులు, మాంసం బజ్జీలు, రకరకాల మత్స్యములు; యిల్లాటి వెన్నో చెప్పపాటులో మటుమాయమై పోయావి, భోక్తల వదనగహ్వారాల్లోంచి! అన్నీ రుచిగా కూడా వుండేవి. మిరియం, లవంగం, శుంఠి మొదలైన సుగంధ ద్రవ్యాలతో మసాలా పెట్టి వండిన మాంసపు వంటకాలు నోరూరించే వనుకోండి! చివరకు మద్యపాత్రలలోకూడా వారు యీ సుగంధద్రవ్యాలను కలుపుకొనేవారు. రాజనగరుల్లో తేరగా గొంతువరకూ మెక్కి జనులు యింకా తినాలి, త్రాగాలి అని పేరాశ చెందుతూనే వుంటారు, మరి.

వీళ్ళందరినీ మేపున దెవరు? దాసులే.

ఐతే వీళ్ళందరికీ దుస్తులు యెవ రిస్తారు? రాజపరివారానికి దుస్తులుకూడా దాసులే తయారుచేసి యిస్తారు.

ఒకానొకప్పుడు, పూర్వకాలంలో రాజు, రాణి, రాజకుటుంబీకులు యింట నేయించిన వస్త్రాల్నే ధరించేవారు. కాని, యిప్పుడో? రాజుగారు ముఖమల్ అంగీలను, రాణీగారు పట్టుపుట్టములనూ, శాబుల్ చర్మముతో కుట్టిన మెడపట్టీలనూ ధరిస్తూన్నారు.

ఈ అమూల్యవసనము లెక్కడివి?

రాజధానిలో జరిగే సంతల్లో కొన్నవే, యివన్నీ; పట్టు బట్టలు, ముత్యాలు, రత్నాలు, సుగంధద్రవ్యాలు మొదలైనవన్నీ దూరదేశాలనుంచి తీసికొని రావలసినవే. వాటి కన్నిటికీ ఖంగ్‌మనే బంగారునాణెములను మూల్యంగా చెల్లించాల్సిందే.

రాజబొక్కసానికి యింత సొమ్ము యెక్కడినుంచి వస్తుంది?

అన్ని యితర వస్తువులనూ రాజు యెక్కడినుంచి తెస్తాడో, యెల్లా తెస్తాడో, యివీ అక్కడినుంచే, అల్లాగే తెస్తాడు. ఏది వచ్చినా దాసుల పూరిగుడిసెల నుంచే, పొగచూరి నల్లబడిపోయిన కుటీరాలనుంచే రావాలి. ఇదివరలో దాసులు ధాన్యాదులు పండించి తెచ్చి రాజభవనంలో పోసి వెళ్ళేవాళ్ళు. ఇప్పుడు దినుసుకు మారుగా రొఖము డబ్బునే తెచ్చి యిస్తున్నారు. వారు చెల్లించాల్సిన దంతా సకాలంలో తెచ్చి

వప్పగించాల్సిందే. రాత్రింబగళ్లు కష్టపడైనా, పిల్లా జెల్లా కూడా నడుం వంచైనా, దూడామడికినీ అమ్మైనా మక్తా సొమ్ము సంపాదించి తెచ్చి, రాజుగారి కోటకు ముడుపు చెల్లించాల్సిందే.

దాసులదగ్గర యింతా పీడించి పుచ్చుకున్నా ప్రభువుల దగ్గర కావలసినంత ధనం ఉండేదే కాదు. ఒక దండయాత్రకు బైలుదేరా లంటే బోలెడంత డబ్బు కావాలి. కత్తులు, కఠార్లు, శిరస్త్రాణాలు, డాళ్లు, బల్లెములు, విల్లంబులు, గుర్రాలు, ఒకటేమిటి–దండయాత్రకు అవసరమైన సమస్త సామగ్రికి, సైనికుల పోషణకూ యెంతో ధనం అవసర మవుతుంది. రాజుగారు చేసే విందులకు, వినోదాలకూ, విదేశాలనుంచి దించిన భోగవస్తువులకూ బోలెడు డబ్బు కావాలి సంతలు జరిగే పట్టణాలకి రాజుల బొక్కసాలనుంచి అంతకంత కధికధనం ప్రవాహంగా పోతూంది. మద్యములు, దివ్వెలకు మైనం, పట్టుబట్టలు, ముఖమల్, మజ్లినులు, ముత్యాలు, రత్నాభరణములు, సుగంధద్రవ్యాలు మొదలైనవి దివాణంలోకి వస్తూండేవి...

పట్టణాల్లో వ్యాపారం పెరిగిందంటే మరి పెరగదూ? గత కొద్ది దశాబ్దాల్లోనూ సంతలూ, తీర్థాలూ యెంత పెరిగేయి! వెనుకటి దినాల్లో పట్టణమంటే యేదో కాస్తంత పొలంచుట్టూ రాటలు పాతి కంచెకట్టి, అక్కడక్కడ కొన్ని శిధిలకుటీరాలు, మధ్యలో చెర్చి, అంగళ్లు పెట్టుకునే చావళ్లు,

చెత్తా చెదారంతో వుండే చిన్న చౌకు;-యిదీ దాని స్వరూపం. కాని, యిప్పుడో! వర్తకులు, నేత గాండ్రు, ఆయుధనిర్మాతలు, వడ్రంగులు;- వీళ్ళంతా యెలాంటి యిళ్లు కట్టుకుంటున్నారని! ప్రతి వృత్తికీ చెందిన వారంతా ఆ యా శ్రేణీసంఘాలుగా యేర్పడి, పెద్దలను యెన్నుకొనేవాళ్లు. పట్టణ శ్రేణీసంఘాల ప్రధానసభ్యులు చాల పలుకుబడి గలవాళ్లైనారు. వాళ్ళ గృహాలు ఒక దానితో ఒకటి పోటీ చేస్తూ, దివ్యంగా వున్నాయి. ఇనపపెట్టెల్లాగ గట్టిగా, బంగారు నీరు అని అలంకరించిన స్తంభాదులతో, నగిషీ పని చేసిన తనాబీలతో వాళ్లు దివ్య భవనాలు నిర్మించుకున్నారు.

ఒకానొకప్పుడు వర్తకులు ఒక గ్రామాన్నుంచి యింకో గ్రామానికి పెద్దపెట్టెను మూపున మోస్తూ, యింటింటికీ బోయి సరుకు లమ్ముతూ తిరిగేవారు. దర్జీవాడు తన పనివాళ్ళతో ఒక దుర్గాన్నుంచి మరో దుర్గానికి వెడుతూండేవాడు. ఏటా ఈస్టర్ పండుగముందు గాని, లేదా యేదేనా శుభకార్యం వుంటే గాని రెండు మూడు నెలలు మకాం వేసి, ఏకటాకీని రాజకుటుంబానికీ, పరివారానికీ, ఆడామగా అందరికీ యేడాదికి కావలసినవన్నీ కుట్టి యిచ్చేవాడు.

కాని, యిప్పుడో? వర్తకులు, నేతగాండ్రు, దర్జీలు మొదలైన వాళ్ళంతా కుటుంబాలతో, బంధువులతో సహా పట్టణాల్లో స్థిరపడ్డారు. వాళ్లు దుకాణాలు, కార్ఖానాలు తెరచేరు అక్కడే. అంతేగాకుండా కుంభకారులు, కలంకారీలు,

వడ్రంగులు, గృహశిల్పులు, అనేక యితర కర్మకారులు ముఠాలుగా కాపురముండే ప్రత్యేక పేటలుకూడా పట్టణాల్లో బైలుదేరేయి. ఒక పనివాని తండ్రి యేదో దుర్గంలో ప్రభువు క్రింద వడ్రంగిగానో, కమ్మరిగానో వుండి వుండవచ్చు. గాని ఆ పనివాడు మాత్రం యెవరికీ దాసుడు గాడు. ఈ పనివాడిప్పుడు తండ్రివృత్తినే అవలంబించ నక్కర లేదు. అవలంబించినా సాధారణ వడ్రంగికాడు. పనిలో ఆరితేరి, నగిషీపని నేర్చుకొని, మేస్త్రీయై, కార్ఖానా స్థాపించి, తనక్రింద మరికొందరు పనివాళ్ళను పెట్టుకొనివున్నాడు. అతడు పలుకుబడి సంపాదించి, శ్రేణీసంఘానికి పెద్దగా వున్నాడు. నీటైన కొత్త దుస్తులు ధరించి, అందమైన చిన్న బకుల్సుతో వున్న చక్కని బూట్లు తొడుక్కొని వున్నాడు! ఠీవిగా మొలదట్టీలో వుంచిన చిన్న బాకూ, దాని ఒరమీద వెండితొడుగూ ఉన్నాయి!

అంతేగాదు. ఇప్పుడు వర్తకులు గుర్రంమీద స్వారీచేస్తూ వెడుతూన్నప్పుడు చూసితీరాలి. ఎత్తైన బొచ్చు టోపీ, పెద్ద పైకోటూ ధరించి, మాంచి డాబుగా ఉంటున్నారు. వీళ్ళు యెవరికీ ఒక్క దమ్మిడీ బాకీ వుండరు. అన్ని వస్తువులకూ, సేవకులకూ రొఖం యిచ్చేస్తారు, వీళ్ళు.

రైతులు, వ్యవసాయం చేసేవాళ్ళు తప్ప మిగిలిన అందరు జనులూ సుఖంగానే కాలక్షేపం చేస్తున్నట్లు తోస్తుంది. కాని, జనాభాలో అత్యధిక సంఖ్యాకులు రైతులే.

యుద్ధాలు తరచుగా వస్తూండేవి. యుద్ధం కార్చిచ్చులా అలుముకుని దేశాన్ని సర్వనాశనం చేస్తూంటే పట్టణవాసులు నగర ప్రాకార ద్వారాల్ని మూసివైచి, దృఢమైన ప్రాకారం లోపల సురక్షితంగా వుండేవాళ్లు. ప్రభువులు తమ దుర్గద్వారాల్ని మూసి తాళాలు వేసుకుని, అగడ్తలుంటే వాటిమీది వంతెనలను యెత్తేసేవారు. గ్రామీణరైతులకు రక్షణ దుర్గాలూ లేవు, ప్రాకారాలూ లేవు, సంఘాలూ లేవు. పటాలాలు పంటపొలాల్ని త్రొక్కి పాడుచేసేవి. గుర్రాలు మేసేసేవి, సైనికులు కొంపలు తగులబెట్టేవాళ్లు, దోచుకునే వాళ్లు. పశువుల్ని తోలుకుపోయేవాళ్లు, స్త్రీలను చెరబట్టే వాళ్లు, అదేమంటే చంపేవాళ్ళు.

భూపతులు యుద్ధాలు తెచ్చేవాళ్లు, చేసేవాళ్లు. వాటివల్ల కష్టనష్టాలు పొందేవాళ్ళేమో రైతాంగం, జనులు. జనపదాలన్నీ నాశనమై, నిర్జనమైపోయేవి. యుద్ధాలవల్ల పొలాలన్నీ కలుపుతోను, పూతికతోనూ అరణ్యాల్లాగ ఐపోయేవి. శిశిర ఋతువులో నూర్పిడుల కాలం వచ్చినపుడు రైతులు, విత్తిన దానిలో ఆరోవంతుకూడా కోయనక్కర లేకపోయేది. తల్లిని బిడ్డడు చిన్న రొట్టిముక్కకై వేడినపుడామె 'నాయనా! దొరలు మన కడుపు కొట్టేసురా!' అనేది. తండ్రికి పనిలో సాయపడుతూన్న కొడుకు, దున్నేందుకుకూడా ఓపిక లేక తూలుతూంటే, తండ్రి అనేవాడు : 'నాయనా! దొర ఆజ్ఞరా. దుక్కి యెల్లాగో పూర్తిచేయాలి!' ప్రతి ఆదివారమూ చెర్చిలో

ప్రార్థనా సమావేశాలు జరిగేవి. పురోహితుడు వేదిక నెక్కి జనుల్ని ఓరిమి వహించమని బోధించేవాడు. ఏసు క్రీస్తు యెంత ఓరిమి వహించేడు, మరి!

ఓరిమి, ఇంకా ఓరిమి! ఔను, కాని, ఇన్ని బాధల ననుభవించేందుకు గావలసినంత ఓరిమిని సామాన్య మానవులు, రైతు జనులు యెక్కడనుండి తేగలరు? అదీగాక, ఒక్కమాట అడగనా? ఓరిమి దేనికి? ఎందుకోసం?

తాము గాకున్నా తమ బిడ్డలైనా యింతకంటె సుఖపడక పోతారా అని ప్రతివారూ! అనుకునేవారు, ఆశపడేవాళ్ళు. కాని, వాళ్ళ ఆశలు అడియాసలై పోతూన్నాయి. సమాధి స్థలాల్లోని తెల్లశిలువ లంతకంతకు అధిక సంఖ్యాకములై పోతున్నాయి. చాలమంది రైతులు తమ మనుమల ప్రక్క సమాధుల్లో పవ్వళించి, విశ్రాంతి తీసుకుంటూన్నారు! ఐనా పరిస్థితు లొక్క పిసరు కూడా బాగుపడతా యనే ఆశ కనిపించడం లేదు.

ఇప్పు డేమి చేయాలి? రైతులకు దారి యేది? ఎటు చూసినా అంధకారమే. పుట్టిన దేశాన్ని, మెట్టిన భూముల్ని వదలిపెట్టి, రాత్రిపూట అంధకారంలో తన జన్మభూమిని తిరిగైనా చూడకుండా యెక్కడికో వెళ్ళిపోవడం!

కాని, వెళ్ళడం యెక్కడికి?...

పోనీ, పట్టణానికి వెడితే?

ఆఁ! అదొక శే ఆశ! పట్టణంలో పాదం పెడితే, గాలే మనిషిని స్వతంత్రుణ్ణి చేస్తుందని పాత సామెత ఒకటుండేది, యూరోపులో. ఈ సామెత గాలిలో పుట్టలేదు మరి!

కాని, దాసులు భూమిని వదలిపెట్టి పారిపోకూడదు. శాసనాలనే సంకెళ్ళు కనబడనివైనా బలమైనవి. దాసుడు పట్టుబడినాడంటే ఖైదులో పడేస్తారు. చాలా బాధలు పెడతారు. దాసుడు స్వతంత్రుడుగాడు. భూపతి ఆస్తిపాస్తుల్లో చేరినవాడాయె!

పారిపోయిన రైతులమీాది స్వత్వం విషయమై యేర్పడిన పోరాటాలతో పట్టణాలకూ, ప్రభు వర్గానికీ మధ్య యెన్నో ఘర్షణలు జరిగేవి.

జీవించడం అంతకంతకు కష్టతరమై పోతూంది. పన్నులు వసూళ్ళు, మామూళ్ళు భరించడం, బాధల ననుభవించడం అంతకంతకు దుర్భరమవుతూ వచ్చింది. జనుల ఓరిమికూడా ఆఖరై పోవచ్చింది.

భూపతుల దుర్గాలు, రాజభవనాలు భగ్గుమని మండ నారంభించేయి. తిరగబడుతూన్న రైతులు చుట్టుప్రక్క లంతటా కారుచిచ్చులా వ్యాపించేరు. కొన్ని పట్టణాలుకూడా ధూమావృతములై నాశనం అయిపోయినాయి...

యుద్ధదేవత తోడులేనిదే రాదు! క్షామదేవత ప్రళయతాండవం చేస్తూ వచ్చిపడింది, యుద్ధదేవత వెంబడే. బీడు పెట్టబడి, దోచుకోబడి, తగులబెట్టబడిన దేశంలో క్షామం ఆకలి విజృం

భించ కేమి చేస్తాయి ? ఇటలీనుంచి దక్షిణ ఫ్రాన్సులోని ప్రొవెన్స రాష్ట్రం వరకూ, అక్కడినుంచి బర్గండీవరకూ కరువు నగ్ననృత్యం గావించింది. దోసెడు గింజలు దోసెడు బంగారు దీనారములతో సమానమైనాయి !

క్షామం వెనువెంటనే రోగాలు వచ్చి పడినాయి. మృత్యువు గ్రామాన్నుంచి గ్రామానికే గాక గడపనుంచి గడపకు తొంగి చూస్తూ, ప్రయాణం చేస్తూంది. సమాధిస్థలాలు అంతకంతకు క్రిక్కిరిసిపో జొచ్చినాయి. జనపదాలు పలుచబడ జొచ్చినాయి. చాలమంది భీతావహంతో లోకానికి అంతం, ప్రళయం దాపురించిం దని యెదురు చూస్తూన్నారు. కొందరు తమ దురదృష్టాల్ని నిందించుకుంటూ, యీ ప్రపంచమే యేదో రాక్షస సృష్టి యనీ, లేకపోతే యింత కష్టభూయిష్టంగా, దురన్యాయంగా, దుర్భరంగా, దురంతంగా యెందు కుంటుం దనీ వాదించేవారు.

దేశా లన్నిటా వైధర్మ్యం వ్యాపించ సాగింది. ఈ విమత భావా లన్నింటినీ, క్రైస్తవమతసాంప్రదాయాల రక్షణ పేరట చెర్చి అగ్నితోనూ, ఖడ్గంతోనూ నిర్మూలించ యత్నించింది. క్రైస్తవ మతారంభ దినాల్లో యితరుల చేతుల్లో క్రైస్తవులు పడిన బాధలు, అవమానాలు, యిప్పుడు క్రైస్తవపీఠాధి పతులు స్వీయమతస్థులను పెడుతూన్న బాధలు, నిర్బంధాలతో పోల్చి చూస్తే చాల తక్కువగా వుంటాయి. కాని చిత్రవధలు,

సజీవదహనాలు జనులలోని నిరాశా నిస్పృహాలకూ, తజ్జన్యము లైన భావాలకూ ఔషధములు కాజాలవు !

మరైతే యిక దారేమున్నది ?

నట్టింటనే వున్నా జనానికి దారి, విముక్తి మార్గం కనబడడం లేదు. ఇంట్లోనే ఆశ లేనప్పుడు యిళ్లువదలి వీధిని బడితే మునిగిపోయిం దేముంటుంది ? గనుక . . . రోడ్లన్నీ, యిళ్లు వదలిపెట్టి పారిపోతూన్న కాందిశీకులతో క్రిక్కిరిసి పోయి వున్నాయి. మార్గశ్రాంతులూ, మ్లానవదనులూ ఐన రైతుల చేతుల్లో స్వంతంగా చేసుకున్న కత్తులూ, బల్లెములూ వున్నాయి. మిలమిల మెరిసే కవచాలు ధరించిన యోధులు, తమ భుజస్కంధాలమీద శిలువలను మోసుకుంటూ, అశ్వారూఢులై జనాన్ని దాటి ముందుకు పోతూన్నారు. రెండు చక్రాల మోటబళ్ళలో రైతుల పిల్లలు యేడ్చే యేడ్పులు, పశువుల అరపులతోనూ, గుర్రాల సకిలింతలతోనూ కలిసి, విలక్షణమైన శ్రుతిలో సందడిగా వుంటూంది. ఇక మళ్లా యెన్నటికీ స్వగృహాలకు తిరిగి పోనొల్లని వారివలె జనులు తమ సామానులు మోసుకు రాగలిగిన వాటి నన్నింటినీ తెచ్చేసేరు.

ఆ వెనుకనే ప్రభువులు తమ అంగరక్షకులతో సహా దారిన పడ్డారు తమతో కూడా దాసులను, సేవకులను, విదూషకులను, పాటకులను, మేళతాళాలను, చివరికి వేటగాండ్రను,—చేతిమీద

డేగల నెక్కించుకొని నడుస్తూన్న వాళ్ళని, — కూడా తీసికొని వచ్చేరు.

ఈ సర్వజన ప్రస్థానానికి గమ్యం ఏది ? అర్థం ఏమిటి ? వీరంతా యెక్కడికి, యెందుకు పోతూన్నారు ? అందరి కష్టాలకూ యేదో విరుగుడు వుందని విని, దాన్ని అనుసరించే పోతూండి వుండాలి, వీరంతా. అదేమిటో చూద్దాం.

అంగడి స్థలాల్లో నిరంతరం సందడిగా వుంటూంది. రేవు పడవలమీదా, దుకాణాల్లోనూ యెప్పుడూ జనసమ్మర్దమే. ఇదివర కెన్నడూ లేని రీతిగా వర్తకం ముమ్మరంగా సాగుతూంది. తమ యిండ్లను వదలి బైలుదేరు నప్పుడు చాలామంది తాము మోసికొని పోజాలని వాటి నన్నిటినీ అమ్మేసేరు. వర్తకుల భోషాణములలోనికి రూకలు ధారావాహినిగా ప్రవహిస్తున్నాయి. వారు తమ గాదుల పెద్దతాళాలను తెరచి ధాన్యాదులను సంతిలకు తోల నారంభించేరు. ధాన్యాదుల కున్న గిరాకీని అవకాశంగా తీసుకుని మంచిలాభాలు తీద్దామని వాళ్ళకి ఆశకదా !

చివరికి రోడ్లమీద వరుసలుదీరి చిన్న పిల్లలుకూడా నడుస్తూండేవాళ్ళు.

వీళ్ళంతా యెక్కడికి పోతూన్నారు? వీళ్లు ఆశించుతూన్నది యేమిటి ?

వీరంతా ఏదో అనూహ్యమైన అద్భుత సంఘటన, అదృష్టం దైవదత్తంగా వచ్చి తమన్ని రక్షిస్తుందని అనుకుంటూన్నారు.

22

తూర్పుదిశగా, పవిత్రభూమికి, క్రీస్తుప్రభువు జన్మించిన పాలస్తీనాకు పయనమై పోతూన్నారు, వీరందరూ. పరమ పవిత్రమైన ఆ పుణ్యభూమిని విధర్ములైన సారసినుల చేతుల్లోంచి విముక్తి చేయాలి; క్రైస్తవజెండా పాలస్తీనాపై ఎగురవేయాలి! తూర్పుదేశాల సంపదలన్నీ, కేవలం కథలలోనే తాము విన్నటువంటి మహా నిక్షేపాలన్నిటినీ తామూ పొందవచ్చునని వీరందరి ఆశాను! ఐహికవిషయాలనే అయినా సాధించేందుకు మానవుణ్ణి ప్రోద్బలించాలంటే స్వధర్మరక్షణ యనే పవిత్రాశయంగా రూపొందించాలేమో! *

---

* స్వధర్మ రక్షణ యనే పేరుతో చేసిన దారుణ యుద్ధానికి తక్షణ ఫలితం విజయం, రాజ్యప్రాప్తీ, తత్సుఖమూ కావచ్చు. "యద్రాజ్య సుఖ లోభేన హంతుం స్వజన ముద్యతాః। అహోబత! మహాత్పాపం కర్తుం వ్యవసితా వయం" అన్న అర్జునుని సంశయానికి సమాధానంగా పరంపరగా ధర్మరక్షణ, వ్యవస్థారక్షణ జరిగి, మానవ సమాజం ఇహపరసాధనలో ముందుకుపోయి తీరుతుంది గాన యీ మారణకర్మ చేయవలసినదే నని శ్రీకృష్ణుని ఉపదేశం ఉన్నదిగదా.



## నాలుగో ప్రకరణం

### 1. ప్రపంచం మళ్లా విశాలమైంది

క్రైస్తవధర్మం కోసం, శిలువమీద ఆత్మబలిదానం గావించిన ఏసు క్రీస్తు బోధించిన ధర్మంకోసం గావించిన యుద్ధాన్నే 'శిలువ యుద్ధం' లేక 'క్రూసేడ్' అంటారు. ఈ శిలువయుద్ధంలో కడపటికి క్రైస్తవులు జయం పొందేరు. జయించిన క్రైస్తవులు జెరూసలేం పట్టణంలో రాజ్యస్థాపన చేసేరు. శిలువయుద్ధంలో పాల్గొన్న ఫ్రెంచి, ఆంగ్ల, ఇటాలియను, జర్మన్, గ్రీకు, సిరియను, ఆర్మీనియను క్రైస్తవజనులు యిరుగు పొరుగుననే నివసిస్తూన్నారిప్పుడు. ఆలివ్ తోపులూ, ద్రాక్షారామములూ మధ్య క్రైస్తవయోధుల దుర్గాలూ, బురుజులూ కనబడుతూన్నాయి. జెరూసలేమ్ రాజసభలో చిత్రవిచిత్రమైన బిరుదు నిశానీలుగల ప్రభువర్గాలను చూసేవారు, జనులు. గెలీలీ ప్రిన్సు, జప్ఫా కౌంట్, సిడోనియా లార్డ్,– యిత్యాదిగా. ఆ యా పట్టణముల లేక ప్రాంతముల రాజు లేక ప్రభువు అని యీ మాటలకు అర్థం. ఈ ప్రభువు లందరకూ పాలస్తీనా, సిరియాలలో విశాలమైన జమీలు వున్నాయి. సిరియను దాసులు యీ జమీల్లో చాకిరీ చేస్తూన్నారు.

ఫొయినీషియన్ నాగరజనులదైన టైర్ నగరంలో అద్దకం పనివాళ్లు ఊదారంగును అప్పటికీ నత్తగుల్లలనుంచే తీస్తూండే

వాళ్ళు. గాజుతో అత్యంత సుందరములూ, అమూల్యములూ నైన పాత్రాదికములనూ చేవాళ్ళు. అప్పటికి వేయేండ్ల క్రిందట యెట్లో అట్లే యీ కృషి నిరాఘాటంగా సాగిపోతూంది కాని, యిప్పుడా టైర్ నగరవీథుల్లో యెల్లాంటి విచిత్ర సమ్మేళనాన్ని చూస్తాము! ఓహోహో! రంగురంగుల, రకరకాల ముఖాలూ, పేర్లూ, భాషలూ కనిపిస్తూన్నాయి, వినిపిస్తునాయి, టైర్ నగర వీథుల్లో. ఈ నగరవాసులలో మూడోవంతు జనం వెనీషియనులు, వీళ్ళకి వేరే పేటలూ, అంగడివీధి, చెర్చి, గాదెల వరుసలు, గోదాములు, స్నానగృహాలు, రొట్టెల సాలలూ వుంటూండేవి.

వెనీషియనులు, పరాసులు, ఆంగ్లులు మొదలైన వాళ్ళు తూర్పు దేశాల్లో నివసించేవారు. కాని, యిక్కడకూడా తమ దేశీయుల మధ్యనే వుండాలని వాళ్ళకోరిక. అందుచేత యిరుగు పొరుగు జనులతో సంబంధం లేకండా, చుట్టూ యెత్తైన గోడలు పెట్టుకుని, తమకొక లోకాన్ని సృష్టించుకొనేవాళ్లు. వాళ్ళంతా విమతస్థులను ద్వేషించేవాళ్ళు. సారసినులు విమతస్థులేగదా! కాని, నిరంతరమూ ద్వేషిస్తూ కూర్చోడానికి జీవితంలో వీలా? క్రమంగా సారసినులతోబాటు ప్రశాంతంగా నివసిస్తూ, సిరియన్ ముస్లిమ్ స్త్రీలను వివాహం చేసుకుంటూ వచ్చేరు. స్థానిక భాషాశబ్దాలు వాళ్ళ సంభాషణలలో అంతకంతకి తరుచుగా దొర్లుతూ వచ్చేవి.

కఫ్తాన్ = తుర్కీ అంగీ (పెరిష్యన్)
బుర్నూస్ = మేలిముసుగుగా ధరించే గుడ్డ (అరబ్)
మజ్లిన్ = సన్నని నేతవస్త్రము (మెసపొటేమియన్)
పిస్తాఖియో = పిస్తాపప్పు (పెరిష్యన్)
లెమన్ = నిమ్మ (అరబ్)

ఇల్లాంటి వివిధభాషాశబ్దాలు వాళ్ళు వాడేవారు. క్రైస్తవ ప్రభువులు ముద్రిస్తూన్న బంగారు నాణెములమీద ఖొరాన్ సూక్తులు ముద్రించబడుతూండేవి. ముస్లిములతో వాణిజ్యం చేయడానికి వారికి సారసిన్ బెజాంట్లు (నాణెములు) అవసరమే, మరి.

ఇటాలియను ఓడలు బానిసలను, ఆయుధాలను తెచ్చి, ఈజిప్టు సుల్తానుకు విక్రయిస్తూండేవి. ముస్లిం సుల్తాను క్రైస్తవులకు పరమశత్రువే ఐనా వ్యాపారావసరములు వ్యాపారావసరములే! రోములోని పోప్, క్రైస్తవ పీఠాధిపతి, బుల్ అనే శ్రీముఖం ప్రకటించి, క్రైస్తవులు సారసినులతో వర్తకం చేయరాదని నిషేధించేడు. కాని, యీ విషయంలో పోప్ 'బుల్' యేమీ పనిచేయలేదు. సిరియానుంచి జినోవాకు సుగంధద్రవ్యాలు, రంగులు, సిల్కులు, మద్యము, పంచదార మొదలైన వస్తువులను వేసికొని పోతూండే వందలాది ఓడల్ని పోప్ నిషేధాజ్ఞలు ఆపలేకపోయినాయి. సిరియను ఎడారులనే లక్ష్యపెట్టకండా, వాటిలోంచి ప్రాకివస్తూన్న బిడారులపంక్తుల్ని, చర్మంమీద వ్రాసిన ఒక వాక్యం—ఆ వాక్యం పోప్ వ్రాసినదే

గానీండి, – ఆపుచేయగలదా ? ఆకాశాన్ని అంటే ఆల్ప్స పర్వతాల్ని అధిగమించి, ఇటలీకి వచ్చిన జర్మను వర్తకులను, తూర్పుదేశాలనుంచి వచ్చిన వస్తువులకోసం వచ్చిన వాళ్ళని తిరుగగొట్టడం సాధ్యమా ?

మహాదీర్ఘమైన చరిత్ర లోలకం కుడి యెడమలకు అప్పుడే రెండుసార్లు ఊగిసలాడింది. క్రీ. శ. 8 వ శతాబ్దంలో ఇస్లాం అరబ్బులు చంద్రధ్వజంతో పశ్చిమాభిముఖంగా పిరనీసు పర్వత శ్రేణులవరకూ వచ్చేరు. క్రీ. శ. 11 వ శతాబ్దంలో క్రైస్తవ 'శిలువయోధులు' తూర్పుదిశగా జెరూసలేమ్ వరకూ వచ్చేరు.

' ఈ లోగా పరిస్థితు లెంత మారినవనుకొన్నారు ! సముద్రములచేతా, యెడారులచేతా వేరుచేయబడిన దేశాలూ, మతములు, ఆచారాలచేత విడదీయబడిన దేశాలూ, జాతులూ పరస్పరం దగ్గరగా వచ్చినాయి. ఫ్రెంచి, జర్మన్ యోధులు తమతమ దుర్గాల్లోనే వుంటూ, లోకానికి దూరంగా గుహల్లో నిద్రపోబోయిన యెలుగుగొడ్లలాగ వుండిన రోజులు గడచి పోయినాయి. కాలం మారిపోయింది.

వాళ్ళకి ప్రపంచాన్ని గూర్చి ఏమి తెలుసు ? ఇతర దేశాల్ని గూర్చి వాళ్ళకేమి తెలుసు ?

వాళ్ళు విన్నదల్లా యెక్కడో జెరూసలేమ్ పట్టణ మనేది వుందనీ; అది సరిగ్గా యీ ప్రపంచానికి మధ్యస్థంగా వుందనీను! అదిగాక మరో రెండు పెద్ద పట్టణా లున్నాయి;–రోమ్, కాన్

స్టాంటినోపుల్,—అనేవి. కాని, ఆ నగరాల్ని గూర్చి, అక్కడ నివసించే జనాన్ని గూర్చి వాళ్ళకున్న భావాలు యెంత మసకగా, మబ్బుగా వుండేవని! పై పెచ్చు వాళ్ళ పాతనమ్మకాలు యింకా సమసిపోనేలేదు. ఎక్కడో ప్రపంచానికి ఒక కొసను, సూర్య చంద్రాదులు ప్రకాశించనట్టి దేశ మొకటి వుందనీ, అక్కడి మనుష్యులకు నెత్తిమీద కొమ్ము లుంటా యనీ, పంజాలకు సింహపు గోళ్ళుంటా యనీ అనుకునేవాళ్ళు!

జన్మకల్లా శివరాత్రి అన్నట్లు ఎప్పుడో అరుదుగా కనబడే వాళ్ళు, పరదేశులు. సరుకు లమ్ముకుంటూ తిరిగే వర్తకుడో, తీర్థయాత్రలు చేసే యాత్రికుడో యెప్పుడేనా దుర్గానికి వచ్చేవాడు. నెగడి చుట్టూనో, భోజనాల బల్ల చుట్టూనో కూర్చుని ఆ పరదేశి చెప్పినవన్నీ వాళ్ళంతా చెవులు చేసుకుని వింటూండేవాళ్లు, జనం. తాను విన్నవాట్లను గూర్చి, చూసిన వాట్లను గూర్చి, తన అభూతకల్పనలను కొన్నింటిని చేర్చి అతగాడు యేవేవో చెప్పేవాడు. నిత్యసంచారులుగా వుండే చారణులు, కథకులు, మాంత్రికులూ యెన్నో గాధలు పాడుతూండేవాళ్ళు. వాళ్ళ పాటల్లో నిజచరిత్రకంటె కల్పనాభాగమే అధికంగా వుండేది. అల్లుల్లో మల్లు పెద్ద అన్నట్లు దుర్గంలో యోధులే శాస్త్రనయం. అటువంటి యోధులు కూడా, తమ దుర్గాన్నుంచి నూరుమైళ్ళు పోతే యిక అక్కడినుంచి చిత్ర విచిత్ర దేశాలు, రాక్షసభూములు, భూతప్రేత పిశాచాలు వుండే దేశాలు వుంటా యనీ, అక్కడికి వెళ్ళిన వాళ్ళని గండ

భేరుండాలు, శరభసాళ్వములు అమాంతంగా మ్రింగేస్తా యనీ అనుకునేవారు !

అటువంటి మహాయోధు లిప్పుడు స్వయంగా వేలాదిమైళ్ళు అధిగమించి జెరూసలేమ్ నగరానికి వచ్చేరు. సిరియాలోని ఆంటియోక్, బైజాంటియమ్ లోని కాన్‌స్టాంటినోపుల్ నగరాలు చూచేరు. బైజాంటియం లోని అత్యద్భుతమైన చెర్చిలను, తూర్పుదేశాల్లోని మసీదులను, అన్నిచోట్లా రాజ సభా భవనాలనూ చూసేరు. గ్రీసు, సిరియాల్లో వారు చూచిన వాటితో పోల్చుకుంటే, స్వదేశంలో, స్వగృహాల్లో తమ జీవితాలు తమకే క్షుద్రంగా, అల్పంగా, దరిద్రంగా తోచేయి.

ఈ తూర్పుదేశాల్లో ఉత్త మట్టికూడా మహోన్నతమైన గత చరిత్రయొక్క స్మృతులను జ్ఞాపకం చేస్తూన్నట్లుంది ! అక్కడ యింకనూ అరబ్ పండితులు అరిస్టాటిల్, టాలమీ గ్రంథాల్ని పఠిస్తూనే వున్నారు. అక్కడి భూగోళికులు హిందూ, చీనాదేశాల్లోని మహాద్భుతాల్నిగూర్చి గ్రంథాలు రాస్తూనే వున్నారు. ప్రతిచోటా ప్రాచీన శిల్పశిథిలములను చూస్తాము, అక్కడ ! ప్రాచీన విజ్ఞాన సాంప్రదాయా లచ్చోట యింకా సజీవంగా వుండడం చూస్తాము.

ఫొయినీషియన్ రేవు పట్టణమైన టైర్‌లో ఒక క్రైస్తవ బిషప్పు ఖొరాన్‌ను, అరబ్ చరిత్రకారుల రచనలను చదువు తూన్నాడు. ఆయన ఒక గ్రంథం రచించేరు. దానిలో యెక్కడా

ఇస్లాం మత ద్వేషం గాని, తమకు విజాతీయంగా విచిత్రంగా కనిపించే విశ్వాసాలు, ఆచార విచారాలను గూర్చి అసమంజసంగా, అశ్లీలంగా వ్రాయడంగాని చేయలే దాయన!

ఇది గొప్ప విషయమా? అని అడగవచ్చు, మీరు.

ఔను! గొప్పవిషయమే, మరి! యుద్ధ మధ్యంలో విద్వేష వైరముల మధ్యలో మానవుని సంస్కృతి పెరుగుతూ, పరిణతమవుతూ వస్తూందని యిది ఋజువు చేస్తూంది.

ఖలీఫాల రాజ్యం అదృశ్యమైపోయింది. జెరూసలేం క్రైస్తవ రాజ్యమూ శిథిలమై పోయింది.

కాని సామ్రాజ్యాలు రూపుమాసిపోయినా, మానవజాతి యొక్క మొత్తం కృషి ఫలితాలను నాశనం చేయడం, తుడిచి పెట్టడం జరగదు. లక్షలాది జనులు ప్రాక్పశ్చిమాల్లో శ్రమపడి పని చేస్తున్నారు. భూములు సాగులోకి తెస్తున్నారు, ద్రాక్షారామాల్ని పెంచుతున్నారు. పట్టుపురుగుల ఉత్పత్తిని విస్తృత పరుస్తూన్నారు. మల్బరీ తోటలు నాటుతున్నారు. నత్తగుల్లలనుంచి రంగులు తయారుచేస్తున్నారు. ఆలివ్ గింజల నుంచి చమురు ఒత్తుతూన్నారు. చెరకు పిండి చెక్కెర వండుతూన్నారు. గొర్రెల వున్ని కత్తిరిస్తున్నారు. చర్మాలు శుభ్రపరుస్తున్నారు. ప్రత్తి యేరి దారం తీస్తూన్నారు. ఇనుమును కరుగుతూన్నారు, వస్త్రాలు నేస్తున్నారు;- వివిధ కర్మకలాపాలు సాగిస్తూన్నారు.

ప్రాక్పశ్చిమములు రెండింటా జనుల ఘర్మజలాల నుంచి అధికాధికంగా సంపదలు ప్రోగుపడుతూన్నాయి.

పశ్చిమానికి తూర్పు కావాలి; తూర్పునకు పశ్చిమం అవసరం. ఎడారుల మీదుగా, సముద్రాల మీదుగా ప్రాక్పశ్చిమాలు చేతులు జాచి, ఒండొరులను ఆహ్వానించు కొంటున్నాయి. సంకుచిత శత్రుభావాలవల్ల తమలో జనించిన ఆటంకములనూ, భావసంఘర్షణలనూ అన్నిటినీ అధిగమించి, మిత్రభావముతో హస్తాలను జాచినా, యీ చిరశత్రుత్వములు అంత సులభంగా పోయేవి గావు. అవి ఇంకా అస్తిశల్యగతములుగా వుండి, చాలకాలం పట్టి వేధిస్తూనే వుంటాయి.



ఇటలీ దేశపు వర్తకనౌకలు మధ్యధరాసముద్రంలో తిరుగుతూండేవి. ఎత్తైన నౌదలలతో, నూరేసి తెడ్లతో, అవి చాల పెద్దవిగా వుండేవి. సారసినులూ యెప్పటినుంచో సముద్రయానం గావిస్తూన్నవాళ్ళే. ఇటలీ నావికులు ఏదైనా సారసినీ ఓడను తారసిలిసప్పుడు దానిమీాద పడి పొడవైన కొక్కెములతో దాన్ని తమ దగ్గరకు లాక్కునేవాళ్ళు. దగ్గరకు రానిచ్చి, సాయుధులై శత్రునౌకలలోనికి దుమికి, వాళ్ళతో యుద్ధం

సాగించేవాళ్ళు, సముద్రంమీద ఎవరి ఆధిపత్యం వుండాలి? జినోవా వాళ్ళ శిలువ టెక్కెమా? సారసీనుల చంద్ర ధ్వజమా? ఎవరి జెండాక్రింద మధ్యధరాసముద్రం ఉండాలి? అనేదే సమస్య. ఉభయులూ, ఒకరి నొకరు పచ్చిదొంగ లని పిలుచుకొనేవాళ్ళు. ఎదుటివాళ్ళు నరరూపరాక్షసు లనే వాళ్ళ నమ్మకం!

నిరంతరశత్రుత్వం సాధ్యంగాదు గదా. కథ నడవాలిగదా. అంధకారంలో మెరుపుతీగలా మైత్రీభావమూ వుంటూండేది. జినోవా ఓడలు అనేక విదేశరేవుల్లో లంగర్లు దించి, గుంపులు గుంపులుగా వర్తకుల్నీ, సన్యాసుల్నీ దింపేవి. ఆంటియోచ్, జఫ్ఫా, సిజేరియా మొదలైన వెనాంట్ పట్టణాల్లో యూరో పీయ భాషలు అంతకంత కధికాధికంగా వినబడుతూన్నాయి. సిరియా దేశపు వినీలాకాశాన్ని చీల్చుకుంటూ మసీదుల మినరెట్లు (శృంగములు) ప్రక్కనే చెర్చిల బెల్ఫరీలూ– ఘంటాగోపురాలు – కనబడుతూన్నాయి. చెర్చిల ఘంటా నాదాలూ, మసీదుల్లో ముయిజ్జిన్ల (ప్రార్థనకై భక్తులను కేకవైచి పిలిచేవాడు) కేకలూ కలిసి విలక్షణ శ్రుతిలో అక్కడి ఉష్ణవాతావరణంలో చాల దూరం వినబడు తూన్నాయి.

ఈ కాలంలోనే జర్మనీ దేశంలో పరిస్థితు లెల్లావున్నాయో ఒక్కసారి తొంగి చూద్దాం. జర్మనీలో లూబెక్ అనే స్వతంత్ర పట్టణం ఉండేది. అది ఒక రాజ్య మన్నమాట.

వ్యాపారార్థమై ఆ నగరానికి వచ్చిన నొవోగొరోద్ వర్తకులు తమ స్వంత చర్చిలో సమావేశమై ప్రార్థనలు చేసుకునేవాళ్లు. చీలమండలవరకూ వచ్చే పొడుగాటి బొచ్చుకోట్లు తొడుక్కొని, తలలపై యెత్తైన గోపురపు టోపీలు పెట్టుకున్న యీ పరదేశులు, 'అతిథులు', యీ విదేశంలోకూడ తమ ఆచార వ్యవహారాలనూ, వేష భాషలనూ అనుసరించేవాళ్ళు.

ప్రపంచం అంతకంతకు ఉత్తర దక్షిణాలుగాకూడా విస్తృత మవుతూంది.

ఉత్తర ప్రాంతాలనుంచి వచ్చిన మొదటి ప్రజ నొవోగొరోద్ ప్రజే. వారు చిన్న చిన్న పడవలలో నదులమీదుగా ప్రయాణం చేస్తూ దక్షిణానికి వచ్చేవారు. ఉత్తరప్రాంతాలు బీదవిగా కనబడుతూన్నవే గాని వస్తుతః పేదవి గావని యీ నొవోగొరోద్ వాసులు యెరుగుదురు. దట్టమైన ఉత్తరారణ్యాల్లో మంచి కలపచెట్లే గాక శాబుల్, మార్టిన్ మొదలైన చిన్ని జంతువు లున్నాయనీ, అవి బంగారం కంటె విలువైనవనీ వా రెరుగుదురు. నొవోగొరోద్ పట్టణంలో బోయర్ల యొక్కా, వర్తకులయొక్కా గొదాములు వీటి మృదు చర్మములతో నిండివుండేవి. ఇవే గాదు. ఫ్లాండర్సులోని వైప్రిస్ నగరం నుంచి వచ్చిన ఉన్నిగుడ్డల తానులుకూడా అక్కడి గొదాముల్లో చూస్తాము.

బ్రిటన్ ద్వీపంలోని సంతలకు ఫ్రాంసునుంచికూడ వర్తకులు వచ్చేవాళ్లు. ఇటలీ, జర్మనీ దేశాలనుంచీ వర్తకులు వచ్చే

వాళ్లు. సంతల్లోనూ, తీర్థాల్లోనూ మొదటి రోజుకే తమ అంగళ్లు తెరవాలని ప్రతీదేశపు వర్తకులూ తొందర పడు తూండేవాళ్ళు.

ప్రపంచం విస్తృతి మవుతూంది..

## 2. బజారు నుంచి బజారుకి.

సంత జరిగే ప్రదేశం ఒక చిన్న కొండప్రక్కనే వుంది. దానిపైన రాజుగారి జెండా యెగురుతూంది. అంటే ఆప్రదేశం ఆ రాజు రక్షణలోని దని అర్థం. రాజుగారి ప్రదేశంలో రాజు రక్షణ క్రిందవున్న వర్తకులను యెవరైనా దోచుకునే టట్ల యితే రాజు న్యాయస్థానం యెదుట జవాబు చెప్పుకోవా లని యీ జెండా ప్రకటిస్తూం దన్నమాట.

ఈ జెండా ప్రక్కనే ఒక పెద్ద గుడారం వుంది. అందులో న్యాయస్థానం వుంది. ఈ సంతలోని వ్యవహారా లన్నీ న్యాయ ముగా జరిగేటట్లు చూసే పూచీ ఈ న్యాయస్థానానిదే. వర్తకులు తక్కువ తూనికలు, పిచ్చికొలతలు యివ్వకుండాను, దొంగ నాణెములు చెలామణీలోనికి రాకుండాను, సరియైన సరకులు న్యాయమైన ధరలకు విక్రయించబడే టట్లూ వీరు కనిపెట్టి చూస్తూంటారు. రొట్టె, మద్యం, బీరు మొదలైన ఆహార పానీయాదులకు అధికధరల నడిగే వాళ్ళని పట్టుకుని శిక్షించేందుకు బొండకొయ్యలు సిద్ధంగావుండేవి, అక్కడే.

సంత జరుగుతూంటే చూడ్డానికి ఓ చిన్న పట్టణంలా వుంది. కొయ్యగదులూ, దుకాణాలూ, పెద్ద పెట్టెలూ వరుసలుగా వుంటాయి. నిజమైన పట్టణంలోనికి వలెనే ఇక్కడా వీధులుంటాయి. ఒక వీధిలో దుకాణాల్లో మిరియం, లవంగాలు, ఏలకులు, జాజికాయ మొదలైన సుగంధద్రవ్యాలుంటాయి. మరో వీధులో అన్నీ జవుళి అంగళ్ళు. ఎరుపు, ఆకుపచ్చ వగైరా రంగుల గుడ్డల తానులు బ్రూజెస్, ఘెంట్, ఛాంపనీ మొదలైన పట్టణాలనుంచి వచ్చినవి యిక్కడ వుంటాయి. వర్తకులు తాము చెందిన పట్టణాన్ని బట్టికుండా వేర్వేరు గుంపులుగా యేర్పడుతూంటారు. ఫ్లెమిష్ వారు ఫ్లెమిష్ వారితోను, జర్మనులు జర్మనులతోనూ కలిసి, ఒక్కొక్క బజారుగా యేర్పడుతారు. ఆయా పట్టణాలనుంచీ, ప్రాంతాలనుంచీ వచ్చే వస్త్రాలను ఆ ప్రాంతాల పేర్లతోనే పిలిచేవాళ్ళు. ఇప్పటికీ యిదే సంప్రదాయాన్ని చూస్తాం.

ఈ కొయ్యపట్టణం చుట్టూగోడకూడావుంటుంది, ఆ ప్రహారీ గోడకూడా కొయ్యదే. లావుపాటి దుంగలు నేలలో దగ్గర దగ్గరగా పాతి, అక్కడక్కడ ద్వారాలూ, ద్వారపాలకుల్నీ ఏర్పాటు చేసేవారు. ద్వారాల్లో వున్న భటులు పన్నులు వసూలు చేస్తూంటారు. పన్నులు చెల్లించనిదే యెవరినీ అటు నిటు పోనీయరు.

సంత ఒక నిర్దిష్ట దినమున ప్రారంభిస్తారు. అంతా సిద్ధం కాగానే వేత్రహస్తుడై, జరీ దస్త్రీ, పటకా ధరించి రాజకింకరుడు వచ్చి 'సంత ప్రారంభమైంది, ఓహో!' అని ఉచ్చైస్స్వరంతో

ఘోషం గావిస్తాడు. అశ్వారూఢులైన న్యాయాధిపతులు తాళాలగుత్తులు పుచ్చుకుని సంతచుట్టూ సంచారం చేస్తూం టారు.

సంత ప్రారంభమైంది. ఏమి గొడవ, గందరగోళం! బొబ్బలూ! కేకలూ! కొనేవాళ్లు మెన్నోసార్లు అంగళ్ళను అటు నిటు పరీక్షగా తిరగేసి, గీచిగీచి మరీ బేరాలు చేస్తు న్నారు! అన్నిటికంటె చౌకగా వున్నచోట కొనాలని వాళ్ళ యత్నం. సామగీతాలను పాడుతూ అంధులు బిచ్చమడుగు తూన్నారు. అదృష్టాలు చెప్పే జ్యోతిష్కులు, పళ్లు పీకేందుకు దంతవైద్యులు, క్షురకర్మ చేసే మంగళ్లు, తమాషాలు చేసే హాస్యగాళ్ళు సంతలో తమ వ్యాపారాలు సాగిస్తూన్నారు. కావాలంటే నువ్వా తినొచ్చు, తాగచ్చు, పాడచ్చు, ఆడచ్చు, పోట్లాడచ్చు, కొనచ్చు, అమ్మవచ్చు!

సమీపమందే వున్న దుర్గాన్నుంచి రాజుగారు బైలుదేరి వచ్చేరు. ఆయన మస్తుగా తాగేసి సగం తెలివితో వున్నాడు. కనపడిన దల్లా దారిలో కొంటూన్నాడు. ఒక్కొక్క అడుగు వేస్తూన్న కొద్దీ ఆయన డబ్బుసంచీ తేలికవుతూంది. దాసుల నుంచి ఆయన వసూలు చేసిన ధన మంతా శిశిరమందలి చెట్టు ఆకుల్లాగ రాలిపోతూంది.

ఇల్లాంటి సంత సంబరాల ఆకర్షణలనుంచి వృద్ధులైన రాజ వంశీకులు దూరంగా వుండేవాళ్ళు. కాని, కుర్రకారు మాత్రం ఊరిఖే మిడతల్లా యిందులోకి దూకేవాళ్ళు, తాత తండ్రులు

పొదుపుగా ప్రోగుచేసిన దేమైనా వుంటే యీ పడుచువాళ్ళు కొద్దిరోజుల్లోనే చక్కని దుస్తులకోసం, వినోదం కోసం, డాబు దర్పాల కోసం ఖర్చుపెట్టేసేవాళ్ళు. దుర్గంలోని ధనాగారాలు చీకటి కొట్లుగా వుండేవి. లక్ష్మి అందులో బందీగా మూలు గుతూ వుండేది. ఇప్పుడు ఆ కొట్ల యినుప తలుపులు, తాళాలు తెరచి, ధనమంతా ఖర్చు చేసేస్తూన్నారు. ఇంక వెండిపిల్లింగులూ లేవు. బంగారు డ్యూకట్లూ లేవు! వెనీస్ నగర రాజ్యపు ప్రధాన మేజస్ట్రేట్‌ను డోజీ అనేవారు. అతడే డ్యూక్ కూడాను ఈయన శిరస్సు ముద్రించబడి వుంటుంది, నాణెము లన్నిటి మీదా. ఏదో అదృశ్యమహాశక్తి యీ నాణెముల నన్నిటినీ సంతలలోనికి తోలేస్తున్నట్లు కనబడుతుంది!

ఈ ధనము ఒక సంతనుంచి మరో సంతకు తిరుగుతూండేది. ఉత్తర దక్షిణాలకీ, తూర్పు పడమరలకీకూడా వెడుతూండేది, యిది పక్షపాతం లేకండా. ఈ ధనంలో చాలభాగం నదిలోని యిసుకలాగ దొర్లుతూపోయి దారిలోనే కాస్త కాస్తగా దిగడి పోయింది. ఇటలీ వర్తకుల, వడ్డీవ్యాపారుల భోషాణాలు కొంత భాగాన్ని మింగేసేవి. మరికొంత భాగం కాన్‌స్టాంటినోపుల్‌కు అలగ్జాండ్రియాకు పోయి, కరగ్రాహుల కార్యస్థానాల్లోనూ, బైజాంటియం చక్రవర్తి బొక్కసంలోనూ, ఐగుప్త సుల్తానుల ఖజానాల్లోనూ దిగడిపోయింది!

అలగ్జాండ్రియాకు తుర్కులు యజమానులైనప్పటినుంచీ దిగుమతి పన్నులు యెన్నో రెట్లు పెరిగిపోయినాయి.

కాని, బంగారు నాణెముల ప్రవాహం యీ చెప్పిన చోట్లనే ఆగిపోలేదు. పట్టుపుట్టములు, మంచిముత్యాలు, అమూల్య రత్నాలు, సుగంధ ద్రవ్యాలు మొదలైనవి యెక్కడినుంచి వస్తున్నాయో తెలుసుగదూ? తూర్పునవున్న ఆ అజ్ఞాత అద్భుత దేశాలకు, యీ వస్తువుల నన్నిటినీ పశ్చిమానికి పంపుతూన్న తూర్పు దేశాలకు ప్రవహించి పోతూంది, యీ స్వర్ణ వాహిని!

ఈ వస్తువులు పాశ్చాత్య దేశాల్లో గ్రాహకులకు చేరేసరికి అంతంత ఖరీదైనాయంటే ఆశ్చర్యంగా వుందా? హిందూ దేశంలో వాటి ఖరీదులకు ఐదు రెట్లుండేవి అలగ్జాండ్రియాలో; దాని కైదింతలు ధర ఛాంపగ్నీ సంతలో వుండేవి! హిందూ దేశంనుంచి యెంతదూరం ఉందని ఛాంపగ్నీ! మార్గంలో కొండలు దాటాలి; యెడారులు అధిగమించాలి, సముద్రాలు తరించాలి. ఎంత కష్టం, ఎన్నెన్ని ప్రమాదాలు, ఎన్ని తిరుగుడులు వున్నాయని! బండ్లమీంచి ఓడలకీ ఓడలమీంచి మరో ఓడలమీదికీ,అక్కడినుంచి ఒంటెల మూపురాల మీదికీ,అక్కడినుంచి గుర్రాలకీ, గుర్రాల వీపులనుంచి పడవలకూ, వాటిలోనుంచి గాడిదలమీదికీ;-యిల్లాగే సమస్త వాహనాల్నీ అధిరోహించి యాత్ర సాగించేవి, యీ సరుకులు. ఈ సరుకుల ప్రవాహాన్నీ, ధన ప్రవాహాన్నీ ఎవరూ, ఎప్పుడూ ఆపలేరు! వర్తక బిడారుల నీ సుదీర్ఘ ప్రయాణాలూ, వ్యాపారం చేయ

కుండా ఎవరూ మానిపించనూ లేరు, నిరుత్సాహ పరచనూ లేరు!...

ప్రపంచం క్రమంగా విస్తృతం అవుతూనే వుంది. ఈప్రపంచం వైపు చూస్తే జనులకు మహారణ్యాలు, విశాలమైన క్షేత్రాలు, దీర్ఘములైన పర్వతశ్రేణులు, సారవంతమైన లోయలు, నిర్జలమైన యెడారులు, మెట్టభూములు, విస్తృతమైన సముద్రాలు కానవస్తాయి. బాల్టిక్ సముద్రాన్నుంచి నొవోగొరోద్ వరకూ అక్కడినుంచి కీవ్ రాజ్యంవరకూ, కీవ్ నుంచి బైజాంటియం సామ్రాజ్యం, అక్కడినుంచి అసంఖ్యాకమైన తూర్పు దేశాలకూ; పశ్చిమాన హాన్సియాటిక్ సమితిలోని జర్మను పట్టణ రాజ్యాలకూ, ఫ్లాండర్సుకూ, ఫ్రాన్సుకూ, అక్కడినుంచి యింగ్లీషు ఛానల్ మీదుగా బ్రిటన్ కూ జనావాసాలు వ్యాపించి వున్నాయి. ఈ ప్రాంత మంతా చిన్నచిన్న రాజ్యాలుగా విభజింపబడి పోయివుంటూ, పరస్పరం పోరాడు కుంటూండేవి. సోదరులూ, యిరుగు పొరుగు వాళ్ళూ కూడా అవకాశం దొరికినప్పుడల్లా ఒకరిమీద ఒకరు దూకడానికి సిద్ధంగా వుండే వాళ్ళు!

యుద్ధోద్యోగం యింత సర్వవ్యాపకంగా వున్నప్పటికిన్నీ ఆ కాలంలోకూడా సర్వజన ఐకమత్యం, సహానుభూతి అంటే తెలిసినవారు, గ్రహించినవారు, దానికై పాటుబడేవాళ్ళూ కొందరైనా మహాజనులు వుండేవాళ్ళు.

## 3. ఒకే మనస్సు.

ఆ కాలంలో గ్రంధాలు పల్చని గట్టి చర్మములపై వ్రాసే వారని చెప్పేనుకాదూ. ఆ పురాతన చర్మ గ్రంధాలను మళ్ళా ఓసారి తిరగేసి చూద్దాం. వీటి నిండా ప్రతీపుటలోనూ రక్తప్లావితములైన పోరాటాల, యుద్ధాల వర్ణనలే. మొదటి సారి చూస్తే నీకు యెవరు యెవరితో యుద్ధం చేస్తున్నారో స్పష్టంగాదు. ఒకరోజున బద్ధశత్రువులుగా వున్నవాళ్లు మరు నాడు పరమమిత్రులు; మరునాడు వీరు తిరిగి శత్రువులై పోట్లాడుకోడం;- యిల్లాగే వుంటుంది.

ఉదాహరణకు, ఇదిగో! చూడండి. ఇది జర్మన్ పరివ్రాజ కుడు లాంబెర్టు వ్రాసిన చరిత్ర. రాజులు, బేరన్సు, బిషప్పులు మొదలైన వాళ్ళమధ్య పోట్లాటలు, యుద్ధాలు యెల్లా జరు గుతూ వచ్చేయో ఆయన అతి ప్రశాంతంగా, నిర్లిప్తంగా చెప్పుకు పోతాడు. పోట్లాడే యీ జనులంతా ఒకే మతానికీ, ఒకే చెర్చికీ చెందినవారైనప్పటికీ అది వీళ్ళ శత్రుత్వాన్ని యే మాత్రం తగ్గించనూ లేదు. మైత్రీభావాన్ని పెంపొం దించనూ లేదు !

లాంబెర్టు పరివ్రాజకుని గాథల్లో ఒక బిషప్పు అనుచరు లకూ ఒక అబ్బట్ అనుయాయులకూ జరిగిన యుద్ధగాధ ఒకటి వుంది. 'ఇదొక సాధారణ, స్వాభావిక విషయమేలే!' అన్నట్లుగా అది వర్ణించే రాయన ఈ యుద్ధం 'వైరిమూర్త్యం'

(ట్రినిటీ) పండుగరోజున జరిగిందట. చెర్చి అంతా విశ్వాసులతో కిటకిట లాడుతూంది. ప్రార్థనా కాండ జరుగుతూందొకప్రక్క. మధ్యలోనే జనం లేచి, కత్తులు దూసి, ఒకరి నొకరు నరుక్కుంటున్నారు! బిషప్పు వేదికమీద నిల్చుని, తన అనుచర వర్గాన్ని ప్రోత్సహిస్తూన్నాడు. ప్రార్థనాగీతాలు, సామములకు మారు పోట్లాడే వారి హుంకారాలు, పడి పోయిన వాళ్ళ మూలుగులు వినబడుతూన్నాయి. బహుశః బిషప్పుగారు, అబ్బట్‌గారు తమ అభిప్రాయభేదాలు పరిష్క రించు కొనేందుకు యింతకంటె మంచి సమయం, మంచిస్థలం దొరక వనుకొని వుంటారు!

పోనీ, వారి మధ్య తగువుకు తగిన కారణ మేమైనా వుందేమో చూద్దామా అంటే అదీ లేదు. ఆర్చిబిషప్‌గారి ప్రక్కను, బిషప్ కూర్చోవలసిన స్థానంలో అబ్బట్ వెళ్ళి కూర్చున్నాడట! ఇల్లాంటి అవిధేయ ప్రవర్తన, పొగరుబోతు తనం సాగనీయరాదని బిషప్పుగారి పట్టుదల.

ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ;—ఒక టేమిటి, యూరోపు దేశా లన్నింటిలోనూ కూడా రాజులూ, ప్రభువులూ, యోధులూ ఒండొరులతో యెడ తెగకుండా పోరాడు తుంటూన్నారు. కాని యీ పోరాటాలూ గందరగోళాలూలోనూ కూడా, ఈ చిల్లర తగువుల నధిగమించి చూడగలిగిన మహాపురుషులు, దీర్ఘ దర్శులైనవా రక్కడక్కడ లేకపోలేదు.

ఇదిగో! మరొక గాథ. ఇది చూద్దాం. అదే కాలానికి చెందిన రష్యన్ గాథ, యిది. 11 వ శతాబ్దపు ద్వితీయార్థానికి చెందినదే, యిదీ.

ఈ దేశంలోకూడా ప్రతీ ఒక్కడూ మిగిలిన అందరితోనూ పోట్లాడుతూనే వున్నాడు! కీవ్ రాజు వెళ్ళి ఛెర్నిగోవ్ నగరాన్ని ముట్టడించేడు. నొవోగొరోద్ రాజు సుజ్‌దల్‌ను ముట్టడివేసేడు. రష్యన్ రాజులు ఒకరొకరిమీదికి స్టెప్పీలమీద ద్రిమ్మరే పశుపాలక గణాలనూ, పొలోవ్‌త్సీలనూ ప్రేరేపించి పురిగొల్పుతూండేవాళ్ళు. ఈ మూకలతో కలసి రష్యన్ రాజులే ఒకరొకరి నగరాల్ని దోచుకుని, పరశురామప్రీతి గావిస్తూండేవాళ్లు. *

ఈ చరిత్ర వ్రాసినవాడే పక్షానికి చెందినవాడు? ఛెర్నిగోవ్ పక్షీయుడా? లేక కీవ్‌ను సమర్థించేవాడా? అబ్బే! ఇతడే ఒక పక్షమునూ సమర్థించడు. ఆతడు మొత్తం రష్యన్ భూమికి

---

* గణ వ్యవస్థ నధిగమించి యేకరాజ్యాధిపత్యం క్రిందకు వచ్చిన దశ యిది. మహాభారతం చదివితే ఆనాటి హిందూదేశంలోకూడా వివిధ రాజ్యాలే గాక యింకా గణనిర్మాణ దశలో వున్న జనులు యాదవులు, నాగులు మొదలైనవారు కనిపిస్తారు కురుపాండవ యుద్ధంలో రాజులే గాక యాదవాది గణములుకూడా యిరుపక్షాల అభ్యర్థనలపై యుద్ధంలో పాల్గొన్నారు. మహాభారత యుద్ధానంతరం కృష్ణనిర్యాణం తరువాత యాదవగణాలు తమలోతాము కలహించుకుని సర్వనాశనమై పోయారు. అర్జునునితో ద్వారకనుంచి బోవు కృష్ణుని పరివారాన్ని, అంతఃపుర వధూ జనాన్ని యెడారి ప్రాంతంలో కిరాతులు మొదలైన ఆటవికు లెదిరించేరు, —అనువాదకుడు.

చెందినట్టివాడు. లూబెక్ సమావేశంలో రష్యన్ రాజుల ఉప
న్యాసాల నాతడు పరిపూర్ణహృదయంతో యేకరువు పెట్టేడు.
తండ్రుల రాజ్యాలను, ఆస్తులను, కుమారులు పొందేహక్కును
ఆ సభలో రష్యన్ రాజులు పూర్తిగా బలపరచేరు :

"మనం చేతులారా మన మాతృభూమిని ఎందుకు నాశనం
చేస్తున్నాము? మనలో కలహాలు వున్నంతవరకు పోలోవ్త్సీలు
మన భూమిని చీల్చి చెండాడి నాశనం చేస్తూనే వుంటారు.
అందుచేత యికనుంచైనా మనం యేకమనస్కులమై యుండి,
మన మాతృభూమిని పరిరక్షించుకుందాము."

ఈ చరిత్రకారుడు 'ఏక మనస్కతను' గూర్చి వ్రాసేడు.
జనులలో 'ఏక మనస్కత' అట! అబ్బో! ఈయన తన కాలా
నికి యెంతో ముందన్నట్లున్నాడే! క్రీ. శ. 11 వ శతాబ్దం
లోని సంఘటన లన్నీ భూస్వామ్యయుగధర్మా న్ననుసరించే
జరుగుతూండేవి. అప్పటికింకా యెవరూ 'రష్యన్ ప్రజలు' అను
మాటను వాడి యెరుగరు. 'రష్యన్ భూమి' అని మాత్రం
అనేవాళ్ళు. కాని, యీ చరిత్రకారుడు తన మనోనేత్రంతో
భవిష్యత్ ను చూడగలిగేడు.ఆ సుదూరభవిష్యత్తులో రష్యను
పట్టణాలు ఒండొంటితో పోరాడుకోవు; అప్పుడు రష్యను
లాంతరంగిక వైరాలను మానుకొని, ఐకమత్యం కలిగి
వుంటారు. అప్పుడు రష్యను జనులకు రష్యాభూమిలోని అన్ని
నగరాలూ, కీవ్, చెర్నిగోవ్ లన్నీ ప్రియతమమైనవే అవు
తాయి. నేలాడి, లటిలాది, కోట్లాది జనులు 'యేకమనస్కులై'

వుండడం సాధ్యమే నని యీ చరిత్రకారుని యొక్క క్రైస్తవుని యొక్క విశ్వాసం.

ఈ పరివ్రాజకుడు తన కాలం కంటె ముందు నడుస్తున్నాడు. కాని, కాలం ఆగదుగదా. చివరకు కాలం ఆ స్థానాన్ని చేరే తీరుతుంది.

లూబెక్ మహాసభ సమాప్తమైంది. రష్యన్ రాజులు తిరిగి యిండ్లకు పోతూ, దారిలోనే కుట్రలు ప్రారంభించేరు. రాజులలో మొనోమాచ్ సోదరులు చాలా బలంగల ముఠాగా వుండేవాళ్లు. వాళ్లు యితర రాజులకు చెందిన భూభాగాల్ని ఆక్రమించడానికి యెత్తులు వేస్తూన్నారు.

కీవ్ రాజు వ్లాడిమిర్ మొనోమాచ్ తన హితోపదేశాల్లో యీ విషయమై యిల్లా చెప్పేడు :

"వోల్గానది యెగువనున్న నా సోదరుల రాయబారులు నా దగ్గరకు వచ్చి ఈ విధంగా చెప్పేరు : 'మాతో సహకరించు. అప్పుడు సులభంగా రోస్టిస్లావ్ రాజుల నోడించి, వాళ్ళ నగరాల్ని స్వాధీనం చేసి కొందాము. నువ్వు మాతో కలువనిచో మనం విడిపడిగానే వాళ్ళదాడుల నెదుర్కోవాలి.' నేను వాళ్ళకి యిల్లా జవాబిచ్చేను 'మీరు నామీద శత్రుత్వం వహించినా సరే గాని నేను మీతో చేరజాలను. స్వమతస్థులతో నేను పోరాడను!' వాళ్ళతో యిల్లా చెప్పి పంపి, విచారంతో నా ప్రార్థనా గ్రంథం (సాల్టర్) తీసికొని, తెరువగా సరిగా నాకు కావలసిన భాగమే వచ్చింది :

'ఓ మనసా ! నీ వెందుకు కించ పడతావు ? ఎందుల కింత ఆందోళన చెందెదవు ?"

వ్లాడిమిర్ మొనోమాచ్ తమతో చేతులు కలుపుతా డనుకోవడంలో ఆ రాజుసోదరులు పొరపాటు చేసేరు. మొనోమాచ్ అటువంటివాడు గాడు. తన స్వజనంతో నే, బంధు మిత్రాదులతో నే యుద్ధం చేసేందు కాతని కిష్టంలేదు. రష్యా నంతనూ ఐక్యపరచి, పొలోవిత్సీలకు వ్యతిరేకంగా నిలబెట్టాల నే ఆయన వాంఛ. రష్యాదేశంకోసం యితరు లెవ్వరూ చేయజాలని దాన్ని చేయడానికి ఆయన సంసిద్ధుడుగా వున్నారు. లూబెక్ సమావేశానికి కొంచెం ముందుగానే మొనోమాచ్ రాజుకి చాల గొప్పనష్టం కలిగింది. ఛెర్నిగోవ్ రాజైన ఓలెగ్ తోటి యుద్ధములో మొనోమాచ్ కుమారుడు చనిపోయాడు. ఆతని స్థానములో వున్నవా రెవరైనా తన కుమారుని మరణానికి ప్రతీకారం చేయాలని ఉత్సహించేవాళ్లు, అదే ఆనాటి ఆచారము కూడాను. కాని మొనోమాచ్ ఓలెగ్‌కు యిల్లా రాసేడు. 'నేను నీకు శత్రువును గాదు. అదిగాక నేను నీమీద ప్రతీకారం తీసుకోవాలనీ కోరడం లేదు; ఆ విషయాన్ని దేవునికే వదలి పెడదాం. మన తగువు లతో రష్యాభూమిని నాశనం చేయవద్దు.' ఈ రీతిగా శత్రువుకి మైత్రీ పూర్వకంగా చేయి చాచుట అంత సులభంగాదు. కాని, ఆయన దీర్ఘదృష్టిని ప్రదర్శించేడు. ఆతడు తన స్వంత యింటికే గాక, తన చిన్న రాష్ట్రానికే గాక యింకా దూరానికి

దృష్టి సారించగలిగేడు. ఆయన యావత్ రష్యాభూమి విషయాన్నీ చూడగలిగేడు. అంతేగాదు. ఆత డింకా దూరంలో వున్న యితర దేశాల్ని కూడా చూడగలిగేడు.

తన కుమారుల నితర భాషలు నేర్చుకోమని మొనోమాచ్ సలహా యిచ్చేవాడు. "ఇతర దేశాల్లోని మంచి అంతా కూడా ఆ దేశపు గ్రంథాల్లో వుంటుంది" అనేవాడు. తన తండ్రిగారికి ఐదు భాషలు వచ్చుననే విషయా న్నాతడు కుమారులకు యెప్పుడూ జ్ఞాపకం చేస్తూండేవాడు.

ఈ విదేశాలకు వెలుపల, యింకా దూరంలో అసీమమైన అసంఖ్యాక దేశాలు మొనోమాచ్ రాజు కండ్లముందు తాండవ మాడుతూన్నట్లు కనబడేవి.

ఆయన రచించిన 'ధర్మోపదేశాలు' (సెర్మన్సు) అను గ్రంథములో మొనోమాచ్ యీ విశ్వమందలి అద్భుతాలను స్తుతి చేసేడు. ఆకాశపు నిర్మాణమును గాంచి ఆశ్చర్యమును ప్రకటించి, ప్రపంచం జలములమీద ఆధారపడి వుండడం చూసి ముగ్ధుడయేడు. సూర్య చంద్ర గ్రహ తారకలు, వివిధ మృగపక్షి సంతతులను గూర్చి ఆయన దానిలో వ్రాసేరు. వేడి దేశాలనుంచి పక్షులు ప్రపంచ మంతటికీ వ్యాపించి, అరణ్యాలు, పొలాలు మొదలగువాటి నన్నిటినీ నింపడం మొదలైన ప్రకృతిలోని విషయాల్నిగూర్చి వ్రాసేడు. మొనోమాచ్ రాజు బహుశ్రుతుడనేది ఆయన రచనవల్ల

తెలుస్తూంది. గ్రంథ రచనా నైపుణ్యంకూడ ఆయనకు వున్నట్లు స్పష్టమవుతూంది.

జూలియస్ సీజర్, మార్కస్ ఆరిలియస్‌లు ప్రపంచ విఖ్యాతులైన విజేతలు. వాళ్ళు దండయాత్రా సమయాల్లో గుర్రాలమీద స్వారీచేస్తూకూడా అనేక విషయాలు చెప్పి వ్రాయించేవారు. వారివలెనే మొనోమాచ్ రాజుకూడా యాత్రా సమయాల్లోకూడా వ్రాసేవాడు. ఆయన ధర్మోపదేశా



లన్నీ, 'నేను సరుగుడు బండిలో స్వారీచేస్తూ, ఆలోచనాధీన మనస్కుడనై యుండగా...' అను మాటలతో ప్రారంభ మవుతాయి. మొనోమాచ్ రాజర్షి, కవి. స్టెప్పీల మీదనే అడవి గుర్రాల్ని వెంటాడి వుచ్చుతో పట్టగల మహాబలుడు; ధీరాయుధుడై మహారణ్యాల్లోనే భల్లూకములతో పోగాడగల యోధుడు; పొలోవ్‌త్సీలు, యితర సంచారజాతులతో,

స్టెప్పీలోని గోపాలక గణములతో పోరాడేందుకై రష్యా రాజలోకా న్నంతనీ ఐక్యపరచేందుకు ఈయనకు యెంత బలమైనా, తెలివైనా, దూరదృష్టి ఐనా అవసరమే.

మొనోమాచ్ కూడా కాలానికి ముందు నడచు కల్యాణ గుణుడే! ఆయన మరణానంతరం తిరిగి యుద్ధజ్వాలలు రష్యా నంతనూ గ్రసించినాయి. రష్యను జనపదాల్నీ, నగరాల్నీ సంచారజాతులు పాదాలక్రింద మట్టివేస్తూ, పరశురామ ప్రీతి చేయజొచ్చేరు.

కాని, యింకా జనుల 'యేక మనస్కత' లో విశ్వాస మున్నట్టి సుజనులు కొందరున్నారు.

'ఇగోర్ రాజు కథ' గీతంలో చారణుడు రష్యన్ రాజులంద రకూ ఉద్రేకపూరితమైన ఉద్బోధమును గావించి, వాళ్ళని యీ రీతిగా మందలిస్తాడు; "మీ ద్రోహకృత్యాలతో రష్యను భూమినే అఖిల స్లావు ప్రజల జన్మస్థానాన్నే కళంకితం, కలుషితం గావిస్తూన్నారు."

'ఇగోర్ రాజు కథ' ను రచించిన కవి యెవరో మనకు తెలియదు. కాని అతని మాటలు నిలిచివున్నాయి. ఇంకా నిలిచే వుంటాయి. ఆ కాలంలో వలెనే అవి గింగురుమంటూ, చారణుని చేతి తంబుర తీగెల్లాగే మ్రోగుతూంటాయి!

> "ఓహో! ఏమిది? నా చెవుల బడునది?
> కర్ణపుటభేదన మ్మొనర్చు నీ కలకలము
> తెల్ల వారకనే ఏతెంచు నెక్కడినుంచి?

ఈ కలకల మంతా యుద్ధసన్నద్ధులై ఏతెంచుతూన్న రష్యన్ యోధులది! 'బూరాల క్రింద ప్రోది సేయబడి, శిరస్త్రాణముల క్రింద వృద్ధిచెంది, భల్లాగ్రములమీాద పోషించబడినట్టి రష్యన్ యోధులు వస్తూన్నారు. మార్గా లన్నీ వారికి సుపరిచితము లే; లోయలన్నీ, కనుమలన్నీ వారికి కొట్టిన పిండే. వారి ధనుస్సులు బిగువైనవి, వారి తూణీరములు నిండియున్నవి. వారి ఖడ్గాలు పదునైనవి. పొలంలోకి కాపులవలె వీరు తమంత టనే యుద్ధ క్షేత్రంలోనికి దూకుతారు. ఈ వీరులు తమకు కీర్తి గౌరవాలను, తమ ప్రభువులకు యశోవిజయములనూ సమకూరుస్తారు.'

ఆ చారణు డెప్పుడో కాలగర్భంలో కలిసిపోయినాడు. ఆతని పేరుకూడా విస్మృతిపధాన పడిపోయింది. కాని, ఆతడు శ్రుతి మేళవించిన తంబురా తీగెలు ఝుమ్మంటూ యింకా ప్రతిధ్వను లీనుతూనే వున్నాయి. ఆతని కథలో వర్ణితమైన ప్రాచీనవీరుల జీవితం మాత్రం ప్రాణప్రతిష్ఠ గావించబడినట్లు అల్లాగే వుంది.

గుట్టలమీాద రాజభవనాలు, బంగారు కలశములు గల ప్రాసాదాలు మళ్లీ ప్రకాశిస్తూన్నాయి. తూర్యధ్వనులు మళ్ళా వినిపిస్తూన్నాయి. ధ్వజములు రెపరెప లాడుతూ యెగురుతూన్నాయి. మనచుట్టూ చాలదూరంవరకూ కొండలు, లోయలు, నదులు, సరస్సులు, సెలయేళ్ళు, బాడవలు, పొలాలు కానబడుతూన్నాయి. పొలాలలో కాపులు ఒకరినొకరు బిగ్గరగా పిలుచుకుంటున్నారు. నదీతీరాలు వెచ్చని పొగమంచుతో

కప్పబడి ఉన్నాయి. తీతువులూ, గ్రద్దలూ నదిమీద యెగురు తూన్నాయి. పడవలు కెరటాలపై దొర్లుతూ పోతున్నాయి. రాజు పొలాల్లో వేటాడుతూన్నాడు. హంసల్నీ, పెద్దబాతుల్నీ వేటాడుతూ డేగలు గగనవీధిలో యెగురుతూన్నాయి.

ఈ చారణుడు యే రాజు సభలోనివాడో మన మెరుగము. ఎందుచేతనంటే ఆతడు యెవరో ఒక్క రాజు కీర్తినే గాక రష్యన్ భూమియొక్క యశస్సునే కీర్తించేడు. పోలోవ్‌త్సీ తెగలు రష్యన్ సైన్యాలను తిరుగగొట్టడం ఆతడు చూసేడు. వ్యధ నొందేడు. రష్యన్ రాజుల, యోధుల నాతడు వేగిర పెడుతూన్నాడు : "మీ బంగారు రికాబుల్లోకి ఉరికి, దుర్గ ద్వారములకడనే వాడిబాణములతో శత్రుబలాలను తిరుగ గొట్టండి! రష్యన్ భూమికి జరిగిన అవమానాన్ని తుడిచి పెట్టండి! అత్యాచారానికి ప్రతిక్రృతి చేయండి!

'ఇగోర్ రాజు కథ' అంటే కేవలమూ ఇగోర్ రాజుదే అనుకోనక్కరలేదు. యావత్తు రష్యన్ భూమిదీను, అది!

కీవ్, నొవొగొరోద్ రాజ్యాలే గాక పశ్చిమాన గెలీషియా కూడా యీ కవికి ప్రియమైనదే. సుదూరాన వున్న యితర దేశాలను కూడా యితడు చూసేడు. పొలొత్సీవ్ తెగల చేతుల్లో ఇగోర్ రాజు బందీయైనప్పుడు యీ కవియే వెళ్ళి గ్రీకుల, మొరావియనుల, వెనీషియనుల సహాయాన్ని అభ్యర్థించి తీసికొని వచ్చేడు. ఇగోర్ రాజు బంధవిముక్తుడై స్వదేశమైన కీవ్‌నకు తిరిగి వచ్చినప్పుడు, 'దేశము లన్నీ

సుఖవంతములూ, నగరము లన్నీ ఆనందతరంగితములూ ఐన వని కవి గానంచేసేడు. ఈ గీతం రచించిన కవి ఆనాటికే మానవు లందరి కష్టసుఖాలూ ఒకటే నని గ్రహించినట్లు తోస్తుంది...*

అబ్బట్ ఫియొడోసిస్, ఇజ్యాస్లావ్ రాకుమారునికి యిల్లా వ్రాసేడు : "నీ తోటి మతస్థుల మీదనే గాక యితర మతస్థుల పైన కూడ కరుణ కలిగియుండుము. ఏ మానవుడైన శీతకాల ములో గానీ, వర్షఋతువునందు గానీ, ఆకొని గాని, వస్త్ర హీనుడై గాని ఉంటే, దురదృష్ట పీడితుడై ఉంటే, ఆ వ్యక్తి యూదుడే గానీ, సారసిను గానీ, బల్గరుడు గానీ, పాషండుడు గానీ, కాథొలిక్ గానీ, లేదా అందరిచేతను నిందించబడువాడే గానీ, అతని దీనత్వమును తొలగింపుము; అతనికి నీవు చేయ గలిగిన దంతయు చెయుము; సర్వజనులమీదా కరుణ గలిగి యుండుము."

ఈ వాక్యములు సాధారణమైనవే కాని, వీటిలో యెంత ఉన్నతమైన, విశాలమైన భావము, సర్వమానవ సౌభ్రాతృత్వ భావము యిమిడి వుంది !

---

* ఈ భావం మన కెంత పాతదంటే, దానిని మనం గుర్తే పట్టడం లేదు ! మహా భారతము, హరివంశము, అంతకంటె ప్రాచీనమైన రామా యణమూ మొదలైన వాటిలో పదేపదే చెప్పబడిన విషయం యిదే. భారతీయ సారస్వతం ఈ ధర్మబోధనా విషయంలో అనన్యము, అద్వితీయము. ఆచరణలో పెట్టుటే లోటు గాని ధర్మబోధ ఎప్పుడూ ఘోషించబడుతూనే ఉంది.

మానవుని బలం, భవిష్యత్తు, వివిధజాతుల స్నేహంలోనే యిమిడి వుందని శతాబ్దములు గడుస్తూన్నకొద్దీ అధికాధిక సంఖ్యాకులైన మానవులు గ్రహిస్తూ వచ్చేరు. ఈ విషయాన్ని గ్రహించిన మహాజనులు తమచుట్టూ ఉన్న ఇరుకు గోడలను అంతకంతకు వెనక్కి నెట్టివేస్తూ వచ్చేరు. వారు తమ దేశాన్నీ, భూమినే గాక యావత్తు భూప్రపంచాన్నీ, మానవజాతి నంతనీ ప్రేమిస్తూ, కంటికి రెప్పలా కాపాడుతూ వచ్చేరు...

కాని, మన కథాకాలాన్ని దాటి అంత ముందుకు బోవద్దు. మనం భూస్వామ్య యుగంలో కాదూ, ఉన్నాము ? ఆ యుగములో ఈ ప్రపంచమంతా అనేక అడ్డుగోడలతో నిండివుండేది. ఒక తెగకీ మరోతెగకీ, ఒక జాతికీ యింకో జాతికీ, ఒక మతానికీ యింకో మతానికీ మధ్య అధిగమించరాని అడ్డుగోడలున్నా ఆ కాలంలో కూడా యీ చిన్నచిన్న తెగలు, ప్రపంచాలు ఒక రొకరిని గూర్చి తెలుసుకుంటూ, గ్రహిస్తూ, తమ జ్ఞానాన్ని విశాలపరుచుకుంటూనే వచ్చేరు.

గలీషియా (పోలండు) రాష్ట్రంలోని ఆర్థొడాక్సు చెర్చి (గ్రీక్ సనాతన చెర్చి) కూడా ఫ్రాన్సులోని కెథాలిక్ కెథిడ్రల్ వలెనే వుండేది. కిటికీల రంగుల అద్దాల్లోంచి ఎరుపు, నీలం, ఆకుపచ్చని కిరణాలు చెర్చిలోని ఋషి విగ్రహాలమీాదికి పడుతూంటాయి. కీవ్ నగర వైభవాన్ని చూసి, విదేశీయు లెంతో ఆశ్చర్యపడేవాళ్ళు. బైజాంటియమ్‌తో కూడ కీవ్ నగరం అందములో పోటీచేస్తుం దనుకొనేవాళ్ళు.

క్రీస్తుశకం 12 వ శతాబ్దం వచ్చింది. నొవోగొరోద్ – మాస్కో నగరాల మధ్యనున్న మహారణ్యప్రాంతంలో మరొక నగరం బైలుదేరింది. దాని పేరే 'వ్లాదిమిర్.' క్లియాజ్మానది యెగువ ప్రాంతాల్లో, ఆకాశాన్నంటే ఆరణ్యకవృక్షాగ్రాల మీదుగా అంబరవీధిలోనికి వ్యాపించిన గంభీరోన్నత కలశ శిఖరాలతో సమోన్నతములైన కెధ్రడల్ కట్టడాలు లేచినాయి. వ్లాదిమిర్ నగరం అనేక దేవాలయాలతో యాత్రాస్థలమైంది.

దూరదేశాలనుంచి వచ్చిన యాత్రీకులు దిమిత్రోవ్ కెధ్రడల్ గోడలమీద చెక్కబడిన శిలాశిల్పములను చూచి ఆశ్చర్య పడేవాళ్లు. నిర్జీవములైన గండశిలలను జీవ ముట్టి పడే మానవ విగ్రహాలుగాను, సజీవము లని భ్రమకలిగించే వివిధ జంతు పక్షి రూపాలుగాను చెక్కగలిగిన శిల్పుల నేర్పునకు అందరూ ముక్కుపై వ్రేలు వేసుకొనేవారు. ఇదిగో! చూడండి! ఇక్కడ కొన్ని భయంకర జంతురూపా లేవో. రెక్క లున్నట్టివి ఉన్నాయి. ఇల్లాంటివి యెక్కడో చూసేము కదూ. ఆఁ! ఔను! పారిస్‌లోని నోత్రీదామ్ కెధ్రడల్ శిఖరాన్నుంచి క్రిందికి చూస్తూన్నట్లు చెక్కబడిన ఖైమిరాల్ని * జ్ఞాపకం తేవడంలేదూ, యివి! ఈ చెర్చి నెర్లా నదీతీరాన, వ్లాదిమిర్ నగరానికనతిదూరంలో నిర్మించబడింది. అత్యంత

* పురాణగాథల్లోని కల్పితజంతువు, సింహం తల, పాము తోక, మేక శరీరమూ గలిగి, మంటలు గ్రక్కుతూండే కవికల్పితప్రాణి, గ్రీకుల సృష్టి — అనువాదకుడు.

లాఘవంతో, అత్యద్భుతంగా తెల్లని స్ఫటికశిలలతో గంభీరోన్నతంగా నిర్మించబడిన యీ చెర్చి, క్రీ॥ శ॥ 1165 వ సంవత్సరంలో పూర్తి గావించబడింది.

క్రీ॥ శ॥ 12 వ శతాబ్దంలోనే కాకేసస్ పర్వత ప్రాంతంలోని జార్జియా దేశంలో ఒక గొప్పకవి, షోత్ 'హా రుస్త్‌వ్యాలీ' అనే అత డుండేవాడు. ఆయన ఒక గొప్ప కావ్యాన్ని రచించేడు. దానిలో పాశ్చాత్యుల మేధాశక్తి, ప్రాగ్దేశీయుల భావనా పటిమ, కవితతో మేళవించ బడింది. జార్జియనులను గూర్చి బైజాంటియనులు యిల్లా అంటూండేవాళ్లు: 'వీరు పుట్టుక చేత జార్జియనులైనా, సంస్కృతిలో నిజమైన గ్రీకులు !'

కీవ్, పారిస్, కాన్‌స్టాంటినోపుల్, లండన్ నగరాల్లో జనులు విహారగ్రంథాలయాల్లో పుస్తకాలు చదువుతూన్నారు, ఇప్పుడు; కథలు, గాధలు రాస్తున్నారు; తమ వ్రాత ప్రతులను బంగారు నీటితోనూ, వివిధ వర్ణముల సిరాలతోనూ అతి మనోహరముగా అలంకరిస్తూన్నారు. ప్రకరణముల ప్రథమాక్షరములను యెంతో శోభాయమానంగా, పెద్దవిగా నగిషీ చెక్కుతూన్నారు.

పిల్లలు చెర్చి పాఠశాలలకు పోతూన్నారు. చదువను, వ్రాయను నేర్చినవాళ్లు యెక్కువగా కనబడుతూన్నారు. విశాల ప్రపంచంలోని వింతలను, విశేషాలను చూచేటందుకు ఒక గవాక్షంగా ఉపయోగిస్తూంది, ప్రతి గ్రంథమూ వాళ్ళకి !

---

# ఐదో ప్రకరణం

## 1. పుస్తకాలు, పాఠశాలలు, విశ్వవిద్యాలయాలు

పాఠశాలలు తేనెపట్టుల్లాగ ఝుమ్మను కలకలంతో సందడిగా వున్నాయి. పిన్నలూ-పెద్దవాళ్ళూ; ఆ తరగతీ యీ తరగతీ అనే భేదం లేకండా బడిలోని పిల్లలందరూ ఒక పొడవాటి బల్ల యెదుట కూర్చుని వున్నారు. చిన్నపిల్లలు తమ గొంతులెత్తి బిగ్గరగా 'మన తండ్రి, స్వర్గాధిపతి...' అంటూ కలిసి బృందప్రార్థన వల్లిస్తూన్నారు. ఇంకొంచెం పెద్దపిల్లలు ఒక్కొక్క అక్షరాన్నే విడిగా ఉచ్చరిస్తూ, శబ్దములకు వర్ణక్రమం చెపుతూన్నారు. మరీ పెద్దపిల్లలు 'సాల్టర్' పుస్తకం (సామగీతాలు 150 న్నీ ఉండే పుస్తకం లేదా 150 ప్రార్థనా భక్తి వాక్యాలు గల గ్రంథం) చదువుతూన్నారు. ప్రతీ పిల్లవాడూ గొంతెత్తి అరుస్తూన్నాడేమో, సంతగోలగా తయారైంది. కొత్తగావచ్చిన వాళ్ళకి చెవులు ఘుడియలు పడతాయి; ఎవరేం చదువుతూన్నారో అసలే తెలియదు.

కాస్త బాగా చదువగలిగిన పిల్లలు గురువుగారి ప్రక్కనే కూర్చుని, ఆయన చెప్పిన దానినే తిరిగి పలుకుతూన్నారు. పంక్తులను వ్రేలితో చూపుతూ, ఒకొక్కొక్క మాటనే ఒత్తి పలుకుతూన్నారు. ఈ పిల్లలు తమ కండ్లమీాదకంటె చెవుల మీాదనే అధికంగా ఆధారపడి వుంటూంటారు. ఎందుచేత

నంటే, వాళ్ళు పుస్తకం చూసిగాదు చదువుతూన్నది: గురువు గారు చెప్పిన దానినే శిష్యులు తిరిగి ఉచ్చరిస్తూండాలి!

పిల్లల మనస్సులు మాత్రం వాళ్ళు చదువుతూన్న పుస్తకాలమీాద వున్నట్లు లేదు. ఇంకెక్కడున్నాయి? అదిగో! పావురాల గుంపు! చెర్చి శిఖరం మీాదనుంచి యెగిరిపోతూన్నాయి! ఇదిగో! గొర్రెల మంద! వీధంతా దుమ్ము రేపుతూ తోలుకు పోతున్నాడు, గొర్రెల కాపరి! పిల్లల మనస్సునాకర్షించేందుకు యిల్లాగే యెన్నో!

పిల్లల బుర్రల్లో యేదో వాళ్ళ వాళ్ళ ఆలోచనలు నిండి వుంటాయి. వాళ్ళు నోటితో ఉచ్చరించే దానిని గూర్చి వాళ్లు ఆలోచించడంలేదు. ఒకవేళ కొంత దానిని గూర్చి ఆలోచించవచ్చునేమో గాని ఆ పుస్తకంలో వ్రాయబడినదానిని మాత్రం వాళ్ళు కొంచెంకూడా అర్థంచేసుకో లేరు. అంచేత ఆలోచించనే ఆలోచించ లేరు! రష్యను పిల్లలకు, వారు చదువ ప్రయత్నిస్తూన్న సనాతన చెర్చి స్లావుభాష అర్థం చేసుకోవడం చాల కష్టంగానే వుంది. అందులో వాడినది లాటిన్ భాష. దాని అర్థ మేమో పురోహితులకీ, గురువుగారికీ తప్ప యింకెవరికీ తెలియదు. అందుచేతనే వారు మాటకి మాటగా గురువుగారి దగ్గిర 'సంత'గా చెప్పుకోవాలంటే ఆశ్చర్య మేముంది? వారు ఒక పుస్తకాన్ని పూర్తిగావించేక యింకో పుస్తకాన్ని ప్రారంభిస్తారు. . పూర్తిచేయించిన పుస్తకానికి యింత చొప్పున గురువుగారికి దక్షిణ ముట్టేది. పిల్లల తలి

దండ్రులతో గురువుగారు మాట్లాడుకున్న పద్ధతి, యిది. ఒక్కొక్క కొత్త అంగీకి యింత అన్నట్లుగా ఒక్కొక్క కొత్త పుస్తకానికి యింత, అని విలువ! నేతగాడు, దర్జీవాడు మొదలైన వాళ్ళని పిలిచినట్లే గురువును కూడా 'మాష్టరు' అనికూడా పిలిచేవారు. 'మాష్టరు' అంటే 'గొప్పవాడు' అని గాని లేదా ఒక కళలోనో, విద్యలోనో ప్రత్యేక నైపుణ్యం గలవాడు అని గాని అర్థం.

మాష్టరుగారు గణితంలో పిల్లలను యెంతో దూరం తీసికొని పోవడంలేదు! అంటే కూడికలవరకూ మాత్రమే యీ బడిలో చెప్తున్నారు. ఇంకాపైన నేర్చుకోవాలని వుంటే వాళ్ళింకో పాఠశాలకు వెళ్ళాలి. ఆ పాఠశాల కెథిడ్రల్‌లో గాని, విహార మఠంలో గాని వుంటుంది. అక్కడ వ్యాకరణం, అలంకారం, తర్కం మొదలైనవి బోధిస్తారు. ఈ విషయాలన్నీ నేర్చుకున్నాక శిష్యులు, గణితం, ఖగోళశాస్త్రం, భూమితి లేక క్షేత్రమితి, సంగీతం నేర్చుకుంటారు.

ఏడుగురు అప్పచెల్లెండ్ర మాదిరిగా విజ్ఞానశాఖలు కూడా యేడు వున్నాయి. శబ్దములను గూర్చినది వ్యాకరణశాస్త్రం; సత్యమును తేల్చి చెప్పేటందుకు తర్కశాస్త్రం; ప్రసంగములను శోభస్కరంగా చేసేటందుకు అలంకారశాస్త్రం; సుస్వరముతో పాడుటకై సంగీతశాస్త్రం; లెక్కలు తేల్చుటకు పనికి వచ్చేది గణితశాస్త్రం; సూర్యచంద్ర గ్రహనక్షత్రాలను గూర్చి తెలిపేది ఖగోళశాస్త్రం లేక జ్యోతిశ్శాస్త్రం: ప్రదేశమును లేక భూమిని కొలచుటకై భూమితి లేక క్షేత్రమితి

శాస్త్రం; యిల్లాగే వివిధ శాస్త్రాలు, వివిధ ప్రయోజనాల కొరకై వున్నాయి.

వ్యాకరణం చదవడం పాప మని బిషప్పులుకూడా చెప్తూండే ఆ దినాలు యెల్లాగో గతించిపోయినాయి. ఇక యిప్పుడో? బిషప్పులే గాక అంతకంటే పదవిలో తక్కువ స్థాయిలో వుండే అబ్బాట్లుకూడా చదువను, వ్రాయను నేర్చుకుని వుండాల్సి వస్తూంది.

వ్యాకరణం అంటే అంత సులభమైన దేమీ కాదు. గణితం అంతకంటెనూ కఠినమైనది! అరబిక్ అంకెలు,-హిందూ దేశాన్నుంచి అరబ్బులద్వారా ఐరోపాకు వెళ్ళినందున వీటిని అరబిక్ అంకె లంటున్నాము,— తెలిసినవాళ్ళు బహు కొద్ది మందే! అంకెలు యింకనూ పాత లాటిన్ పద్ధతిలోనే వ్రాయబడేవి. లాటిన్ అక్షరములనే కొన్నింటిని యెంచి, అంకెలుగా వుపయోగించేవారు. * వీటినే రోమక అంకము లనికూడా అంటారు. రోమక అంకెలలో పెద్ద పెద్ద సంఖ్యలను చదవడమే కష్టం; కూడటం మరీ కఠినం; యిక వీటిలో గుణకారం, భాగహారం అంటే యెంత కష్టమో చెప్పనక్కరేలేదు! రోమక అంకెల్లో భిన్నములను గురించిన సంకలనం మొదలైనవి కేవలం అసంభవ మనియే చెప్పాలి!

---

* I ఒకటి; V= ఐదు; X= పది; L= యేభై; M= నూరు పది అంకెలను ఒకదానిప్రక్క నొకటిగా వేసి, వాటి విలువను స్థానాన్ని బట్టి లెక్కించే పద్ధతిని భారతీయ గణితశాస్త్రము లోనే ప్రథమమున చూస్తాము.

అంతేగాదు. ప్రతి అంకెయొక్కా అర్థాలను, సంకేతా లనూగూడ పిల్లలు నేర్చుకొనివుండాలి. గురువు శిష్యుల కీ రీతిగా బోధించేవారు: 'నాలుగు అంకెనే తీసుకోండి. అది నాలుగు ఋతువులను,* నాలుగు దిన విభాగాలను తెలుపుతుంది. వసంత గ్రీష్మ, వర్ష, హేమంతములు నాలుగు ఋతువులు; ఉదయం, సాయంత్రం, పగలు, రాత్రి, యీ నాలుగూ దిన విభాగాలు. ఇది మన తాత్కాలిక ఐహిక జీవితాన్ని, దానిలోని అల్పఆశలు, తుచ్ఛ సంతోషములు మొదలైన వాటిని సూచిస్తూందన్న మాట. తాత్కాలిక సంతోషాల్ని, తుచ్ఛ సౌఖ్యాల్ని వదలిపెట్టి, మానవుడు దినమంతా ఉపవసించి, ప్రార్థనలో గడపుతూ తన అవినీతిప్రవర్తనకై పరితాపపడాలి."

మూడు అంకె వుంది, చూసేరూ, అది త్రిమూర్తులనూ అంటే పరమపిత- ఈశ్వరుడూ, ఏకైక కుమారుడు-ఏసుక్రీస్తూ, పవిత్రాత్మ - హోలీ ఘోస్టు:- యీ త్రితయాన్ని తెలుపు తూంది. క్రైస్తవులు యీ త్రితయమును నమ్ముతారు.

ఏడు అంకె వుందే, అదే మానవుడు! ఎల్లాగంటారా? మానవునిలో శరీరం, ప్రాణం అనేవి వున్నాయి. ప్రాణం అనే దాంట్లో హృదయం, ఆత్మ, మనస్సు:- యీ మూడూ చేరి వున్నాయి. దీనికి ఆధారం యేమిటంటే బైబిలులో 'నీవు నీ పరమ ప్రభువైన దేవుని నీ హృదయ మంతటితోను, ఆత్మ

* భారతీయులకు ఋతువులు ఆరు; వసంత గ్రీష్మ వర్షా శిశిర శరత్ హేమంతములు.

యంతటితోను, మనస్సు అంతటితోనూ ప్రేమింపుము !' అని వ్రాయబడివుంది గనుక. ఇక శరీరం విషయం. శరీరంలో నాలుగు భూతాలు; * అగ్ని, జలం, పృథ్వి, వాయువు— యీ నాలుగు మూలపదార్థాలూ వున్నాయి. శరీరంలోని నాలుగు భూతాలున్నూ, ప్రాణములోని మూడు విభాగాలున్నూ, వెరశి యేడు అవుతూంది గదూ.

ఖగోళశాస్త్రంలో భూమ్యాకాశాల వర్ణనలు చదివేవారు, శిష్యులు. ప్రాచీనకాలంలో వివిధ పుక్కిటిపురాణాలను, వాన, మంచు, జంతువులు, పక్షులు మొదలైనవాట్లను గూర్చి, అభూతకల్పనలను వాళ్లు నేర్చుకునేవారు. దేవతలు తమ బాకాలను సముద్రోదకంతో నింపి, భూమిమీదికి పోయడమే వర్షమని వాళ్ళు భావించేవారు. కొన్ని దుంపలనుంచి చెట్లు బైలుదేరినట్లే పొట్టేలు కొమ్ములు పెరుగుతాయనీ, కొన్నిరకాల పండ్లనుంచే పక్షులు పుడుతున్నాయనీ విశ్వసించేవాళ్ళు. ఇప్పుడు జనులు యిల్లాంటి కాకమ్మ కథలను, అభూతకల్పనలను నమ్మడంలేదు. వాళ్ళు ప్రతీ విషయాన్నీ పరిశీలనగా చూడడం నేర్చుకుంటున్నారు.

ప్రాచీన శాస్త్రవేత్తలైన అరిస్టాటిల్, టాలమీ మొదలైనవాళ్ళ గ్రంథాలు అరబ్బులద్వారా తూర్పునుంచి పశ్చి

* గ్రీకు విజ్ఞానులు మూలభూతాలు నాలుగని భావించేవారు. మన పూర్వులు పంచభూతాలుగా పృథివ్యప్తేజోవాయు రాకాశములను నిర్ణయించారు. 'పంచభూతాలు' అనే మా గ్రంథాన్ని చదవండి, యీ వివరాలకి.

మానికి వచ్చినాయి. విహార పాఠశాలల్లోని విజ్ఞానులు నాలుగు భూతాలనుగూర్చి, పృథివ్యప్తేజో వాయువులను గూర్చి యెరుగుదురు; స్ఫటిక సంకాశములై స్వచ్ఛకాంతితో ప్రకాశిస్తూన్న గ్రహ తారకాది ఖగోళములు ఆకర్షణా శక్తితో అనంతాకాశంలో పరిభ్రమిస్తూన్నాయనీ వారెరుగుదురు కోస్మాస్ పండితుడు యీ విశ్వమునంతనూ చిన్న బొమ్మరిల్లుగా వర్ణించిన దానికంటె వీరి భావన యదార్థానికి సమీపంగా వుండనేది నిర్వివాదం.

బొలోగ్నా, పారిస్ నగరాల్లో విశ్వవిద్యాలయాలేర్పడినాయి. యాత్రీకులు చేతుల్లో పొడవైన దండములనూ, వీపుల మీద వలాసములనూ ధరించి, యీ విద్యాలయాలకు వచ్చేవాళ్ళు. వీళ్ళు వెనుకటి యాత్రీకుల వంటి వాళ్లు కారు. వీళ్లు పిన్నవయస్కులు. ఏ వృద్ధతపస్వికి మొక్కుటకో, యే మహాత్ముని పవిత్రాస్థికలకు నమస్కరించుటకో వీరు రాలేదు. పారిస్‌లోని నోత్రీడామ్ కెథిడ్రల్ పాఠశాలకు, విఖ్యాత పండితులైన గైల్లామీ ఆఫ్ ఛాంపియూ, పీర్రీ అబెలార్డ్ మొదలైన వారి ఉపన్యాసాలు, ప్రసంగాలు వినడానికే వీళ్ళు వచ్చేవారు! ఈ పండితుల ఖ్యాతి పాశ్చాత్య ప్రపంచమందంతటనూ వ్యాపించింది. పోయ్‌టీటీర్స్, ఆన్‌జౌ, బ్రిటనీ, ఇంగ్లాండు దేశాల్లో యీ పండితులకు విశేషఖ్యాతి వుండేది.

విద్యార్థులుగా వుండదలచి వచ్చిన యీ యాత్రీకులు పారిస్ చేరి, తమ దేశీయులను తెలుసుకుని, వాళ్ళతో సంప్ర

దించేవాళ్ళు. నోత్రీదామ్ కెథ్రడల్ మార్గం అడిగి తెలుసుకుంటారు, వీళ్ళు. చిన్న వంతెన మీాదనుంచి సీనే నది యెడమ గట్టునే పోతే వుంటుంది, నోత్రీదామ్ కెథ్రడల్. అక్కడకు వెళ్ళి, తమవంటి విద్యార్థులు వందలాదిగా అదివరకే అక్కడ చదువుకుంటూండడం చూస్తారు. ఒకటి రెండు నెలల్లోనే యీా నూతనాగంతుకులుకూడా లాటిన్ పేటలో పాతకాపులై పోయి, స్థానిక నివాసులుగా అయేవాళ్ళు. ఆ పాఠశాలా ప్రాంతాన్ని జనులు లాటిన్ పేట అని పిలిచేవాళ్ళు లెండి.

ఫ్రాన్సు జనులు మాట్లాడే భాష ఫ్రెంచి భాష. కాని, లాటిన్ పేటలో అల్లాకాదు. అక్కడ అందరూ లాటిన్ భాష మాట్లాడతారు. ఫ్రెంచివారు, ఆంగ్లేయులు, ఇటాలియనులు, జర్మనులు, యింకెవరు గానీ ఆ పేటలోనివా రందరూ లాటిన్ భాషే మాట్లాడుతారు! *

ఈ విద్యార్థులను పారిస్ నగరవాసులు వంకరచూపులు చూసేవాళ్ళు. వీళ్ళంతా పరదేశులు గాని స్వజనులు గారని వాళ్ళభావం. విద్యార్థులుకూడా అల్లరిగానే ప్రవర్తిస్తూండే వాళ్లు. వీధుల్లోనో, పాఠశాలల్లోనో, కలుసుకున్నప్పుడు పారిస్ జనులకూ, యీా విద్యార్థులకూ తరచు పోట్లాటలు జరుగు

* మన దేశంలో చదువంతా సంస్కృతంలో జరిగినట్లన్నమాట. కాశీ, నవద్వీపం, చిదంబరం, కంచి మొదలైన విద్యాస్థానాలు పురాణ యుగాలవైతే అంతకు పూర్వం మహా పండితులైన కులపతులు నివసించిన ఆశ్రమాలే విద్యానిలయాలు. అల్లాగే యూరోపులోనూ యిటీవలి వరకల్లా జరిగినది. బాణభట్టుని వర్ణన చూడుడు.

తూండేవి. పురపెద్దలో, వర్తకులో, దుకాణదారులో జోక్యం కలుగచేసుకుని పొగరుబోతు విద్యార్థులను నిర్బంధించమని రక్షకభటులతో చెప్పేవారు. కాని అదంత సులభం గాదు! విద్యార్థులు గట్టిగా యెదిరించి దెబ్బలాడుతూండేవాళ్లు వీళ్లు పురపెద్దల అధికారాన్ని గౌరవించేవాళ్లు గారు. విద్యార్థులకు పెద్ద వేరేవున్నాడు. నోత్రీదామ్ కెథిడ్రల్ ఛాన్సులర్, వీళ్ళ పెద్ద



హిప్పొక్రేటస్

లాటిన్ పేటలోని ఉపాధ్యాయులు, విద్యార్థులూకూడా నిరక్షరులైన పారిస్ వర్తకులను, పనివాళ్ళను చాల తృణీకార భావంతో చూసేవాళ్లు. ఎద్దుకేం తెలుసు అటుకుల రుచీ, అన్నట్లు ఈ మడ్డిమూకకు ఏమి తెలుసు? ఈ జనానికి తత్త్వ

శాస్త్రం తెలుసా ? ధర్మశాస్త్రం తెలుసా ? మత ధర్మాలు, సాంప్రదాయాలు, యేం తెలుసు ? ఇంక వైద్యశాస్త్ర విషయం చూద్దాం, పోనీ. జలగల్ని పట్టించో మరోలాగో జనుల దుష్టరక్తం తీస్తూ, వాళ్ళ గడ్డాలు గొరిగే క్షురకుడూ వైద్యుడే అంటావా ? హిప్పోక్రేటస్, గాలెన్, పండితులను





గా లె న్

గూర్చి క్షురకుని కేమి తెలుసును ? వైద్యశాస్త్ర పితామహు లైన యీ మహామహులను గూర్చి వాళ్లు అసలు వినికూడా వుండరు !

ఏ పౌరుణ్ణయినా అరిష్టాటిల్ యెవరని అడిగిచూడు ! అతడు నోరు తెరబెడతాడు. అంతే ! కాని, విద్యార్థులో ?

సెయింట్ ఆగస్టైన్‌ను గురించి యెంత శ్రద్ధగా చదివేరో అంత శ్రద్ధగానూ వాళ్లు అరిస్టాటిల్‌ను గురించి పఠించేరు, మరి!

అప్పటికి కొద్దికాలం క్రితమే గ్రీకుతత్త్వవేత్తల వ్రాతలన్నీ నరకం నుంచి బైలుదేరిన నాస్తికప్రలాపాలని భావించేవారు, అంతా. హెబ్రూ, అరబ్ భాషలనుంచి లాటిన్ భాషలోని కనువదించబడిన గ్రీకు శాస్త్రజ్ఞుల రచనలన్నీ క్రైస్తవమతాధిపతుల ఆజ్ఞానుసారంగా తగులబెట్ట బడేవి! కాని, యిప్పుడు రోజులు మారిపోయినాయి. అరిస్టాటిల్ పండితుడుకూడా ఏసుక్రీస్తులాగే అత్యంత గౌరవాస్పదుడుగా గౌరవించబడుతూన్నాడు! అరిస్టాటిల్ విధర్మి యన్నమాట నిజమే. కాని, ఆయనకు మేధాశక్తి నెట్లుపయోగించవలయునో తెలుసు; సేకరించిన, గ్రహించిన విషయబాహుళ్యా న్నంతనీ వర్గీకరించడంలో మహా దిట్ట! ఈయనంత తెలివిగా ఆలోచించడం, విషయ విభాగ నిర్ణయం చేయడం సామాన్యం గాదు. అరిస్టాటిల్ మహామేధావి, మహాజనుడు! మానవు లంతా ఆరాధించదగిన వారిలో నొకడు!

ఈ రోజులలో అంతకంత కధిక సంఖ్యాకులుగా బైలుదేరుతూన్న యీ విధర్ములు, పరధర్ములు, నాస్తికులు, అవిశ్వాసులు వీళ్ళతో కాస్త వాదిస్తూండు, వాళ్ళ పస తెలుస్తుంది. వాళ్ళ వాదనలను, వాళ్ళ ప్రాతిపదికలమీదనే, వాళ్ళ సిద్ధాంతముల చేతనే, నీవు ఖండించగలిగి యుండాలి. లేకపోతే వాళ్ళ తర్కంతో, యుక్తులతో నిన్ను గాభరా పెట్టేస్తారు, నలుగురిలో

నవ్వులపాలు చేస్తారు. చివరికి నిన్ను దిష్టిపిడతను చేసి వదలి పెడతారు! కొంతకాలానికి వాళ్ళ పైశాచికవ్యూహంలో, నాస్తిక వాదనల్లోకి నువ్వే పడిపోవచ్చుకూడాను. అందుచేత కేవలం అంధానుకరణం గావించేవాడుగా, విశ్వాసపాత్రుడైన మతవిశ్వాసివిగా వుంటేనే చాలదు. 'నీ బుర్రలో గుంజు వుందని కూడా ఋజువు చేసుకుంటూండాలి! బుద్ధికి పని చెప్పా లన్నమాట.

ఈ విధంగా జనులు ముందుకు మరో పెద్ద అంగ వేసేరు. అప్పటికి కొన్ని శతాబ్దాలుగా ఆలోచించకండా నమ్మడం మంచి దని జనులకు బోధ గావించుతూ వచ్చేరు. ఇప్పుడు కేవలం గ్రుడ్డిగా విశ్వసించకండా ఆలోచించడం అనేది జనులు మళ్ళీ ప్రారంభిస్తూన్నారు. ఒకసారి ఆలోచించడం ప్రారంభించిన వాళ్ళని ఆపడ మనేది అసంభవమైన విషయం. ఎందుచేతనంటే ప్రతిదానికీ ఋజువూ, సాక్ష్యమూ చూడ్డం ప్రారంభించిన మానవులకు తర్కమూ, శంకలూ, కార్యకారణవివేచనా కలిగి తీరుతాయి!

అంధవిశ్వాసులుగా వుండే అసంఖ్యాకజనానికీ, విశ్వాసాలను విజ్ఞాన మనే గీటురాయిమీద పరీక్షించా లనేవాళ్ళకీ తగువు లారంభమైనాయి. క్లెయిర్వాలోని అబ్బట్ బెర్నార్డ్ లాంటి వాళ్ళుకూడా కొందరుంటారు. వాళ్ళు చెవులు రెండూ మైనంతో మూసేసుకుంటారు! ఎందుకో తెలుసా? ఐహికము

లైన తుచ్ఛ విషయాలను చెవులతో వినడంకూడా వాళ్ళకి యిష్టంకాదు గనక !

అబ్బట్ బెర్నార్డ్‌ను గురించి ఒక కథ చెపుతారు. ఆయన ఒకప్పుడు జినీవా సరస్సుమీద పడవప్రయాణం చేస్తున్నారు. ఏవో ఆలోచనల్లో మునిగివుండిపోయిన బెర్నార్డ్ ఆ సరస్సునే గమనించలేదు. ఆయనతో కూడా వున్న మనిషి సరస్సును గూర్చి మాట్లాడ నారంభించేసరికి బెర్నార్డ్ విస్తుబోయేడట! ఆయన కండ్లు తెరచే వున్నాయి; జాగ్రదవస్థలోనే వున్నాడు కూడాను. కాని, చుట్టూ వున్న వస్తుప్రపంచాన్ని ఆయన కండ్లూ చూడడం లేదు, మనస్సూ గ్రహించడం లేదు !

మరి కొందరు మనుష్యులు పీర్రీ అబెలార్డ్ వలెనే సమస్తాన్నీ చూడాలి, వినాలి, ఆలోచించాలి అని కోరుతారు. పీర్రీ అబెలార్డ్ పిన్నవయస్కుడైన ఆచార్యుడు, పరివ్రాజకుడు. ఆయన కండ్లతో శూన్యాన్ని గాక వివిధవస్తు విషయ పూర్ణమైన విశాల ప్రపంచాన్ని చూసేవాడు. సన్యాసుల మఠంలోని సంకుచితమైన చీకటిగదిని గాక తేజఃపూర్ణమైన విశ్వాన్ని యెట్టయెదుట తిలకించేవా డాయన !

## 2. బెర్నార్డ్, అబెలార్డ్‌ల గాథ

అబ్బట్ బెర్నార్డ్, ఆచార్య అబెలార్డ్‌లు యిద్దరూ క్రైస్తవ మఠనివాసులే, క్రైస్తవులే. కాని, అబెలార్డ్ అవిశ్వాసి, విధర్మి యని బెర్నార్డ్ నేరారోపణ చేసేడు. తమ

రిద్దరిలో యెవరిది సత్యమో, ధర్మమో మతపీఠాధిపతులు విచారించి తీర్పు చెప్పాలని అబెలార్డ్ దృఢంగా నిలబడ్డాడు.

విచారణాదినమున రెండు పక్షాలూ పారిస్‌కు వచ్చేరు. ధర్మ విచారణ జరిగే సభాభవనంలోనికి బెర్నార్డ్ ఒక ద్వారాన, అబెలార్డ్ మరో ద్వారాన ప్రవేశించేరు. పట్టణం పట్టణ మంతా వాళ్ళని చూడ్డానికి విరగబడింది. బెర్నార్డ్ కనబడగానే జనసమూహాలు సగౌరవంగా ఆయనకు వైదొలగి నిలిచేరు. ఆయన పాదచారియై, సన్యాసులు ధరించే ముతక అంగీతో, తలవంచుకొని వచ్చేరు. జను లందరి కళ్ళూ ఆయన మీదే వున్నాయి. ఉపవాసాలతోనూ, జాగరణలతోనూ, నియమానుష్ఠానాలతోనూ బెర్నార్డ్ ముఖం శుష్కించి వుంది ఆయన నేత్రాల్లో నిగూఢమైన శక్తి యేదో అంతర్గర్భితంగా వుంది. ఆయన కళ్లు రెండూ యేకాగ్రతలో, జాజ్వల్యమానంగా వెలుగుతూన్నాయి. ఆయన సాధించిన అత్యద్భుత అలౌకిక కార్యములను గురించీ, ఆయన వాక్శుద్ధిని గురించీ జనులు ఊరికే గుజగుజలు పోతూన్నారు!

'ఆయన మహర్షి!' అన్నారు జనం, బెర్నార్డ్‌ను గూర్చి.

కుంటివాళ్ళు, గ్రుడ్డివాళ్ళు, రోగిష్టులూ ఆయన చుట్టూ మూగేరు. ఆయన ముందు మోకరించి, తమ్ము ఆశీర్వాదించ మనీ, రోగబాధా నివారణ ననుగ్రహించ మనీ వేడు కుంటూన్నారు!

అబెలార్డ్ పేరుకూడా అందరకూ తెలిసినదే. దేశమంతటా ప్రజల్లో ఆయన పాటలు ప్రచారంలో వున్నవే. 'హెలోయ్‌సీ!' అనే సంబోధనా మకుటంతో అబెలార్డ్ యెన్నో గీతాలను రచించేడు.

కథాక్రమం ప్రకారం, హెలోయ్‌సీ అను యువతి, అబెలార్డ్ శిష్యురాలు. ఆ కాలంలోని స్త్రీలందరివలె వడకుట, కుట్టుట, బుటేదారీ పని,–వీటితోనే కాలక్షేపం చేస్తూండక, హెలోయ్‌సీ నిరంతరం గ్రంధపఠనం గావిస్తూండేది. అరిస్టాటిల్, ప్లేటో, సెయింట్ అగస్టైన్, మొదలైన తత్త్వవేత్తల గ్రంధాలెన్నింటినో అబెలార్డు ఆమెకు బోధించేడు. వాళ్ళిద్దరూ ఒకే పుస్తకంమీద తలలువంచి, చదువుతూ తరచు కనబడేవాళ్ళు. వీరిద్దరూ పరస్పరం ప్రేమించుకున్నారట! హెలోయ్‌సీ ఆయనను ప్రేమించకండా యెట్లుండగలదు? ఆచార్య అబెలార్డు శిష్యగణ పరివేష్టితుడై వీధుల్లో నడుస్తూంటే, యువతులందరూ ఆయనను చూచుట కెంతో ఆతురపడేవాళ్ళు. అబెలార్డు చక్కని విగ్రహం గలవాడు; చతురత, తెలివితేటలు, పాండిత్యం, అద్భుతవాగ్ధోరణి, గంభీరమైన చక్కని కంఠస్వరం మొదలైనవన్నీ ఆయన కలంకారములు.

హెలోయ్‌సీ ప్రేమనుగూర్చి ఆమె బంధువర్గాలకి తెలిసింది. ఈ వివాహానికి వా రంగీకరించలేదు. మొరటుగాను, క్రూరంగానూ వా రామెను అబెలార్డునుంచి వేరు చేసేరు. భగ్నమనోరథుడైన అబెలార్డు పరివ్రాజకుడై ఒక విహార మఠానికి

బోయేడు. బ్రహ్మచారిణిగా వుండేటందుకు ఆమెనుగూడా అంగీకరింపజేసేడు. విహారమఠంలోనే కాదు, ఆఖరికి నరకంలో కూడా అబెలార్డుతో సన్నిహితంగా వుండడానికి హెలోయిస్ ప్రాణాలను కూడా ఒడ్డుతుంది. ఆయన నంతగాఢంగా ప్రేమించిందామె.

కాని, అబెలార్డు మఠప్రవేశం గావించినా తిరుగుబాటుదారుడే. చెప్పిన దానినల్లా గ్రుడ్డిగా విశ్వసించడానికి యీతడు అంగీకరించేవాడుగాడు. ప్రతీ విశ్వాసాన్నీ తర్కించి బుద్ధితో వివేచన గావించి, స్వీకరించాలని ఆతని ప్రయత్నం. ఆ రోజుల్లో యీ భావమే భయావహమైనది! ఈశ్వరపుత్రుడూ, జనులకు రక్షకుడూ ఐన ఏసు క్రీస్తు దైవీయమైన కారణవివేకరూపుడని అబెలార్డు చెప్తుతూండేవాడు. ఈ మాటలు వినేటపుడు జనులు భయంతో అటునిటు దిక్కులు చూసేవాళ్ళు. ఇల్లాంటి సంగతులు చెప్ప సాహసించినందుకు చాలమంది ప్రాణాలతోనే దహనం గావించబడ్డారు. సాంప్రదాయిక విశ్వాసాలకి భిన్నమైన దంతా విధర్మమే. వైధర్మ్యమైన మాటలు ఉచ్చరించడమే గాక వినడంకూడ ఆ రోజుల్లో నిషిద్ధమే.

జనసమూహాలు కదులుతూన్నాయి. వీధుల కిరుప్రక్కలా యేటవాలుగా నుండే కప్పులుగల యిళ్లు వరుసలు తీరివున్నాయి. వీధినిండా జనం క్రిక్కిరిసి వున్నారు. వీధి మలుపులో పట్టణ ద్వారం వైపున అందరి దృష్టులూ కేంద్రీకరించి వున్నాయి. జనసముద్రం పైగా వాళ్ళ శిరస్సులమీదుగా ఉన్నతంగా ఒక

అశ్వారూఢుడు కనబడుతున్నాడు. అతడే అబెలార్డ్. బెర్నార్డ్‌వలె అతడు పాదచారియై రాలేదు. సన్యాసుల మాదిరిగా పాదచారియై రాక అబెలార్డ్ యోధునివలె అశ్వారూఢుడై వచ్చేడు.

అబెలార్డ్ వస్తూంటే ముసలవ్వాలు శిలువ వేసుకుంటూ వైదొలగిపోతూన్నారు. కాని, జనసముద్రంలో ఏదో నిశిత మైన కలకలం బైలుదేరింది. అది భయంవల్లనూ గావచ్చు, మెప్పువల్లనూ గావచ్చు;- యేదైనా కావచ్చును.

ప్రతిద్వంద్వు లిద్దరూ కెథిడ్రల్‌లో ముఖాముఖిగా కలుసు కున్నారు.

భారమైన కెథిడ్రల్ కప్పుక్రింద దీపకాంతి అణచివేయబడి నట్లుగా మందంగా వుంది. వెలుపలమాత్రం యెండ తీక్షణంగా వుంది. బైటి సూర్యకాంతిలోంచి వచ్చిన వాళ్ళకి కెథిడ్రల్ లోపల మసక వెలుతురులో వ్యక్తులను విడమర్చి గుర్తించడం కష్టంగా వుంది. బిషప్పులు మహా ఆడంబరంగా దుస్తులు ధరించి కూర్చున్నారు. సన్యాసులంతా ముదురు జేబురా రంగు దుస్తుల్లో వున్నారు.

అబ్బట్ బెర్నార్డ్ వినీతవేషంలో వున్నా, భయంకరం గానూ, ఉద్రేకంతోనూ యెదుర్కొన్నాడు. అతడుకూడా అబెలార్డు వలెనే యోధకుటుంబ సాంప్రదాయానికి చెందిన వాడు. ధర్మనిర్ణయ సభలా లేదు, అది! యుద్ధరంగంలా కనిపిస్తూంది. బెర్నార్డును చూపుతూ, అవిశ్వాసి, విధర్మి,

అనృతవాది, పాషండుడు అని దూషించేడు: "మ్లేచ్ఛులైన తత్త్వవేత్తల పుస్తకాలు చదివే నువ్వూ మ్లేచ్ఛుడవే!"

సన్నని కిటికీల్లోంచి లోనికి వస్తూన్న కాంతి అస్పష్టంగా వుంది. బెర్నార్డు చర్మపు చుట్ట నొకదాన్ని విప్పి, ఆ మసక వెలుతురులోనే బిగ్గరగా చదువ నారంభించేడు. అతడు కొద్ది వాక్యాలు చదివేసరికే ఆ గ్రంథం అబెలార్డు వ్రాసిన 'ఔను, కాదు!' (Sic et non) అనే దని అక్కడున్న వాళ్ళందరూ గుర్తించేరు. ఆ పుస్తకంలో అబెలార్డు కొన్ని సమస్యలమీద యిరుపక్షాల వాదనలనూ యిచ్చి, మత పీఠాధిపతులు కొందరి వ్రాతలనుంచి తన వాదనకు బలంగా కొన్ని ఆధారాలను కూడ యెత్తిచూపేడు. ఇదంతా చదివి బెర్నార్డు యిల్లా ప్రశ్నించేడు: "ఇదంతా పరధర్మం గాదా? పాప చింతన, పాషండత్వమూ యీ వ్రాతల్లో స్పష్టం గావడం లేదా?"

బెర్నార్డు రెండుచేతులనూ ఆకాశంవైపు, చాచి, 'దేవుని క్రోధం యీ పాషండుని శిరముపై బడుగాక!' అని శపించేడు. ఆయన ఉచ్చరించే ప్రతీమాటా చెర్చి గర్భంలోనుంచి ప్రతి ధ్వనిస్తూనే వుంది.

కాని, అబెలార్డు ధైర్యంగా, కంగుమనే కంఠంతో మధ్యలోనే అడ్డుతగిలి అన్నాడు: "మీ న్యాయనిర్ణయాధికారాన్ని నేను గుర్తించ నిరాకరిస్తూన్నాను! పోపు తప్ప మరే యితరుల యొక్క ధర్మనిర్ణయాన్నీ అంగీకరించను!"

ఇల్లా అంటూ అబెలార్డు వెనుతిరిగి ధీరంగా, గంభీరంగా, నిదానంగా నడిచి కెథిడ్రల్ ద్వారంవైపు వెళ్ళిపోయేడు. ఈ రాతి గోడల మధ్యనుంచి, ప్రాచీనసమాధిలోని నిర్జీవ వాతావరణంలోనుంచి స్వచ్ఛమైన బాహ్య వాతావరణం లోనికి, జీవనధాత్రియైన సూర్యరశ్మిలోనికి ఆతడు వెళ్ళాలి. ఉక్కిరిబిక్కిరి చేసే కెథిడ్రల్ గర్భగుడిలోంచి బైటికి వెళ్ళి పోయి, గాలి పీల్చుకుంటే నే గాని ఆతడుండ లేక పోయేడు.

ధర్మ నిర్ణయస్థానం – చెర్చి కోర్టు – అబెలార్డు పరోక్షమందే తన తీర్పు నిచ్చింది:– "సన్యాసి అబెలార్డు అవిశ్వాసి; ఏతావతా దోషి."

అబెలార్డును విహార మఠంలోని ఒక గదిలో నిర్బంధించి వుంచేరు. సజీవ సమాధి గావించ బడినట్లున్న అబెలార్డులో వెనుకటి ధైర్య స్థైర్యములు, శక్త్యుత్సాహములు తొలగి పోయి, విన్నదనం తోప, బలహీనుడై పోయేడు.

ఆతని ప్రేయసి కంఠధ్వని దూరాన్నుంచి అతనిని పిలిచేది. హెలోయ్‌సీ ఆతనికి జాబులు వ్రాసేది. ఆతనిలో ధైర్యం పురిగొల్పి, వెనుకటి స్థైర్యాన్ని తిరిగి కలిగించాలని ఆమె ప్రయత్నం. కాని ఆమె గాఢవాంఛ, తీవ్రోద్రేకంకూడా యేమీ ప్రయోజనకారులు కాలేదు. ఆమె కాతడు వ్రాసిన జవాబుల్లో అధీరత, లొంగుబాటు తప్ప వేరేదీ కనిపించేది గాదు. అబెలార్డు ధైర్యం కుంఠితమైంది, తర్కశక్తి అవమానితమైంది. ప్రేమ మృతమైంది !

ఈ స్థితిలో యింకా బొందెలో ప్రాణాలను ధరించడం దేనికి ? అదివరకటి తన గోధ‌లను తానే నిరాకరిస్తూ, అబె లార్డు అతిదైన్యంగా మరణించేడు. అతని శతాబ్దిలో కాల ప్రవాహాని కెదురీది, ఒంటరిగా నిలబడుట చాల కష్టమైనది.

చాల సంవత్సరాలు గడిచినాయి. అబెలార్డు అస్థికలు హెలోయిస్ అస్థికలతో బాటు ఒక చోట సమాధి గావించ బడినాయి. వ్యర్థమనోరథులైన ప్రేమికులను గురించిన యేదో పాతపాటలోని సంఘటనల వలెనే యిదంతా జరిగిపోయింది. అబెలార్డు – హెలోయిస్‌ల సమాధిమీద యీ మాటలు చెక్కబడినాయి.

"...దుఃఖకరమైన కృషివల్లనూ, భగ్నప్రేమవల్లనూ మరణించేరు..."

ఈ రీతిగా రెండు శిబిరాల వారికీ పోరాటం జరుగుతూనే వుంది. ఒకళ్లు తమ ఆత్మలను నిర్వాతమైన – యిరుకు చీకటి గదిలో బంధించి వుంచుకొనేవాళ్ళూ; రెండోవాళ్లు ప్రతి విషయాన్నీ సవిమర్శకంగా చూడాలి, తెలుసుకోవాలి, ప్రేమించాలి అనేవాళ్ళూను.

ఈ యిద్దరూ శత్రువులు గారు. కాని కెథిడ్రల్‌లో రెండు కాలాల ప్రతినిధులకు, భూత – భవిష్యత్‌లకు–సంఘర్షణ జరుగుతూంది. అబెలార్డు మరణకాలంలో తన అవిశ్వాసానికి పశ్చాత్తాపం ప్రకటించినా, ఆతడు తన కర్తవ్యాన్ని నెరవేర్చు కొన్నాడనే చెప్పాలి. త్యాగం ఊరికే పోదు.

సంవత్సరాలు గడిచిపోతూన్నాయి. క్రీస్తుశకం 12 వ శతాబ్దం గడచిపోయింది. 13 వ శతాబ్దం చరిత్రయొక్క పంచాంగంలోకి వచ్చింది.

పారిస్ విశ్వవిద్యాలయంలో అందర నోళ్ళలోనూ ఒక క్రొత్తపేరు వినబడుతూంది: "ఆల్బర్టస్ మాగ్నస్!" మాగ్నస్ అంటే మహా అని అర్థం. మహా ఆల్బర్టస్! ఈయన ఉపన్యాసం జరుగుతూందంటే యెంత పెద్దహాలైనా చాలేది కాదు! అదివరలో యీ 'మహా' అనే విశేషణం, బిరుదు సార్వభౌములకూ, లోకవిజేతలకూ మాత్రమే వర్తించేది. కాని, యీ సారి యిదొక పండితుడికి, విద్వాంసుడికి వాడబడింది. ఆల్బర్టస్ మాగ్నస్ సర్వశాస్త్ర పారంగతుడు, గొప్ప మంత్రశాస్త్రవేత్తగా పరిగణించబడేవాడు. ఆయన వివిధ లోహాల స్వభావాన్ని గూర్చి తన పరిశోధనాగారంలో పరీక్షించేవాడు. ఏ యే లోహాలు నైట్రిక్ యాసిడ్‌లో కరుగునో, యే వేవి గంధకంతో కలుస్తాయో ఆయన యెరుగును. ఆకాశాన్ని పరిశీలించి, పాలపుంత (క్షీరసముద్రం – మిల్కీ వే) అనేక నక్షత్రముల సముదాయమని కనిపెట్టేడు.* ఆయన పరికరములలో తూర్పుదేశాలనుంచి గొనివచ్చిన 'దిక్సూచి' (కంపాస్)

* ఈ విషయమును అంతకు పూర్వమే గ్రీకులూ, వారికి పూర్వమే హిందువులూ యెరుగుదురు. కాని, ఐరోపాలో యీ విషయములో నిశ్చితాభిప్రాయం యిచ్చినవాడు యీయన గానోపు. ఆర్యభట్టు, వరాహమిహిరుడు, నాగార్జునుడు మొదలైన మహాపండితులు ఖగోళ రసవాదాది శాస్త్రాలలో అనేక నూతన సిద్ధాంతాలు గావించేరు.

ఒకటుండేది. ఆయన బల్లమీద అరబ్, హెబ్రూ, గ్రీకు గ్రంథాల వ్రాత ప్రతులు చిందరవందరగా పడివుండేవి.

జంతువులు, మొక్కలు, ఖగోళములు మొదలైన వాట్లని గురించి ఆయన యెన్నో గ్రంథాలు రచించేడు. కాని, అప్పటికింకా యీ గ్రంథాల్లో నూతన వైజ్ఞానిక విషయాల కంటె పాతగాథలే యెక్కువగా వుంటూండేవి. ఆల్బర్టస్ పండితుడు అరిస్టాటిల్‌ను పొగడేవాడు. కాని, అరిస్టాటిల్‌ను గురించిన యీయన చిత్రణ విలక్షణమైనది. అరిస్టాటిల్ సన్యాసి, ఋషి అని యీయన అభిప్రాయం! క్రీస్తుకు పూర్వంలో జీవించి యుండిన మహాత్ములను, మహాజనులను, మధ్య యుగాలనాటి పండితులు, కవులు, కళాకారులు యీ రీతిగానే చిత్రించేవారు! విహారమఠాల్లో, పరివ్రాజక వేషాల్లో వుండి వుంటారని వీరి అంచనా!

ఏదేమైనా యీ సర్వశాస్త్ర పారంగతుడు, మహా ఆల్బర్టస్‌కూడా మతమునూ, విజ్ఞానాన్నీ వేరువేరుగా వుంచడానికే ప్రయత్నించేవాడు.

ఆయన కెందరో శిష్యు లుండేవాళ్లు. వారిలో అరిస్టాటిల్ గ్రంథాల నత్యంత శ్రద్ధతో పఠించినవా డొకడుండేవాడు. అతని పేరు థామస్ అక్వినాస్. అతనికి అరిస్టాటిల్ గొప్పతనం తెలిసింది. అరిస్టాటిల్ వంటి మహావిజ్ఞానిని మతంవైపునకు, చర్చి పక్షానికి లాగుకోవాలని ఈతడు తలచేడు. నాస్తికులూ, విధర్ములూ, అపవిత్రులూనైన అవెరోస్ అనుయాయులకు యిల్లాంటి మహాత్ముణ్ణి వదలిపెట్టడ మేమిటని అక్వినాస్ దుగ్ధ!

ప్రాచీనమైన మ్లేచ్ఛ విజ్ఞానాన్నంతనూ ఒకానొకప్పుడు అరిస్టాటిల్ పండితుడు సూత్రగ్రధితం గావించేడు. అట్టి అరిస్టాటిల్ సాయంతో థామస్ అక్వినాస్ మధ్య యుగాల కేథలిక్ విజ్ఞానాన్నంతనూ యిముడ్చుకోగల ఒక ఆధార పీఠాన్ని, పునాదిని తయారుచేసేడు! ఒక మహాగ్రంథాన్ని, సర్వ ప్రశ్నలకూ జవాబు లియ్యగల దానిని, సర్వ సంశయాలనూ కూకటి వేళ్ళతో పెల్లగించగల దానిని, అజ్ఞాన గ్రంధిని ఛేదించగల దానిని ఆయన వ్రాసేరు.

ఆత్మ అంటే యేమిటి? పదార్థ మంటే ఏమిటి? తెలివి, బుద్ధి అంటే ఏమిటి? వేదనలు అంటే యేమిటి? దేవుడు యీ ప్రపంచాన్ని యెల్లా సృష్టించేడు? ఆయన దీని నెల్లా పాలిస్తూన్నాడు? ఆసురీశక్తి అంటే ఏమిటి? అసుర పరిపాలన క్రిందనున్న రాజ్యాలు యేవేవి? దేవతలు తిండి తింటారా? వాళ్ళు నిద్ర పోతారా?

ఇల్లాంటివే వందలకొద్దీ ప్రశ్నలూ, ఉపప్రశ్నలూ వున్నాయి, థామస్ అక్వినాస్ గ్రంథాల్లో, ప్రతీ ప్రశ్నకూ ఖచ్చితమైన సమాధానమూ వ్రాసివుంది. ఈ జవాబులు సరియైనవి గావని యెవరూ సంశయించ కూడదు. దీనికి విరుద్ధంగా భావించేవా రెవరైనా సరే, వాడు మ్లేచ్ఛుడు, నాస్తికుడు; సంశయాత్మా వినశ్యతి!

ఈశ్వరవాదులు, మతాచార్యులు మొదలైనవారు మానవ బుద్ధియొక్క, జ్ఞానంయొక్క, ప్రామాణికత్వాన్ని నిరాక

బోయేడు. బ్రహ్మచారిణిగా వుండేటందుకు ఆమెనుగూడా అంగీకరింపజేసేడు. విహారమరంలోనే కాదు, ఆఖరికి నరకంలో కూడా అబెలార్డుతో సన్నిహితంగా వుండడానికి హెలోయిస్ ప్రాణాలను కూడా ఒడ్డుతుంది. ఆయన నంతగాఢంగా ప్రేమించిందామె.

కాని, అబెలార్డు మఠప్రవేశం గావించినా తిరుగుబాటుదారుడే. చెప్పిన దానినల్లా గ్రుడ్డిగా విశ్వసించడానికి యీతడు అంగీకరించేవాడుగాడు. ప్రతీ విశ్వాసాన్నీ తర్కించి బుద్ధితో వివేచన గావించి, స్వీకరించాలని ఆతని ప్రయత్నం. ఆ రోజుల్లో యీ భావమే భయావహమైనది! ఈశ్వరపుత్రుడూ, జనులకు రక్షకుడూ ఐన ఏసుక్రీస్తు దైవీయమైన కారణవివేకరూపుడని అబెలార్డు చెప్తుతూండేవాడు. ఈ మాటలు వినేటపుడు జనులు భయంతో అటునిటు దిక్కులు చూసేవాళ్ళు. ఇల్లాంటి సంగతులు చెప్ప సాహసించినందుకు చాలమంది ప్రాణాలతోనే దహనం గావించబడ్డారు. సాంప్రదాయిక విశ్వాసాలకి భిన్నమైన దంతా విధర్మమే. వైధర్మ్యమైన మాటలు ఉచ్చరించడమే గాక వినడంకూడ ఆ రోజుల్లో నిషిద్ధమే.

జనసమూహాలు కదులుతూన్నాయి. వీధుల కిరుప్రక్కలా యేటవాలుగా నుండే కప్పులుగల యిళ్లు వరుసలు తీరివున్నాయి. వీధినిండా జనం క్రిక్కిరిసి వున్నారు. వీధి మలుపులో పట్టణ ద్వారం వైపున అందరి దృష్టులూ కేంద్రీకరించి వున్నాయి. జనసముద్రం పైగా వాళ్ళ శిరస్సులమీదుగా ఉన్నతంగా ఒక

అశ్వారూఢుడు కనబడుతున్నాడు. అతడే అబెలార్డ్. బెర్నార్డ్‌వలె అతడు పాదచారియై రాలేదు. సన్యాసుల మాదిరిగా పాదచారియై రాక అబెలార్డ్ యోధునివలె అశ్వారూఢుడై వచ్చేడు.

అబెలార్డ్ వస్తూంటే ముసలవ్వలు శిలువ వేసుకుంటూ పైదొలగిపోతూన్నారు. కాని, జనసముద్రంలో ఏదో నిశిత మైన కలకలం బైలుదేరింది. అది భయంవల్లనూ గావచ్చు, మెప్పువల్లనూ గావచ్చు;– యేదైనా కావచ్చును.

ప్రతిద్వంద్వు లిద్దరూ కెథిడ్రల్ లో ముఖాముఖిగా కలుసు కున్నారు.

భారమైన కెథిడ్రల్ కప్పుక్రింద దీపకాంతి అణచివేయబడి నట్లుగా మందంగా వుంది. వెలుపలమాత్రం యెండ తీక్ష్ణంగా వుంది. బైటి సూర్యకాంతిలోంచి వచ్చిన వాళ్ళకి కెథిడ్రల్ లోపల మసక వెలుతురులో వ్యక్తులను విడమర్చి గుర్తించడం కష్టంగా వుంది. బిషప్పులు మహా ఆడంబరంగా దుస్తులు ధరించి కూర్చున్నారు. సన్యాసులంతా ముదురు జేబురా రంగు దుస్తుల్లో వున్నారు.

అబ్బట్ బెర్నార్డ్ వినీతవేషంలో వున్నా, భయంకరం గానూ, ఉద్రేకంతోనూ యెదుర్కొన్నాడు. అతడుకూడా అబెలార్డు వలెనే యోధకుటుంబ సాంప్రదాయానికి చెందిన వాడు. ధర్మనిర్ణయ సభలా లేదు, అది యుద్ధరంగంలా కనిపిస్తూంది. బెర్నార్డును చూస్తూ, అవిశ్వాసి, విధర్మి,

అస్మృతవాది, పాషండుడు అని దూషించేడు: "మ్లేచ్ఛులైన తత్త్వవేత్తల పుస్తకాలు చదివే నువ్వూ మ్లేచ్ఛుడవే!"

సన్నని కిటికీల్లోంచి లోనికి వస్తూన్న కాంతి అస్పష్టంగా వుంది. బెర్నార్డు చర్మపు చుట్ట నొకదాన్ని విప్పి, ఆ మసక వెలుతురులోనే బిగ్గరగా చదువ నారంభించేడు. అతడు కొద్ది వాక్యాలు చదివేసరికే ఆ గ్రంథం అబెలార్డు వ్రాసిన 'ఔను, కాదు!' (Sic et non) అనే దని అక్కడున్న వాళ్ళందరూ గుర్తించేరు. ఆ పుస్తకంలో అబెలార్డు కొన్ని సమస్యలమీద యిరుపక్షాల వాదనలనూ యిచ్చి, మత పీఠాధిపతులు కొందరి వ్రాతలనుంచి తన వాదనకు బలంగా కొన్ని ఆధారాలను కూడ యెత్తిచూపేడు. ఇదంతా చదివి బెర్నార్డు యిల్లా ప్రశ్నించేడు: "ఇదంతా పరధర్మం గాదా? పాప చింతన, పాషండత్వమూ యీ వ్రాతల్లో స్పష్టం గావడంలేదా?"

బెర్నార్డు రెండుచేతులనూ ఆకాశంవైపు, చాచి, 'దేవుని క్రోధం యీ పాషండుని శిరముపై బడుగాక!' అని శపించేడు. ఆయన ఉచ్చరించే ప్రతీమాటా చెర్చి గర్భంలోనుంచి ప్రతి ధ్వనిస్తూనే వుంది.

కాని, అబెలార్డు ధైర్యంగా, కంగుమనే కంఠంతో మధ్యలోనే అడ్డుతగిలి అన్నాడు: "మీ న్యాయనిర్ణయాధికారాన్ని నేను గుర్తించ నిరాకరిస్తూన్నాను! పోపు తప్ప మరే యితరుల యొక్క ధర్మనిర్ణయాన్నీ అంగీకరించను!"

ఇల్లా అంటూ అబెలార్డు వెనుతిరిగి ధీరంగా, గంభీరంగా, నిదానుగా నడిచి కెథిడ్రల్ ద్వారంవైపు వెళ్ళిపోయేడు. ఈ రాతి గోడల మధ్యనుంచి, ప్రాచీనసమాధిలోని నిర్జీవ వాతావరణంలోనుంచి స్వచ్ఛమైన బాహ్యా వాతావరణం లోనికి, జీవనధాత్రియైన సూర్యరశ్మిలోనికి ఆతడు వెళ్ళాలి. ఉక్కిరిబిక్కిరి చేసే కెథిడ్రల్ గర్భగుడిలోంచి బైటికి వెళ్ళి పోయి, గాలి పీల్చుకుంటేనే గాని ఆతడుండలేక పోయేడు.

ధర్మ నిర్ణయస్థానం – చెర్చి కోర్టు – అబెలార్డు పరోక్షమందే తన తీర్పు నిచ్చింది:– "సన్యాసి అబెలార్డు అవిశ్వాసి; ఏతావతా దోషి."

అబెలార్డును విహార మఠంలోని ఒక గదిలో నిర్బంధించి వుంచేరు. సజీవ సమాధి గావించ బడినట్లున్న అబెలార్డులో వెనుకటి ధైర్య స్థైర్యములు, శక్త్యుత్సాహములు తొలగి పోయి, విన్నదనం తోప, బలహీనుడై పోయేడు.

ఆతని ప్రేయసి కంఠధ్వని దూరాన్నుంచి అతనిని పిలిచేది. హెలోయిస్ ఆతనికి జాబులు వ్రాసేది. ఆతనిలో ధైర్యం పురి గొల్పి, వెనుకటి స్థైర్యాన్ని తిరిగి కలిగించాలని ఆమె ప్రయత్నం. కాని ఆమె గాఢవాంఛ, తీవ్రోద్రేకంకూడా యేమీ ప్రయోజనకారులు కాలేదు. ఆమె కాతడు వ్రాసిన జవాబుల్లో అధీరత, లొంగుబాటు తప్ప వేరేదీ కనిపించేది గాదు. అబెలార్డు ధైర్యం కుంఠితమైంది, తర్కశక్తి అవమానితమైంది, ప్రేమ మృతమైంది!

ఈ స్థితిలో యింకా బొందెలో ప్రాణాలను భరించడం దేనికి ? అదివరకటి తన బోధనలను తానే నిరాకరిస్తూ, అబెలార్డు అతిదైన్యంగా మరణించేడు. ఆతని శతాబ్దిలో కాల ప్రవాహాని కెదురీది, ఒంటరిగా నిలబడుట చాల కష్టమైనది.

చాల సంవత్సరాలు గడిచినాయి. అబెలార్డు అస్థికలు హెలోయిసీ అస్థికలతో బాటు ఒక చోట సమాధి గావించ బడినాయి. వ్యర్థమనోరథులైన ప్రేమికులను గురించిన యేదో పాతపాటలోని సంఘటనల వలెనే యిదంతా జరిగిపోయింది. అబెలార్డు - హెలోయిసీల సమాధిమీద యీ మాటలు చెక్కబడినాయి.

"...దుఃఖకరమైన కృషివల్లనూ, భగ్నప్రేమవల్లనూ మరణించేరు..."

ఈ రీతిగా రెండు శిబిరాల వారికీ పోరాటం జరుగుతూనే వుంది. ఒకళ్లు తమ ఆత్మలను నిర్వాతమైన - యిరుకు చీకటి గదిలో బంధించి వుంచుకొనేవాళ్ళూ; రెండోవాళ్లు ప్రతి విషయాన్నీ సవిమర్శకంగా చూడాలి, తెలుసుకోవాలి, ప్రేమించాలి అనేవాళ్ళూను.

ఈ యిద్దరూ శత్రువులు గారు. కాని కెథీడ్రల్‌లో రెండు కాలాల ప్రతినిధులకు, భూత - భవిష్యత్ లకు—సంఘర్షణ జరుగుతూంది. అబెలార్డు మరణకాలంలో తన అవిశ్వాసానికి పశ్చాత్తాపం ప్రకటించినా, ఆతడు తన కర్తవ్యాన్ని నెరవేర్చుకొన్నాడనే చెప్పాలి. త్యాగం ఊరికే పోదు...

సంవత్సరాలు గడిచిపోతూన్నాయి. క్రీస్తుశకం 12 వ శతాబ్దం గడచిపోయింది. 13 వ శతాబ్దం చరిత్రయొక్క పంచాంగంలోకి వచ్చింది.

పారిస్ విశ్వవిద్యాలయంలో అందర నోళ్ళలోనూ ఒక క్రొత్తపేరు వినబడుతూంది: "అల్బర్టస్ మాగ్నస్!" మాగ్నస్ అంటే మహా అని అర్థం. మహా అల్బర్టస్! ఈయన ఉపన్యాసం జరుగుతూంటంటే యెంత పెద్దహాలైనా చాలేది కాదు! అదివరలో యీ 'మహా' అనే విశేషణం, బిరుదు సార్వభౌములకూ, లోకవిజేతలకూ మాత్రమే వర్తించేది. కాని, యీ సారి యిదొక పండితుడికి, విద్వాంసుడికి వాడబడింది. అల్బర్టస్ మాగ్నస్ సర్వశాస్త్ర పారంగతుడు, గొప్ప మంత్ర శాస్త్రవేత్తగా పరిగణించబడేవాడు. ఆయన వివిధ లోహాల స్వభావాన్ని గూర్చి తన పరిశోధనాగారంలో పరీక్షించేవాడు. ఏ యే లోహాలు నైట్రిక్ యాసిడ్‌లో కరుగునో, యేవేవి గంధకంతో కలుస్తాయో ఆయన యెరుగును. ఆకాశాన్ని పరిశీలించి, పాలపుంత (క్షీరసముద్రం - మిల్కీ వే) అనేక నక్షత్రముల సముదాయమని కనిపెట్టేడు.* ఆయన పరికరములలో తూర్పుదేశాలనుంచి గొనివచ్చిన 'దిక్సూచి' (కంపాస్)

---

* ఈ విషయమును అంతకు పూర్వమే గ్రీకులూ, వారికి పూర్వమే హిందువులూ యెరుగుదురు. కాని, ఐరోపాలో యీ విషయములో నిశ్చితాభిప్రాయం యిచ్చినవాడు యీయన గానోపు. ఆర్యభట్టు, వరాహమిహిరుడు, నాగార్జునుడు మొదలైన మహాపండితులు ఖగోళ రసవాదాది శాస్త్రాలలో అనేక నూతన సిద్ధాంతాలు గావించేరు.

ఒకటుండేది. ఆయన బల్లమీద అరబ్, హెబ్రూ, గ్రీకు గ్రంథాల వ్రాత ప్రతులు చిందరవందరగా పడివుండేవి.

జంతువులు, మొక్కలు, ఖగోళములు మొదలైన వాట్లని గురించి ఆయన యెన్నో గ్రంథాలు రచించేరు. కాని, అప్పటి కింకా యీ గ్రంథాల్లో నూతన వైజ్ఞానిక విషయాల కంటె పాతగాథలే యెక్కువగా వుంటూండేవి. ఆల్బర్టస్ పండితుడు అరిస్టాటిల్‌ను పొగడేవాడు. కాని, అరిస్టాటిల్‌ను గురించిన యీయన చిత్రణ విలక్షణమైనది. అరిస్టాటిల్ సన్యాసి, ఋషి అని యీయన అభిప్రాయం! క్రీస్తుకు పూర్వంలో జీవించి యుండిన మహాత్ములను, మహాజనులను, మధ్య యుగాలనాటి పండితులు, కవులు, కళాకారులు యీ రీతిగానే చిత్రించేవారు! విహారమఠాల్లో, పరివ్రాజక వేషాల్లో వుండి వుంటా రని వీరి అంచనా!

ఏదేమైనా యీ సర్వశాస్త్ర పారంగతుడు, మహా ఆల్బర్టస్‌కూడా మతమునూ, విజ్ఞానాన్నీ వేరు వేరుగా వుంచ డానికే ప్రయత్నించేవాడు.

ఆయన కెందరో శిష్యు లుండేవాళ్లు. వారిలో అరిస్టాటిల్ గ్రంథాల నత్యంత శ్రద్ధతో పఠించినవా డొకడుండేవాడు. అతని పేరు థామస్ అక్వినాస్. అతనికి అరిస్టాటిల్ గొప్పతనం తెలిసింది. అరిస్టాటిల్ వంటి మహావిజ్ఞానిని మతంవైపునకు, చర్చి పక్షానికి లాగుకోవాలని ఈతను తలచేడు. నాస్తికులూ, విధర్ములూ, అపవిత్రులూనైన అవెరోస్ అనుయాయులకు యిల్లాంటి మహాత్ముణ్ణి వదలిపెట్టడ మేమిటని అక్వినాస్ దుగ్ధ!

ప్రాచీనమైన మ్లేచ్ఛ విజ్ఞానా న్నంతనూ ఒకానొకప్పుడు అరిస్టాటిల్ పండితుడు సూత్రగ్రధితం గావించేడు. అట్టి అరిస్టాటిల్ సాయంతో థామస్ అక్వినాస్ మధ్య యుగాల కేథలిక్ విజ్ఞానా న్నంతనూ యిముడ్చుకోగల ఒక ఆధార పీఠాన్ని, పునాదిని తయారుచేసేడు! ఒక మహాగ్రంథాన్ని, సర్వ ప్రశ్నలకూ జవాబు లియ్యగల దానిని, సర్వ సంశయా లనూ కూకటివేళ్ళతో పెల్లగించగల దానిని, అజ్ఞాన గ్రంథిని ఛేదించగల దానిని ఆయన వ్రాసేరు.

ఆత్మ అంటే యేమిటి? పదార్థ మంటే ఏమిటి? తెలివి, బుద్ధి అంటే ఏమిటి? వేదనలు అంటే యేమిటి? దేవుడు యీ ప్రపంచాన్ని యెల్లా సృష్టించేడు? ఆయన దీని నెల్లా పాలిస్తూన్నాడు? ఆసురీశక్తి అంటే ఏమిటి? అసుర పరిపాలన క్రిందనున్న రాజ్యాలు యేవేవి? దేవతలు తిండి తింటారా? వాళ్ళు నిద్ర పోతారా?

ఇల్లాంటివే వందలకొద్దీ ప్రశ్నలూ, ఉపప్రశ్నలూ వున్నాయి, థామస్ అక్వినాస్ గ్రంథాల్లో, ప్రతీ ప్రశ్నకూ ఖచ్చితమైన సమాధానమూ వ్రాసివుంది. ఈ జవాబులు సరియైనవి గావని యెవరూ సంశయించ కూడదు. దీనికి విరుద్ధంగా భావించే వా డెవడైనా సరే, వాడు మ్లేచ్ఛుడు, నాస్తికుడు; సంశ యాత్మా వినశ్యతి!

ఈశ్వరవాదులు, మతాచార్యులు మొదలైనవారు మానవ బుద్ధియొక్కా, జ్ఞానంయొక్కా, ప్రామాణికత్వాన్ని నిరాక

కాలానికి యింకా ముందే భూగోళమున కవ్వలి ప్రక్క చీనా దేశంలో యీ మందు వాడుకలో వుంది. కాని, దీని నాశమున యెరుగడు. అరబ్బులు యీ ప్రేలుడు మందును తూర్పు దేశాలనుంచి స్పెయిన్‌కు తెచ్చేరు. అంతటితో ఆగలేదు. ఫిరంగులు మ్రోత పెట్టేందుకుకూడ యింకెంతో వ్యవధి అక్కర లేదు!

అణు ప్రపంచంలో, దాని గర్భంలో మానవుడొక మహా శక్తిని కనుగొన్నాడు. అది తన యజమానిమీదనే తిరగబడుతుందని విధికాబోలు!

## 4. మానవుడు నక్షత్రాలను ప్రశ్నించుతాడు.

రోజర్ బేకన్ తన కాలంకంటె చాలముందు నడుస్తూన్నట్టి వాడు. భవిష్యత్తులోనికి చూచి, ఆయనొక యెగిరే యంత్రాన్ని వ్యూహాలో కల్పించేడు; తెడ్లులేని ఓడ, గుర్రములు అక్కరలేని బండినికూడ ఆయన మనస్సులో వ్యూహించేడు.

ఐననూ ఆతడు తన కాలానికి ఔరసుడేగదా. ఆతడు నివసించే గోపురమే ఖగోళశాస్త్రజ్ఞుని నక్షత్రశాల, రసవాది ప్రయోగశాల కూడా ఐవుండేవి. నీచలోహాలను బంగారంగా మార్చగల 'చింతామణి'ని కనిపెట్టడానికై ఆత డెన్నెన్నో లోహాలను కలుపుతూ, కరుగుతూ వుండేవాడు. మానవుల

అదృష్టములను చెప్పడానికై ఆతడు ఖగోళముల స్థితిగతులను పరిశీలించుతూండేవాడు. *

ఈ ప్రపంచంలోని సర్వమున్నూకూడా పరస్పర సంబంధములు కలిగియున్నవనిన్నీ, యీ ప్రపంచమంతా అవిభాజ్యమైన ఒక పూర్ణాంకమనిన్నీ, ఖగోళములనుండి అదృశ్యమైన శక్తి ప్రసారం యీ పృథ్వీమీదికీ, దీనిమీది ప్రాణికోట్లపైకీ వ్యాపిస్తూనే వుందనిన్నీ ఆయన భావించేవాడు. చంద్రుడు తన గతిభేదంవల్ల సముద్రజలాల్లో పోటుపాట్లు కలుగజేయడం లేదా ? మొక్క మొటికలకు సూర్యుడు జీవనాధారుడగుట లేదా ?

మన మీ రోజున కూడా ఆ రీతిగానే భావిస్తూన్నాము. ఈ బ్రహ్మాండగోళంలో మనభూమి ఒక సూక్ష్మఅంశంమాత్రమే. సూర్యుడు తన కిరణజాలాన్ని ప్రసరింప జేయకపోతే యీ భూమిమీద ప్రాణి జీవితమే వుండదు. భూమికి ఆకర్షణశక్తి వుంది. అల్లాగే యితర గోళా లన్నిటికిన్నీ కూడా ఆకర్షణశక్తి వుంది. కాని, భూమిమీదనే వున్నాం గనక మనపై భూమ్యాకర్షణమే అత్యధికము. వెలుతురు, ఆకర్షణ;— యివి రెండూ యీ విశ్వములోని సమస్తాన్నీ పరస్పర సంబంధం కలవిగా, ఒకటిగా చేస్తున్నాయి.

---

* అతః పూర్వం ఎన్నో శతాబ్దాలక్రిందటి నాగార్జునుడున్నూ యిల్లాగనే పలుశాస్త్రాలలో పరిశోధకుడు, మహాయోగి, వైద్యుడు, జ్యోతిర్వేత్త, వేదాంతిన్నీ. ఆయన భారతీయుడు, తత్రాపి ఆంధ్రుడూ నని చెపుతారు.

ఈనాడు మనం నమ్ముతూన్నది, యిదీ. కాని, 13 వ శతాబ్దంలో, బేకన్ జీవితకాలంలో ఆకర్షణ శక్తిని గురించి కాని, కాంతికిరణ స్వభావాన్ని గూర్చి కాని జనులకు ఏమీ తెలియదు.* వారు విశ్వంలోని సమస్త వస్తువులకూ వున్న పరస్పర సంబంధాల్ని కేవలం ఊహామాత్రంగానే, అస్పష్టంగానే గ్రహించేరు, నక్షత్రాదుల, మానవుల అదృష్టాదులు కలిసే వున్నా యని వారికి దిఙ్మాత్రంగానే తోచింది.

ఒక చర్మపత్రంమీద బేకన్ ఒక చతురమును గీసి, దాని లోపల యింకో చిన్న చతురమును వేసేడు. ఈ రెండింటిమధ్య భాగాన్ని పంౘెండు త్రికోణాకారమైన చిన్నచిన్న గదులుగా అతడు విభజించేడు. ప్రతీ గదిలోనూ ఒక్కొక్క బొమ్మను వేసేడు. ఒక గదిలో త్రాసు-తుల; మరోదానిలో రెండు చేపలు-మీనం; యింకో దానిలో విల్లు-ధనుస్సు. ఆ యా బొమ్మలు తులా, మీన, ధను రాసులను సూచిస్తా యన్న మాట. రాసులు పంౘెండు;- (మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, సింహాము, కన్య, తుల, వృశ్చికము,

* క్రీస్తుశకం 993 వ సంవత్సరములో భారతీయ ఖగోళశాస్త్రవేత్తయైన శ్రీపతిభట్టు సిద్ధాంతశేఖర మను గ్రంథము రచించేరు. క్రీ. శ. 1144లో భాస్కరాచార్యులు సిద్ధాంత శిరోమణిని రచించేరు. ఈ గ్రంథములలో ఖగోళములు ఆకర్షణాశక్తిచే పరిభ్రమించుచున్న వని చెప్పబడినది. భాస్కరాచార్యులు పౌలిశ, రోమక, వాసిష్ఠ, సౌర, పైతామహ గణిత సిద్ధాంతము లైదింటిలో దిట్ట యని ప్రసిద్ధము. వెలుతురుయొక్క వేగమును గురించికూడ కొన్ని ప్రాచీన సిద్ధాంతము లున్నాయి. అవి భారతీయులకు తెలియునని ప్రాచీన గ్రంథాలవల్ల స్పష్టమవుతూంది.

ధనుస్సు, మకరము, కుంభము, మీనము) పన్నెండు రాసులకూ పంద్రెండు గదులు. చిన్న చతురపు మధ్య ప్రదేశం ఖాళీగా, అదృష్ట వివరాలు వ్రాయవలసిన వాని పేరు, జననకాల ముహూర్తాదులైన వివరాలుకోసం ప్రత్యేకించబడింది. ఏ యే గ్రహ గోళ నక్షత్రాదులు యీ జన్మకాల నక్షత్రాదులు గల

రాశి చక్రము.

ప్రాణియొక్క జీవితంమీద యెల్లాంటి ప్రభావాన్ని కలిగి వుంటాయో వగైరాలన్నీ వివరంగా వ్రాస్తారు. *

* దీనినే జాతక చక్ర మనే పేరుతో మనం పిలుస్తాము. ఇది ఒక ప్రత్యేక కళగా మనదేశీయులు చాలకాలం క్రిందటనే అభివృద్ధి చేసేరు.

ఇది యెల్లా సాధ్యమో చూద్దాం. సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, నక్షత్రాలు కూడా ఒకేచోట స్థిరంగా వుండకండా ఆకాశవీధిలో నిరంతరాయంగా తిరుగుతూంటాయి. నభోచక్రమును పై విధంగా 12 విభాగాలుగా చేసేరు. వాటిని రాసులని పిలుస్తాము. ఆకాశంలో తిరుగుతూన్న సూర్యచంద్రాదులు నభోచక్రములోని 12 రాసులలోనూ, ఒకదానినుంచి మరో దానిలోనికి జరుగుతూంటాయిగదా. ఒక్కొక్క గ్రహము ఒక్కొక్క గుణమును కలిగి వుంటుందని జనులలో విశ్వాసం యేర్పడివుంది. చంద్రుడు చల్లనివాడై, శోకదాయకుడుగా వుండి, దురదృష్టాన్ని తెచ్చిపెడతాడు. నీలంగా వుండే శుక్రుడు, కాంతిగల బృహస్పతి సుఖకరులుగా వుంటారు. ఎర్రని అంగారకుడు, తెల్లని శని దుఃఖకరులు. ఈ గ్రహాల గతులు ఒక్కొక్కప్పుడు పరస్పరమూ ఖండించుకుంటూ, మరొక్కొక్కప్పుడు దూరదూరంగా వుంటాయి. వీటిలో కొన్ని గ్రహాలు పెద్దవి, మహాశక్తి గలవీ నన్నీ, మరికొన్ని అల్పములూ, నీచశక్తి గలవీ నన్నీ కూడ నమ్మకం వుంది. అతిశక్తివంతములైన ఉచ్చగ్రహములు ఒక యింటిలో కలిసికొన్నప్పుడు యేవో మహాద్భుత కార్యాలు;—చక్రవర్తుల పతనం, ప్రవక్తల జననం,

---

గ్రహచారమును బట్టి గుణించి ఒకని జీవితంలో అనేక వివరాలను యించుమించుగా చెపుతూంటారు. ఇది పూర్తిగా శాస్త్రంగా కాలేదు. కాని కొట్టిపారవేయలేము. ఇదికూడ పరిపూర్ణశాస్త్ర మని భావించు మేధావులుం పలువురున్నారు.

మహా క్షామాలు, మహామారులు, గొప్ప యుద్ధాలు మొదలైనవి కలుగుతా యని కూడ నిర్ధరించేరు.

ఈ ఖగోళచలనమువల్లనే ఒక్కొక్క మనిషి గావించే పనులు నిర్ణీతములై వుంటాయి. ఏ రోగికైనా చికిత్స ప్రారంభించే ముందు వైద్యుడు గ్రహచార ఫలములను చూసేవాడు. ఒక్కొక్క రాశికి శరీరంలోని ఒక్కొక్క భాగంమీద ప్రభావం వుంటుంది. మిథునరాశికి చేతులమీద, మేషరాశికి తలమీద, మీనరాశికి కాళ్ళమీద;—యిల్లాగే. మిథునంలో చంద్రుడుంటే వైద్యుడు విరిగిన చేతికి కట్టుకట్టకూడదు; యింకా అనుకూల గ్రహస్థితికై వేచియుండాల్సిందే, మరి.

రసవాదులూ తమ పని నారంభించే ముందు నక్షత్రాల్ని సలహా చేసేవాళ్ళు. పాదరసముకు బుధుడు, వెండికి చంద్రుడు, బంగారముకు సూర్యుడు, సీసమునకు శని;— యిల్లాగే ప్రాతినిధ్యం వహిస్తాయి. సూర్యుడు నీచవట్టి వుంటే అంటే వ్యతిరేక గ్రహంయొక్క యింట్లో వున్నట్లయితే ఆ పని జయప్రదం కాదు. అంతేగాక సూర్యుడు దుఃఖకారక శనిలోనికి ప్రవేశిస్తూన్నట్లయితే యిది మహా విపత్సూచకం. బృహస్పతి ఆ సమీపంలో యెక్కడున్నా సరే, అన్ని క్లిష్టపరిస్థితుల్లోంచీ కాపాడగలడు. బృహస్పతి సూర్యుణ్ణి గ్రహణాన్నుంచి, బంధనాన్నుంచి ఉద్ధరిస్తాడు.

రాజులు, సేనానులు, నావికులు, అందరూ జ్యోతిశ్శాస్త్రాన్ని సలహా చేసేవాళ్ళు. ఒక్కొక్క దేశం ఒక్కొక్క గ్రహం పర్య

వేత్రుణాక్రింద వుంటుంది. శని హిందూదేశాన్నీ, బృహస్పతి బాబిలోన్ దేశాన్నీ, బుధుడు ఐగుప్త దేశాన్నీ, యిల్లాగే వివిధ గ్రహాలున్నాై.

బేకన్ యీ రాత్రి యెవరి అదృష్టాన్ని గుణిస్తున్నాడు?

ఆయన గ్రహగణితం చేస్తూన్నది యేవ్యక్తి అదృష్టం, ఏ దేశం అదృష్టం తెలుసుకోడానికి గాదు. మతంయొక్క అదృష్టం యే రీతిగా వుండబోతూందా? అనేదే ఆయన ప్రశ్న. ఖగోళాలు మతాల అదృష్టాన్నికూడ చెప్పగలవని ఆయన విశ్వాసం. శని యూదులకు, శుక్రుడు సారసినులకు అంటే ముస్లిములకు, బుధుడు క్రైస్తవులకు ప్రాతినిధ్యం వహిస్తారు. బృహస్పతి బుధునితో కలిసినప్పుడు క్రైస్తవ మతం బైలుదేరింది. బృహస్పతి సుఖదాయకుడు, అధికార కారకుడూను.

బేకన్ తెల్లవారే వరకూ గ్రహచారాన్ని గుణిస్తూనే వున్నాడు. ఆయన చేయి చక్రాల్ని గీస్తూ, సంజ్ఞలను వ్రాస్తూన్నా, ఆలోచనలు మాత్రం యెక్కడో వున్నాయి. బేకన్ మనస్సు యావత్ప్రపంచాన్నీ, అందరు జనులనూ చూసివస్తూంది. ప్రతిచోటా ఆతడు విశృంఖలతనూ, క్రూరత్వమునూ, అన్యాయాన్నీ చూస్తూన్నాడు.

రాజులు, ప్రభువులు, యోధులు ఒకరి నొకరు ఓడించి దోచుకుంటూన్నారు. వారు నిరంతరం యుద్ధాలు చేస్తూ, పన్నులతో ప్రజల్ని నాశనం చేస్తూన్నారు. వీళ్ళు యెప్పుడూ

యితరుల రాజ్యాల్ని ఆక్రమించడానికే, దేశాలను దోచుకోడానికే అభిలషిస్తూంటారు.

జనులు రాజులను ద్వేషించేవాళ్ళు. అవకాశము ఉన్నంతవరకు వాళ్ళు ప్రభువులకు దూరంగా వుండడానికే, వాళ్ళ దృష్టినుంచి తప్పించుకోడానికే ప్రయత్నిస్తూండేవాళ్ళు.

వర్తకులు మాట్లాడే ప్రతీ మాటా అబద్ధమే. వాళ్ళ నిలువల్లా మోసమూ, దగా. పురోహితులు గర్విష్ఠులూ భోగపరాయణులూ, ఆశాపరులూను. ♦ పారిస్, ఆక్స్‌ఫోర్డు విశ్వవిద్యాలయాల్లో విద్వాంసులైన పురోహితవర్గాలు తమ తగువులాటలతోనూ, పేచీకోరుతనంతోనూ పౌరులకు గాభరా కలిగించేవాళ్లు! ప్రధాన గురువులుకూడా వారి సంరక్షణలో నుంచబడినవారి ఆత్మాలయం దెట్టి శ్రద్ధాసక్తులూ చూపకండా, యెప్పుడూ వారికే సంపదలు ప్రోగుచేసుకుంటూండడమే. వంచకులైన గురువులు దోష నిందా ప్రచారాలతో అమాయిక ప్రజల్ని నాశనం చేసేవారు. పోపు ధర్మపీఠం దగ్గర అంతులేని భోగలాలసత తప్ప వేరేమియూ కాన్పించేదిగాదు. అహంభావము, భోగలాలసత, అసూయ - యివే క్రైస్తవ చర్చిల్లోనూ, పవిత్ర క్షేత్రాల్లోనూ కనబడేవి. ఆఖరుకు పవిత్ర

---

♦ శ్లో. బోద్ధారో మత్సరగ్రస్తాః । ప్రభవస్స్మయదూషితాః ।
అబోధోపహతా శ్చాన్యే । జీర్ణమంగే సుభాషితం॥

అన్న భర్తృహరి మాట ఏనాటిది! వర్తకవాణిజ్యాదులను 'సత్యానృతం' అని మనువు నిర్వచించేరు!

వేదికలమీాద కూడా మోసాలు, అబద్ధాలు స్వేచ్ఛగా చెలామణీ అవుతూండేవి.

బేకన్ ముఖంమీాద ముడుతలు గాఢంగా వున్నాయి. అదిగో! చలిస్తూన్న కొవ్వొత్తి దీపపు వెలుగు ఆ ముడుతలను మరింత స్పష్టంగా చూపుతూంది. ఆయన బొమముడిపాటు చిరాకును సూచిస్తూంది. ఫ్రాన్సిస్కన్ సన్యాసి * అంగీ ధరించిన యీాతడు యెన్నోసార్లు తనకోపం పట్టజాలక, కపట నటన చేసేవాళ్ళ ముఖంమీాదే సత్యమును విసిరికొట్టేవాడు. అందుచేతనే ఫ్రాన్సిస్కన్ పీఠాధిపతియైన జాన్ బొన వెన్తురాకు బేకన్ అంటే మహామంటగా వుండేది. ఇందులో ఆశ్చర్య పడాల్సిన దేమీాలేదు. 'యదార్థవాదీ బంధువిరోధీ.' ఈ పీఠం వాళ్ళు ఆయనను మంత్రగాడనీ, మాయావాది యనీ పిలిచే వాళ్లు! రోగర్ బేకన్‌ను!

ఆయన గణితం చాలవరకు పూర్తయింది. లెక్కలు చూపి స్తూన్న దేమిటి? అతిభయంకరమైన ఫలితాలు కలుగ నున్నా యని! బేకన్ గ్రహా లన్నిటినీ వాటివాటి గృహాముల్లో వేసేడు; చంద్ర బృహస్పతు లొకే యింట నున్నారు; అది కన్యారాశి, బుధస్థానంలో కన్య – హృదయస్థానాధిష్ఠాన రాసి;

---

* రోమన్ కాథొలిక్ చెర్చిక్రింద యేర్పరచబడిన సన్యాసి పీఠము లలో నొకటి. సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసీ యీాపీఠస్థాపకుడు. ఈతడు 1182-1226 లో వుండేవాడు. బేకన్ యీా సాంప్రదాయంలోనివాడు.

బుధుడు క్రైస్తవమతాన్ని చూస్తూన్నాడు. రెండు పెద్ద గ్రహాలు, అనగా శోకాధిపతి చంద్రుడూ, మహాశక్తిమంతుడు బృహస్పతీ;- యీ యిద్దరూ బుధస్థానంలో కలుసుకోవడం దేన్ని సూచిస్తుంది? మానవ హృదయాల్లో విశ్వాస నాశనం కానున్న దని గ్రహసంపుటి స్పష్టీకరిస్తూంది! 'సర్వవ్యాపితంగా పతనం, దుర్మార్గం, అన్యాయం, దుర్నీతి గల సంఘంలో అన్యథా జరుగుతుం దని యెల్లా అనుకుంటాం!' అని తలచేడు, బేకన్.

ఆయన నిద్రించబోతూ, మరునాడు మహాంధకార దినం, ప్రళయాసన్నదినం అనే నిశ్చయంతోనే పండుకొన్నాడు...

కాని...

మరునాడు ప్రాతఃకాలమే బేకన్ లేచి కిటికీలోంచి చూచేసరికి యేం కనిపించింది? ఒక గొఱ్ఱెలకాపరి తన మందను తోలుకుంటూ, చేతిలో జువ్వను మంచుతో నిండిన గడ్డిమీద ష్ ష్ ష్! మనునట్లు విసురుతూ గోపురం ప్రక్కగా నడిచి పోతూండడం కనిపించింది! ఐతే, ప్రళయం...రాలేదూ?... ప్రాతఃకాలపు పొగమంచులో నుంచి ఆ మంత్రవేత్త గోపురం ఛాయా మాత్రంగా కనబడుతూంటే గొఱ్ఱెలకాపరి దానివైపు విచిత్రంగా చూస్తూన్నాడు! గోపురవాసియైన ఆ పండితుడు రాత్రి తెల్లవార్లూ గుణించి తేల్చిన ఫలితాల్ని యీ గొల్లవాడు గనుక యెరిగివుంటే యేమనేవాడో?

## పాఠకుడు మఠాధిపతి సేవకుని కలుసుకుంటాడు.

బేకన్ జ్యోతిర్విద్యావేత్త మాత్రమేగాదు, ఆయన రసవాది కూడాను. ఇతర రసవాదులవలెనే యీయనా బకయంత్రం అడుగున బంగారం చూడాలని ఆశిస్తూన్నాడు.

'చింతామణి'ని కనుగొన్నవాడు రాగి, సీసం మొదలైన నీచలోహాల్ని బంగారంగా మార్చవచ్చును. అట్టివాడు యీ ప్రపంచానికే అధిపతి కాగలడు. కాని, బేకన్ కృషికంతకూ కారణం ధనాశాగాదు, అధికారవ్యామోహమూ గాదు. వస్తు విషయాదులలో కలిగే అత్యద్భుతమైన మార్పులకుగల కారణాల నన్వేషించే ఆసక్తే ఆయనను ప్రేరేపిస్తూన్నది. సూక్ష్మ వస్తు ప్రపంచంలోని విచిత్రాల నాయన కనుక్కొంటూన్నారు. జ్ఞాన పిపాసయే, తెలియనిదాన్ని తెలుసుకోవాలనే తీవ్ర ఆకాంక్ష మాత్రమే యీ పండితుణ్ణి ముందుకి నడిపిస్తూన్న శక్తి! ఇతర రసవాదులు బంగారము కొరకే వాంఛిస్తూండ వచ్చు. ప్రపంచంలో అప్పటికింకా పెత్తనమంతా మఠాధిపతులు, ఖడ్గబలం గల రాజులు, – వీళ్ళ చేతుల్లోనే వుండేది. ఈ అధికారంలో పాలుకోసం ధనపతులు తంటాలు పడుతూన్నారు.

పీఠాధిపతులు, రాజ్యాధిపతులు దుర్ణయపరులై వొట్టి పోయిన తమ బొక్కసములను నింపుకోడానికై ధనస్వాముల

దగ్గరకు పోయి తియారా * లను, కిరీటాలను కుదువబెడు తూండే వాళ్లు. ప్రతీరాజూ ఒక్కొక్క రసవాదినైనా పోషిస్తూ తన ఆస్థానంలో వుంచేవాడు. సైనికులకు జీతాలు యెప్పుడూ బకాయీగానే వుండేవి. సేనాపతులు జీతాలవిషయం ముచ్చ టించినపుడల్లా రాజులు, 'కొంచెం ఆగు మరి! మన రసవాది చింతామణిని కనిపెట్టేసినట్లే అనుకో! ఇక అప్పుడు చూస్తా రుగా, నా చెయ్యి! ఒట్టుపెట్టి చెపుతున్నానుమా. ప్రతి సైని కుడికీ, సేనాపతులకీ జీతాలే గాదు, యిబ్బడిగా బహుమతులు కూడా ముట్ట చెపుతా. బంగారం ఖణేల్మని మ్రోగిపోతుం దనుకో!' అంటూండేవాళ్ళు!

రసవాదుల పరిశోధనాగారాల్లోకి వెళ్ళేందుకూ, చూసేం దుకూ యెవరికీ దమ్ములే వుండేవి గావు! అసలు ఆ గడపదాటి లోపలికి వెళ్ళినవాడు యెవడూ లేడు.

ఒకానొక మతగురువుదగ్గర పనిచేసే సేవకుడు గనుక చెప్పకపోతే అసలు ఆ గదుల్లోపల యేమి జరిగేదో యెవరికీ తెలియకుండానే పోయేది! ఆ గురువుగారు రసవాదే! ఆ మహాశయుని విషాదపూరిత స్వగతమును విలాపవాక్యము లను వినడం తటస్థించిన ఆంగ్లమహాకవి ఛాసర్, తన 'కాంటర్ బరీ గాథలు' అనే గ్రంథంలో యీ ఉదంతాన్ని విపులంగా వర్ణించేడు, చదివి చూడండి!

---

* మూడు అంతస్థులుగా వుండే రత్నఖచిత స్వర్ణకిరీటం, యిది. ప్రాచీన పెర్షియన్ చక్రవర్తులు, తరువాత క్రైస్తవ మతాధిపతి పోపు ధరించేవాడు. మహా గౌరవచిహ్నం, యిది — అనువాదకుడు.

ఈ నాటి రసాయన శాస్త్రజ్ఞులు ఆ నాటి రసవాదులలో తమ ప్రతిబింబాలను చూడ గలరు. వాళ్ళూ నిరంతరం కరిగించే వాళ్ళు, మరిగించేవాళ్లు; కలపడం, కొలవడం, తూచడం, కాచడం,- యిదే వాళ్ళ పని! రాత్రింబగళ్లు వాళ్ళు యిదే కార్యక్రమంలో మునిగివుంటూంటారు!

ఆ గదిలోని పొగలు, సెగలు బైటికి పోయేందు కెన్ని గొట్టాలు అమర్చినా లాభం లేకపోయింది. రకరకాల పొగల తోనూ, ఆవిరులతోనూ నిండిన ఆ రసవాద ప్రయోగశాలల్లో వూపిరితీయడంకూడ దుస్తరంగా వుండేది. పొగకీ, వేడిమికీ కళ్ళు మండేవి, గ్రుడ్లనీళ్ళు క్రమ్మేవి. చేతు లన్నీ బొబ్బలెక్కి, పుండ్లుపడి, భగ్గున మండిపోయేవి. యాసిడ్ చిందిపడిన బట్ట లన్నీ చిల్లులుపడీ, చీకిపోయీ వుండేవి. ఏదేమైనా సరే ఆ రస వాద మహాశయులు ఒక్క క్షణకాలంకూడా తమ గదుల్లోంచి బైటికి వచ్చేవాళ్ళు గారు!

ఈ నాటి రసాయన శాస్త్రజ్ఞులకూ బోలె డన్ని యిబ్బంది లున్నా యనుకోండి. వీళ్ళ ప్రయత్నాల్లో తరచుగా అపజయం కలుగుతూనూ వుంటుంది. కాని, ఆ నాటి రసవాదుల కష్టా లతో పోలిస్తే నేటివాళ్ళవి ఒక కష్టాలే గావు! వాళ్ళకి వున్న సాధనసామగ్రులే అంతంతమాత్రం. అవికూడా తరచుగా ప్రేలి, ముక్కలై యెగిరిపోతుండేవి. మూకుళ్ళతో పుటాలు పెట్టి, బక యంత్రాలతో బట్టీలు పెట్టి, యెన్నో వారాలూ, మాసాలూ చేసిన పనంతా ఒక్క క్షణంలోనే ఒక్కొక్క

ప్రేలుడు నాశనం గావించేసేది. అతడు నిరుత్సాహియై, అలిసిపోయి యింటికి వెళ్ళిపోయేవాడు. కాని, మరునాటి ఉదయమే ఆతడు తిరిగి తనగదిలో ప్రత్యక్షం! కాలి మచ్చలు పడివున్న టేబిలుదగ్గర, బకయంత్రాలు, కాచపాత్రలు మొదలైన వాట్లతో చిందర వందరగా వున్న పనిబల్లయెదుట నిలబడి యేదో ప్రయోగంలో నిమగ్నుడై వుండేవాడు!

ఈ శాస్త్రజ్ఞులను రసాయనిక ప్రయోగాల్లోనికి ఆకర్షిస్తూన్న శక్తి యేమిటి? ఏ అన్వేషణా కుతూహలం రసవాదుల నాకర్షిస్తూందో, అదే యీ శాస్త్రజ్ఞులనూ లాక్కుపోతూంది. రసవాదు లేదో మరుమరీచికను, నీడను వెంటాడి పట్టుకోవాలనుకుంటూన్నారన్న మాట నిజమే! కాని, యీ నీడ యీ కొరవిదయ్యం వాళ్ళని తీసుకొనిపోయి, రహస్యమైన పరమాణు ప్రపంచంలో దిగవిడిచింది! ఈ అణుప్రపంచంలోనే మహాశక్తులు, యినుపగోడలను కూడా భేదించుకొని పోగల మహాశక్తులు దాగివున్నాయి.

ఈ సూక్ష్మ ప్రపంచంలో రసవాది, తా ననుకోని వాటి నెన్నిటినో కనిపెడుతూ వచ్చేడు. వాం రాశించిన బంగార మేమో లభించనే లేదు! కాని, బంగారుకంటె యెన్నో రెట్లు విలువైనవే దొరుకుతూ వచ్చేయి! రసవాద మంతా ఒకపెద్ద పొరబాటు, తప్పు! కాని, ఈ పొరపాటే వారిని సత్యాన్వేషణా మార్గంలో దిగవిడిచింది! రసవాదంనుంచే రసాయన శాస్త్రం జన్మించింది.

రసవాదులు యెప్పుడైతే 'చింతామణి' అనేది లేనేలేదనీ, బకయంత్రాల్లోని రాగి బంగారంగా మారదనీ తెలుసుకున్నారో, అప్పుడు వాళ్ళు తమ మూకుడులను, పాత్రలను, బకయంత్రాలనూ, బట్టీలనూ గిరగిర త్రిప్పి పారవేయలేదు. దానికి కారణం ఒకటే, అప్పటికే రసవాది శాస్త్రజ్ఞుడైనాడు! ఆతడు వస్తుప్రపంచంలో యెటువంటి మహాద్భుతములు, విశేషాలూ వున్నాయో తెలుసుకున్నాడు. ఇక దానిని విడిచిపెట్టడానికి శాస్త్రజ్ఞు డంగీకరించలేదు .....

## 6. మానవజాతి మహాప్రమాదంలో పడిపోయింది.

పశ్చిమదేశాల్లో మొదటి విశ్వవిద్యాలయాల్లో ఆచార్యుల ప్రథమ ఉపన్యాసాలను మొదటి విద్యార్థులు వింటూన్న రోజుల్లోనే, మొదటి రసవాదులు తమ ప్రయోగ ధూమాల్లో ఉక్కిరిబిక్కిరవుతూ తంటాలు పడుతూన్న కాలంలోనే, తూర్పుదేశాల్లో మానవజాతి అదృష్టాన్ని నిర్ణయించే మహాయుద్ధాలు అతిభయంకరంగా జరుగుతూన్నాయి.

పారిస్ నగరంలో, గోపుర శృంగాలు సాధారణ గృహాల మీద, కొయ్యతో చేసిన గాలికోళ్ళమీద మహోన్నతంగా కనిపిస్తూ గాలిలో లేస్తూన్నాయి. రష్యను భూమిలో గంభీరోన్నతములైన కెథ్రిడల్ ల శిలాశిల్పములు చూపరులను ముగ్ధుల్ని గావిస్తూన్నాయి. కాని మధ్యాసియా మైదానాలు, యెడారులలో, సుదూరమున జను లింకా కంబళిగుడారముల

లోనే నివసిస్తూన్నారు. వారు ధాన్యాదులను పండించుటగాని, యిళ్ళు వాకిళ్ళు యేర్పాటు చేసికొనుట గాని లేనేలేదు. అక్కడి సంచారజాతులు తమ యావజ్జీవితాన్నీ కూడ నాలుగు చక్రాల రధాలపైన యేర్పాటు చేసికొన్న కంబళి గృహాల్లోనే గడుపుతూన్నారు.

ఈ తెగగుంపు మైదానంలో ప్రయాణం చేస్తూన్నపుడు తమ పశులమందలను కూడా తోలుకునే పోతూంటారు. పశుధూళితో దిక్కులన్నీ కప్పబడిపోయేవి. వేలాదిగా వున్న రథచక్రాలు కిర్రుకిర్రుమని చేసే ధ్వనిలో సారధుల ఘోషణములు వినబడేవే గావు. ఖురసంఘట్టన ధ్వానములున్ను, హాయహేషలున్ను చుట్టూ మైళ్ళదూరంవరకూ వినిపించేవి. * ఒక దేశానికి దేశమే మరోచోటికి తరలిపోతూన్నట్లుండేది.

వీరు తరలి సాగిపోతూంటే, దారిలో వెనుక యేమీ మిగిలేదేకాదు. తృణకాష్ఠములు లేని వొట్టి నేలలనూ, తగులబెట్టబడిన జనావాసాలనూ మాత్రమే వీరి దారిలో చూస్తాము. వీళ్ళ పశులమందలూ, గుర్రాల దండులూ గడ్డినంతనూ పురుగునాకేసేవి. వంటలకూ, నెగళ్ళకూ మొక్కడలేని పుల్లాపుటికా చాలేదే కాదు. ఇక యీ జనులుకూడా తమకు అగతగిలిన జనపదాలను పాడుచేస్తూ, పరశురామప్రీతి గావిస్తూ పోయే

---

* మహాభారతంలోని గోగ్రహణ సందర్భంలోని వర్ణనలు జ్ఞాపకం చేసుకుంటే, యీ వర్ణనలకు చాల సన్నిహితంగా వున్నట్లు తెలుసుకోగలము - అను.

వాళ్ళు. ఎన్నో సంవత్సరాల తరబడిని గ్రామీణులు కూడ బెట్టుకున్న సమస్తాన్నీ యీ సంచారులు తమ రథాలమీద వేసుకుని గొంపోయేవాళ్ళు, స్థానిక జనులు వీరి దారికి యిటూ అటూ పురుగు నాకేసినట్లు నశించిపోయేవాళ్ళు. కొందరు చంపబడడం, మిగిలినవారంతా బానిసలుగా గొంపోబడడం,— యిదీ వరస. ఒక మహాప్రవాహంలాగ మధ్యాసియానుంచి బైలుదేరిన సంచార తెగలు లోకాన్నంతనూ ముంచివేస్తూన్నట్లుండేది.

ఈ జనప్రవాహం చీనా హద్దులను భేదించుకొనిపోయింది. మధ్యాసియాలోని దక్షిణ ప్రాంతంలోని దేశాలనూ, నగరాలనూ, ఒయేసిస్సులనూ యీ ప్రవాహం ముంచివేసింది. ఈ ప్రవాహము హిమాచ్ఛాదితములైన కాకసస్ పర్వతశ్రేణులను తాకి, జార్జియా లోయలను, పర్వతపాదభూములను నింపివేసింది. నల్లసముద్రం వెంబడేవున్న స్టెప్పీమైదానాల్లోనికి యీ ప్రవాహం జొరబడిపోయింది. అక్కడినుంచి హంగరీని చేరి, అట్లాంటిక్ సముద్రతీరాలను దాసింది. *

---

* ఈ సంచార జాతులలోనివారే హూణులు. వీరు హిమాలయములలోని పశ్చిమోత్తర కనుమలగుండా హిందూదేశంలోనికి తరంగాలు తరంగాలుగా చొచ్చుకు వచ్చేరు. కాని, హిమాలయములను దాటి వచ్చిన వారు కొద్దిమందే యగుటచే, వారు తాత్కాలికంగా కొన్ని ప్రదేశాల నాక్రమించినా, వారు క్రమంగా మన దేశపు ఉన్నత నాగరకతకు లోబడి, దీనిలో జీర్ణమైపోతూ వచ్చేరు.—అను.

మంగోలియా మైదానాల్లో పరిభ్రమిస్తూండిన యీ తెగలు, తమకంటె ఉన్నత నాగరకత గలిగిన అసంఖ్యాక వ్యాప సాయిక దేశాలను జయించ నారంభించిన దెట్లు? మంగోలు తెగల నన్నిటినీ ఐక్యపరచి, ఒకే ఒక తార్తారు సార్వ భౌమాధికారాన్ని స్థాపించిన సాహసికుడూ, గుణశాలీయైన జెంఘీజ్ ఖాన్ వల్లనే యీ పని సాధ్యమైంది. చరిత్ర కందని కాలంలో, అంతకు ముందు యిల్లాంటి సేనానుల క్రింద నీ సంచారజాతులు యిట్టి విజృంభణను చూపినవో లేదో యింకా పరిశోధకులు తేల్చాల్సి వుంది.

జెంఘీజ్ ఖానూ, ఆతని చమూపతులూ, ఉత్తరచీనాను, తూర్పు తుర్కీస్థానమును, మధ్యాసియా దేశాలను, కాకసస్ ప్రాంతాలను, తూర్పుయూరోపును దండు వెడలి ఆక్రమించేరు. క్రీస్తుశకం 1227 లో జెంఘీస్ ఖాను మరణించేడు. ఆతని తరువాత వారసులు యీ జైత్రయాత్రలను కొనసాగించేరు.

ఈ తార్తారు మూకల వ్యాప్తినీ, ఆక్రమణలనూ చూచి, విని, యావత్ప్రపంచమూ భయభ్రాంతమైపోయింది. రోమను పోప్, యీ మహాఖానుని సమతాని కి తన దూతల్ని పంపి, ఆతనితో స్నేహశాంతిపూర్వకమైన ఒడంబడిక గావించుకో డానికి యత్నించేడు.

పోప్ రాయబారులుగా ముగ్గురు సన్యాసులు,— ఇటాలియన్ గియోవన్నీ కార్పినీ, జెచియానుంచి స్టెపాన్, పోలండు నుంచి బెనిడిక్ట్ అను ముప్వురూ యీ దీర్ఘయాత్రకు బైలు

దేరేరు. అశ్వారూఢులై అరణ్యాలగుండా, మైదానాల మీదుగా నూటఆరు రోజులు ప్రయాణం చేసి, డ్నీపర్, దాన్, వోల్గా నదులను తరించి, ఎట్టకేలకు మధ్యాసియా ఎడారిప్రాంతం చేరుకున్నారు. తార్తారు మూకలచే సర్వనాశనం గావించబడిన ప్రాంతాలమీదుగా వా రనేకసార్లు ప్రయాణాలు గావించాల్సి వచ్చేది. మైదానాలమీద గడ్డిలో మానవకపాలాలూ, ఎముకలూ ప్రోగులు ప్రోగులుగా, చిందరవందరగా పడియుండేవి. పెద్ద పట్టణాల్లోకూడా చివరికి తలదాచుకోనేందుకు చోటు లభించేదిగాదు. ఒకప్పుడు వందల కొలది యిండ్లున్నచోట యిప్పుడు కొద్దికొంపలు మాత్రం మిగిలి వున్నాయి. ఎట్టకేలకు వారు మహాఖానుయొక్క ప్రధానస్థానం చేరుకున్నారు.

క్రైస్తవలోకానికి పితృతుల్యుడు పోప్, ఆయన రాయబారులు యీ ముగ్గురు సన్యాసులూ; ఇల్లాంటి వీళ్ళు మహాఖానుకు తమ భక్తి విశ్వాసాలు తెలుప విచ్చేసిన నాలుగు వేల రాయబారులలో అంతు దొరక్కుండా మునిగిపోయేరు! ఆసియాలోని సమస్త దేశాలనుంచీ, మూలమూలలనుంచీ యెందరో ముఖ్యులైన రాజులు, ప్రభువులు, రాయబారులు మహాఖాను దర్శనానికి వచ్చి వున్నారు. మహాఖానుని రాజధానీనగర మధ్యంలోనే సువిశాలమైన గుడార మొకటి నిర్మించబడింది, దానిలో ప్రతి ఉదయమునూ రెండు వేలమంది సభ తీర్చేవాళ్లు!

మొదటిరోజున వారందరూ శ్వేతవస్త్రములనూ, రెండో రోజున అరుణ వసనములను, మూడో దినమున నీలిదుస్తులనూ ధరించేవాళ్ళు అక్కడి రాజసభామర్యాద యిది. రాయబారు లందరూ తివాచులమీద సుఖాసీనులై, గుఱ్ఱపు పాలు త్రాగుతూ * మహాఖాను రాకకై నిరీక్షిస్తూ కూర్చునేవాళ్లు. ఆయ నొక్కడే ప్రవేశించు హక్కుగల ఒక ప్రత్యేకద్వారం పైననే అందరి దృష్టులూ కేంద్రీకృతంగా వుండేవి. ఎట్టకేలకు మహాఖానుడు పరివారజన పరివేష్టితుడై ఆ ద్వారంలోంచి వచ్చేవాడు. ఆతనికి రెండువైపులా వింజామరలు వీచేవాళ్ళు నడుస్తూంటారు. సభలోని వేల జనులు ఆయన రాగానే వినయ సంభ్రమములతో మోకరించేవాళ్లు.

యావత్ప్రపంచమూ యీ మహాఖానుని ముందు మోకరించేందు కుద్యుక్తమై వుందనిపించేది!

మహాఖాను, పోపు రాయబారులు చాల కాలం వేచియుండే టట్టు చేసేడు. ఆఖరికి వారికి ఆయన ఒక లేఖను దయచేసేడు. ఆ జాబు అరబిక్, లాటిన్, మంగోలియను భాషల్లో వ్రాయబడివుంది. బహుశః ఖాను బందీలుగా అన్నిజాతుల, తెగల వారూ, చదువుకున్నవాళ్ళు యెందరో వుండివుంటారు. వాళ్ళ చేతనే అరుదుగా అవసరమయే లేఖన పరనాదు లన్నీ చేయించే వాళ్ళులావుంది. ఆ లేఖలో యిల్లా వుంది :

---

* మధ్యాసియా ప్రజలు గుర్రపుపాలు త్రాగుతారు, గుర్రపు మాంసం తింటారు. గుఱ్ఱపు పాలలోంచి క్యుమిస్ అనే సారాయిని తీసి అదీ తాగుతారు. క్షయాది వ్యాధులను పోగొడుతుందిట, ఈ క్యుమిస్.

"నీవు స్వయంగానే, సమస్త రాజులోకాన్ని నీ వెనుకబెట్టుకొని మా దర్శనానికి వచ్చి, నా సేవచేయడానికి, నన్ను గౌరవించడానికి ప్రతిన తీసుకోవాలి. నీ విట్లు గావించినచో నీ లొంగుబాటును గుర్తించగలము. లేనిచో నిన్ను మా శత్రువుగానే పరిగణిస్తాము."

అఖిల క్రైస్తవ ప్రపంచ గురుడైన పోప్‌నకు ఖాను పంపిన జాబు, యిదీ! రాజమాన్యుడైన పోప్ రాయబారులైన



ఆ సన్యాసులు ముగ్గురూ యేడువేల మైళ్ళు ప్రయాణం గావించి వచ్చి, తీసికొని వెళ్ళిన జవాబు యిది!...

మానవజాతికి మహా భయంకరమైన విపత్తు సన్నిహితమై వుంది. గతం వర్తమానంతో తలపడుతూంది! సంచార జాతులు, స్థిరపడిన వ్యావసాయిక జాతులతో యుద్ధానికి తయారవుతూన్నారు!

ఇందులో మరీ ప్రమాదకరమేమంటే ఈ బర్బరులు తామది వర కెన్నడూ యెరిగి యుండని యుద్ధ పద్ధతులను మధ్యాసియా లోని నాగరిక ప్రజలనుంచి నేర్చుకున్నారు. ఆ యుద్ధ పద్ధతు లను ప్రయోగించి, వీరిప్పుడు అన్ని దేశాలనూ సర్వనాశనం గావించుతూన్నారు. వీరొక శత్రు నగరాన్ని ముట్టడించి నప్పుడు దుర్గ ప్రాకారముల దగ్గరకు లగ్గలుపట్టు యంత్రాల్ని తీసుకొనివచ్చి పెద్ద పెద్ద పాషాణములను గోళీకాయలవలె లోనికి విసరివేసేవాళ్ళు. ఒడిసెలలతో బెడ్డలను విసరినట్లు యీ యంత్రాలు పెనుబండలను పట్టణవాసులమీాద విసరగలవు! భగ్గున మండుతూండే తారుకుండలు, గుగ్గిలపు ముద్దలు దూరానికి విసిరి, నగర ప్రాకారాల్లో భవనాలను పరశురామ ప్రీతి గావించేవారు! బరువైన, బలమైన, దారునిర్మితమైన 'కుమ్ముడుపొట్టేళ్ళు' నగరద్వార కవాటాలను ఢీకొని, పడపడ గ్రుద్దుకుని పగులగొట్టేవి!

నాగరకజాతుల నుంచి నేర్చుకున్న యీ యంత్రసాధనాలనే ఉపయోగించి. బర్బరులైన తార్తారులు ఒక్కొక్క నగరాన్నే స్వాధీనం గావించుకుంటూన్నారు, ముందుకు సముద్ర తరం గాల్లా విరుచుకు పడుతూ పోతూన్నారు.

వీరు యూరోపు నంతటినీ స్వాధీన పరుచుకోగలిగివుంటే యేమై వుండేది?

మానవలోకం చాల కాలంవరకూ సర్వనాశనస్థితిలో పడిపోయి, నాగరికత-సంస్కృతి తిరోగమించి వుండేవి. మానవ

సంస్కృతికి పుట్టినిళ్లైన సుప్రసిద్ధనగరా లన్నింటినీ తార్తారులు నాశనం గావించేసేవాళ్ళు. మానవజాతి నేటిని చూచి గర్వించునో అట్టివన్నీ, గ్రంథాలు, శిల్పాలు, చిత్రాలు, విగ్రహాలు,- ఒక టేమిటి సర్వవిద్యలూ, కళలూ భస్మావశేషము లైపోయి వుండేవి. అతి సుందర శిల్పశోభితములూ, బహువర్ణ కాచఫలక రంజితజాలకమార్గములూ నైన దేవాలయములు, రాచ నగరులు ముక్కలు చెక్కలుచేసి వుండేవాళ్లు, పారిస్ నగరపు పవిత్ర దేవాలయాల్లో, కెథిడ్రల్స్‌లో తార్తారులు తమ గుర్రాల్ని కట్టేసేవాళ్ళు!

కాని, పురోగమిస్తూన్న తార్తార మూకలను అడ్డగించి నిలబెట్టివైచిన శక్తి ఒకటి బైలుదేరింది!

తార్తారు సైన్యాలు రష్యన్ భూమిని గ్రమ్మివేసినాయి. ఓకు దారువులతో నిర్మించిన 'కుమ్మడు పొట్టేళ్ళు' రష్యన్ నగర ద్వారాలమీద సాగరతరంగాల్లా తాకుతూన్నాయి. శిలాకుడ్యములు కూడ వాటి తాకిడికి శిధిలములై కూలుతూన్నాయి. కాని, శిధిలము లవుతూన్న గోడలలోపలనే రాత్రికి రాత్రి కొత్తగోడలు లేస్తూన్నాయి. ఈ కొత్తగోడలు యెత్తుగా బలంగా దూలాలతో నిర్మించేవాళ్ళు. ప్రతి నగరమూ తార్తారు మూకల మార్గాన్ని ప్రతిరోధిస్తూనే వుంది. రష్యన్ భూమి యావత్తూ, విరుచుకుపడి ఉరకలమీద వస్తూన్న తార్తార సైన్యవాహిని దారిలో ఆనకట్టగా నిలిచింది.

ఈ ఆనకట్టలో బీట లేమీ లేకుండా వుంటే దృఢంగా నిలిచి వుండేది. కాని, దురదృష్టవశాత్తూ రష్యాను లప్పటి కింకా ఒక ఐక్యజాతిగా తయారై వుండలేదు. క్రీస్తుశకం 1224 వ సంవత్సరంలో కల్కా నదీ తీరాన ఒక రష్యనురాజు శత్రువులతో పోరాడుతూంటే యితర రష్యను రాజులు సేనాసమేతులై దగ్గరలోని కొండగుట్టలమీద నిలబడి, చోద్యం చూస్తూ, కదల మెదలకండా వుండిపోయేరు. తోడిదేశీయుల శరీరాలను తార్తారు గుఱ్రపుదండ్లు త్రొక్కి మట్టిపేస్తూంటే వారు తమకు పట్టనట్లూరకున్నారు...*

తూర్పు దిక్కునుంచి వీచుతూన్న వడగాడ్పు సెగలతో పశ్చిమ దేశా లన్నీ మండిపోతూన్నాయి. ఈ సెగలు, పొగలు పరశురామప్రీతి యగుచున్న అసంఖ్యాక నగరాలు, జనపదాలుమీాదనుంచి వచ్చేవే. తార్తార వాహినులు ప్రతి ఘటనను నిర్మూలించేసి, రష్యాను, పోలండు, జర్మను దేశాలను ముంచివేసినాయి.

జర్మనులు మాత్రం తమ మాతృభూమిని సంరక్షించుకో గలిగేరు. అక్కడ పర్వతములు చాల హెచ్చుగా నున్నందున

* భారతదేశ చరిత్రలో సుమారు 2400 యేండ్లక్రిందట అలగ్జాండరు సైన్యాలను జీలం నదీతీరాన పురుషోత్తముడు యెదిర్చినపుడూ, మహమ్మద్ ఘోరీమూకలను 1192లో పృథ్వీ రాజు నిలువరించినపుడూ, 18 వ శతాబ్దంలో ఆంగ్లేయులను నిలువరించడంలోనూ కూడ యిల్లాంటి అనైక్యతనే మన దేశీయులూ ప్రదర్శించేరు. భారత నాగరికత అనేకసార్లు బర్బరమూకల దాడికి గురవుతూ వచ్చింది. — అనువాదకులు

సహజంగా వారికి రక్షణావకాశాలు వున్నాయి. తార్తారుల అశ్వబలాలు సమమైదాన భూములకు అలవాటుపడినవే గాని పర్వతభూముల్లో వాటికి గమన సౌలభ్యం లేదు. అంతేగాక, రష్యనుభూమిలో జరిగిన ఘోరసంగ్రామాలలో తార్తారులు బాగా బలహీనపడిపోయేరు.

తూర్పుదిశనుంచి వచ్చిన తార్తార వాహినులనుంచి తమ రక్తమును ధారపోసి, రష్యనులు యూరపుజనులను కాపాడేరు. కాని, అంతలోనే పశ్చిమాన్నుంచి స్వీడులు, జర్మనులు వచ్చి రష్యనులపై బడ్డారు. ఎడా పెడా తగిలిన యీ ఆఘాతాలకు రష్యనులు తట్టుకో లేకపోతున్నారు. రష్యనుల పడమటి పొరుగు వారే వారిని వెనుకనుంచి దెబ్బతీసేరు.

రష్యనులు స్వీడుల నోడించడానికి నీవా నదీతీరాలకూ, జర్మను యోధుల నెదిరించడానికి పైపస్ సరస్తీరాలకూ చొచ్చుకొని పోవాల్సివచ్చింది.

రష్యనులు తార్తారులను వెనక్కి త్రిప్పి కొట్టలేకపోయేరు. గాని, వారు తమ కర్తవ్యాన్నేమో నెరవేర్చుకున్నారు. తార్తారులు నిలువరించబడ్డారు. ఇంకా పశ్చిమంగా తమ దాడులు సాగించేటందుకు తగిన బలం వారికింక లేదు. పూర్తిగా జయించబడని రష్యాను, తిరుగబడగల రష్యాను తమ వెనుక భాగంలో దిగవిడిచి, ముందరికి పోవడానికి తార్తారులు భయపడ్డారు. తార్తారు పురోగమనం నిలిచి పోయిందే కాని రష్యనులకు మహా కష్టకాలం వచ్చింది.

రష్యాను పల్లెలు, పట్టణాలు సర్వనాశనం ఐపోయినాయి. పారిపోయి ప్రాణాలు కాపాడుకో గలిగిన జను లందరూ అరణ్యాల్లో దాగొనివుండి, కాలక్షేపం చేస్తున్నారు. మానవు డొకప్పుడు అరణ్యాలను నరికి బాగుచేసి, పంటపొలాలుగా చేసేడు. ఇప్పుడా పంటభూము లన్నీ మళ్ళీ అరణ్యాలుగా మారిపోతూన్నాయి. జనపదములే, పట్టణవీధులే యిప్పుడు పొదలు, రుప్పలతో జీబురు మంటూన్నాయి. జనాకీర్ణములై యుండిన గ్రామాలు యిప్పుడు క్రూరమృగాలకు ఆవాసములుగా వున్నాయి.

కాలచక్రం, చరిత్రగతి వెనుకకు తిరుగుతుందా? అని పించింది.

ఈ కష్టకాలంలో రష్యాను భూమిలో విజ్ఞాన సంస్కృతు లేమైనాయి?

అంతకు కొంచెం ముందే చరిత్ర కారులు వ్రాసేరు :

'ప్రాణిలోకానికి ఉదకదానం గావించే జీవనదుల వంటివే గ్రంథాలు; అవి జ్ఞానానికి ఊటల వంటివి. గ్రంథాలలో ఎవరూ కనుగొనియుండని అగాధవిషయా లెన్నో వుంటాయి. దుఃఖసమయాలలో మానవులు వీటిలో ఉపశమనమును పొందుతారు.' *

---

శ్లో. అనేకసంశయోచ్ఛేది । పరోక్షార్థస్య దర్శనం ।
సర్వస్యలోచనం శాస్త్రం । యస్యనా స్త్యంధ ఏవసః॥
శ్లో. విద్యా దదాతి వినయం। వినయాద్యాతి పాత్రతాం ।
పాత్రతా ద్ధనమాప్నోతి । ధనాద్ధర్మం తత స్సుఖం॥

నిజమే! ఈ రచయిత చెప్పింది అక్షరాల నిజమే! భయంకరమైన యీ దుఃఖ సమయంలో, విపత్కాలంలో రష్యనులు దుఃఖనివృత్తికరములైన గ్రంథ పెన్నిధానమును శత్రుమూకల నుంచి కాపాడుకో యత్నించేరు.

రష్యను భూమికి యీ కాళరాత్రి దిగివచ్చినపుడు వారు తమ కూరట కలిగించు గ్రంథసంచయమును బర్బర మూకల పాలబడకుండా కాపాడ యత్నించేరు. శత్రువులు సమీపిస్తూన్నారని తెలియగానే పుస్తకాల నన్నిటినీ ప్రోగుచేసి, జనులు వాటిని దూరగ్రామాల్లోని రాతి చెర్చిలలో, నేల మాళిగలలో దాచేవాళ్ళు. *

జనులు అపురూపమైన ఆ గ్రంథాల నెల్లా కాపాడేవాళ్ళో! వాటిలో ప్రతిపుటా కూడ బంగారు నీరుతోనూ, ఊదా సిరాతోనూ చిత్ర విచిత్ర వర్ణశోభాలంకృతమై వుండేది! ముత్యాల వంటి జిలుగు అక్షరాలతో, సమమైన పంక్తులతో, పుటచుట్టూ చక్కని లతాచిత్రాలతో యెంత బాగా వుండేవవి! ఆ గ్రంథాలను యే మాత్రమూ మాయకండా, చినుగకుండా, గట్టిగా బైండుచేసి వుంచేవారు! తోలుతోనూ, అంచులను రాగి పట్టములతోనూ దృఢంగా బంధించి, బందులూ, తాళాలూ వేసి వుంచేవారు, గ్రంథాలను! పెన్నిధులకంటె విలువగల వీ గ్రంథములు! అల్లాంటి అమూల్య గ్రంథాలు యిప్పుడు

---

* శ్లో॥ ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయం ।
యది శబ్దాహ్వాయం జ్యోతి రా సంసారం నదీ ప్యతే॥

కుప్పలుగా చెర్చిలలో రాతి తిన్నెలమీద పడివున్నాయి. మానవుడు గావించిన సృష్టి కంతటికీ మకుటాయమానమైనది, యీ గ్రంధజాలము! దీనికి మించిన సౌందర్యం మరెక్కడా లేదు! కాని వీటికి చెర్చిలో కూడా రక్షణ లభించలేదు. ఓరిమితో, శ్రద్ధతో అనేక సంవత్సరాలపాటు కష్టపడి రాసిన గ్రంధాలు, గావించిన కృషి, అంతా కొద్ది నిముషాల్లోనే నిర్దాక్షిణ్యములైన మంటల కాహుతియై నశించేవి.

ఆనంద జనకములైన ఆ గ్రంధాల పుటలు, నేర్పు, ఓరిమి గల వ్రాయసగాండ్రచే చిత్రించబడినట్టి ఆ గ్రంధాల పుటలు చిటికెలో సెగకు చుట్టలు చుట్టుకుపోయి, నల్లటి నీలిమంటలు లేచేవి.

"వారు జ్ఞానవాహినులను శోషింపజేసిరి; విజ్ఞాన కూపముల నింకింపజేసిరి" అన్నాడొక కవి.

కాని, రష్యాను జనులు తమ గతాన్ని జ్ఞాపకం పెట్టుకునే వున్నారు. అందుచేతనే వారికి భవిష్యత్తునందు కూడా విశ్వాసం కలిగివుంది.

ఎక్కడో దూరాన ఉత్తరారణ్య భూములలో నివసించే అజ్ఞాత కవిపుంగవుడు, 'రష్యాభూమి వినాశనగాథ' లను రచించి, గానం చేసేడు. ఆ కథనంతనూ ముందుతరాలకు, తన మాతృభూమికి అర్పణగావించి, చిరస్మరణీయుడైనాడు. రష్యాను భూమికి తటస్థించిన దురదృష్టాన్ని దానిలో వర్ణించేడాయన.

ఆ గేయగాథలోని మొదటి చరణాలు కొన్ని మాత్రమే మన కీనాడు మిగిలి వున్నాయి. మాతృభూమియందు అకుంఠిత ప్రేమాభిమానాలు, భవిష్యత్తులో గాఢవిశ్వాసం, మానవత్వంలో నమ్మకం, – యివన్నీ ఆ పాటలో తొణికిసలాడుతూంటాయి.

ఇవిగో! ఈ చరణాలు చదవండి :

ఓహో! రష్యను భూమాతా!
కాంతిపుంజ సమేతా! సర్వాభరణోపేతా!
అమేయ సౌందర్య విభ్రాంతీకృత జనతా!
ఏమి నీ యగణిత సశోభ!
నదీనదాలూ, పవిత్ర తీర్థములు,
ధవళోన్నత శృంగయుత పర్వతశ్రేణులు,
శోభావహ వనరాజులు, ఆనందోద్యానాలూ,
అగణిత జరాయుజాండజ విభ్రాజితా,
మహానగర జనపదశోభినీ, శుభకరీ,
నీ విహారోద్యానము లేమి!
నీ దేవాలయ సుందర శిల్పము లేమి!
రిపు భయంకరులౌ రాజులు, ఋజుమార్గులౌ రైతులు,
ఎందరెందరో సంపన్నులు, ప్రభువులు,
సర్వసంపదల కాలవాలమవు తల్లీ!
ఓ క్రైస్తవ మతమా! సత్యపూతమా! ..
మ్లేచ్ఛ భూములన్నీ క్రైమోడ్పులొసగినవి,
మహారాజా త్సెవలోద్ యోధునకు,
ఆయన తండ్రి యూరీకి, కీవ్ రాజునకు,
పితామహుడు వ్లాదిమిర్ మొనోమాక్‌నకు,
రిపుభయంకరులగు పొలోవ్‌త్సీలు,
గోపాలురు, మొనోమాక్ పేరుచెప్పి,

ఉయ్యాలలోని బిడ్డలను జడిపించేవాళ్లు !
లిథుయేనియనులు తమ గర్తభూములనుంచి,
వెలుగులోనికి రా నిరాకరించువారు ;
యుగ్రియనులు తమ పట్టణప్రాకారాల
ఇనుపకవాటాలను మూసివైచువారు,
వ్లాదిమిర్ రాజు జోచ్చునను భీతితో.
జర్మనులు తమ అదృష్టానికెంతో మురిసేవారు,
నీల సముద్రాని కవ్వల దూరంగా తమ ఉనికికి.
బుర్గా, ఛెరిమిసీ, వోద్, మొర్దావియన్‌లు,
అడవితేనెనే అరిగా అర్పించేవాళ్లు,
మహారాజు వ్లాదిమిర్ మహితునికి,
మనూయిల్, జార్‌గ్రాడ్ * సార్వభౌముడే
రూస్ రాజునకు సరభసముగ,
అపురూపకానుకలు, ఎన్నెన్నో వస్తువులు,
మహారాజు వ్లాదిమిర్‌న కంపెడివాడు,
తన రాజధానిని ముట్టడి వేయకుండ !

రషియను జనులు ధైర్యము గోల్పోలేదు. వాళ్ళ గుండెలు జారిపోలేదు.

## 7. మానవుడు విజయుడై పురోగమిస్తాడు.

మానవతను జయించు టేమంత సులభంకాదు; అరణ్యాలలో తలదాచుకొన్న జనులందరూ ఒక్కరొక్కరుగా తిరిగి జనపదాలను చేరుకొన నారంభించేరు. వీళ్ళందరూ కొద్ది రోజుల క్రిందట అంతా పూర్తైపోయిందనీ, తమ జీవితాలు

* జార్‌గ్రాడ్ = బైజాంటియమ్

ముగిసినవనీ, భావించినవాళ్లే! వీళ్ళకిప్పుడు యిళ్లు వాకిళ్లు లేవు. చాలమందికి బంధుమిత్రాదు లెందరో చనిపోయేరు. చుట్టూ సర్వనాశనమైపోయింది. తమ స్వగ్రామాలు, నగరాలూ భస్మరాసులుగా మిగిలి, ఆనవాలు పట్టడమే అసాధ్యంగా వుంది. అసలు యీ మిగిలిన జనమే మారిపోయినట్లు, పునర్జన్మ యెత్తినట్లు కనబడుతూన్నారు. అందరికీ తలలు నెరిసిపోయినాయి; అకాలవార్ధక్యం పైబడింది. వాళ్ళ నుదుళ్ళ మీద ముడుదలు లోతుగా యేర్పడి పోయినాయి.

వెనుకటి సుఖమయ జీవితం వాళ్ళని వదలిపెట్టి, శాశ్వతంగా వెళ్ళిపోయింది. అంతా మళ్లా ప్రారంభించాల్సిందే!

జీవి ఆశామయుడు. అంధకారంలోంచి వెలుతురుకోసం, మృత్యువులోంచి అమృతంకోసం అర్రులు చాచుతాడు! మళ్లా అంతా ప్రారంభిస్తాడు.

తిరిగి అరణ్యాలన్నీ గొడ్డలివ్రేటులతో ప్రతిధ్వనిస్తూన్నాయి. మ్రానుల్ని నరకడం, దుంగల్ని చెక్కలుగా చీల్చడం, చెక్కలను కుసివేసి చేర్చి బిగించడం జరుగుతూంది. దుంగలు, దూలాలు, చెక్కలు ఒకదానిమీద ఒకటి యథాస్థానాల్లో బిగించబడి, కొత్తయిండ్లు లేస్తున్నాయి. దేవదారు నిర్మితములైన ఈ గృహాలు గుగ్గిలంవాసనలతో గుప్పుమంటూన్నాయి. కొత్తగ్రామం చుట్టూ కొత్తగోడ లేచింది. ఈ ప్రాకారం కూడా బలమైన దేవదారు మ్రానులతోనే నిర్మించేవారు. మెలికలు తిరిగి ప్రవహిస్తూన్న మాస్క్వానది యెగువ ప్రాంతంలో క్రెమ్లిన్ రాజ ప్రాసాదం చుట్టూ నగరం పెరిగింది. ఇదే మాస్కో

నగరం. చెట్టు ప్రమానులో నడిమి చేవచుట్టూ ఉంగరాలుగా ప్రమాను కట్టినట్లే క్రెమ్లిన్ భవనంచుట్టూ క్రమక్రమంగా వృత్తాలుగా మాస్కో నగరం పెరిగింది. మాస్కో నగరం కేంద్రంగా రష్యను రాజ్యం పెరిగి, చుట్టూ వ్యాపించింది. ఆశాపరులైన మాస్కో రాజులు గ్రామం తరువాత గ్రామం, పట్టణం తర్వాత పట్టణం స్వాధీనం గావించుకుంటూన్నారు. మాస్కో రాజ్యం లక్షలాది జనుల నైక్యపరచి పాలించే పెద్ద రాజ్యంగా తయారైంది.

శతాబ్దాలు గడుస్తూన్నాయి. క్రీ. శ. 13 వ శతాబ్ది గడిచి 14 వ శతాబ్దం వచ్చింది. మాస్కో రాజ్యం పెరిగి పెద్దదై, తార్తారులతో బాహాటంగా యుద్ధానికి తలబడగల శక్తిగల దైంది.

ఒకప్పుడు రష్యన్ రాజులు యెవరికి వారే తార్తారులతో మైదాన భూముల్లో యుద్ధాలు చేస్తూండేవాళ్ళు. ఇప్పుడు వారందరూ కలిసి యేకమై, మాస్కో రాజైన దిమిత్రీ ఇవానోవిచ్ నాయకత్వాన, సుసజ్జితమైన సేనానీకములతో దండెత్తి తార్తారుల నెదుర్కోడానికి వెళ్లేరు.

ఈ సారి తార్తారు అశ్వికదళాలు రష్యా సైనికులను త్రొక్కుకుంటూ పోలేకపోయినవి. రష్యనులే దాన్ నదీతీరస్థ మైదానభూముల్లోంచి తార్తారులను తరుముతూ పోయేరు.

మాస్కో నగరం పెరిగి పెద్దదవుతూ వస్తూంది. ఓకు దూలాలతో నిర్మించిన ప్రాకారానికి మారుగా యిప్పుడు

శిలానిర్మిత ప్రాకారం లేచింది, క్రెమ్లిన్ చుట్టూ. నేర్పరులైన పనివాళ్ళు పెద్దపెద్ద చెర్చిలు, విశాలమైన విహారాలు, సుందరమైన రాచనగరులు మొదలైనవాటిని మాస్కోలోను, యితర నగరములలోనూ నిర్మిస్తూన్నారు.

రషియన్ చిత్రలేఖకులలో సుప్రసిద్ధుడైన ఆంద్రీ రుబ్లేవ్, మాస్కో మహారాజు పనుపున 'ప్రకటనా స్మారకమైన రాతి చెర్చి' ని చిత్రాలతో నింపేడు. కాని, రుబ్లేవ్ చిత్రాలలో అత్యుత్తమమైనది 'త్రితయము' అనేది. దీని నాయన 'సెయింట్ సెర్గియస్ త్రితయ విహారం' (ట్రినిటీ మొనాస్టరీ)లో చిత్రించేడు. ఆ చిత్రములో,-

ముగ్గురు దేవతలు ఒక టేబిలుదగ్గర ఆశీనులై వుంటారు. టేబిల్ మీద నొక పండ్లగంప వుంటుంది. వారు ముగ్వురూ మౌనంగా దేనినో గురించి గాఢాలోచనానిమగ్నులై వున్నట్లు కనబడుతూన్నారు. వారి అవనత శిరస్సులు, వదులుగా నున్న వారి దుస్తులలోని ముడుతలు మొదలైనవన్నీ ప్రాచీన గ్రీకు సంప్రదాయములను పోలివున్నాయి. కాని, గ్రీకు మహాశిల్పులు అతి సుందరమైన శరీరాలను మాత్రమే చెక్కితే, రషియను మహాచిత్రకారుడు అతి సుందరములైన ఆత్మలను కూడా వ్యక్తమగునట్లు చేయగలిగేడు!

రుబ్లేవ్ చిత్రంలోని దేవతావిగ్రహాల్ని చూస్తూంటే కరుణరసపూర్ణమైన శోకగీతికను భావనలో వింటూన్నట్లు తోస్తుంది, సీకు. మధ్యలో ఆసీనుడైయున్న దేవత వెనుక

నొక వృక్షం వుంటుంది. గాలివాన కది వంగి వుండే గాని విరుగ లేదు; ఆ చెట్టు వెనుక నే పర్వత మొకటి వుంటుంది. గీతంలో పల్లవి మాదిరిగా వున్నాయి, ఆ వృక్షమూ, పర్వతమూ కూడా. శోకభారంతో క్రుంగివున్న ఆ దేవత శిరస్సు మాదిరి గానే అవన్నీ ద్విరావృత్తంగా అవనతములై నట్లుంటాయి.

'ఇగోర్ రాజు గాథ' లో, మానవుని ఆత్మకు, ప్రకృతికి గల విభిన్నత్వం సరిగా యీ విధంగానే చూపేడు, కవి.

"నేరాంగీకారము గావించిన తృణములు తలలు వంచినవి,

మహావృక్షములు శోకపరీతములై నేలంట వంగినవి,"...

చిత్రకారుడు రుబ్లేవ్ భావమునూ, శక్తినీ, కూడ తన చిత్తరువుల్లో ప్రస్ఫుటీకరించేడు. కవులు తమ గీతాలలో 'బంధనములలో నుండి తార్తారుల పాపాలను పంచుకొన్న' రష్యాభూమి శోకమునూ, రానున్న స్వర్ణయుగపు శక్తినీ, విముక్తినీ శబ్దములతో చిత్రించేరు!

తార్తారు ఖానులు తమ దండులను తిరిగి మాస్కో-పైకి నడిపించేరు. కాని, అవి వెనుకటి తార్తారు దండులు గావు; రూస్ భూమి కూడా మారేపోయింది. పరస్పర కలహాల్లో మునిగివున్న రాజులను యేకచ్ఛత్రాధిపత్యం క్రిందికి తెచ్చేం దుకు రషియనులు యత్నిస్తూంటే, 'తార్తారుల పసిడిదండులు' * పరస్పర నిర్మూలనోద్యుక్తులైన వివిధ ఖాన్‌ల ఆధిపత్యం

* తార్తారులు మంగోలులు, వీరు పసిమిరంగువారు, గాన వీరిని 'పసిడిదండులు' లేక 'గోల్డెన్ హోర్డ్స్' అంటారు.—

క్రిందకు చీలిపోతూన్నాయి. తమలో తామే పోట్లాడు కుంటున్న దిప్పుడు తార్తారు ఖానులే గాని రషియను రాజులు గారు. మానవచరిత్రయొక్క మహోఘుంటాపథంలో రషియను ప్రజ లింకొక పెద్ద ముందడుగు కూడా వేసేరు. కాని, తార్తా రులు మాత్రం వెనుకటివలెనే అసంస్కృతులుగా వుండిపో యేరు. ప్రాచీనకాలపు రషియనుల స్థితికి తార్తారులు యిప్పుడు వచ్చేరు, మానవజాతి చరిత్రలో.

అనాహూతులై తార్తారు అతిథులు మాస్కో ద్వారముల వద్ద కనబడ్డారు. రషియనులు వారిని కలుసుకోడాని కెదురు ఏగేరు. ఈ సారి కథ అడ్డం తిరిగింది. అతిథులు విందు గుడవ డానికి ఉపవిష్టులు కానేలేరు! తార్తారులు యుద్ధం చేయ డానికి నిలబడనే లేదు. కొంచెం కాలం తటపటాయిస్తూ నిలబడియుండి, అంతలో గిరుక్కున తిరిగి వచ్చిన దిక్కుగానే వెళ్ళిపోయేరు.

రెండు శతాబ్దుల పర్యంతం రష్యాకూ, యితర యూరోపి యను రాజ్యాలకూ సంబంధాలు తెగిపోయినాయి. కాని, తార్తారు దాడులచే భిన్నాభిన్నం గావింపబడి, చెదిరిపోయి వున్న యీ రాజ్యాలు మళ్లా దగ్గరగా చేరుకొన నారం భించేయి.

రషియను రాజకుమార్తె యొకతె ఫ్రాన్సు రాణిగా వున్నకాలం ఒకటి వుండేది. అప్పుడు మరో రషియన్ రాజ కుమార్తె, నార్వే రాజు హెరోల్డును పరిణయమాడింది.

యూరోపులోని యితర రాజధానులతో కీవ్‌కు సన్నిహిత సంబంధాలున్న రోజు ఒక టుండేది. అప్పుడు కీవ్ రాజులు రషియన్ భాషనే గాక గ్రీకు, లాటిన్, జర్మను భాషలను కూడ మాట్లాడేవాళ్ళు.

• అటువంటిది యిప్పటికి రెండు శతాబ్దాలుగా పశ్చిమ దేశాలు రష్యానుగూర్చి పూర్తిగా మరిచిపోయేయి. ఫ్రాన్సు, ఇంగ్లాండు దేశాల్లో జనులు, 'పోలెండు, లట్వియాలు దాటేక ఒక పెద్ద దేశం వుంది; అది పోలండు రాజుల పాలనక్రిందదీ కాదు; తార్తారులదీ గాదు!' అని ఆశ్చర్యంగా చెప్పుకునే వాళ్ళు. బ్రిమెన్, లూబెక్ నగరాలనుంచి వచ్చే జర్మను వర్తకులు రషియనులను గూర్చి యింకా బాగా యెరిగి వుండే వారు. హాన్సియాటిక్ లీగ్ * అని పిలువబడే జర్మను వర్తక సంఘం వారి కార్యస్థానాలూ, గోదాములు, మండీలు వగైరాలు నొవోగొరోడ్‌లో కూడ వుండేవి. కాని, తమ వ్యాపార ప్రదేశాల్లోకి యితరులు జొరబడుట వాళ్ళ కిష్టంలేదు.

తార్తారుల 'పసిడిదండులు' చీలికలై పోయినాయి. రష్యను భూమిలోని రాజ్యాలన్నీ యిప్పుడు ఒకటిగా కలిసిపోయినాయి. మాస్కో-రాజ్యం యిప్పుడు త్వెర్, రియాజాన్ మండలాలతో పోరాడడంలేదు. వ్లాడిమిర్ మొనామాక్ రాజు కాలంలో

* హాంబర్గ్, లూబెక్ నగరాలమధ్య నున్న జర్మను పట్టణాల్లోని వర్తకుల సంఘం. ఇది 1241 వ సంవత్సరంలో యేర్పడి, ప్రత్యేక కట్టు దిట్టములతో, సాంకేతిక భాషతో వ్యవహరించేది.

ప్రాచీన కవి కనిన కలలు యిప్పటికి నిజమైనాయి. 'ఏకమనస్సు' 'ఏకహృదయం' అనేవి యిప్పుడు రష్యనులు కనుగొన్నారు. మాస్కోలో యిప్పుడు ఒక్క మాస్కో రాజులే గాక యావత్తు రష్యా రాజులూ వుంటూన్నారు.

మాస్కోనుంచి ప్రథమ రాయబారులు పశ్చిమానికి పంపబడ్డారు. 'మాస్కో రాయబారవర్గం' అనే గ్రంథం రచించిన పావోలో గియోవియోను అంతా మెచ్చుకున్నారు. ఆ పుస్తకం చదివిన పాఠకులు కొందరు గియోవియోకు 'మీరు నూతన ప్రపంచాన్ని కనిపెట్టేరు!' అని వ్రాసేరు. తత్త్వశాస్త్రాభిమాని యొకడు 'గియోవియో! మీరు మాస్కోనుగూర్చి వ్రాసిన గ్రంథం చదువుతూంటే డెమాక్రిటస్ ప్రసంగిస్తూండిన ఆ యితర లోకాలు జ్ఞాపకం వచ్చేయి!' అన్నాడు.

రష్యను రాయబారులు వెనీస్, రోము నగరాలకు వెళ్లేరు. వెళ్ళిన దేశాలన్నిటిలోనూ కర్మకుశలురైన పనివాళ్ళ నన్వేషించమని రాయబారులకు ఆజ్ఞాపించబడింది. మట్టినుంచి లోహాలను విడగయగల నేర్పరులు, నగర నిర్మాణదక్షులైన వాస్తు నిపుణులు, శిల్పులు, ఆగ్నేయ ఆయుధములు ప్రయోగించగల వాళ్లు, రాతికట్టడాలు కట్టగలవారు, వెండి విగ్రహాల్ని పోతపోయగలవాళ్లు, స్వర్ణకారులూ,-ఒకటేమిటి, రకరకాల కర్మకారనిపుణుల కోసం అన్వేషించమని తమ రాయబారులకు రష్యా రాజు ఆదేశించేడు.

మాస్కోలో పనులు మాంఛి చురుకుగా సాగిపోతూన్నాయి. స్థానికంగా నిపుణులైన కార్మికులు తగినంతమంది లభించక పోవడంచేత విదేశాలనుంచి పిలిపించాల్సి వస్తూంది. క్రెమ్లిన్ భవనాల్లో దుమ్మూ ధూళీ నిలువెత్తున పడివుంది. సర్వత్రా సగం కూలిన పాతభవనాలనూ, శిథిలములైన చెర్చిల్నీ కూల గొట్టేసి, కొత్తవాటిని కడుతూన్నారు.

భవన నిర్మాణంలో రష్యన్ శిల్పులు, విదేశీయ నిపుణులూ పరస్పరం పోటీపడుతూన్నారు. 'స్వర్గారోహణ చెర్చి'ని పునర్ని ర్మించే పని ఎర్మోలిన్ అను శిల్పికీ, అతని బృందానికీ వప్పగించ బడింది. ఈ చెర్చి తగులబెట్టబడింది; దాని లాజులు సుడితిరిగి పోయినాయి.

ఈ లాజుల్ని కూలగొట్టకండా నే బాగుచేయాలని ఎర్మోలిన్ నిశ్చయించుకొన్నాడు. నాశనం గాకండా నిలిచివున్న పని నంతనూ అట్టేవుంచి కాపాడడానికి యిది అవసరమని ఆ మహా శిల్పి అభిప్రాయము. అదేమంత సులభంకాదు. తగులబడిపోయి విరిగిపోయిన యిటుకలను పీకిపారేసి, లాజులను పొసగించి, కూలిపోడానికి సిద్ధంగా నున్న వాటిని సరిచేయాలి, శిల్పులు, పనివాళ్ళకి నేర్పూ, ఉపజ్ఞా, సాహసమూ మాత్రమేగాక విజ్ఞానం కూడా కావాలి, యీ పని చేయడానికి.

ఎర్మోలిన్, ఆయన అనుచరులూ భౌతికశాస్త్ర గ్రంథాలను గాని, వాస్తుశాస్త్రాన్ని గాని చదివివుంటూ రనడానికి అవకాశం లేదు. కాని, వారు అనుభవవిజ్ఞాన మనే గ్రంథాన్ని మాత్రం

చాలసార్లు తిరగేసి వున్నారు. కట్టడపు పని చేస్తూనే, గండ శిలల బరువు క్రింద శ్రమిస్తూనే ఆ శిల్పులు సమతులా సూత్రాన్ని పరనం గావించేరు. వారిది ప్రత్యక్షానుభవవాస్తు నైపుణ్యం.



'మీటకు ఆధారమును, నాకు నిలబడుచోటును యివ్వండి! ఈ భూగోళాన్నే పైకెత్తుతాను!' అన్నారట యంత్ర శాస్త్రవేత్త ఆర్కిమెడీస్.

ఆ శిల్పులేదైన బరువైన రాతిని కదపాల్సివచ్చినపుడు మీటలను (లివర్) ఉపయోగించేవాళ్లు. ఏ గండశిలనో పైకి లేవదీయాల్సివస్తే వాళ్లు 'ఉడుత'ల నుపయోగించేవాళ్లు.

ఆ పనివాళ్లు తమ మీదనుంచిన బాధ్యతాయుత కార్యాన్ని నెరవేర్చేరు. చెర్చి తిరిగి పరిపూర్ణరూపంలో, చెక్కు చెదరనట్లుగా నిలిచివుంది. అసలు దీని నెప్పుడూ అగ్నిహోత్రుడు స్పృశించనే లేదన్నట్లుంది, ఆ చెర్చి! ఒక చరిత్ర కారుడు అనేక యితర విషయాలతో బాటు యీ విషయాలను కూడ

అపురూపంగా వ్రాసేడు : "వారు మొత్తం చెర్చినంతనూ పునాదుల్లోకి పీకివేయవేదు. వెలుపలి కట్టడాలలో కాలి చిట్లిపోయిన రాళ్ళను మాత్రమే వాళ్లు తొలగించేరు. లాజు లన్నిటినీ వారు చక్కబరచిరి. అసాధారణమైన యీ పని నేర్పును చూసి, అందరూ ఆశ్చర్యపడిరి." *

ఇటాలియన్ స్థపతియైన అరిస్టాటిల్ ఫియోరవెంటీ, ఒక ప్రాచీన రషియను మాదిరి నాధారంగా గొని, ఉస్పెన్స్కీ కెథిడ్రల్‌ను క్రెమ్లిన్‌లో నిర్మించేడు. బెందడి బాగా జిగురు గలిగి వుండునట్లుగా దానిలో పాళ్ళు ఫలానా రీతిగా వుండాలని రష్యను శిల్పులు, విదేశీశిల్పులు నిర్ణయించేరు. పెద్ద పెద్ద రాళ్ళని పైకెత్తునట్టి పెద్ద చక్రాన్ని చూసి మాస్కోవాసులు పరమాశ్చర్యపడిపోయీవాళ్ళు.

ఉస్పెన్స్కీ కెథిడ్రల్ తరువాత యితర కెథిడ్రల్స్ లేచి నాయి. మహారాజుకోసం ఒక రాజప్రాసాదం నిర్మించబడింది. మహారాజు విదేశ రాయబారులకు దర్శనమిచ్చే సభాభవనపు రాళ్ళను మెరుగుపెట్టి, వాటికి పలకలు కోసి, బహు నిపుణంగా తయారు చేసేరు, శిల్పులు.

---

* గత వేయిరేండ్లలో భారతదేశంలో ఆసేతు హిమాచలపర్యంతం వేలాది దేవాలయాలు, గొప్ప శిల్ప నిర్మాణాలను దాడిమూకలు నాశనం చేసినాయి. మహమ్మదీయులు నాశనం చేసిన దేవాలయాలకి లెక్కలేదు. యూరోపియనులున్ను ఆశాపాతకులై యెన్నో రాచనగరులను, అమూల్య శిల్పాలను దొంగిలించుకొని పోయేరు. ఇప్పటికీ ఈ దొంగవ్యాపారానికి, రాక్షస కృత్యానికి తమ సంపదలను పాశ్చాత్యులు మొదలగువారు వినియోగిస్తున్నారు.

క్రెమ్లిన్ చుట్టూ త్రిభుజాకారంగా యెత్తైన రాతిప్రాకారం నిర్మించేరు. మూడు మూలల్లో మూడు పెద్ద గోపురములూ, ఒక్కొక్క వైపున యేడేసి చిన్న గోపురములూ వుండి, కోటకు అంగరక్షగా యేర్పడినాయి. దారు నిర్మితమైనదే, మాస్కో నగరం. దానిమీదుగా మహోన్నతమైన క్రెమ్లిన్ దుర్గం అజేయంగా కనబడుతూంటుంది. మాస్కో వీధు లన్నీ క్రెమ్లిన్ నుంచే అన్నివైపులకూ వ్యాపించినాయి. వీధులు అప్పటికే అక్కడక్కడ దళమైన చెక్కలతో చప్టా చేయబడి వుండేవి. నగరం అన్ని దిశలకూ, పైకీకూడా పెరుగుతూంది.

. ఈ ఉత్తర దేశాన్ని గూర్చిన వార్తలు అంతకంత కెక్కువగా పశ్చిమరాజ్యాలకు అందుతూన్నాయి. ఈ కొత్తదేశం యెల్లాంటిదో, ఎంత బలాఢ్యమైనదో తెలుసుకోడానికి పశ్చిమ దేశాలనుంచి రాయబారులు వస్తూండేవాళ్ళు.

పొప్పెల్ అనే జర్మన్ యోధు డొకడు మాస్కోలో ప్రత్యక్షమయేడు. కాని, వారాతనిని బిచాణా కట్టుకుని, తిరిగి పొమ్మన్నారు. అత్యంతాతురతను చూపిన యీ విదేశీయుని వారు విశ్వసించలేదు. పొప్పెల్ యింటికిపోయి, మిత్రులతో తన యాత్రలను గూర్చి చెప్పేడు. "మాస్కోవీ రూస్ దేశం పోలండు కావలగా వ్యాపించివున్న విశాలరాజ్యం. అది పోలండుకూ లోబడినదిగాదు, తార్తారులకూ సామంతరాజ్యం గాదు. రూస్ రాజు, పోలండు రాజుకంటె ధనికుడు!"

మూడో ఫ్రెడరిక్ చక్రవర్తి పొప్పెల్‌ను మూడో ఇవాన్ రాజుదగ్గరకు మాస్కోకు తిరిగి రాయబారంమీద పంపించేడు. రష్యను ప్రభువు తన కుమార్తెను బేడెన్ నగరపు మార్గ్రేవ్ రాకుమారున కిచ్చి వివాహం చేయమనీ, దానికి ప్రతిఫలంగా ఆయనకు 'రాజ' బిరుద మొసగబడుననీ ఆ:మున కబురంపేడు.

దానికి ఇవాన్‌రాజు జవా బిచ్చేడు : "ఏదో రాజ్యాధికారాన్ని గురించీ, రాజ బిరుదమునుగురించీ తాము సెలవిచ్చేరే, అవి ఈశ్వరుని అనుగ్రహంవలన మా కుటుంబంలో మొట్ట మొదటినుంచీ, మా వంశ మూలపురుషుని దగ్గరనుంచీ మాకు ఉండనే వున్నాయి ... అందువల్ల యిప్పుడు మాకు యెవరూ ఆదేశాలూ యివ్వనక్కరలేదు, అనుగ్రహాలూ చూపనక్కర్లేదు. మే మెవరినుంచీ ఆజ్ఞలు తీసికోము..."

రష్యన్ భూమి కంతకీ పాలకుడుగా వున్నవాడు తన కింకొకరు రాజనామధేయం యివ్వాలని కోరడంలేదు. ప్రపంచ రంగంమీదికి రష్యనుప్రజ కొత్తగా ప్రవేశించింది. వారు తమ శక్తిని తెలుసుకుంటూ, ఆత్మవిశ్వాసంతో పురోగమించుతూన్నారు.

మాస్కోరాజులు తమ పూర్వీకులనుంచి మొనోమాక్ రాజు శిరస్త్రాణాన్ని వారసత్వంగా పొందియున్నారు. ఆ శిరస్త్రాణం యెల్లాంటిది ? ఈ శిరస్త్రాణమునే వెనుక బైజాంటియం చక్రవర్తి కానుకగా వ్లాదిమిర్ మొనోమాక్ రాజునకు పంపేడు. దీనితో బాటు కురువిందమణి నిర్మితమైన

పాత్ర నొకదానిని కూడా చక్రవర్తి బహూకరించేడు. ఈ కురువింద పాత్రముతోనే రోమన్ చక్రవర్తి అగస్టస్ కులాసాగా మధుపానం గావించేవాడని చెప్తారు!

మూడవ ఇవాన్ రాజును గూర్చిన యీ కథ మనకు తెలుపున దేమిటి? మూడున్నర శతాబ్దాల క్రిందట నివసించిన రషియను జనుల సాంప్రదాయములు, భావములు యెల్లా వుండేవో అనేదే దీనివల్ల మనం గ్రహిస్తాము. రోము, బైజాంటియమ్‌లు ఒకప్పుడు తామే ప్రపంచనాగరకతకు వారసుల మనుకున్నారు. అల్లాగే రషియనులు, తమ దేశం కూడా భవిష్యత్‌లో ఒక గొప్ప నాగరికతకు కేంద్రం అవుతుందని భావించేవాళ్ళని యీ కథ చెప్తూంది.

మూడో ఇవాన్ రాజు కాలంలో మాస్కోనగరం రోముతో పోల్చదగినదిగా లేదు; కాని, అది వెనుకటి కుగ్రామమూ కాదు. ఇప్పుడది మంచి జనసమ్మర్దంగల రాజధానీనగరం!

క్రెమ్లిన్ అంగళ్ళలో చీనా సిల్కు మడతలూ, వెనీషియను వెల్వెట్ మడతలూ దొంతిరలుగా వుండేవి. చిల్లర అంగళ్ళలోను, పచారీ దుకాణాల్లోనూ, ఓషధీ స్థానములలోనూ బహు దూరస్థమైన హిందూదేశాన్నుంచి వచ్చిన మూలికలు, పువ్వులు, కాయలు, దినుసులు ఘుమఘుమలాడుతూ తమ సుగంధంతో జనుల నాకర్షించేవి. మాస్కోనగరపు వొగమంచు

# ఆరో ప్రకరణం

## మానవుడు భూగ్రహాన్ని పరిశీలిస్తాడు.

మానవుడు యీ భూగ్రహం మీద అంతటా పరిభ్రమించేడు. ఏదో ఆరేడు వేల మైళ్ళ చిన్న యాత్ర అంటే యిప్పుడాతనికి



అంతగా కష్ట మనిపించడం లేదు! అత డీ గోళంయొక్క కప్పు మీద కెక్కినట్లు పామీర్ పీఠభూమిపై కెక్కి చూసేడు. ఆ పీఠభూమి మీద చాలా చలిగా వుంటుంది. 'అక్కడ అగ్ని

కూడా మైదానాల్లో అంత ప్రకాశమానంగా ప్రజ్వలించవు. అగ్నిజ్వాలలు అక్కడ యింకో విలక్షణమైన వర్ణంలో వుంటాయి అని వారు తెలుసుకున్నారు. ఆతడు మధ్యాసియా మైదాన భూములమీద ప్రయాణం గావించేడు. ఆ మైదానాలమీద వాయువు బహువేగంగా వీస్తూంది. గుర్రంమీద స్వారీ చేస్తూన్నవానిని అక్కడి వాయువు వెనక్కి యెగురగొట్టివేయ గలదు! అక్కడి సుడిగాలులు, ధూళి మేఘాలు నీ చూపు నడ్డగించి, కొంచెం ముందు వున్నవాటిని కూడా కనబడకండా చేస్తాయి.

మానవుడు గోబీ యెడారిని దాటి వెళ్లేడు!

"అదెంత పెద్ద దంటే, దాన్ని దాటేందుకు ఒక్క యేడాది పూర్తిగా పడుతుంది. దానిలో పర్వతాలు, లోయలు, యిసుక,—అన్నీ వున్నాయి గాని, యెక్కడా ఆహార మన్నదే లేదు. ఎన్నో రాత్రింబగళ్ళు ప్రయాణం చేయగా చేయగా ఆఖరుకి ఒక నీటిపట్టు కనబడుతుంది. కాని, యేమి లాభం? దానిలోని నీరు చేదువిషం! ఆ చుట్టుపట్ల యెక్కడా ఒక్క జంతువు గాని, చివరకు కాకి పిట్ట గాని కనబడదు. ఎందుచేత నంటే, ప్రాణులకు త్రాగేందుకు నీరూ, తినేందుకు అన్నమూ కాస్తేనా అక్కడ వుంటే కాదూ?"

జంతువులు గాని, పక్షులు గాని గోబీ యెడారిని దాటేందుకు సమర్థములు గాజాలక పోయినాయి. కాని, మానవుడు దాన్ని దాటేడు! మానవుడు యీ భూగోళంమీద యెవరో పరదేశి

లాగ, తీర్థయాత్రీకునివలె పరిభ్రమణం చేస్తూ వచ్చేడు. కాని, యీ భూమిమీాది వింతలు యెంత చూసినా ఆతనికి తృప్తి కలుగనేలేదు !

చాలమంది నేలబొగ్గును చూసేరు. అదొక 'నల్లని రాయి' యనీ, కర్రలాగ కాలుతుం దనీ అన్నారు. మరికొందరు నీటి గుర్రాల్నీ, సముద్రాల్లో తిమింగలాల్నీ, పదహారడుగుల పక్ష



విక్షేపంగల పెద్ద పక్షులనూ చూసేరు. ఇంకా కొందరు చీనా భూమిలోని బంగారు సౌధాల్నీ, హిందూదేశంలోని బ్రహ్మాండమైన దేవాయతనములనూ, దేవతా విగ్రహాలనూ చూచి అద్భుతాశ్చర్యాల్లో మునిగిపోయేరు.

విదేశ యాత్రీకులు యిళ్ళకు జేరుకుని అందరితోనూ తాము జూచిన యీ ప్రపంచ వైచిత్ర్యములను వర్ణించి చెప్పేవాళ్ళు. కాని, జనులు వాటిని నమ్మక, కాకమ్మ కథ లనేవారు. అది

వరలో కూడ యిల్లాగే ఫొనీషియను, గ్రీకు నావికులు చెప్పే వాళ్ళుగాదూ? అప్పుడూ వాళ్ళ మాటలు యెవరూ నిజమని నమ్మేవాళ్ళుగారు!

క్రీస్తుశకం 13 వ శతాబ్దం ఆఖరున మార్కో పోలో అను పేరుగల వెనీసు వర్తకుడు అప్పటికి తెలిసిన ప్రపంచాన్నంతనూ చుట్టివచ్చేడు. యూరోపు, ఆసియాల మీదుగా చీనా చేరుకుని, శాంతి మహాసముద్రంలోంచి ఓడమీద ప్రయాణం చేసి, యెట్టకేలకు హిందూదేశం చేరుకున్నాడు. అక్కడినుంచి స్వదేశం చేరుకుని, మార్కో పోలో తన యాత్రానుభవాల్ని గూర్చి ఒక గ్రంథం వ్రాసేడు. తాను చూచిన అతి విచిత్ర విషయాల నాయన అందులో వ్రాయగా, జనులు ఆతనిని 'అబద్ధాలకోరు, అభూతకల్పనాపరుడూ' అన్నారు. తర్వాత మార్కో పోలో మరణాసన్నుడై, మృత్యుశయ్యపై నుండగా పురోహితుడు వచ్చి, "నాయనా! ఆఖరికి యిప్పుడేనా పశ్చాత్తప్తుడవు గమ్ము. నీవు నీ గ్రంథాలలో వ్రాసిన అబద్ధాలను నిరాకరించుము" అన్నాడు. కాని, మరణశయ్యపై నున్న ఆ వృద్ధుడు అన్నాడట: "అయ్యో! నేను చూచిన వాటిలో సగంకూడా వ్రాయలేకపోయానే! పశ్చాత్తాపపడాల్సిందేమీ లేదే!"

ఆ తరువాత కొన్ని దశాబ్దాలకు, ఫ్లోరెంటైన్ బ్యాంకు ప్రతినిధి యొకడు, మార్కో పోలో సందర్శించిన ప్రదేశా

లన్నిటికీ వెళ్ళేటందుకు 'మార్గదర్శి' గ్రంథాన్ని తయారు చేసేరు.

మొదటి యూరోపియను ఆ ప్రదేశాలలో అడుగిడి యింకా యెంతో కాలం కానేలేదు. కాని, అప్పుడే బాగా నలిగిన బాటల వెంబడి నడుస్తూ, వర్తకులు, బిడారులు బైలుదేరేరు. ఆస్త్రఖాన్, ఊర్ఘెంజ్‌ల మీదుగా, ఇస్సిక్-కుల్ సరస్సును దాటి, గోబీ యెడారి వంచనే ముందుకి ప్రయాణం చేసేరు, వాళ్ళు.

## 2. మూడు సముద్రాల్లోంచి మార్గం

తూర్పు దేశాలకు యింకో మార్గాన కూడ యాత్రీకులు బైలుదేరి వెళ్లేరు. మాస్కోనుంచి వోల్గా నదిమీదుగా కాశ్యపసముద్రం; కాశ్యప సముద్రాన్నుంచి డెర్బెంట్, బకూల మీదుగా పెరిష్యాకు, అక్కడినుంచి హిందూదేశానికీ కొందరు పయనించేరు.

త్వెర్ నగరవాసి, వర్తకుడు ఐన అఫనాశీ నికిటిన్ యీ సుదీర్ఘయాత్ర గావించి, హిందూదేశానికి వెళ్ళేడు. రెండు పెద్ద ఓడల నిండా బొచ్చుజంతువుల చర్మములను నింపి, విక్రయార్థమై పెరిష్యాదేశానికి ఆతడు తీసికొని వెళ్ళేడు. అట్టి సుదీర్ఘయానాన్ని తెరచాప పడవలవంటి ఓడల్లో సాగించేందుకెంతో ధైర్యం వుండాలి. ప్రతి ఓడకూ ఒక తెరచాపకొయ్య, దళసైన గుడ్డ తెరచాప, పదహారు తెడ్లు, చుక్కాని, వెడల్పు

యిన పడిచెక్క, క్రిందుగా సామానులకు గదులు,-యిదీ ఓడలో వుండేదంతా ప్రోగుచేసి!

నిఝ్నీ-నొవొగొరోద్ పట్టణంలో అఫనాశీ నికిటిన్‌కి ఒక సహయాత్రీకుడు లభించేడు. అతడు షెమాఖానుంచి వచ్చిన రాయబారి. మాస్కోనుంచి తిరిగి స్వదేశానికి వెడుతూన్నాడాయన. మాస్కో రాజు యీ రాయబారిద్వారా షెమాఖా ఖాన్‌కు బహుమానం పంపుతున్నాడు. ఆ బహుమతి యేమిటో చెప్పకోండి?...చూతాం!...చెప్పకోలేరూ?... ఐతే నేనే చెపుతా...వేటకు పనికివచ్చే తొంబది డేగలు! అదీ బహుమానం.

వోల్గా ముఖద్వారంలోనికి వెళ్ళేసరికి వారిని తార్తారులు ముట్టడించేరు. అఫనాశీ ఓడల్లో వున్న సామానంతా వాళ్ళు యెత్తుకుపోయేరు. అతడు మిగిలేడు, ప్రాణాలతో. ఇక రష్యాకు తీసికెళ్ళడాని కేముంది గనుక? అందుచేత అఫనాశీ, రాయబారి ఓడమీదనే ప్రయాణం చేస్తూ, డెర్బెంట్ పట్టణానికి వెళ్ళేడు. డెర్బెంట్‌నుంచి భూమార్గాన పెరిష్యాకున్ను, అక్కడినుంచి హిందూదేశానికీ చేరుకున్నాడు. అతడిప్పుడు చర్మాలతో గాక గుర్రాలతో వ్యాపారం చేస్తున్నాడు. హిందూదేశంలో గుర్రాలకు మంచి గిరాకీ వుందని విన్నాడు. అందుచేత తన దగ్గరనున్న సొమ్మంతా పెట్టి, పెరిష్యాలో గుర్రాల్ని కొన్నాడు. కాని, పాపం, అఫనాశీని దురదృష్టదేవత యిక్కడా వదలిపెట్టలేదు. హిందూదేశంలో గుర్రాల నమ్మి, ఆ డబ్బుతో

కొన్ని సరుకులు కొనాలని ఆత డనుకున్నాడు. తాను హిందూదేశంలో కొన్న సరకులు రష్యాలో సులభంగా, లాభసాటిగా అమ్ముడుపోవునవి ఐవుండాలని ఆయన అభిప్రాయం. కాని, అల్లాంటి వస్తువు లేవీ అతనికి కనబడలేదు. ఒక్కొక్క దానికి ఒక్కొక్క చిక్కు! అఫనాశీకి చాలా ఆశాభంగం కలిగింది; తిట్టుకున్నాడు : "ఈ బసుర్మన్ కుక్కలు (పన్నులు వసూలుచేసే తార్తారులు) నాతో అబద్ధం చెప్పేరు. మన దేశంలో లాభసాటిగా అమ్ముడుబోయే వస్తువులు హిందూ దేశంలో యెన్నో దొరుకుతా యని వాళ్లు చెప్పింది శుద్ధ అబద్ధం. మిరియాలు, రంగుదినుసులు చాల చౌకగా వున్నా పన్నులవాళ్లు వాటిని తీసికొని వెళ్ళనీయరాయె...సముద్ర మార్గాన పయనమైపోతే పన్నులు చెల్లించనక్కరలేదు గాని, సముద్రపుదొంగలు నిన్ను దోచుకుని, ఓడల్ని నాశనం చేయకండా వదలరు..."

అఫనాశీ ఒక పట్టణాన్నుంచి మరో పట్టణానికి పోతూనే వున్నాడు. కాని, అదృష్టదేవత కాతనియందు దయ కలుగనే లేదు. పరదేశా లంటే అతనికి సుముఖత కలుగలేదు. స్వదేశంలో కంటె అక్కడ ప్రతీదీ భిన్నంగానే వుంటుంది. ఆక్కడ జనులు విచిత్రంగా వుంటారు! సాధారణంగా జనులు అర్ధనగ్నశరీరులై తిరుగుతూంటారు. ఆహారం అంత బాగా వుండదు. చాకులు, చెంచాలు ఉపయోగించడం వాళ్ళకు అలవాటు లేదు. అంతేగాదు. అక్కడ జనులు అంతా కలిసి

తినడం, త్రాగడం వుండదు. ఎవరికివారే ఒంటిగా తింటారు, త్రాగుతారు. * హిందూదేశంలో శీతాకాలంలో కూడా ఆవిరిస్నానం చేస్తూన్నట్లు వేడిగా, ఉక్కగా వుంటుంది!

నాలుగేండ్లు గడిచినాయి, యీ విధంగా. కాని, యింకా అఫనాశీ హిందూదేశంలోనే వున్నాడు. ఇంక ఆతడు వుండలేక జన్మభూమికి పోయేందుకు నిశ్చయించుకుని బైలుదేరేడు.

ఆహా! అది అంతులేని యాత్ర! అనంత ప్రయాణం! హిందూదేశాన్నుంచి త్రిబిజోండ్‌కు వేలమైళ్లు! త్రిబిజోండ్ నుంచి నల్లసముద్రం వెంబడే వున్న జినోవా వర్తకుల స్థావర దుర్గాలలో నొకదానికీ, అక్కడనుంచి త్వెర్ నగరానికీ. కాని, అఫనాశీ జన్మస్థానం చేరనేలేదు, పాపం. జన్మస్థానం చేరి, క్రీస్తుప్రభువు స్వర్ణ దేవాలయాన్ని దర్శించే అవకాశం యివ్వకుండానే మృత్యు వాతనిని గ్రసించింది. స్మొలెంస్క్ నగరం చేరులోపలనే మార్గమధ్యంలో అఫనాశీ చనిపోయాడు. మరణశయ్యపై బడియుండి, తన యావజ్జీవితమూ యేవిధంగా వృధామైపోయిందో తలచుకొని ఆయన విచారించి వుంటాడు. సంపదలను అన్వేషిస్తూ బైలుదేరి, మూడు సముద్రాలు తరించి వెళ్ళి, చివరకి రిక్తహస్తుడై యింటికి తిరిగి వచ్చేడు.

---

* పదిమందీ చూస్తూండగా దేనినైన తినుటను మన శాస్త్రాలు నిషేధించినాయి. కాని యీ ఆచారం ఆ యా సందర్భాల నుచితంగా యేర్పరుపబడింది.

కాని, అఫనాశీ అన్వేషణ వృథాయేనా ?

ఆతను స్వగృహానికి బంగారం, వస్తు సంపదలు తీసికొని రాని మాట నిజమే. ఆతని భుజంమీద నున్న మూట చాల చిన్నది. వీపుమీది వలాసంలో యే మూలనో, చిన్న దస్త్రం ఒకటి వుంది. కాని, అది బంగారుకంటె యెంతో విలువైనట్టిది. దాని వెల కట్టడం సాధ్యం కాదు.

అఫనాశీ మరణానంతరం యీ సంపద, పెన్నిధి, మాస్కో-రాజువద్దకు పంపబడింది. అది అఫనాశీ తన దీర్ఘ యాత్రా కాలంలో వ్రాసిన దినచర్యా గ్రంథం !

బంగారమైతే అటునిటు చెదరిపోతుంది. ఈ చేతినుంచి ఆ చేతికీ, ఒకరి పెట్టెలోంచి మరొకరి భోషాణంలోకీ మారుతూ, క్రమంగా తరిగిపోతూంటుంది. కాని, జ్ఞానధనము దొంగలపాలు గానేరదు. దానికి వాడుతూన్నకొలదీ పెంపు కలుగుతుందే గాని తరుగు విరుగు లేర్పడవు ! * దీనిని ఆస్వాదిస్తూన్నకొద్దీ యిది వృద్ధిని పొందుతూంటుంది. ఈ గ్రంథాన్ని చేతబట్టినవారి కిది ఒక చక్కని కథను, దివ్యగాథను చెపుతుంది. అఫనాశీ తన యాత్రాసందర్భంలో ఆశ్చర్యం, అద్భుతం కలిగించిన విషయా లన్నిటినీ అందులో వ్రాసిపెట్టి వుంచుతూ వచ్చేడు. విదేశాల్లోని జంతువులు, పక్షులు, రాజభవనాలు, దేవాలయములు, జనులు, ఆచారవ్యవహార

* జ్ఞాతిభిః వంచ్యతే నైవ । చోరేణాపి న నీయతే ।
దానేన న క్షయం యాతి । విద్యారత్నం మహాధనం॥

ములు,– ఒక టేమిటి ? సమస్త విషయాల్ని గూర్చి తన దినచర్యా గ్రంధంలో వర్ణించేడు.

"రాజుగారి భవనానికి యేడు ద్వారా లున్నాయి. ఒక్కొక్క ద్వారంలోనూ నూరుగు రేసి భటులు కాపలా వుంటారు... చూచేందుకు రాజభవనం అత్యద్భుతంగానూ, మహావైభవో పేతంగానూ వుంది. భవనంలోప లంతా బంగారు నీటితో మలామా చేసి, కుడ్యచిత్రములతో నిండివుంది. ప్రతి శిలమీదా నగిషీపని గలిగిన బంగారు రేకులు పొదిగేరు...రాజు లోభి గాడు. ఆయన కెందరో భార్య లున్నారు. ఆయన సైన్యంలో పది వేలమంది ఆశ్వికులు, యాభై వేలమంది కాల్బలము, బంగారు అలంకారాలు గల రెండువందల యేనుగులు వున్నాయి. రాజు గారు యేనుగుపై ఊరేగుతూంటే ముందు నూర్గురు కాహళ ములవాండ్లు, రెండువందలమంది నాట్యకత్తెలు, బంగారు జీనులు వేసిన మూడువందల గుఱ్ఱములపై సవారులు, నూరు వానరములు, యితర పరివారమూ నడుస్తూంటుంది..."

ఇదంతా హిందూదేశంలో ఒక స్థానిక రాజును గురించి నదే! అక్కడి వన్నీ, నాట్యకత్తెలు, కోతులు, యేనుగులు మొదలైన వన్నీకూడ అఫనాశీకి అద్భుతాశ్చర్యమయము లుగా వుండేవి....

"ఏనుగుల దంతాలకీ, తొండానికీ పెద్ద పెద్ద కత్తులు కట్టే వాళ్ళు. ఆ కత్తి ఒక్కొక్కటి దాదాపు మూడు మణుగు లుండేది. ఏనుగుల మీద అంబారీలు నిర్మించేవాళ్లు. ఒక్కొక్క

అంబారీలో రెండేసివందల విలుకాండ్రు ధనుర్బాణాలతోనూ, రకరకాల ఆయుధాలతోనూ సంసిద్ధులై వుంటారు..."

"వానరములు అడవుల్లో వుంటాయి. వాటికీ ఒక రాజూ, ఆ రాజుక్రింద కొంతసైన్యమూ వుంటుంది. ఎవరేనా తమ్ము బాధించినట్లైతే కోతులు తమ రాజుతో చెప్తాయి. అప్పు డాతడు వానరప్రజను రక్షించడానికి తన సైన్యాల్ని పంపు తాడు. వానరసైన్యాలు పట్టణంలోనికి వచ్చి, యిళ్లు పీకేసి, జనుల్ని చంపేస్తాయి. వానరసైన్యం చాల పెద్దదనిన్నీ, వాళ్ళకి వేరే ఒక భాష వుందనిన్నీ చెప్తారు."

కాని, వీటన్నిటినీ మించిన వింత, పవిత్రక్షేత్రంలోని బుద్ధ దేవుని మహాదేవాలయం; అది అఫనాశీని ముగ్ధుణ్ణి గావించింది.

"బుద్ధదేవాలయం చాలా పెద్దది, విశాలమైంది. త్వెర్ నగరం (రష్యాదేశంలోనిది) అంత వైశాల్యం గలది, ఆ దేవా లయం! అదంతాకూడా శిలానిర్మితమైనట్టిదే. ఆ శిలలమీాదే బుద్ధదేవుని పవిత్రకథ లన్నీకూడా చెక్కబడి వున్నాయి... ఆ మహాత్ముడు యెన్ని అవతారములను దాల్చెనో, యెన్ని జన్మము లెత్తెనో, యెన్ని అద్భుత మాహాత్మ్యములను గావించెనో, ఆ వివరాలన్నీ శిలారూపాలలో మలచబడినాయి. ఒకప్పుడు మానవాకారం, యింకో అప్పుడు గజాననాకారం, మరొకప్పుడు వానరాకారం, ఒక్కొక్కసారి భయంకర మృగ శిరస్సుతోనూ, యేడడుగుల వాలంతోనూ. – యిల్లాగే యెన్నెన్నో రూపాలతో ఆయన యీ శిలాశిల్పములలో కన

బడతారు. బుద్ధదేవుని అద్భుత జన్మ విశేషాల్ని సంపర్శించే టందుకు హిందూదేశ మంతటినుంచీ జనులు అసంఖ్యాకంగా యీ దేవాలయాలకి వస్తారు...... రాతిలో చెక్కబడిన మహోన్నతి బుద్ధ విగ్రహం ఒకటి వుంది. ఆతడు కుడిచేయె త్తి నిలిచివుంటాడు; ఆయన తోక శరీరాన్ని చుట్టబెట్టుకుని వుంటుంది......ఆతని ముఖం వానరముఖంలా వుంది * ... బుద్ధునియెదుట నల్లరాతిలో మలచిన వృషభం మహోన్న తంగా వుంది. ఈ వృషభంమీద బంగారునీటితో చక్కని అలంకారం చిత్రించబడి వుంటుంది. జను లెందరో వచ్చి, యీ యెద్దు కాలిగిట్టను ముద్దిడుకొని, దానినీ, బుద్ధునీ, వుప్పు ములతో కప్పివోతారు......"

హిందూదేశాన్ని గురించి అఫనాశీ వ్రాసివుంచిన దిది. యూరోపులో అంతవర కెవ్వరూ యిల్లాంటి మహాద్భుతాలను గూర్చి కర్ణాకర్ణిగనైన వినియుండలేదు! ఆ కాలంలో వారికి సముద్రయాన సౌలభ్యం కలిగించే ఓడలు యింకా లేవు. వాస్కో - ద - గామా హిందూదేశానికి సముద్ర మార్గం

* హనుమంతుని విగ్రహాన్ని చూచి యీ విదేశీయుడు బుద్ధవిగ్రహంగా పొరబడి వుంటాడని విస్పష్టమే. హిందువుల పౌరాణికగాథలతో బాగా పరిచయం లేని విదేశీయు లెందరో హనుమంత, విఘ్నేశ్వర, ఈశ్వర, నారసింహ, శ్రీరామ, శ్రీకృష్ణాది విగ్రహాలను చూచి, అన్నీ కూడా బుద్ధుని అవతారాలే నని పొరబడి వ్రాసిన సందర్భా లెన్నో గ్రంథాల్లో చూస్తూంటాము. విదేశీయులకు మన దేశాన్నిగూర్చీ, మతాన్ని గూర్చీ తెలిసిన కొంచెమూ కూడ బుద్ధుని కథలద్వారానే!

అన్వేషిస్తూ బైలుదేరిన ఓడలు అప్పటికింకా చాలకాలం తరువాతనే కట్ట నారంభించింది!

## 3. సంపద లెట్లు ఉత్పత్తి చేయబడతాయి ?

మానవునికి పరిచితమైన ప్రపంచం అంతకంతకు విశాలం కాజొచ్చింది.

రీగా రేవుపట్టణంలోని వర్తకసంఘం భవనంమీాది గాలి కోడిని పిల్లలంతా గుంపులుగూడి చూస్తూండేవాళ్ళు. కూచిగా వున్న ఆ భవనపు కప్పుమీాద ఒక ఓడ, ఒక కోడి, ఒక ఆశ్విక యోధుడు,-యీా మూడు బొమ్మలూ యెడమనుంచి కుడికి తిరుగుతూండేవి. సముద్రంమీాదనుంచి భూమిమీాదకు గాలివీచే దిశనుబట్టే యివి తిరిగేవి. ఈ గాలిబొమ్మల కదలికను చూచి, ఆ పిల్ల లెంతో ఆసక్తితో, కుతూహలంతో ఆనందించేవాళ్ళు.

ఆ వర్తకసంఘ భవనం, ముందుకు రాజభవనంలా కనిపించినా, వెనకనుంచి చూస్తే గొదాములాగే వుండేది. తెల్లవారింది మొదలు సాయంత్రంవరకూ యింటికప్పుక్రింద కప్పీల కిరకిరలు వినిపిస్తూనే వుండేవి. పీపా తరువాత పీపా కప్పీలమీాద పైకి లేచి, వెనుకముందులకూగి, రెండో అంతస్థులోని పెద్దద్వారంవద్ద లాఘవంగల దృఢహస్తాలతో పట్టుకోబడి, చీకటిగా వున్న అంతర్భాగానికి గొంపోబడేది. ఇక్కడే సరకు లన్నీ నిలవ చేయబడేవి. సమస్తసంపదలకూ యిది ఒక మజిలీ. ఉత్తరాభిముఖులై పోయీా యాత్రీకులు సత్రములో విడిసినట్లే వర్తకపు

సరకు లీ గొడాములలో మజిలీ చేసేవి. తూర్పున నొవొ గొరోద్ నుంచి వచ్చిన బొచ్చుచర్మములు కూడ యీ గొడాముల్లో గుట్టలుగా వుండేవి. ఈ చర్మాలు ఎంతో ఖరీదైనవి. వీటికి దక్షిణ దేశాల్లో చాలా గిరాకీ వుంటుంది.

హిందూదేశాన్నుంచి ఇటలీకి, ఇటలీనుంచి ఉత్తర జర్మనీలోని హన్సియాటిక్ లీగ్‌లోని వ్యాపార కేంద్రాలకూ, అక్కడి నుంచి రష్యాలోని నొవొగొరోద్ పట్టణానికీ చాల దూరం వుంది. వేర్వేరు దేశాల్లో, వేర్వేరు నగరాల్లో తయారు చేయబడిన వస్తువులు ఒక చేతినుంచి మరొక చేతికి మారుతూ, ప్రయాణాలు చేస్తూండేవి. ఈ సరకుల ప్రవాహం మానవు డెక్కడెక్కడ నివసిస్తూంటాడో అక్కడక్కడకు పోకండా యెవరూ ఆపలేరు!

నొవొగొరోద్ పెద్ద వ్యాపార కేంద్రం, అక్కడ రాతి కొట్లలో గొలుసులమీద ఆరవేయబడి చర్మాలు వ్రేలాడుతూండేవి; గోడగూళ్ళలోని కొయ్య బీరువాల్లో వస్త్రాల మడతలు దొంతరలుగా వుండేవి; మిరియాలతో నింపిన కొయ్య పీపాలు వరుసలు దీర్చి వుండేవి.

ఒక్కొక్క వర్తకగృహం, గొడాము ఒక్కొక్క దుర్గంలా వుండేది. చుట్టూ కందకం, దానిమీాద మడతివంతెనలు, చుట్టూ ఏడడుగుల మందంగల గోడలు, కాపలాకు గోపురాలు,-యిదీ వరుస! ఆ భవనాల్లో కావలసినంత సరకు, దొంగలు - బందిపోట్లు నుంచి సంరక్షించుకోవలసింది వుందా

యెను, మరి. రాళ్ళతో బలిష్టంగా లాజులు తీర్చి కట్టిన నేల మాళిగలలో సరకుల నిలువ లుండేవి! మొదటి అంతస్థులో దుకాణం; దానిపై అంతస్థులో చక్కగా అలంకరించబడిన గదుల్లో యజమాని నివాసం. ఆ కాలంలో, ఆ దేశంలో వర్తకుల జీవితం యిల్లా వుంటూండేది.

కొనుగోలుదారులు, యేటవాలుగా నున్న మెట్లదారినే దుకాణంమీదకి యెక్కి, తలకు యే ద్వారబంధమో తగల కండా తలవంచుకొని లోనికి ప్రవేశిస్తారు. ఇందులోని గదు లన్నీ తలా ఒక మట్టంలోనూ వుంటాయి. ఎక్కడా తూలి పడిపోకండానూ, కాలు విరుగగొట్టుకోకుండానూ మనం బహు జాగ్రత్తగా మెల్లగా ముందుకు సాగాలి.

దళసరి గోడల్లో నడవలూ, మెట్లూ వున్నాయి. చిన్నచిన్న గవాక్షాలు వెలుతురును పథ్యంగా పంపుతూన్నాయి! లోపల కొయ్యపలకలు. చర్మాలు, తోళ్ళు, ప్రాగ్దేశాల సుగంధ ద్రవ్యాలు, ఓషధులు, మద్యములు మొదలైన వివిధవస్తువుల వాసన లన్నీ కలిసిన విలక్షణమైన వాసనతో గుప్పుమంటూంది.

సరుకులు యీ విధంగా ఒక దేశాన్నుంచి మరో దేశానికీ, ఒక నగరాన్నుంచి మరో నగరానికీ, బండినుంచి పడవకూ, పడవనుంచి ఓడకూ, అక్కణ్ణుంచి గొదాముల్లోకీ, గొదాము ల్లోంచి సారియా వాళ్ళ నెత్తిగంపలూ, పీపు వలాసాల్లోకీ మారుతూనే వుంటాయి. ఈ వివిధసరుకులు కోట్లాది మానవ హస్తాలచేత చేయబడినవీ, సంచిత మొనర్చబడినవేను.

ఈ వస్తువాహినికి జన్మస్థాన మేది ?

కృషిచేయువాని కుటీరము, కర్మకారుని కార్ఖానా,— యివే యీ వాహినికి పుట్టినిళ్ళు.

ఈ ప్రవాహం పోను పోను, యేటేటా క్రమాధికంగా విశాలమూ, అధికశక్తివంతమూ అవుతూంది. జనపదాలు, పల్లెలు అంతకంత యెక్కువగా ధాన్యాలను, గింజలను, నారలను, ఉన్నిని, చర్మాలను యిస్తూన్నాయి. పట్టణాల్లో అంతకంతకు అధిక సంఖ్యాకులు కర్మనిపుణులు చేరుతూ, వస్త్రాలు, పాదరక్షలు, కత్తులు, గండ్రగొడ్డళ్ళు, లోహపాత్రాదికములు, మద్యములు వగైరాల నుత్పత్తి గావిస్తూన్నారు.

మానవజాతి జీవితంలో ఒక సంవత్సరం అత్యల్పమైన అంశమును మాత్రమే మారుస్తుంది. కాని, ఒక్క సంవత్సరాన్ని గాక ఒక శతాబ్దాన్నో, సహస్రాబ్దాన్నో గనుక తీసికొని చూస్తే మార్పు పరిగణనీయంగా కనబడుతుంది. ప్రాచీనమైన ఏథెన్సు, రోము మొదలైన నగరాలతో మధ్యయుగంనాటి పట్టణములను పోల్చి చూస్తే, మానవు డెంత ముందుకు పోయేడో తెలుస్తుంది, మనకు.

ప్రాచీనకాలపు పనివాళ్ళు తమ చేతులతోనే తయారు చేసిన కుంపట్లు, కొలుములు, తిత్తులు, తరిమెన సాధనాలు, కుమ్మరిసారె, చక్రాల బండ్లు, నీటి చక్రాలు మొదలైనవన్ని మేధాశక్తినీ, హస్తకౌశలాన్నీ వెల్లడించేవిగానే వుంటాయి. అల్లాగే పదహారో శతాబ్దపు మానవుడు తనమట్టుకు తానూ

జలపతన చక్రం, జలోత్క్షేపణ చక్రం, దారమువడకు చక్రం, గాలినూదే కొలిమిచక్రం, గాలిచే త్రిప్పబడే గాలి చక్రం, - యిల్లాంటి వెన్నో సాధించేరు.

ప్రాచీనకాలపు మానవుడు తనకార్యములను జలములచేత చేయించుకోడం నేర్చుకొన్నాడు. కొయ్యపలకలతోనూ, కమ్ములతోనూ పెద్దచక్రాల్ని కట్టి, ప్రవాహజలాల్లో వుంచే వాళ్ళు. ప్రవాహం చక్రాన్ని త్రిప్పేది. కాని, క్రమంగా



పూర్వుల అనుభవానికి తమ తెలివిని తోడు చేసికొని కొత్త తరంవాళ్ళు జలప్రవాహాన్నే తమ కార్ఖానాలదగ్గరకు తీసికొని పోతూన్నారు. ప్రవాహజలముల కొకదారిని నిర్మించేవాళ్ళు. తొట్టెలు, పెట్టెలుతో నీటిని నడిపించుకొని పోయి, చక్రాల మీాద పడునట్లూ, వాటిని త్రిప్పునట్లూ చేసేవాళ్ళు. ప్రవాహాన్ని నిరోధించి, ఆనకట్టలు కట్టేవాళ్లు. అందువల్ల నీటిమట్టం లేచేది. పైకిలేచిన నదీజలాల్ని కాలువలగుండా, తొట్టెల లోకి పంపించి, అక్కణ్ణుంచి క్రింద అమర్చిన చక్రాలమీాద ఉరవడిగా పడేటట్లు చేసేవాళ్ళు. జలప్రవాహపు వేగం వివిధ

చక్రాలగుండా కార్ఖానాలోకి ప్రవేశించి, అక్కడ మానవునికి కావలసిన పనులను చేస్తూండేది. చక్రాలద్వారా జలశక్తి పోయి, కొయ్యచక్రములకు త్రిప్పి, దానికి బిగించిన బడితెలతో చింకిపీలికలను బాది, యేకి, పింజగా చేసేది; ఆ పీలికలతో కాగితం చేసేవాళ్ళు. ఈ చక్రాలే తిత్తుల నూది, కొలిమిలోని అగ్నిని ప్రజ్వరిల జేసేది; యీ శక్తియే భారమైన సమ్మెటల నెత్తి, కాలిన లోహాన్ని సమ్మెట వేసేది.

ఈ విధంగా కాగితం మిల్లు, జవుళి మిల్లు మొదలైనవి అస్తిత్వంలోనికి వచ్చేయి. 'మిల్లు' అంటే ధాన్యాదులను నూరునది, లేక పిండిగా చేయునది యని వాచ్యార్థం. కాగితం మిల్లు, జవుళిమిల్లుల్లో నూరటం, గుండకొట్టటం లేకపోయినా, వీటినికూడా మిల్లులనే పిలిచేవారు, జనులు. కొత్తవస్తువులను పాతపేర్లతో పిలవడం పరిపాటిగా వుండేది. ఇప్పటికీ యిదే అలవాటు. ఇంగ్లీషుభాషా సంపర్కం వున్నదేశాల్లో యీ రోజుకుకూడా యే రకమైన ఫాక్టరీనైనా సరే 'మిల్లు' అనే పిలుస్తూంటారు.

ఎత్తునుంచి పడు నీటివల్ల త్రిప్పబడు నీటిచక్రం మరో క్లిష్ట సమస్యనుకూడా పరిష్కరించింది. మడిలోహపు చిట్టెములను గుండకొట్టి, కరిగించి, దానిలోనుంచి యినుమును వేరుచేయు పనినికూడా యీ జలచక్రం సుకరం చేసిపెట్టింది.

చిట్టెములను బట్టీలు, కొలుములలో వుంచి యినుమును తీసేవారు, ప్రాచీనులు. బట్టీలలో బొగ్గు, చిట్టెములు పొరలు

పోరలుగా పేర్చబడేవి. తరువాత కొలిమితిత్తులను కాళ్ళ తోనూ, చేతులతోనూ, త్రొక్కి-లాగీ గాలిని బట్టీలోనికి పంపించేవాళ్ళు. ఈ విధానాలవల్ల బట్టీలోపల అంత హెచ్చు వేడిమి పుట్టేదిగాదు. ఇనుము పూర్తిగా కరిగేదిగాదు. అదే తిరిగి తిరిగి వండబడేదన్నమాట. తత్ఫలితంగా తెట్టుతోనూ, యితర మలినములతోనూ, మిశ్రితమైన యినుము, స్పాంజి వంటిది తయారయేది. తెట్టునుంచి యినుమును వేరుచేసే పనిని, బట్టీలో అసంపూర్తిగా వదలిపెట్టబడినదానిని కమ్మరి కొలిమీ, దాగలిమీద సమ్మెట పెట్టులూ పూర్తిచేయాల్సి వచ్చేది. అంతేగాక యీ పద్ధతులవల్ల చాల కొద్ది పరిమాణం లోనే లోహం తయారయేది.

జనులు లోహపు బట్టీల నింకా యెత్తుగా, పెద్దవిగా నిర్మించ ప్రయత్నించేవాళ్ళు. కాని, బట్టీల్లోకి తగినంత యెక్కువ గాలిని పంపలేకపోయేవాళ్ళు. కాలుచేతులతో వొత్తు తిత్తులు అంత గాలిని బట్టీలోకి పంపలేవు, మరి.

సరిగ్గా యీ లోపాన్నే జలశక్తిచే తిరుగు చక్రం పూరించింది. అధిక శక్తివంతమైన కొలిమితిత్తుల్ని ఊదు ఘనకార్యాన్ని యిప్పుడివి నెరవేర్చగలిగేయి. బట్టీలో యిప్పుడు కావలసినంత వాయువు జొప్పించబడింది. బట్టీలో యిప్పుడు కావలసినంత ఉష్ణోగ్రత ఉంది ఇనుము కరుగుతూంది; బొగ్గుకూడా దానితో బాటు కరుగుతూంది; వీటి మిశ్రమ ఫలితంగా దుక్క-యినుము తయారైంది.

జలము - అగ్ని, - యివి రెండూ యెప్పుడూ శత్రువులే అనుకుంటాంగదా! కాని, యీ సందర్భంలో జలము తన శక్తితో కొలుముల నూది, అగ్నిని భీకరంగా ప్రజ్వరిల్లచేసి, దానికి మిత్రునిగా వ్యవహరించింది! ఇది విచిత్రంగా లేదూ? శత్రుడు మిత్రుడగుట అంటే యిదే!

అంతవరకూ తయారవుతూండే స్పాంజివంటి బంకయినుము గాక బట్టీల్లో దుక్కయినుముయొక్క యెర్రని ద్రవాన్ని చూచి నపుడు పనివాళ్లు పశ్చాత్తాపంతో నాలుక కరుచుకున్నారు. "అరరే! నిక్షేపంలాంటి సరుకును పాడుచేసుకున్నామే!" అనుకున్నారు.

ద్రవపు యినుమా? ఇది వాళ్ళకి విడ్డూరంగా కనబడింది.

వారికి లభించినది పెన్నిధే గాని వారు దానిని గుర్తించలేక పోయారు! దుక్క యినుము నిజంగా నిధే అనుకోండి. దీనిని అచ్చులలో పోతపోయవచ్చును! దాగలీ, సుత్తితో రూపొందించజాలని రకరకాల వస్తువుల నెన్నింటినో యీ దుక్క యినుముతో పోతపోయవచ్చును, చేయవచ్చును!

ఈ విధంగా జలచక్రంతో పనిచేసే కొలిమితో యినుమును కరిగించే బట్టీలను 'బ్లాస్టు-ఫర్నేస్' లంటారు. ఈ మాటకు అర్థం 'ఝంఝూవాత - అగ్నికుండం' అని. ఇక యిక్కడినుంచే

16, 17 వ శతాబ్దాల్లోని ఇనుప కార్ఖానాలకు రాజబాట వేయబడింది. *

కొయ్యపలకలతో కట్టిన తొట్టిలోనుంచి కృతక జల ప్రవాహం వచ్చి, కార్ఖానాలో సరాసరిగా ప్రవేశించేది. ఈ ప్రవాహాన్నుంచి వేర్వేరు పాయలు వెళ్ళి జలచక్రంమీదా, కొలిమితిత్తుల నొత్తే చక్రంమీదా, సమ్మెట నెత్తే చక్రం మీదా పడి, వాట్లను పనిచేయించేవి. మొట్టమొదటివైన యీ యినుప కర్మాగారాల్లో యెంతెంత చప్పుడు, ధ్వని, గోలా వుండేదని! పనంతా వట్టిచేతులతోనే చేసుకుపోయే పురాతన కర్మకారుని చిన్న పాకవలె, కమ్మరిపాకవలె వుండే దనుకున్నారా? అబ్బే!

బ్లాస్టు-ఫర్నేసు కనిపెట్టబడినప్పటినుంచీ యినుము అధికంగా తయారవుతూ వచ్చింది. ఇనుముతో యిప్పుడు నాగేటి కర్రులు, లంగరులు, బండియిరుసులు, పట్టాలు, బందూకులు మొదలైన వెన్నో చేస్తున్నారు. అదివరకు యితర లోహాలతో చేసే వస్తువులు కూడా యిప్పటినుంచి యినుముతో చేయ నారంభించేరు. కంచుగొడ్డలి పోయి ఇనుపగొడ్డళ్ళు వచ్చేయి! అన్నిటికీ యినుమే యిప్పుడు.

---

* క్రీస్తుపూర్వమే భారతదేశపు చేత యినుమూ, పోతయినుమూ ప్రసిద్ధి గాంచినాయి. ఢిల్లీలోని యినుప స్తంభం కుమారగుప్తుని నాటిది, ఇంకా త్రుప్పు పట్టంకడా అట్లే నిలిచివుంది. దానిలోని లోహాలపాళ్ళు, దాన్ని పోతపోసిన వైనమూ యీ నాటికీ సాంకేతిక శాస్త్రజ్ఞుల కవగతం కాలేదు.

ఒక్క తీగె లాగితే డొంకంతా కదిలింది. గొళ్లెం యింకో గొళ్లెమును కదిలించింది. జలచక్రం తరువాత బ్లాస్టు-ఫర్నేస్ ప్రత్యక్షమైంది; బ్లాస్టు ఫర్నేసుతో యినుము ఉత్పత్తి పెరిగింది; ఇనుము అధికంగా, చౌకగా లభిస్తూన్నకొద్దీ జనులు పెద్ద పెద్ద చక్రాలనూ, తొట్లెలనూ కూడా యినుముతోనే చేయ నారంభించేరు. ఇనుప పట్టా లున్న చక్రాలు సులభంగా దొర్లాలంటే దిం చుకుపోని గట్టిరోడ్లు, రాతి రోడ్లు కావాలి. సరే మరి! తప్పే దేముంది? జనులు పాషాణరథ్యాలు నిర్మించ నారంభించేరు. పెద్దబండ్లు లేక రథాలు పో వీలైన మార్గమే రథ్య లేక రోడ్డు అంటారులెండి! ఏనుగులు బారులుతీరి పోగల విశాల మార్గాన్ని ఘంటాపథం అని పిలిచేవారు, హిందూ దేశంలో.



ఇనుప క్నరు వేసిన నాగలి కొయ్యనాగేటికంటె బాగానూ వేగంగానూ, లోతుగానూ పొలాల్లో భూమిని దున్ని తిరగేస్తూంది.

ఇనుపకార్ఖానాల్లో జలచక్రం పదిమంది బలాఢ్యులైన మనుష్యులుకూడా యెత్తజాలని పెనుసమ్మెటలను కూడా

అవలీలగా మెత్తి దించుతూంది. కేవలం కండబలమేగాక బుద్ధిబలం అంతకంత కధికంగా మానవునికి తోడ్పడుతూంది.

క్రమంగా కర్మాగారాలు అభివృద్ధిచెందుతూ, ఆధునిక యంత్రాలవైపు, భవిష్యత్ ఫ్యాక్టరీలు, ప్లాంట్లువైపు అతి వేగంగా జరుగుతూన్నాయి. నీటి మిల్లుకు యంత్రాని కుండ వలసిన అంగాలన్నీ యేర్పడివుండలేదూ? యంత్రం తిరగడానికి చలన హేతువు లేక ప్రేరక శక్తి ఉండాలి. దీనినే ఆధునిక పరిభాషలో మోటార్ అంటాము. ఇది తిరుగుతూ కొన్ని చలన చక్రాల్నీ, పళ్ళచక్రాల్నీ త్రిప్పుతుంది. ఈ సరంజాము నంతనూ కలిపి 'గేరు' అని పిలుస్తాము. పనిచేసే అంగములు విడిగా వుంటాయి. ఇవన్నీ నాటి జలయంత్రానికీ వున్నాయి గదా.

గత వెయ్యేండ్లుగా జలశక్తి సహాయంతో మిల్లు రాళ్ళను మానవుడు త్రిప్పుతోనే వున్నాడు. తరువాత జలచక్రానికి క్రొత్తపని తగిలింది. పిండి విసిరే పని ఒక్కటి మాత్రమే గాకుండా కమ్మరి కొలుములు, జవుళి కార్ఖానాలు, కాగితం చేసే కర్మాగారాలు, లోహపు గనులు మొదలైన వన్నీ కూడా జలచక్రాల చేతనే పనిచేస్తూన్నారు. గనుల్లోంచి నీటిని తోడివేయడం, చిట్టెములను పైకి తీసికొనిరావడం, చిట్టెములను నలుగగొట్టడం,— యీ పనులన్నీ కూడా జలశక్తే నిర్వహిస్తూంది.

ఇక యిప్పుడు మిల్లు రాయి గుదిబండలాగున జలశక్తి మెడలో వ్రేలాడడం లేదు! జలశక్తికి స్వేచ్ఛ లభించింది. తన పని యెక్కడుంటే అక్కడికి వెళ్ళి పనిచేస్తూంది, జలశక్తి.

ఇది జరిగిన కొన్నివందల యేండ్లకు, 18 వ శతాబ్దంలో రష్యాలో ఆనకట్టలు కట్టిన కుజ్మా ఫ్రోలోవ్ అను నాత డొక కర్మాగారం నిర్మించేడు. దానిలోని జలచక్రం నీటిపంపులను పనిచేయించడం, చిట్టెముల తట్టలను గనిలోంచి యెత్తడం మాత్రమే గాక యీ చిట్టెములను మోసికొని పోయే బండ్లను నడిపించేటట్లు కూడా యేర్పాటు చేసేడు. ఆ తరువాత పోల్జునోవ్, అను రష్యన్ నిపుణుడు నీటితో గాక నీటియావిరితో నడుపబడే యంత్రాన్ని కనిపెడతాడు. * ఈ యంత్రానికి చక్రాలు అమరి, గమనశక్తి గల బండిగా తయారైంది. ఈ ఆవిరియంత్రం క్రమంగా ఓడల్లోనికి పోయి కుదురుకున్నప్పుడు పొగ ఓడగా తయారైంది. ఆవిరి యంత్రాలే పొలాల్లో నాగళ్ళను లాగడానికీ, గాలిలో యెగిరే వాయు విమానాలను మోసికొని పోడానికీ కూడా వుపయోగించినాయి, తరువాతికాలంలో.

---

* ఇంగ్లండులో జేమ్సు వాట్ కనిపెట్టిన ఆవిరియంత్రమే యిది. తమ దేశస్థులే ప్రతీదీ కనిపెట్టేరని వ్రాయడం, వ్రాయించడం అనే వొక బుద్ధిజాడ్యం. ఆధునికుల్లో కూడా యిది వుమ్మడలంగానే వుంది, గమనించండి! ఇటీవల చీనా వాళ్ళుకూడ ప్రతి ఆవిష్కరణము తమ దేశంలోనే ప్రప్రథమంగా కనిపెట్టేరనీ, దాని నితరులు దొంగిలించుకు పోయేరనీ వ్రాయిస్తూన్నారు. శాంతం పాపం!

మానవుని కృషి, విజ్ఞానాన్ని ముందుకు గొనిపోతుంటుంది. విజ్ఞానాభివృద్ధికూడా కృషికి తోడ్పడుతూంటుంది. గణిత శాస్త్రజ్ఞులు, భౌతికశాస్త్రజ్ఞులు చేయి చేయి కలిపి, యంత్ర నిపుణుల సాయంతో స్వయంశక్త్యుత్పాదకములైన కొత్త కొత్త యంత్రాల్ని నిర్మించసాగేరు ఇల్లాంటి వాటిని గూర్చే ప్రాచీనకాలంలో అరిస్టాటిల్ పండితుడు కలలు గన్నది! పూర్వకాలంలో ప్రతీ పరికరమునూ మానవుని చేతులుగాని, గుర్రముల కాళ్ళుగాని పనిలో పెట్టేవి. అది సజీవయంత్రాల యుగం. అప్పుడు మానవుడే ఒక యంత్రం! గుర్రమే ఒక యంత్రం! ఆ స్థితిని, కాలాన్ని మనకు జ్ఞాపకం చేస్తూ యిప్పుడు మిగిలి యున్నవి కేవలం కొన్ని మాటలు మాత్రమే! అవే 'మానవశక్తి' 'అశ్వశక్తి' మొదలైనవి.

ఇంజనీర్లూ, భౌతికశాస్త్రజ్ఞులూ 'మానవశక్తి' 'అశ్వశక్తి' అని చెప్తూంటారు. 'అశ్వశక్తి' అనేటప్పుడు వారి దృష్టిలో వుండేది గుర్రం కాదు, చలనయంత్రమే! అల్లాగే 'మానవశక్తి' అనేటప్పుడు మనుష్యుణ్ణిగూర్చిగాక టర్బైలను త్రిప్పుప్రవాహ శక్తినిగూర్చి యింజనీరు ఆలోచిస్తూంటాడు.

కాని, మనం చాల ముందుకు పోయేమే, దారి తప్పి!

ప్రస్తుతం మనం తిరిగి 15 వ శతాబ్దానికి పోదాం. అప్పుడు యింజనీరింగు కాలేజీలు, పాలీ - టెక్నికల్ స్కూళ్ళు ఉండేవి గావు. ప్రతీ వృత్తి నిపుణుడూ తన తండ్రి దగ్గరనే పని నేర్చుకుంటూ, కౌశలం ఆర్జించుకొనే కాలం, అది.

కనీసం వెయ్యేండ్లనుంచీ యేదో ఒకరకమైన తరిమెన పట్టే సాధనం వుంటూనే వుంది. దానితో పనిచేసే కౌశలాన్ని కుమారుడు తండ్రినుంచి నేర్చుకుంటూండేవాడు. కొయ్యలో రంధ్రాలు కొలిచే తోరపటమును కూడ మానవులు చాల కాలంగా ఉపయోగిస్తూనే వున్నారు. ఆరెను గుల్లలో బిగించి పట్టుకొని, వింటిత్రాటితో చుట్టిపట్టుకొని, అటు నిటు త్రోయుచో ఆరె గిరగిర తిరిగి, ప్రతీ ఆవృత్తికీ పలకలో కొంత భాగాన్ని చెక్కివేసి, రంధ్రం దొలుచుతూంటే చూచి, కుమారుడు చోద్యపడేవాడు. తండ్రిచేయు ప్రతి అల్ప విషయాన్నీ జాగ్రతగా గమనించి, తానుకూడా అదే రీతిగాచేస్తూ, అనతి కాలంలోనే కుమారుడుకూడా ఆ పనిలో ఆరితేరేవాడు.

తండ్రినుంచి తాను నేర్చిన పనిని అభ్యసిస్తూ తనవంతు వచ్చుసరికి మళ్లా తానూ కుమారునికి ఆ పనిని నేర్పేవాడు. ఈ రీతిగా క్రియా నిపుణత్వం ఒక తరమునుంచి మరొక తరానికి సంక్రమించేది. *

---

* తాత తండ్రులు చేసిన పనినే కుమారులు నేర్చుట సహజప్రవృత్తి. మానవులు యీ విధానాన్నే సాధారణంగా సర్వత్రా అవలంబించేరు. హిందూదేశంలో యీ విధానానికి అత్యధిక ప్రాధాన్యత యిచ్చి, మార్చ రానిదిగా, విధిగా, కర్తవ్యంగా చేయడంతో అది ఆ యా కుటుంబాల ధర్మంగా, కులధర్మంగా, యేర్పడిపోయింది. మొదట్లో గుణములను బట్టి కర్మలు, కర్మలనుబట్టి తరువాత కులములు యేర్పడినట్లు, గీతాప్రమాణం వుంది 'చాతుర్వర్ణం మయా సృష్టం గుణకర్మ విభాగశః' 'సహజం కర్మ కౌంతేయ!' 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' ఇత్యాదిగా. దీనివల్ల కర్మకౌశలం సుగమమైంది.

ఆ తరువాతి కాలాల్లో అనేక మార్పులు వచ్చేయి. అప్పుడింక తాత తండ్రులు చేసినట్లుగానే కుమారులు చేయడంతో సరిపడలేదు. నూతన తరాలు నూతన సమస్యలు యెదుర్కొని పరిష్కరించాల్సిన అవసరాలు యేర్పడుతూ వచ్చేయి.

పురాతనపు తరిమెన చక్రాలమీద బండికుంచములను (ఆధునికమైన హబ్ లు యివే), నురచీలలను (స్పూక్సులు), నీటి పంపుల్లోని విడిభాగాలను తయారు చేయడం చాల కష్టంగా వుండేది. ఈ వస్తువులే గాక యింకా మరికొన్ని కూడా అంత కంతె కఠినకంగా అవసరమవుతూ వచ్చేయి. ఇందుకోసం పెద్ద పెద్ద తటిమెన చక్రాలు (లేతులు), బరువైన పెద్ద ఆరెలు కావలసి వస్తూంది. కుంచములను పట్టేటప్పుడు యీ కొత్త ఆరెను ఒక్క కుడిచేతిలో పట్టుకుంటే చాలదు. ఎడమ చేతికి కూడా మరో పని లేకుండా చేసికొని, రెండుచేతులతోటీ తరిమెన పట్టవలసి వుంటుంది. ఈ అవకాశాన్ని కల్పించడంలో మానవునికి తల, అంటే బుద్ధి సాయంచేసింది, మళ్ళా.

తరిమెన పట్టువాని కుమారుడు యిప్పుడు తాతతండ్రులవలె గాక తద్భిన్నంగా పనిచేయ నారంభించేడు. పైన అటకనుంచి వ్రేలాడే వింటి బద్దనుంచి క్రిందకు త్రాటి నొకదానిని జార్చి, క్రిందికొనను వాలుగా నుంచిన బల్లచెక్కకు కట్టేవారు. ఈ త్రాడులో ఒక మెలత వేసి, దానిలో నొక కదురు తిరుగునట్లు ఏర్పాటు చేస్తారు. పనివాడు కాలితో చెక్కను క్రిందికి అదిమినప్పుడు త్రాడు క్రిందికీ, తర్వాత కాలు పట్టు వదలగానే

పైనున్న విల్లువల్ల యీడ్వబడి త్రాడు పైకి కదురును త్రిప్పేది. పనివాని కాలు యీ విధంగా అతని పనిలో సాయపడి, అతని చేతులు రెండూ స్వేచ్ఛగా మరొక పనిని చేయగలుగుతున్నాయి. అత డిప్పుడు రెండు చేతులతోటీ ఆరెను పట్టుకొని పనిచేయగలడు.



తరిమెనవాని కాలి త్రొక్కుడు సాధనంవలెనే కాలితో త్రొక్కే మగ్గం కూడా ప్రత్యక్షమైంది. వెనుకటి చేతి వడుకు తకిలీ, పంటెల స్థానంలో త్రిప్పుడు రాట్నం తయారైంది.*

ఈ నూతన పరికరాలవల్ల యిప్పుడు యెక్కువ పని జరుగుతూంది. పనివాడు వెనుకటికివలె గాక కొత్త పంథాలో పని

* కుమ్మరిసారెను చేతితో విసురుగా త్రిప్పి, తర్వాత చేతితో మట్టిముద్దను ఒత్తేవారు. దానికిమారుగా కాలితో త్రొక్కిన తిరుగునట్లు సారెను అమర్చి, ఒకేసారి కాలితో సారెను త్రొక్కి త్రిప్పుతూ, చేతితో కుండలను ఒత్తిచేయడం నేర్చుకున్నాడు. ఈ విషయంలో వివరంగా మా "యక్షప్రశ్నలు" అను గ్రంథంలో చూడుడు.

చేయవలసి వస్తూంది—ఇప్పుడొక్కొకే పనివాడు నూలువడకి, రంగు వేసి, నేతనేయుటకు వీలుగా లేదు. క్రొత్త సాధనముల చేత పని చురుకుగా సాగుటవల్ల పనివాడు యేదో ఒక పనిలోనే నిమగ్నుడై వుంటున్నాడు. ఆ యా పనులలో మళ్ళీ అవాంతర కర్మవిభాగములు అవసరమై, అమలులోకి వచ్చినాయి. ఒకడు ఉన్నిని శుభ్రపరచి, ఉతుకుట; రెండోవాడు దానిని యేకుగా చేయుట; మూడవవాడు వడకుట; నాల్గవ పనివాడు నేత; ఐదోవాడు రంగు అద్దకం; యిల్లాగే ఒక్క కంబళిపరిశ్రమలో మళ్ళీ పని విభజన ప్రవేశపెట్టబడింది.

పనులుకూడా యిప్పుడు అధిక వేగంగా సాగుతూన్నాయి. గొదాముల్లో అంతకంత కధికంగా సరకులు చేరుతూన్నాయి. రథ్యలపై అంతకంతకు యెక్కువగా నడుస్తూన్నాయి, సామాను బండ్లు. వర్తకపుటోడలు సముద్రజలాల నంతకంతకు అధికంగా తరిస్తూన్నాయి.

వర్తకులు అంతకంతకు ధనికు లవుతూన్నారు. కర్మకుశలురు, అంటే పని నిపుణులు, సంపన్ను లవుతూన్నారు.

వస్త్రోత్పత్తిదారుల శ్రేణికి చెందిన ఫ్లోరెన్సు నగరపు ధనిక కర్మకుశలుడు యిప్పా డింక పనిలో స్వయంగా నడుం వంచవలసిన పనిలేదు. అతని దుకాణంలో పదుల కొలదీ పనివాళ్ళు అనునిత్యం పనిచేస్తూంటారు. ఫ్లోరెన్సులో ఈ పని వాళ్ళని 'సియోంపీ' లనేవారు. ఈ పదానికి బికారులు, బిచ్చగాళ్ళు అని అర్థము! యజమానివైన మేస్త్రీకే లాభా

లన్నీ వచ్చేవి. పనివాళ్ళు బికారులే మరి! యజమాని దుకాణంలో యిప్పు డన్నీ ఖరీదైన కొత్త పనిముట్లే వున్నాయి!

సియోంపీలు మాడిపోతూండేవాళ్లు. వాళ్లు తిరుగుబాటు లేవదీసేరు. కాని, లాభం లేకపోయింది. పనివాళ్లు ఓడిపోయేరు. పట్టణాల్లోని అధికార మంతా ధనిక వర్తకుల, మేస్త్రీల చేతుల్లోనే భద్రంగా వుంటూండేది.

రాజుల, ప్రభువర్గాల అధికారం చిరకాలం క్రిందటనే ఫ్లోరెన్సు నగరంలో కూలద్రోయబడింది. ఇక్కడ యిప్పుడు రాజభోగములను, రాజోచిత జీవితాలను అనుభవించుతూ న్నది వర్తకులూ, వడ్డీవ్యాపారులూను. నగరంలో ధనికుడైన వణిక్ప్రుంగవుని గృహం రాజభవనంలా వుంటుంది. వీరి యిండ్లలో సామగ్రి అంతగా వుండదు. గోడల వెంబడే కొద్ది పడక కుర్చీలు, చక్కని నగిషీ పనితనం గల మేజాబల్ల యొకటీ, సువాసన కర్రతో చేసిన సందుగపెట్టె యొకటి,—యింతే అక్కడ ఆసనసామగ్రి. కాని, గోడలనిండా, యింటి సరంబీనిండా యెన్నెన్నో రంగులతో బొమ్మలు వేయబడి వున్నాయి. మానవశిరస్సులు గల పక్షులు, చేపతోకలు గల మానవులు, రతీ మన్మధులు, నాట్యమాడుతూన్న వనదేవతలు, జలదేవ తలు, మురళీగానం చేసే దేవతలు,—ఒక టేమిటి? అసంఖ్యాక మైన చిత్రవిచిత్ర విగ్రహరూపాలు క్రిక్కిరిసి వుండేవి. గాఢ

వర్ణచిత్రితములైన యీ కుడ్యముల ముందు స్వచ్ఛమైన స్ఫటిక శిలాప్రతిమలు, రోమను దేవతా విగ్రహాలు అమర్చబడి వుండేవి. ప్రాచీన రోమను శిల్పాలంటే గృహస్వాములైన వణిక్పుంగవులకు అభిమానంలా వుంది. ఈ రోమను దేవతా విగ్రహాలు, మొట్టకేలకు స్వగృహాలకు చేరితిమనే ప్రసన్న భావంతో వున్నట్లుండేవి !

## 4. ప్రాచీనరోమనుడు తన వంశీకునికి అతిధిగా వస్తే

ఈ రోమక దేవతా విగ్రహాలు యిక్కడికి కెల్లా వచ్చేయి ? తమ పీఠాలనుంచి బర్బరుల హస్తాలచే పెరుకబడి, యీ విగ్రహాలు శతాబ్దుల పర్యంతం భూమిలో సమాధియై వుండిపోయినాయి. ఎప్పుడో ఒకరోజున కర్షకు డొకడు పొలం దున్నుతూంటే నాగేటిచాలులో చక్కని స్ఫటిక శిలానిర్మిత విగ్రహశకలం ఒకటి బైటపడింది. కవోష్ణమైన సూర్యకిరణాల్లో ఆ విగ్రహశకలం తిరిగి జీవం పోసుకుంటూన్నట్లు కనబడింది ! మరోచోట యెవడో పారకొడుతూంటే, అకాంథస్ లతా చెక్కడములు తిరగబడినాయి. కొరింథ్ దేవాలయ శిల్పములలో స్తంభమస్తకముల నలంకరించిన మాదిరి చెక్కడములివి ! పాతాళాన్నుంచి పైకివచ్చిన యీ విగ్రహారాధకుల దేవుళ్ళు కళ్ళబడినంతనే హాలికుడు శిలువ వేసికొనేవాడు; పార మొక్కవోయినందుకు మరొకడు సణుక్కునేవాడు. భూమిలో పూడిపోయివున్న చిరకాలం నాటి మానవ చరిత్ర

బైటపడి జనులను పలకరించింది. కాని, వారు దానిని గుర్తించనేలేదు !

ప్రాచీన శిల్పకళా సౌందర్యం సమాధుల్లోంచి మేల్కొని లేచింది. స్ఫటికశిలాఖండాల నన్నిటినీ యెక్కడి వక్కడ యేరి, శుభ్రపరచి జాగ్రత పెడుతూన్నారు, జనులు. ఒక ఇటలీ కుసీదకుడు (బ్యాంకరు) తన భవనానికి వచ్చిన అతిథులకు పురాతన మద్యములను మాత్రమే గాక ప్రాచీన శిల్పసౌంద ర్యాన్నీ, పురాతన విజ్ఞానాన్నీ కూడా చవిచూపించేవాడు. ప్లేటో పండితుని సింపోజియమును విందుల సందర్భాల్లో పఠించేవాళ్ళు; నగిషీ చెక్కిన బంగరు పానపాత్ర ప్రక్కనే ప్రాచీన రోమక మహాపురుషుని స్ఫటికశిలాశిల్పమూర్తి నిలిచి వుండేది ! ఇది ఒక మహోపన్యాసకుని శిరస్సు ! ఇటీవలనే టస్కనీ రాష్ట్రంలో ద్రాక్ష తోటల్లో దొరికింది, యిది. ఆ ప్రాచీన పురుషుడు, పెదవులపై చిరునవ్వు తొలుకాడు తూంటే యిటీవలనే మంచి అభిరుచులను పెంపొందించు కొంటూన్న తన వంశీకులను సానుకంప దృష్టితో చూస్తూ న్నాడా ? అనిపిస్తుంది, ఆ శిల్పాన్ని చూస్తూంటే.

ఆ విగ్రహం వినగలిగి, చూడగలిగి వున్నదైతే ! ఏమి వినేవాడు, యేమి చూచేవాడు, ఆయన? ఆ భవంతికి వెలుపల, తెరచివున్న కిటికీబైటనే ఉద్యానమునూ, దానిలోని పుష్పఫల వృక్షాలు, తమాలవృక్షాలు విరుగబూచి వుండడాన్నీ చూస్తాడు. ఆతడు తన స్వదేశభాష లాటిన్‌ను, తనకు

సుపరిచితములైన హోరేస్, ఓవిడ్, విర్జిల్ మొదలైన మహాకవులను, వారి గ్రంథాలనూ గూర్చిన సంభాషణలను వినియుండేవాడు. ఈ పరివారం అందరూ ఏసుప్రభువు నామం మీదనేగాక, ఒలింపస్ పర్వతవాసులైన ప్రాచీన దేవుళ్ళ పేర్లమీదుగా కూడా ఒట్లు పెట్టుకుంటూండడం అతనికి బహు విచిత్రంగా కన్పట్టి వుండేది! ప్లేటో తత్త్వవేత్త సింపోజియమును వీళ్ళు చదువుతూండడం విని, పాండిత్యం యందు వీరికిగల అభిమానమునకు ఆశ్చర్యపడి వుండేవాడు కూడాను!

గతమంతా పునరుజ్జీవం చెందిందేమిటి చెప్మా? అబ్బే! లేదు. గతం యెన్నడూ తిరిగి రాజాలదు!

ఆ భవనపు అలంకారం మరీ ఆడంబరంగానూ, అతి వ్యాప్తిగానూ వుంది. గోడలమీద ప్రతి బెత్తెడు మేరా, ప్రతి తలుపుమీదా, చివరికి తలుపు పిడిమీదా కూడా యెన్నో నగిషీలు, ఆకులు, పూవులు, కాయలు, లతలు, బొమ్మలూ చెక్కబడి వున్నాయి. గ్రీకు, లాటిన్ ప్రాసంగిక వాక్యాలతో సమ్మిశ్రితములై మొరటైన బర్బర హాస్యోక్తులు వినబడతాయి, అక్కడ. మంచి ఆహారపదార్థాలతో బాటు వింతవ్యంజనాలు కూడా అతిథులకు వడ్డించబడతాయి, విందుల్లో. అతిథులంతా ముఖ్యంగా యీ కొత్త వ్యంజనాలను రుచిచూడాలని యజమాని ఉరికిఖే వాళ్ళని మొగమాటం,

బలవంతం పెడుతూన్నాడు! వారూ వాటిని తిని, వంటవాని నేర్పూ, గృహస్థుని అభిరుచీ తెగ మెచ్చుకుంటూన్నారు!

అంతా తిన్నాక ఆఖరికి గృహమేధి వుండబట్టలేక పకాలున పగలబడి నవ్వుతూ అంటాడు: "మీారు తిన్న దేమిటో తెలుసా ?... చెప్పుకోలేరూ ?... వేపిన కాకిమాంసం!"

ఈ మాటలు వినడంతోనే అతిథులకు డోకు పుట్టింది. ఈ ఘట్టంలో యేం చెయ్యాలో చాలమందికి పాలుపోలేదు. గృహస్థుతో బాటుగా తామూ నవ్వేసి వూరుకోవడమా ? లేదా పిలిచి అవమానించేడని రంతు చేయడమా ? ఆముదం త్రాగిన వాళ్ళలా మొహం పెట్టి, అసహ్యంతో చాలమంది సణుగుకొనేవాళ్ళు : "ఛీ! ఛీ! ఎంత అసహ్యకరం!" గృహస్థు కోరినది కూడా యిదే! అతగాడి సంస్కారం, అభిరుచీలో యిదీ ఒక భాగమే!

ఇల్లాంటి మొరటు హాస్యాలు ప్రాచీనకాలంలోనూ వుండే వనుకోకండేం! ప్రాచీన రోమను సినేటర్లూ (శాసనసభ్యులు), కౌన్సలులూ (రాయబారులు) చేసే విందుల్లో యిల్లాంటి అసభ్యత హాస్యానికైనా వుండేదికాదు. వారి విందుల్లో యెవ్వడూ యేకబిగిని ముప్పై కోడిపిల్లల్ని, నలభై గ్రుడ్లనీ మింగ్రమింగేవాడు కాడులెండి! వాళ్ళ ప్రవర్తన యే సందర్భం

లోనూ ఉదాత్తంగానే వుండేది. * తిండిపోతుతనము నొక గొప్పగా ప్రదర్శించుకొనే సంస్కారంగాదు, వారిది !

ఫ్లోరెన్సు వాసులైన ఆ జనాభా మెచ్చుకొనే మరో చమత్కారం వుంది. అదీ చెపుతా, వినండి ! కాని, ఒక్కటి గుర్తుంచుకోండిసుమా. ప్రాచీన రోమక వీరులు దీనికి అంగీకరించి వుండేవాళ్ళుగారు. వాళ్ళ యింటావంటా యిల్లాంటి బర్బరతను మనం చూడము ! భవంతి యజమాని కొద్దిరోజులక్రిందటే అతిథుల్లో ఒకణ్ణి తప్పత్రాగించి, స్మృతి తప్పేలాగ చేయించేడు. అప్పుడా దౌర్భాగ్యుణ్ణి అంతాకలిసి, కటుకుమీద సమాధి స్థలానికి మోసుకుపోయి, అక్కడే వాణ్ణి వదిలేసి, అతగాడి బంధువుల కందరికీ అతని మరణవార్తను తెలిపే వాళ్ళు. తరువాత ఆ నిర్భాగ్యుడికి తెలివివచ్చేక, సమాధుల మధ్య వున్నానని తెలుసుకుని ఎంత కంగారుపడేవాడో ! పగటి వెలుతురులో యింటికి బోవ వెరచి, యే రాత్రివేళో వూరు మాటుమణిగేక హఠాత్తుగా యింటికి వెళ్ళి తలుపు

---

* మన ప్రాచీన చరిత్రము, గాథలు పరిశీలించినా ఆనాటి మహాజనుల అభిరుచులు, అభిజాత్యాలు గోచరిస్తాయి. రానీ పోనీ, అదేమీ లెక్కచేయకుండా, నిండుమనస్సుతో సర్వత్యాగాలు చేయగల శక్తీ, దాక్ష్యమూ, ఆత్మశిక్షణా గల మహావ్యక్తుల చరిత్రలే అవి యన్నీ. పూర్వ మహాపురుషుల సత్యధర్మానురక్తిని చూచి తరువాతివారు తమ జీవితాలను దిద్దుకోవాలనే రామాయణ భారత భాగవతాది మహాగ్రంథాలను కవులు నిర్మించేరు. వాటికి వికృతవ్యాఖ్యలు చేయు చావుతెలివి గలవారు నేడు పేట్రేగిపోయి జనులలో దురభిప్రాయాలు వ్యాప్తిగావిస్తున్నారు.

తట్టినప్పు డాతని కుటుంబీకు లెంతో గాబరా పడిపోయేవాళ్లు, మృతుడు దయ్యమై వచ్చేడని! ఇదంతా వాళ్ళచే హాస్యం క్రింద నే పరిగణించబడేదంటే వాళ్ళ సంస్కారం యెల్లాంటిదో!

అబ్బే! ఈ జనాభా అరిస్టాటిల్, ప్లేటో పండితుల తాత్త్విక గ్రంధాలను గూర్చి చర్చించుతూన్నా యింకా వీరిని బర్బరుల నే చెప్పాలి!

ఈ భవంతి యజమాని ఎవరు? అతగాడి వైనం ఏమిటి?

ఆ ధనిక గృహస్థు కులీనుడూ గాడు, రాజ వంశీకుడూ గాడు; అత డొక వర్తకుడు. అతని కంతగా భూవసతి లేదు గాని కావలసినంత బంగారం వుంది. అతనికి శక్తి నిచ్చిన దీ బంగారమే అనుకోండి! రాజులు కూడా యీ సంపన్న వర్తకుణ్ణి ఆహ్వానించేవాళ్ళు; తమ యెదుట అతడు నిలబడి మాట్లాడుతూన్నంతసేపూ వారు సగౌరవంగా తమ కిరీటాలను తీసివేసి మరీ వారితో మాట్లాడేవాళ్లు!

రాజు లా వణిక్పుంగవుని సంబోధించేటప్పుడు 'దేవరవారు' 'ప్రభువులు' అనకపోయినా, తత్తుల్యంగా నే గౌరవనీయమైన 'వైభవోపేతుడా!' 'కుబేరసంపన్నా!' యనేవారు.

ఈ 'మెడిసీ', కుబేరసంపన్నుడూ, మహావైభవోపేతుడూ ఐననూ ఏ అట్టహాసం లేక సామాన్యంగా నే కనిపించేవాడు. (ఫ్లోరెంటైన్ నగరంలో 15 వ శతాబ్దంలో సర్వాధిపత్యమునకు వచ్చిన వర్తక కుటుంబం యీ మెడిసీ కుటుంబం. ఈ కుటుంబం 1737 లో చితికిపోయింది.) ప్రాతఃకాలములం దీ

సంపన్నుడు యింటితోటలో ఆ పనీ యీ పనీ చేస్తూ, తోటమాలితో యీదాలాపంగా, చనువుగా మాట్లాడు తాడు. ఏ కార్ఖానా మేస్త్రీనైనా వీధిలో కలుసుకోవడం తటస్థిస్తే, అతణ్ణి చనువుగా వీపుమీద తట్టి మాట్లాడతాడు. కాని, ఆతి డెన్నడూ ప్రభువుల వ్యవహారాల్లో అంటే రాజకీయాల్లో కలుగచేసుకొనేవాడు గాడు. ఐననూ అతని దగ్గరనున్న ధనమే అతనికి కావాలన్న వాటి నన్నిటినీ సాధించి పెట్టేది.

ఈ వర్తకులకు లక్ష్మి వున్నదే కాని, రాజ్యలక్ష్మి లేదు. అందుచే రాజలాంఛనాలు లేవు. కవచోష్ణీషాదులు, భుజ కీర్తులు, కిరీటం, సింహలాంఛితమైన డాలు, పొడవుగా వ్రేలాడే చీరపై బుటేదారీ చేయబడిన డాంబిక చిహ్నాలూ లేకపోయినా ఆతణ్ణి రాజోచిత గౌరవమర్యాదలతోనే చూచేవారు! ఈతడు తన శత్రువుల్ని వధ్యశిలమీదికి గాని, ఖైదులోనికి గాని పంపలేడు. కాని, శత్రువుల నాతడు మర్యాదగా, చల్లగా గుట్టుచప్పుడు లేకుండా యీ లోకంలోనుంచి ఆనవాలైనా లేకుండా తుడిచిపెట్టేసేవాడు! అంతేగాదు, హెచ్చువడ్డీల మూలంగానో అసలు ఋణమీయ నిరాకరించుట మూలం గానో అతడు అనేకులను నాశనం చేసేవాడు. అత్యవసర పరిస్థితుల్లో గండికత్తెరలో పడినప్పుడు, ఆతణ్ణి ఋణం యిమ్మని అడిగి లేదనిపించుకొని అవమానాల పాలైనవారు యెందరెందరో మరి! ఆతడే పట్టణంలో కల్లా ధనికుడు. అందరి వ్యవహారాల పుచ్చులూ అతడి గుప్పెట్లో వుంటాయి!

కాని, అతని మంచినికూడా చెప్పకపోతే అన్యాయంగదా! ప్రాచీన శిల్పములు, బొమ్మలు, గ్రంథాలు కొనాల్సివచ్చినప్పుడాతడు లోభించడు; డబ్బుకు వాటిని కొనడానికి అతడు ధనవ్యయం చేసి సమ్మరించడానికి సందేహించడు. ఇటీవలనే కనిపెట్టబడిన ప్రాచీనగ్రంథాల కాపీలను వ్రాయిస్తూ, అతడు తన గ్రంథాలయంలో నలభై ఆరుగురు వ్రాయసగాండ్రను పోషిస్తూన్నాడు. ప్రాచీన శిల్పముల నెన్నిటినోకూడ అతడు ప్రోగుచేసి, భద్రపరచేడు. విద్వాంసులు, పండితులు ఆతని వద్దకు వెళ్ళి, తమ కోరికలను తీర్చుకొనేవారు. కవులు, పండితులు అతనికి వ్రాసే జాబులు సగర్వంగానే కాని, వినయపూర్వకంగా వుండేవి. చిత్రకారు లాతనిని ఆశ్రయించి, యేభై వేల ఫ్లోరిన్లను పొందేవాళ్ళు! * సముద్రాంతరాలనుంచి, ద్వీపాంతరాల నుంచి తేబడిన రంగులు చాల విలువగలిగి వుండేవి గాన ఒక్కొక్క వర్ణచిత్రం రాయడానికే చిత్రకారులకు బోలెడు ఖర్చు అయేది!

ఆత డెవరికీ యేదీ లేదనడు. కాని, యిచ్చిన ప్రతి పైసా దగ్గర్నుంచీ బహు జాగ్రత్తగా పద్దురాసి వుంచుతాడు. రాచ

* సముద్రాంతర వ్యాపారం చేసి, సంపన్నులైన వణిజులు మన దేశంలో కూడా కళాపోషకులు, భాషాపోషకులుగా వున్న చరిత్రలు చాలా వున్నాయి. పురాణాల్లోనూ, జాతకకథల్లోనూ వణిక్పుంగవుల కథలూ, శ్రీనాథుని హరవిలాసంలో కృతి భర్త అవచితిప్పని చరిత్రా చూడుడు.

వీరుల నిర్లక్ష్యవదాన్యతా పద్ధతులకూ, యీ వణిక్ప్రభువుల దానవ్యయ నియమాలకూ పోలికే లేదు.

ఈ కుబేరులు సువర్ణవర్షం కురిపిస్తూంటే కళావిజ్ఞాన క్షేత్రాలు చక్కగా పదును కు వచ్చేవి. భూమిలో పదును వున్నప్పుడు చల్లిన విత్తులకు తగిన పంట పండిందంటే ఆశ్చర్యం యేముంది ?

ఫ్లోరెన్సు నగరం ఒక ప్రత్యేక ప్రజాస్వామ్యంగా వుండేది. ఏ రాజ్యంలోని మహారాజ భవనమూ కూడా యీ నగరం లోని వణిక్పుంగవుని, సామాన్యపౌరుడైన యీ వర్తకుని భవనమునకు సరిరాదు ! ఈ నగర రాజ్యంలో చాలకాలంగా దాసులనేవాళ్ళే లేరు ! ప్రాచీనరాజవంశీకులు క్రమంగా తమ గౌరవ ప్రాముఖ్యతలను కోల్పోయేరు. ఖడ్గానికీ – త్రాసుకీ, యోధులకూ – వణిజులకూ జరిగిన యీ పోటీలో, పందెంలో చివరకి త్రాసే, వణిజులే జయించేరు. ప్రాచీన గ్రీసులోని మిలీథుస్, ఏథెన్సు రాజ్యాల్లోకూడా యిల్లాగే జరిగింది. మానవ చరిత్రలో ప్రాచీనకాలపు కీర్తివంతుల జాబితాలోకి ధనవంతులు ప్రవేశించేరు, ఆక్రమించుకుని కూర్చున్నారు

ప్రజాస్వామ్య రాజ్యాల్లో పరిపాలన జనులచే సాగించ బడేది. గనుకనే వాటిని జనసత్తాకము లన్నారు. కాని, వీటిలో కూడ నిజానికి జనుల పాలన పేరుకే మాత్రమే. మహాధనికులైన వర్తకవ్యాపారులు, వర్తకులు యెంపులోనూ ప్రత్యక్షంగా కలిగించుకొనేవాళ్ళు గారు. కాని, రాజకుటుం

బీకుల అధికారాన్ని ధిక్కరించేందుకూ, నగర ప్రజాస్వామ్య ప్రభుత్వాలకు ప్రధానాధికారులు గావడానికీ వర్తకులకు పనివాళ్ళూ, జనులూ తోడ్పడేవాళ్లు. ఈ పనివాళ్ళనిమాత్రం వర్తకులు 'బికారులు' అనే పిలిచేవాళ్ళు!

## 5. ఒక నాస్తికుని కథ.

ఫ్లోరెన్సు నగరంలోని పెద్ద బ్యాంకరు (లక్ష్మీపతి) లోరెంజో-డీ-మెడిసీ. ఆయన తరుచుగా పెద్ద పెద్ద విందులు గావిస్తూనే వుండేవాడు. ఆ విందులకు వచ్చే అతిథులలో మన దృష్టిని వెంటనే ఆకర్షించునట్టి వ్యక్తి ఒకడున్నాడు. ఆతడు యువకుడు, సురూపి. లౌరాను సంబోధిస్తూ పెట్రార్క్ కవి రచించి, పాడిన గీతాలన్నీ యితనికి కంఠతా వచ్చును. ఈయన స్వయంగానే గీతాలు రాసేవాడు కూడాను. విందులూ, వినోదాలూ, పంక్తిభోజనాలూ అంటే యితగాడు చెవి కోసుకుంటాడు. ఊరేగింపుల్లో అందరికంటె ముందు యీతడే. వందలకొలది దివిటీలకాంతిలో ముఃఖముల్ ఉడుపులు, అంగీల మీాది వెండి సరిగంచులు, జవనాశ్వముల సరంజామా, అలంకారములు ధగధగ మెరుస్తూంటే, పిల్లనగ్రోవుల మృదు సంగీతాలాపములతో రివిగా నాగిపోతూండే రాత్రి ఊరేగింపులలో యీా కవి, గియోవన్నీ పీకోడిల్లా మిరాండోలా అగ్రేసరుడుగా వుండేవాడు.

అల్లాగని మిరాండోలా నట్టి సోమరీ, డాబుల రాయుడూ, గంగిరెద్దూ అనుకుసేరు గనుక ! అబ్బే ! ఆ కవి అఖండుడు లెండి ! అతడు కులాసాగా వుండేందుకు కుతూహలపడినా, మరొకప్రక్క కఠోరనియమపరుడైన విద్యోపార్జనాపరుడు కూడాను ! ఆతని యింట చాల పెద్ద గ్రంథభాండారం వుంది. దానిలో పురాతన గ్రీకు తత్త్వవేత్తల రచనలు, యూదు కబ్బాలిస్టుల * గ్రంథాలు కూడా వుండేవి. ఇతని పూర్వీకులైన రోమక యోధులు బలప్రదర్శన పోటీలలో నెగ్గినట్లే యీతడు ప్రతీ శాస్త్ర చర్చలోనూ, వాగ్వాదంలోనూ నెగ్గుకొచ్చేవాడు.

ప్రతిపక్షులూ, అమిత్రులూ యితణ్ణిగూర్చి 'అంత చిన్న వయసులోనే యింతటి వైదుష్యం పట్టిందంటే యే క్షుద్ర దేవతో పాసనో ఐవుంటుందోయ్ !' అనేవాళ్లు.

జ్యోతిశ్శాస్త్రజ్ఞులు జాతకం గురించి 'మిరాండోలా జన్మించిన 1463 వ సంవత్సరంలో మన పట్టణంమీద హఠాత్తుగా పెద్ద వెలుగు కనిపించింది. దానికర్థం నూతనంగా జనన మందిన శిశువు భవిష్యత్తు చాల శోభాయమానంగా

---

* యూదు మతగ్రంథమైన తాల్ముడ్‌లోని నిగూఢార్థములను తెలుపు విద్యను 'కబ్బాలా' అంటారు. ఈ గూఢార్థం గురుశిష్య పరంపరగా ఉపదేశ్యమే గాని గ్రంథస్థమై యుండదు. దీనినే ఆత్మవిద్య యన వచ్చు దీనిలో పండితులైనవారు కబ్బాలిస్టులు. సాంకేతిక గూఢార్థ ప్రతిపాదకమైన గ్రంథాలు, ధర్మశాస్త్రాలు యివి.

వుంటుందనే. కాని, యీ వెలుగు క్షణంలో ఆరిపోయింది. గాన ఆతని జీవితం అల్పంగా వుంటుందని అర్థం!' అన్నారు.

పీకోడిల్లా మిరాండోలా ఒక విచిత్రవ్యక్తి. ఒక్కొక్క రాత్రంతా విందుల్లోనో, నాస్తికతత్త్వ శాస్త్రగ్రంధాల్ని పఠిస్తూనో గడిపేసేవాడు. తరుచుగా రాత్రులకు రాత్రులే ఏసుప్రభువు తల్లి, మేరీ కన్య పీఠం ముందు మోకరిల్లి వుండిపోయేవాడు.

రెండు విరుద్ధ ప్రకృతులాతనిలో సంఘర్షిస్తూండేవి. పవిత్ర ఋషితత్త్వమొకటీ, పాషండ తార్కిక తత్త్వమొకటీ,– యీ రెండూ ఒకే పురుషునిలో నిండి నిబిడమై ఒండొంటితో పెనగులాడేవి. ఒకటి విమర్శించకండా విశ్వసించాలనీ, కారణ వివేచన గావించకండా అంధప్రాయంగా శిశువువలె నమ్మాలనీ కోరుతూండేది. రెండోది నిరంతరం ప్రశ్నలు వేస్తూ, 'ప్రతీదీ విశ్వసించకు సుమా!' అని అడ్డగిస్తూండేది.

ఏదేమైనా, అసలు మానవుడంటే ఏమిటి? అని మళ్ళీ మళ్ళీ తన్ను తాను ప్రశ్నించుకొనేవాడు. ఈశ్వర సృష్టియైన దుఃఖసాగరంలో, ఆతడు నడిపించినట్లల్లా పోవు పాంథుడేనా, మానవుడు? లేక తన అదృష్టానికి తానే నిర్ణేతయా? మట్టిలో పుట్టి, మట్టిలో కలిసిపోయే నిర్భాగ్య ప్రాణిసా? లేక స్వయంసృష్టి గావించుకొని, తన్ను తానే నిర్మించుకొన్న సృష్టికర్తా?

శిలాశిల్పాలు, తైలవర్ణ చిత్రాలు,— రాళ్ళు, రంగు, గుడ్డ మొదలైన నిర్జీవ పదార్థాలతో మానవుడు నిర్మించిన కళా ఖండాలను చూచినప్పుడు ఆతని హృదయంలో యెల్లాంటి ఆనందానుభూతి, రసోల్లాసము కలిగేది! ప్రపంచాన్ని మార్చ గలిగిన మానవ వివేచనాశక్తి పట్ల ఆతను యెంతో భక్తి వినమ్రుడయ్యేవాడు!

కాని, ఆతని యీ సుఖక్షణము లంతలోనే విషసిక్తములైనాయి. లోకంలో సుఖం అత్యల్పమూ, దుఃఖం బహుళతరమూ నని తెలిసింది. అత్యధిక సంఖ్యాక మానవుల అనంత దుఃఖములు తీక్ష్ణమైన బాణాల్లా అతన్ని పొడుస్తూన్నట్లుండేవి. తను అంత సౌఖ్యంగానూ, అతిశయంగానూ వుంటూవున్నందుకు అసంఖ్యాక మానవనేత్రాలు తనను మందలిస్తూన్నాయా? అనిపిస్తూండేది.

వీధుల్లో పొడుగునా యాచకు లతిదీనంగా చేతులు చాచి, అడుగుతూండేవాళ్ళు. వాళ్ళ హస్తాలు శుష్కించిపోయి, ప్రేండ్లతో నిండియుండేవి. అతిదీనులైన ఆ దురదృష్టవంతుల ప్రార్థనలనూ, కోర్కెలనూ అతను విని కటకటం బడేవాడు. మహావైభవోపేతమైన ఫ్లోరెన్సు నగరంలో యెందరు బిచ్చగాండ్లు, క్షుద్బాధాపీడితులు వుండేవారని!

యోహాన్నీ తన వద్దనున్న ధనపు సంచిని అక్కడే ఖాళీ చేసేసేవాడు. చుట్టూ వున్న దారిద్ర్య నరకకూపపు అగాధాల్లో అలిసి పడిమిత నాణెము లేపాటి చేయగలవు? చేతులు దులుపు

కొని కంగారుపడుతూ, మనోవేదనతో ఆతడు యింటికి తిరిగి వచ్చేవాడు. తలుపులు మూసికొని, స్నేహితులతో కలుస్తా ననే వాగ్దానాలనే మరచిపోయి, దీనరక్షకుడైన ఏసుప్రభుని విగ్రహం ముందు మోకరిల్లి, కాలమునే మరిచి వుండి పోయేవాడు.

కాని, యీ ప్రార్థన లాతని కేమంత సహాయపడ లేదు. ప్రార్థనా వాక్యాలను గొంతెత్తి బిగ్గరగా ఉచ్చరించేవాడు. ఐతే ఆతని ఆలోచనలు వేరొక మార్గానపడి పరుగులెత్తేవి. ప్రార్థనను ముగించకుండానే లేచి, ఆ పండితుడు తన నిజ సహచరులైన ప్రాచీన పండిత ద్రష్టల సాన్నిధ్యాన్ని అర్థిస్తూ, వారి వద్దకు పరువెత్తేవాడు. ప్రాచీన ద్రష్టలూ, తత్త్వ వేత్తలూ అందరూ అతని గ్రంథ భాండాగారంలో వరుసలు తీర్చి, కూర్చునివుండి, తమ అమూల్యజ్ఞానము నాతనితో పంచుకోడానికి సంసిద్ధులుగానే వున్నారు! పంచినకొద్దీ తరుగక, పెరుగునది ఒక్క విజ్ఞాన సంపదయే గదా! *

ఇతికర్తవ్యతావిమూఢుడైన ఆతడు ప్రాచీన గ్రంథాల పుటలను తిరగేసేవాడు. అంతలోనే అతని మనసులో

* శ్లో. విద్యాధనం శ్రేష్ఠధనం । తన్మూల మితరం ధనం ।
దానేన వర్ధతే నిత్యం । న భారాయ న నీయతే॥

శ్లో. అనేక సంశయోచ్ఛేది । పరోక్షార్థస్య దర్శనం ।
సర్వస్య లోచనం శాస్త్రం । యస్య నాస్త్యంధ ఏవ సః॥

శ్లో. యః పఠతి లిఖతి పశ్యతి పరిపృచ్ఛతి పండితానుపాశ్రయతి ।
తస్య దివాకర కిరణైః నళినీదళ మివ వికాశ్యతే బుద్ధిః॥

కార్యకారణ వివేకమందలి విశ్వాసమున్నూ, మానవుని యందూ, ఆతని భవిష్యత్తునందూ అకుంఠిత విశ్వాసమున్నూ బలపడీవి.

ఆతడా గ్రంథాన్ని మూసి, మరో గ్రంథాన్ని విప్పేడు. దాని పేరు "తెలియదగినవాటి నన్నిటినీ గురించి" అని.

"ఈశ్వరుడు తన సృష్టియొక్క కడపటిదినమున మానవుణ్ణి సృజించెను; విశ్వనిర్మాణసూత్రాల నర్థంచేసుకోడానికీ, దాని సౌందర్యాన్ని ప్రేమించడానికీ, సృష్టి ఔన్నత్యాన్ని మెచ్చుకొనేందుకూ మానవుడు సృష్టింపబడ్డాడు. మానవుడొకేచోట వుండిపోవా లని ఈశ్వరోద్దేశ్యం గాదు; అవసరములచేత బంధితుడై, ఒకే ఒక నిర్దేశిత కర్తవ్యానికి కట్టుబడి, ఒక్కచోటనే మానవు డుండిపోవా లని ఆయన నిర్ణయించ లేదు. మానవునికి అటునిటు మసలే స్వేచ్ఛనూ, మనస్స్వాతంత్ర్యాన్నీ ఈశ్వరుడు ప్రసాదించేడు"

"ఈశ్వరుడు ఆదాముతో * యిల్లా చెప్పేడు. 'నిన్ను ప్రపంచమధ్యంలో, కేంద్రంలో వుంచేను. నీ చుట్టూ చూచి, సమస్తమునూ గ్రహించగలందులకై యే సిన్నట్లు ఉంచేను. నీవు మర్త్యుడవూ గావు, అమరుడవూ గావు. నీవు వృథ్వీసంభూతుడవూ గావు, దేవాంశసంభూతుడవూ గావు. కాని, నీవు

---

* సృష్టికర్త ప్రప్రథమమున ఆదాము-అవ్వలను దంపతులను సృష్టించెననీ, యీ ప్రథమ దంపతులనుంచే మానవజాతి సృష్టించబడిందనీ యూదు, క్రైస్తవమతముల సంప్రదాయము.

స్వీయస్రష్టవూ, శిల్పివీ అగునట్లు, అట్టి ద్రవ్యములతో నేను నిన్ను సృజించేను. నీవు, పశుస్థితికి పతనం కాగలవు, లేదా దివ్యత్వమునకూ ఉన్నతి నొందగలవు. జంతువు లన్నీ తాము వుండాల్సిన రీతిగనే తమ తల్లి గర్భమునుంచి బైటికి వస్తాయి. వాటి ఆత్మలుకూడా మొట్టమొదటినుంచీ అంటే జన్మాదారభ్య మరణించేవరకూ యెప్పుడూ ఒక్కలాగే వుంటాయి. కాని, మానవుడవైన నీవు పెరుగుటకు శక్తిగలవాడవు. నీవు నీ స్వేచ్ఛాసంకల్పానుసారంగా అభివృద్ధిజెందు నవకాశం గల వాడవుగా నుంటావు... కేవలం నీవు మాత్రమే నీ అదృష్టాన్ని నిర్ణయించుకొనగల వాడవు." *

మిరాండోలా గియోవన్నీ తన కలము నావలబెట్టి, తాను వ్రాసిన దానిని మళ్ళా ఓమాటు చదువుకున్నాడు. ఒక వాగ్వాద సందర్భానికై తయారు చేస్తూన్న తన ఉపన్యాసపు ముగింపుభాగ మిది. ఈ చర్చకు ప్రపంచంలోని విద్వాంసుల నందరనూ ఆహ్వానించా లని ఆతని సంకల్పం. మానవుని ప్రతిపత్తిని కొంచెపరచు ప్రతి విద్వాంసుణ్ణీ, ఈశ్వర సృష్టిలో మానవుడు నలుసైనా గాడని దేవుని పేర మానవుణ్ణి కొంచె పరచు పండితుల నందరనూ, ఈశ్వరుడే మానవుణ్ణి బానిసగా బద్ధునిగా సృష్టించే డనే ద్రష్టల నందర్నీ ప్రతిఘటించి, ఖండించ దలచేడు, గియోవన్నీ. సృష్టిలోని కంతకూ అత్యుత్కృష్టమైన

---

* భారతీయుల కర్మవాదపు ప్రతిధ్వనే యిది.

మానవుని రక్షణకై, సమర్థనకై ఆ ఈశ్వరునే రానిమ్ము, తనకు జవాబు చెప్పనిమ్ము!

గియోవన్నీ యొక్క యీ సవాలుకు ప్రతికక్షుల సమాధాన మేమిటి? అతని వాదనలకు ప్రత్యుత్తరములు చెప్పగల పండితు లెవరైనా వున్నారా? ఉంటే రాసిండి!

ఎవరూ ఒక్క మాటకూడా మాటాడలేదు. ప్రతిపక్షు లాతని వాదనలను ముఖాముఖిగా నిరాకరించడానికి కూడా జంకేరు. అందుచేత అసలు యీ చర్చనే పోప్ చేత నిషేధింప జేయడానికి వారెన్నో కుటిలప్రయత్నాలు చేసేరు.

మిరాండోలా గియోవన్నీ పండితుణ్ణి ప్రతిద్వంద్వు లెవరూ లొంగదీయనే లేదు. అతణ్ణి యెదిరించేవారు అతని మనస్సు లోనే వున్నారు! ఈ పాషండభావాలకు ఆతనిని చీవాట్లు పెట్టే ప్రమాదకర ప్రతిద్వంద్వి ఆతని మనస్సులోనే వుంది. పగలంతా యితరులతో కలిసి మెలసి వుంటూన్నప్పుడూ, రాత్రులు ఒంటరిగా ఆలోచిస్తూ కూర్చున్నప్పుడూ కూడ గియోవన్నీ మనస్సులో రెండు భావాలకు నిరంతరపోరాటం జరుగుతూనే వుంది. సంప్రదాయికమైన పాతవిశ్వాసాలకూ, కొత్తభావాలకూ ఆతని హృదయకురుక్షేత్రంలో సంకుల సమరం సాగుతూనే వుండేది.

ఆఖరుకు పాతవిశ్వాసాలే జయించేయి. చుట్టూ ప్రతి ఒక్కరూ వాటి పక్షమే. అంతే గాదు, ఆతడు చిరుతప్రాయము నుంచీ ప్రేమించనేర్చిన, పూజించనేర్చిన మేరీ మాతయొక్క

శాంత కరుణారస పూరిత ముఖము ఆతనిని యీ పాషండ భావములకై మందలిస్తూన్నట్లుగా వీక్షించేది. దేవాలయ ఘంటలు వేలాడి కంచు గొంతులతో ఆతణ్ణి అతని పూర్వీకుల మతమునకు మగిడిరమ్మని ఘోషించేవి. దేవాలయ కుడ్యముల మీద మెన్నెన్నో శిల్పాలతో అసంఖ్యాకులైన పాపులు, అంత్యదినమున వారికి సంభవించనున్న ఘోర శిక్షలు అతనికి కళ్ళకి గట్టినట్లున్నాయి. మత బోధకులు ధర్మవేదికల మీదనుంచి ఉచ్చరించే కఠోర వాక్యాలు గియోవన్నీ మనస్సులో ఆరని అగ్నిజ్వాలలను నరకజ్వాలల్లా ప్రజ్వరిల్ల చేసేవి.

అతడేమి సమాధాన మీయగలడు? నూతన పంథానే అనుసరించ సాహసించగలడా? నాన్యః పంథా విద్యతేఽయనాయ. కాని, నూతన మింకను బంధనములు త్రెంచుకొని పురాతనమునుంచి విడివడనే లేదు. గియోవన్నీ బల మాతనిని పీడిపోతూంది. సంశయాకులుడైన ఆతనిని భీతి ఆవహిస్తూంటే, ప్రత్యర్థులతో వాదోపవాదములను గావించు టాతనికి కష్టతర మగుచుండెను. ఆతని కింకనూ ముప్పదిరెండేండ్లు నిండకపోయినా మృత్యు వాతనిని బెదిరిస్తూంది. జ్యోతిష్కుల వాక్కు ఫలించేటట్లుంది. కడపటికి గియోవన్నీ మరణశయ్యపై నుండి, తానావరకు చెప్పినదంతా నిరాకరించి, పశ్చాత్తాపాన్ని ప్రకటించేడు.

డొమినికన్ సన్యాసుల కిదొక మహావిజయము. కుతర్కములతో యెదిరించి, పాషండవాదాలతో పరిభ్రమించే ఒక పాపి

ఆత్మను తిరిగి కాథలిక్ చెర్చి కౌగిలిలోనికి చేర్చుట వారికి విజయము కాకేమిటి? గియోవన్నీ పాషండుడుగా జీవించి, డొమినికనుగా మరణించేడు. అదృష్ట దేవత అతనితో కఠోర మైన పరిహాసమాడింది. అవిశ్వాసులను బ్రతికివుండగనే చితిపై దహనం గావించే విశ్వాసుల దండులోనే చేరి, యీ అవిశ్వాసి మరణించేడు!

6. పాఠకుడు నిజమైన మహాబలుణ్ణి కలుసుకుంటాడు.

సంకుచితమైన పాతప్రపంచాన్ని అంగీకరించిన వాళ్లకీ, దాన్ని విస్తృతపరచి ముందుకు గొంపోవ యత్నిస్తూన్న వాళ్ళకీ యుద్ధాలు జరిగి ప్రాచీన గ్రీసులో అప్పటికే రెండువేల యేండ్ల యింది.

అప్పటికిప్పుడు మళ్ళీ యీ పాత కొత్త ప్రపంచ దృక్పథా లకు మహాంతమైన తీవ్రయుద్ధం ప్రజ్వరిల్లింది. ఆ ఆదిమకాలంలో తమ అస్తిత్వానికై పోరాటం సల్పి అస్తమించినది, సంకుచిత మైన ప్రాచీన గణసమాజవిధానం. మళ్ళా యిప్పుడు పోర్దా డుతూ, కూలిపోతూన్నది, భూస్వామ్య సమాజవిధానం. ప్రభువులు – దాసులు అనే విభాగం యిప్పుడు శిథిలం ఐపోతూంది.

జనులు తమ తాతముత్తాతలవలె గాక భిన్నంగా యోచిం చడం నేర్చుకున్నారు. సమాజం మారిపోతూంది. పాత గ్రంథాల్లో తాము చదివిన విషయాలతో తాము నిత్యమూ తమ కండ్లతో ప్రత్యక్షంగా చూస్తూన్న విషయాలు పొందికగా,

అనుగుణముగా వుండడం లేదు. కాని, ఘాతవిధానం అంత సునాయాసంగా అస్తమించదు. అది తన అస్తిత్వానికై పోరాడకండా లొంగిపోలేదు. చరిత్ర చర్విత చర్వణ మవుతూందా ? అనికూడా మీరనుకోవచ్చును ! కాని, అది నిజం కాదు. చరిత్ర యెన్నడూ చర్విత చర్వణం కాదు. అది యెన్నడూ గానుగ యెద్దువలె గిరగిర తిరుగుతూండదు. ఉన్న విషయ మిది.

నీ వొక పర్వతాన్నధిరోహించా లనుకో. దారి ఒక్కొక్కపుడు పైకీ, మరొకప్పుడు క్రిందికీ, ఒక్కొక్కప్పుడు ముందుకూ, మరో అప్పుడు వెనక్కీ తిరుగుతూ మెలికలతో, చిక్కులతో వుంటుంది. నువ్వు శిఖరానికి చేరుకున్నా నని అనుకుంటావు. అంతలోనే యిట్టే చూడగా యింకా యెంతో ముందు, దూరంలో ధవళ హిమాచ్ఛాదితమై పర్వతశిఖరం కనబడుతూంటుంది. దానితో నీవు మళ్లా దారివెంబడే దిగుతావు. తిరుగుతావు. కాని, అది వెనక్కి వెళ్ళడంమాత్రం కానే కాదు. వీలు, సౌకర్యంబట్టి దారి మలుపులు, మెలికలు, క్రిందు మీదులుగా పోతూన్నా, నీవు ముందుకే వెడతూంటావు. ఎన్నడూ వచ్చిన దారినే వెనక్కి వెళ్ళవు. కొంతసేపు నడిచేక మళ్ళా తిరిగి చూస్తే, అప్పుడు తెలుస్తుంది, నీవు వచ్చినదారి యెంత ముందుకు తీసికొని పోయినదీ !

మానవ మహాప్రస్థానం కూడా యిల్లాంటి మార్గంలోనే ముందుకు సాగుతూంది. ఈ పథంలో మార్గదర్శులుగా ముందు నడుస్తూంటారు, మహాజనులు.

గ్రీకు తత్త్వవేత్తలు యీ ప్రపంచానికి అర్థం అదివరలో వలె గాక వేరొక నూతనవిధంగా చెప్ప నారంభించిన కాలం ఒకప్పు డుండేది. అప్పుడు వారు ప్రాచీన దేవతలను, సాంప్రదాయకంగా వస్తూన్న వాళ్ళను నిరాకరించేరు. ఆ విధంగానే యిప్పుడు మళ్ళా కార్యకారణ వివేకం తన హక్కుల్ని స్థిరపరచుకుంటూంది. శాస్త్రజ్ఞులు, తత్త్వవేత్తలు, విజ్ఞానులు యీ విశ్వాన్ని, ప్రకృతిని వివరించడంలో వేరొక నూతన పంథాను త్రొక్కేరు. వారు గురువులదగ్గర నేర్చుకున్నదానికంటె, తాత ముత్తాతలనుంచి అనుశ్రుతంగా వస్తూన్న దానికంటె విభిన్నమైన పంథా, యిది !

ఇప్పుడు మానవుడు శిఖరానికి యిదివరకటికంటె సమీపంగా వున్నాడు. మానవసంఘం సత్యానికి మరింత చేరువకు వచ్చింది.

సంప్రదాయ విరుద్ధములైన నూతన విషయములను సమర్థించేవారిని యిప్పుడుకూడా మరల మృత్యుదేవత బెదిరించ నారంభించింది. ఒకానొకప్పుడు గ్రీకు తత్త్వవేత్త అనక్షగోరస్‌ను కబళించబోయినట్లే యిప్పుడుకూడా మృత్యుదేవత యీ నూతన పథగాములైన సత్యార్థప్రకాశకులను భయపెట్టసాగింది. ఏమి ? ఇల్లా యెందుకు జరగాలి ? నూతన భావములు మాటలు అక్కడితో ఆగిపోవు. జనసమూహాల హృదయాలలో యివి పాదుకుని, అనంతర కార్యాచరణకు దారితీస్తాయి. కనుక నే నూతన భావాలను, సిద్ధాంతాలను

మొగ్గలోనే త్రుంచివేయడానికి కొందరు ప్రయత్నిస్తారు. క్రైస్తవమతపీఠంవారు యిప్పుడీ నూతన భావాలమీద వాగ్యుద్ధం ప్రకటించడంతో సరిపెట్టలేదు. ధర్మాధర్మ నిర్ణయ భారాన్ని తమమీదనే వేసుకుని, న్యాయస్థానాల నేర్పాటు చేయ నారంభించేరు, వారు. ఆ న్యాయస్థానాల్లో ధర్మనిర్ణయం జరిగేది. ఈ పద్ధతినే 'యింక్విజిషన్', అంటారు. ఈ మాటకు వాచ్యార్థం 'కనుగొనుట లేక భోగట్టా తెలుసుకొనుట' అని. కాని, జరిగేది యేమిటంటే, యేదేనా నూతన మార్పు కావాలని వాంఛించే ప్రగతిశీలురైన విజ్ఞానులను, వివేకులను యీ మతపీఠాధిపతులు దైవదూషకులు, నాస్తికులు అనే దోషారోపణ గావించి, యీ న్యాయస్థానాల యెదుటికి యీడ్చేవాళ్లు. సాధారణంగా ప్రతివాని హృదయంలోనే వుండే విశ్వాసాలకూ, వివేకానికీ నిరంతరం జరిగే సంఘర్షణా భారాన్నే మానవుని శక్తీ, బలమూ భరించజాలవు. అటు వంటి సమయంలో బైటి ఒత్తిడికూడా తోడ్పడిందంటే యెల్లాటి దృఢసంకల్పమూ కూడా లొంగిపోక తీరదు. గిరెయో వన్నీ యెంత శక్తివంతుడూ, పండితుడూ అయినా లొంగి పోయేడు. చూసేరుగదా!

కాని, అదే ఫ్లోరెన్సు నగరంలో మరో మహాజను డుద్భవించేడు. ఆతడు తన శక్తిని, ఆంతరంగిక శక్తులతోటి సంఘర్షణలో వృథాచేసుకున్నవాడు గాడు. ఆతని మనస్సు రెండు శిబిరాలుగా చీలిపోయినట్టిదె గాదు. ఆతడే లియొనార్డో డా విన్సీ.

మిరాండోలా గియోవన్నీ రెండు శిబిరాల మధ్య, పాత కొత్త శకముల మధ్య డోలాందోళిత మనస్కులై నిలిచిపోయేరు. అట్లుగాక లియోనార్డో-డా-విన్సీ నూతన శిబిరద్వారము నధిగమించిపోయి, ధైర్యంగా, సరాసరిగా దానిలోనికి ప్రవేశించేడు!



లియోనార్డో-డా-విన్సీ

లియోనార్డోను గురించి యోచించినపుడు మనకు ప్రాచీన గ్రీకు కళాకారులు, తత్త్వవేత్తలు జ్ఞప్తికి వస్తారు. ప్రాచీన గ్రీకు మహాశిల్పియైన ఫిదియస్‌ను మన మెరుగుదుము. అతనికి వలెనే లియోనార్డో కూడా శిల్పి, చిత్రకారుడు. వాస్తు శాస్త్రజ్ఞుడు సంగీతకళానిధీను! అంతేగాదు, మిలిటస్ నగర వాసియైన థాలెస్ పండితోత్తముని మన మెరుగుదుము. ఆయనకు

వలెనే లియోనార్డో కూడ శాస్త్రవేత్త, యంత్ర నిర్మాత. తత్త్వవేత్త, పరిశోధకుడూను! మానవుడు యీ విశ్వంయొక్క అపరిమిత విస్తీర్ణమును గురించి యోచన చెయ్యాలన్న కాంక్ష పొందినవాడు థాలిస్. ఆయన మిలిటస్ మహావ్యక్తులలో విశిష్టశక్తివంతుడు. థాలిస్ శక్తి యీ ప్రపంచమునే గాక సర్వ విశ్వమునూ ఆకళింపుచేసుకొన్నట్టిది. ఆయన ఆకాశం



లోని తారలను పరిశీలించేడు. భూమిమీద వంతెనలను నిర్మించేడు, తుఫానుల రాకను సూచించేడు, జలఘటీ యంత్రాన్ని తయారు చేసేడు, సూర్యగ్రహణములను సరిగ్గా చెప్పగలిగేడు. అతడీ విశాలవిశ్వాన్నంతనూ దేశకాలావచ్ఛిన్నంగా నిర్వచించ యత్నించేడు. అంధకారమయమైన

భూగర్భగుహాలు మొదలుకొని ఆకాశమందలి కాంతిమయమైన లోతులవరకూ గల ప్రదేశాన్నంతనూ, విశ్వసృష్టి మొదలు కొని, భవిష్యత్తులో కాలం అంతమగువరకూ గల కాలవ్యవధి లోను యీ విశ్వమును యితమిత్థ మని నిర్వచించేందుకు థాలిస్ ప్రయత్నించేడు !

కాని, ఫ్లోరెన్సు పౌరుడు లియోనార్డో యింతకన్న మిన్న యైనవాడు ! ఈతనిలో శాస్త్రజ్ఞుని తెలివీ, కళాకారుని నేర్పూ, యంత్ర నిర్మాత ఉపజ్ఞా, పరిశోధకుని ధైర్యసాహసాలు, యివన్నీ సమ్మేళనం చెంది వున్నాయి.

లియోనార్డో చిత్రించిన 'మోనా లీజా' 'ఆఖరి భోజనం' వంటి జగద్విఖ్యాత చిత్రాల్ని యెరుగనివా రుండరు. అట్టి యీతడు ఫ్లోరెన్సులోని ఒక సాధారణ శ్రేణీ సభ్యుడుగా తన జీవితాన్ని ఆరంభించేడు. ఒక శిల్పివద్దా, ఒక కంసాలిదగ్గరా పని నేర్చుకుంటూ యీతడు చాల యేండ్లు గడిపేడు.

లియోనార్డో వ్రాసిన గ్రంథపు పుటలను చూస్తూంటే నీకు కళాకారుని స్కెచ్‌లు, యింజనీరు ప్లానులు కలిసివుండడం కనబడుతుంది. ఉదాహరణ కిక్కడ ఒక సుందరి ముఖం, ఆలోచనాపూర్ణమై, నిగూఢమైన చిరునగవుతో ప్రకాశిస్తూం టుంది. దాని ప్రక్కనే కొత్త 'లేతు'యంత్రం తాలూకు రేఖాకృతి—స్కెచ్ వుంటుంది. పెద్దచక్రాన్ని త్రిప్పే చిన్న పళ్ళచక్రపు రేఖాకృతి నాయన కొద్ది గీతలతో బహు నేర్పుగా సూచించేడు. అంతకుముం దెన్నడూ యెవరూ అట్లాంటి,

ఉపాయం యోచించనే లేదనుకోండి. పళ్ళచక్రం అదివర కెవ్వరూ చూడలేదు!

ఏ విషయంలో కానీండి, మనం లియోనార్డో దా విన్సీని గూర్చి తలచుకోక తప్పదు. తర్నివాని లేతు గానీ, కెమెరా ఆబ్స్క్యూరా (బైటి వస్తురూపాల్ని లోపల తెల్లని తెరమీద పడేటట్లు చేయు సాధనం) గానీ, నేత్రనిర్మాణం గానీ, నిరంతరచలనం గానీ, దుర్గపుముట్టడి గానీ, దీపపు చిమ్నీ గానీ, దీపం వెలగడం గానీ, విశ్వాంతరాళంలో జ్వలించే విచిత్రతారకలు గానీ, మరే విషయంమీద చర్చ రానీ యీతని ప్రశంస రాక తప్పదు. ప్రతి విజ్ఞానశాఖవారూ లియోనార్డోను తమవా డంటారు. చిత్రకారు లాతనిని చిత్రకారు డంటారు; ఇంజనీర్లు ఆతడు తోటి యంత్రనిర్మాత అంటారు; సంగీత శాస్త్రజ్ఞు లాయన తమ వాడైనందుకు గర్విస్తారు; కవుల కాతడు కవి యని జ్ఞాపకమే! ఇదీ వరస.*

---

* ప్రాచీనకాలంలో ప్రముఖశాస్త్రజ్ఞు లందరూకూడా బహుముఖ ప్రజ్ఞావంతులైనవారే. హిందూదేశంలో ప్రాచీన తత్త్వవేత్తలు, కవులు, శాస్త్రజ్ఞులు అంతా ఒకజేయైన వా రెందరో వుండేవాళ్ళు. వాల్మీకి వ్యాస కాళిదాసాదులు కవులేగాక అనేక శాస్త్రాలలో కూలంకష పాండిత్యం గలవారని వారి గ్రంథాలే ఘోషిస్తున్నాయి. చరిత్రకందిన వారిలోకూడా నాగార్జునుడు మొదలైనవారి పేర్లు సర్వశాస్త్రపారంగతులైన వారివిగా మనకు తెలుస్తూన్నాయి. వైద్యశాస్త్రం, రసవాదం, శబ్దశాస్త్రం, కవిత్వం, తత్త్వశాస్త్రం, మతం, దర్శనశాస్త్రాలు, సాహిత్యం, కళలు మొదలైన యెన్నిటిలోనో నాగర్జునుడు సిద్ధుడు. సమస్త విద్యాపారంగతులైన

శతాబ్దాల పర్యంతం మానవుని మార్గం యీ కొండ కోనల్లో వంకలు తిరుగుతూనే వుండి, ఆఖరికి ఒక నూతన శిఖరాన్ని చేరుకుంది. థాలిస్ చాల దూరంవరకూ ముందుకు చూడగలిగేడు. కాని, లియోనార్డో యెదుట నున్న పథం అంతకంటె విశాలమైనదీ, బహుదూరంవరకూ గోచర మయేదిన్నీను.

థాలిస్ యోచనలో యీ ప్రపంచం ఒక గుండ్రని ద్వీప మనీ; దానిచుట్టూ సముద్రం వున్నదనీ; యీ ద్వీపపు కొసలలో, అంచులలోనే అజ్ఞాతజను లెందరో, హిందూ దేశస్థులు, వామనులు మొదలైన వాళ్ళు నివసిస్తూంటా రని ఆయన నిర్ణయించేడు. అప్పటి నాగరక ప్రపంచానికి అమెరికా మాటటుంచి, బ్రిటన్ కూడా అజ్ఞాతభూమియే! యూరోపు ఖండం ఆల్ప్సు పర్వతాలతో ఆఖరనుకునేవారు! భూగోళాన్ని చుట్టి వుండే మహాసాగరం తాలూకు శాఖయే కాశ్యప సముద్రం అనుకునేవాళ్ళు. కాశ్యపసముద్రానికి ఆవల యేముందో యెవరికీ తెలియదు! కనుక యిక ఆ తరువాత అంతా సముద్రమే నని అనుకుంటూండేవాళ్ళు.

తన శకం నాటికి మానవుడు చేరుకున్న పర్వతశిఖరంనుంచి లియోనార్డో యింకా ముందుకు చూచేడు. ఆయనకు

---

వా రెందరెందరో వుండేవారు. ఒకే వ్యక్తిగా అన్ని విద్యలూ భాసించిన కాల మది. ఒక్కొక్క విద్యాశాఖయే పెరుగుతూ వచ్చి, మహాసముద్రంగా తయారై, ఒక్కదానిలోనే ప్రత్యేకకృషి గావించవలసిన స్థితి క్రమంగా వచ్చింది అందుకే ఒక జీవితం సరిపోని దశ, యిది.

హిందూదేశాన్ని గూర్చి, చీనాను గూర్చి బాగానే తెలుసును. అప్పుడే కొలంబస్ చిన్న ఓడల్లో అట్లాంటిక్ మహాసముద్రాన్ని తరిస్తూన్నాడు. లియోనార్డో నిశితదృష్టి కొలంబస్ మహా కార్యాన్ని వెంటాడుతూ పరికిస్తూనేవుంది. మసకలోనుంచి కొత్తప్రపంచ భూరేఖ క్రమంగా దృశ్యమైంది. ప్రాచీను లెరిగియుండని ఒక మహావిశాల సముద్రము లియోనార్డో కండ్లముందు పరుచుకొని వుంది. ఆయన నిశితదృష్టికి యిప్పుడు గోచరించింది, యీ భూమి వర్తులంగా గాక గోళాకారంగా వున్నదని!

లియోనార్డో కాలంలో, యీ భూగోళం నిశ్చలంగా విశ్వ కేంద్రంలో వుందని జను లనుకొనేవారు. కాని, ఆయన యితరులకంటె యింకా ముందుకు చూడగలిగిన మహామేధావి. విశ్వాంతరాళంలో వున్న అనంతకోటి తారకలలో నీ భూగోళం కూడా ఒక తారయై యుంటుందని లియోనార్డో భావించేడు. థాలిస్ పండితుడు యెంత సమ్యగ్దర్శనుడైననూ ఆయన కాలంలో మానవుడు కేవలం అస్పష్టంగానే, ఊహామాత్రం గానే విశ్వరూప సందర్శనం గావించేవాడు. విజ్ఞానయుగాని కది ప్రాభాత సమయం. అప్పటికింకా భానూదయం కాలేదు. అస్పష్టమైన ఆ వెలుతురులో థాలిస్ చూడగలిగింది తక్కువా, ఊహించవలసినది అధికంగానూ ఉండేది. దర్శన లోపాన్ని అనుమానాది ప్రమాణములవల్లనూ, మనోకల్పనల వల్లనూ పూరించుకోవాల్సి వచ్చేది. కాని, లియోనార్డో

కాలంలో యిక ఊహాచిత్రణ గావించుకోవాల్సిన అవసరం లేకపోయింది. అంతేగాక ఊహాచిత్రణ పూర్తి సత్యమని ఆయనకు విశ్వాసమూ లేదు. "ప్రమాణమునకు తండ్రివంటివి పరిశోధనా, అనుభవమూను. అవి నిజమైన గురువులు. అట్టి అనుభవ విషయములు మాట్లాడేటప్పుడు మిగిలినవా రందరూ పలుకకుండ మౌనమునే వహింతురు గాక!" అనేవా డాయన.

పరిశోధనా లబ్ధమైన జ్ఞానం ప్రామాణికమైనది కాగలదు. అందులో తప్పు లంతగా చొరజాలవు. ఎక్కడైనా తప్పు దొర్లిందంటే, మనం వాటినుంచి తీయు - నిర్ణయములలో, సారాంశమునకు రావడంలో వుంటుందే గాని మరొకలా రాదు. ఈ సందర్భంలోనే లియోనార్డో యిల్లా అన్నారు: "పంచ జ్ఞానేంద్రియములలో యేదో ఒకదాని మూలంగా కలిగినది గాని-చో విజ్ఞానము వట్టిదీ, తప్పులతో నిండియున్నదీ కాగలదు."

ప్రాచీనకాలంలో చాలమంది పండితులు వినిన విషయము లను విశ్వసించుటే గాని విమర్శచేసి, పరిశీలన గావించుట అరుదుగా వుండేది. అరిస్టాటిల్ అంతటివాడు కూడా, కోడిపిల్లల కండ్లను తీసేస్తే, అవి మళ్ళా క్రొత్తకండ్లను పెంచుకొనగలవని విశ్వసించేవాడు! అంతేకాని, దీని యాథార్థ్యము నాయన పరిశీలించుటకు పూనుకోలేదు! అరిస్టాటిల్ యింకా కొంత నయమే. ఆయన లోకాన్ని కొంత

వరకైనా గమనించేడు. కాని, ప్రాచీన విజ్ఞానులు చాలామంది లోకాన్ని గూర్చి ఆలోచించడమే గాని, దానివైపు క్రీగంటనైనా చూడ నక్కరలే దనుకొనేవాళ్ళు!

లియోనార్డో యీ కోవకు జెందినవాడుగాడు. కళాకారుల కుండే సహజ కుతూహలంతో ఆతను తనచుట్టూ వుండిన సమస్త వస్తు ప్రపంచాన్నీ గమనించేవాడు. మనస్సుతో గావించిన ఆలోచనలను, కల్పనలను ఆయన కండ్లు పరీక్షించి చూచేవి; కండ్లు చూచిన వాటిని ఆయన చేతులు స్పృశించి, పట్టి సరిచూసేవి. ఆతడు అగ్నిని గురించి కేవలం సిద్ధాంతాల నల్లుతూ వూరుకోలేదు. దీపపు మంటమీద ఆయ నొక గాజు బుడ్డి నుంచి పరిశీలించేడు: ఫలితమును గమనించేడు. "ఎక్కడ అగ్ని మండుతూన్నా దానిచుట్టూ వాయుప్రవాహం బైలు దేరుతుంది. ఈ వాయుప్రవాహమే మంటను నిలిపియుంచు తుంది." అని తాను గమనించిన విషయమును గూర్చి వ్రాసేడు.

ప్రాచీన పండితులలో ప్రయోగాల ప్రాముఖ్యతను గ్రహించిన వారి గ్రంథాల నాతిడు బహు జాగ్రత్తగా పఠించేడు. ఆయన బల్లమీదనే హెరో గ్రంథా లున్నాయి. హెరో యంత్రశాస్త్ర నిపుణుడు, అలగ్జాండ్రియా నగరవాసి. దేవాలయ కవాటములు వాటంతటవే తెరచుకొనునట్లు చేసే సాధనము నీతడు కనిపెట్టేడు; ఆవిరిచే గిరగిర తిరుగు గోళాన్ని

కూడా ఈతడు నిర్మించేడు. హెరో వ్రాసిన గ్రంధాలు చాలకాలంవరకు మరుగునపడి వుండిపోయేయి. లోకం వాటిని మరిచేపోయింది. కాని, యిప్పుడు లియొనార్డో తిరుగ యెన్నో యంత్రాలను సృష్టించేడు. ఒక పక్షి



రూపాన్ని తయారుచేసి, దానిని వేడిగాలితో నింపేడు, ఆయన. అది అటకవరకూ లేచింది. కేవలం ఆటబొమ్మయే గానిండు, యిదే సరాసరిగా బెలూన్ నిర్మాణానికి మార్గం సుగమంచేసింది

ఆయన మరో యెగిరే సాధనాన్ని నిర్మించడానికి ప్రయత్నించేడు. ఒక యంత్రానికి ప్లానులు వేసేడు. దానికి ఒక గాలిమర అమర్చి వుంటుంది. మర బిగించినప్పుడు యీ యంత్రం గాలిలో పైకి లేస్తుంది. లియోనార్డో కిటికీదగ్గర నిల్చుని గంటల తరబడిని పావురాలు యెగరడం గమనిస్తూండేవాడు. డాబా గోడవంచనే సన్నని పుల్లలవంటి కాళ్ళతో ఊగుతూ నడిచిపోయే పావురాల్ని చూసేవాడు. నడవడంలో కంటె యెగరడంలోనే ఆ పక్షులు నిపుణతగలవి. రెక్కలు రెండు మూడుసార్లు విదల్చి, అవి నేలంటు విడచి గాలిలో లేచిపోతాయి. రెక్క లల్లార్చుతూ, చాతుర్యంగా పల్టీలు కొడుతూ, మొగ్గలువేస్తూ, యిండ్ల కప్పుల మీదుగా వివిధ గమనరీతులలో యెగురుతాయి. తెడ్లతో నీటిని వెనుకకు త్రోసి, పడవ ముందుకు బోవునట్లుగా రెక్కలతో గాలిని వెనుకకు త్రోస్తూంటుంది, పావురము. వాలుగాలిలో తేలియాడుతూ, చాచిన రెక్కలమీద నిశ్చలంగా పోతూ పావురం విశ్రమించ గలదు!

చౌకు మీదుగా పావురం రెండుసార్లు చక్కర్లు కొట్టింది. అదిగో! ఇండ్లకప్పులమీది గాలికోళ్ళమీదా, దేవాలయ గోపురాలమీదా, శిలువలమీదా, వంతెనలపైనా, గిరుక్కున చక్రాలు కొడుతూ, యెట్లాంటి ప్రయత్నమూ అవసరం లేకుండానే దిగిపోతూంది. పర్వతంమీదించి దిగే మనిషిని అతని బరువే క్రిందికి గొనిపోతూన్నట్లుగా, పావురంపు బరువే

దాన్ని క్రిందికి కొనిపోతుంది. భూమిని సమీపిస్తూన్నప్పుడు మాత్రం ధమ్ముని పడిపోకండా రెక్కల నొక్కసారి బారుగా చాచుతుంది. తేలికగా, లాఘవంగా నేలపై వ్రాలి, తాకిడి లేకండా చేయడానికి ఒక్క మాటు రెక్క ఉల్లాడించి దిగుతుండి, అది.

తెలివితేటలు లేని పక్షి వాయుయానవిద్యను యింత బాగా యెల్లా అభ్యసించ గలిగింది చెప్మా! మానవుడు తనకున్న తెలివితేట లన్నిటితోనూ యింకా నేలంటు వదలలేకండా వుండిపోతూంటే, యీ పిచ్చిపిట్టలు యింత సులభంగా యెల్లా యెగుర గలుగుతున్నాయో!

మేడ కిటికీనుంచి క్రింది చప్టామీదికి యెంత దూరంవుందో లియోనార్డో చూపులు అంచనా వేయసాగేయి. ఇక్కడినుంచి దూకితే క్రింది చప్టామీద పడి, యెముకలు విరుగుతాయి. శరీరాన్ని గాలిలో నిలిపేటందుకు గాని, లేదా పతనవేగాన్ని నిలువరించేటందుకు గాని మార్గ మేదైనా వుందా? అని ఆతడు చాలా ఆలోచించేవాడు. ఆఖరి కొత డొక సాధనమును గురించి యోచన చేసేడు. తన నోటు-బుక్కులో దీనిని గూర్చే 'ఎత్తునుంచి భూమికి దిగే సాధనము' అని వ్రాసే రాయన.

పేరాఛూట్ అని విన్నారుగదూ. ఎత్తున్నుంచి దిగునప్పుడు గాలిలో ప్రతిఘటనను నిర్మించుకొని, పతనవేగాన్ని తగ్గించేదే,

యీ సాధనం. ఆధునిక కాలంలో దీన్ని నిర్మించినా, మూడు శతాబ్దాలకు పూర్వమే దీనికి బీజాలు పడినాయి.

మిగిలిన జనులకంటె, తన కాలముకంటె ముందున్న మహా జనులలో నొకడు, లియోనార్డో-దా-విన్సీ. ఆయన వ్రాత ప్రతులు పన్నెండు పుస్తకాలు చాలాకాలంవరకూ ధూళిలో కప్పబడిపోయి, మిలాన్ నగరంలోని ఒక గ్రంథాలయంలో వుండిపోయినాయి. మిగిలిన పుస్తకాల మధ్యలో, విస్మృతి పథానబడి వుండిపోయినాయి, అవన్నీ. లియోనార్డో 1519 లో కీర్తిశేషుడైనాడు. 18 వ శతాబ్దపు కడపటి భాగంలోనే ఆయన నోటు బుక్కులు విజ్ఞానప్రపంచపు వెలుతురును చూచినాయి.

అవిగో! ఆ పుట లన్నిటిమీదా కలంతో వ్రాయబడిన గీతలు, కోణములు, తలములు, ఘనములు మొదలైనవి అసంఖ్యాకంగా వున్నాయి! వాటిని చూస్తూంటే, వాటి మధ్యనుంచి సజీవమైన ఒక మానవ ముఖాకారం కనబడుతుంది. ఎందరో మహాజనులు ఒకేమార్గంలోనూ నడుస్తూన్నారు, అనేక దారుల్లోనూ సాగిపోతూన్నారు. కలిసీ, విడిగానూ పోతూన్న యీ మార్గా లన్నీ ఒక్కొక్కపుడు ఆ ప్రక్కకూ, యీ ప్రక్కకూ, క్రిందికీ మీదికీ, మరొకప్పుడు వెనుకకూ, యెన్నెన్ని రీతులుగా పోయినా, అన్నీ కలిసిన ఒకే ఒక మార్గం, మానవ మహాప్రస్థాన పథం ముమ్ముందునకే అవిచ్ఛిన్నంగా సాగిపోతూ కనిపిస్తుంది. శతాబ్దాల పర్యంతం ఒక

చోటా, క్షణకాలం అన్నిచోట్లా అంధకారం వ్యాపించవచ్చు. కాని, ఆ మహాంధకారంలోంచి కూడా దివ్యదీప్తులతో మహాజనులు వెలువడుతూనే వుంటారు. ఆతనిని మన భావ ప్రపంచంలో తప్ప యదార్థ ప్రపంచంలో చూడగలమా? అనిపిస్తూంటుందికూడాను!

ఉత్తమ గురుడైన లియోనార్డో యేకాకిగానే యెన్నెన్నో గీతలు, తలములు, రంగులు, ఛాయలు, విగ్రహాలు, భావాలు, స్వాప్నికరూపాలు మొదలైన వాటితో క్రిందుమీదులు పడుతూండే క్షణములలో ఆయన కర్మక్షేత్రమైన కర్మాగారంలోనే మన మటువంటి మానవరూపాల్ని చూడగలము! ఈ ప్రపంచమందలి సమస్త వస్తువులూ, విషయములూ కూడా తమకొక నిర్దిష్టస్వరూపాన్నియమనీ; సమన్వయాత్మకమైన క్రమంలో తమ్మి అన్నింటినీ నిబద్ధమొనర్చమనీ; అసదృశమూ, అత్యవసరమూనైన పరంపరలో తమ్ము యిమడ్చమనీ,- ఆయనను చట్టుముట్టేవి. ఈ మహాభారమును నిర్వహించగలుగుటకు గురువూ, బోద్ధాయైన మహాజనుడు మొదట తన్ను దాను జయించుకోవాలి. తన సృజనాత్మకశక్తి లోకంలో అన్నిటినీ లొంగదీసుకోగలదు. కాని, తనలోనే పెల్లుబికి వచ్చే ఆవేశాల్నీ, ప్రేరణలనూ లొంగదీసుకోవడమే కష్టాల్లో కన్నిటికీ కష్టమైనటి 'లోకము లన్నియుం గడియలోన జయించినవాడ వింద్రియానీకము చిత్తముం గెలువ నేరవు నిన్ను నిబద్ధు జేయు నీ భీకరశత్రు లార్వుర ప్రభిన్నుల జేసిన

ప్రాణికోటిలో నీకు విరోధి లేడొకడు నేర్పున జూడుము
దానవేశ్వరా! * ...అన్న మహాకవి వాక్య మెంత సత్యము!
లోకమునకు మార్గదర్శి కావలసిన వారికి ముఖ్యంగా యిల్లాంటి
ఆత్మసంయమనం యెంతేనా అవసరం.

అంతేగాదు; మహాజనుడు కళాకారుడు కూడాను. ఆతని
హస్తం వణుకు నెరుగకూడదు. రూపభావన విస్పష్టమైనది
గానూ, సరియైనదిగానూ వుండాలి. అందుకొరకై యే ఆతడు
తన్ను తాను శిక్షణలో వుంచుకుంటాడు. ఈ శిక్షణ పరులచే
విధించబడినది కానేకాదు. ఆతడు తన శక్తు లన్నిటికీ తానే
అధికారి, శాసకుడూను. ఆతని ముఖము ప్రశాంతము,
ప్రదీప్తము. దృఢముగా బిగించిన పెదవులను క్రమ్మివేసి
చుట్టూ తెల్లని మీసములూ, గడ్డమూ వుండి, ఆయనలోని
దృఢనిశ్చయాత్మకబుద్ధినీ, విశాల మానసికశక్తినీ ప్రకటిస్తూ
న్నాయి. నెరసియున్న ఆయన కనుబొమలు ముడిపడి
యున్నాయి. కాని క్రోధంచేత మాత్రం గాదు సుమండీ!
తదేకమైన మనోభావ - కేంద్రీకరణమునే ఆయన భ్రుకుటి
సూచిస్తూంది. విశాల ఫాలభాగంక్రింద ఆయన నేత్రద్వయం
తీక్ష్ణంగా, సూటిగా చూస్తూన్నాయి. ఆయనలోనున్న మనస్సు

---

* బమ్మెర పోతన రచించిన ఆంధ్ర మహాభాగవతము సప్తమ
స్కంధములోని ప్రహ్లాద చరిత్రలో ప్రహ్లాదుడు తండ్రి హిరణ్యకశిపునితో
అనిన మాటలు యివి.

లోకాన్ని పర్యాలోకించుటకీ నేత్రాలే విశదమైన గవాక్షా లని చెప్పాలి. మనస్సు తన హద్దులను, పరిమితులను విస్తృతం గావించుకుంటూ, అనంతమైన యీ విశ్వాన్ని అవలోకించి, పర్యాలోకించుటకు కండ్లు మొదలైన జ్ఞానేంద్రియముల ప్రాధాన్యతను యెవరూ కొంచెపరచుటకు వీలులేదుగదా!



# ఏడో ప్రకరణం

## మానవుడు సముద్రద్వారమును దాటుతాడు.

శ్రీయోనాస్థో వాయు మహాసముద్రంలో తేలియాడడం మెల్లాగా అని యోచిస్తూంటిన కాలంలోనే అప్పటి జనులు జల మహాసముద్రాలను అధిగమించడానికి కృషిగావిస్తూ, ఆ కృషిలో నిమగ్నులై వున్నారు.

మానవు డీ భూగోళంమీద అవతరించేక అన్ని ప్రదేశాలను త్రొక్కి చూసేడు; యెన్నెన్నో చిత్రవిచిత్ర విషయాలను చూసేడు; యెప్పటికప్పుడు నూతన సంగతులను కనుగొంటూనే వచ్చేడు. అన్ని ఋతువుల్లోనూ కూడా మంచు పేరుకొనిపోయి వుండే ఉత్తరధృవప్రాంత భూములనుంచి దక్షిణాన మడగాస్కార్ దీవివరకూ, పడమట జిబ్రాల్టరు లగాయితు తూర్పున సుమత్రా ద్వీపాలవరకూ అనేక దేశాలను, శీతోష్ణ పరిస్థితులను చూచేడు.

కాని, యీ సరిహద్దులమధ్య నున్న సముద్రా లన్నిటినీ మించిన మహా సముద్రాలు మానవు డింకా చూడవలసే వుంది! తాను కాలిడిన దేశాలబైట యింక అంతా జలమే ననిన్నీ, చుట్టూ మహాజలనిధులచే పరివేష్టించబడి వున్నామనీ అనుకున్నాడు, మానవుడు! ఈ భూమి నంతనూ చుట్టుముట్టి వున్న అగడ్త, మహాసముద్రం యిదే నని ఆతని ఊహ!

ప్రాచీన కాలాన్నుంచీ సముద్రయానం గావిస్తూ వచ్చిన జాతు లన్నీ సముద్రాంతరవిశేషాల్ని గూర్చి యెన్నెన్నో గాథలను నిర్మించుకుంటూ వచ్చేయి. ఆదిమకాలంలో సాగరతీర దేశమైన ఫొయినీషియా వాసులు సముద్రయానం గావిస్తూనే వుండేవాళ్ళు. మహాకాయుడూ, భీమబలుడూ ఐన హెర్క్యులిస్‌ను గూర్చిన గాథను మోసుకొని వచ్చినది ఫొయినీషియనులే. మధ్యధరా సముద్రంలో నుంచి మహా సముద్రంలోనికి ప్రవేశించుచోట పర్వతనిర్మితమైన ద్వారమును నిలిపినది, హెర్క్యులిస్ మహాబలుడేనట! ఆ పర్వత ద్వారం మీద "ఇది దాటి ప్రయాణం చేయకుడు!" అని వ్రాసి వుందట! ప్రాచీనమైన యీ కట్టుకథను ఫొయినీషియనుల నుంచి గ్రీకులు నేర్చుకుని, అరబ్బులకు చెప్పేరు. ఈ గాథకు కొద్దితేడాలతో పాఠాంతరాలుకూడా వున్నాయి. ఒక పాఠం ప్రకారంగా ఆ ద్వారంలో పర్వత స్తంభాలు గాక సాక్షాత్తూ హెర్క్యులిస్ దివ్యుడే శిలా స్తంభ రూపంలో కాపలా కాస్తూంటా డనీ, ఆయన ఒక చేత్తో మహాసముద్ర ద్వారపు తాళంచెవిని పట్టుకొని, రెండో చేతిని మధ్యధరా సముద్రంవైపు జాచి, అరచేతితో 'ఆగండి! ఇంకొక్క అడుగుకూడా ముందుకు రావలదు!' అని సమీపిస్తూన్న ఓడలను హెచ్చ రిస్తూంటా డనీ చెపుతారు.

దివ్యుడైన హెర్క్యులిస్ ఆకాశాన్ని మోస్తూ, మహా సముద్ర ద్వార ప్రదేశంలో శిలా స్తంభాల రూపంలో వుంటా

డని ప్రాచీనులు వర్ణించినదే యిప్పుడు మనం జిబ్రాల్టర్ జలసంధి అని అంటున్నాము. ప్రాచీనకాలపు దేశపటాల్లో జిబ్రాల్టరు జలసంధిని మానవులు యీ విధంగా చిత్రించు కున్నారు! నిర్జీవశిలారూపంలో వున్న మహాకాయుడొకడు చైతన్యరూపుడైన మానవుని సముద్రయానముల నక్కడ నిలిపివేస్తూన్నాడు. తన శక్తి యెంతటిదో మానవునికే తెలియదు! అప్పటి మానవుని కింకనూ ఆత్మవిశ్వాసం అంతగా కలుగలేదు.

క్రీస్తు శకం 14 వ శతాబ్దారంభంలోనే ఇటలీ మహాకవి దాంతే 'డివైన్ కామెడీ' (దివ్యమైన సుఖాంతకావ్యం) అనే గొప్ప గ్రంథం వ్రాసేరు. దానిలో యీ ప్రపంచ మొక పెద్ద పర్వతంగా చిత్రించబడింది. అనేక చిన్న గుట్టలమధ్య యీ పర్వతం మహోన్నతంగా లేచి, స్వర్గపీఠులకు, దేవతలు, మహర్షులు నివసించే స్వర్గలోకాలకు మార్గం చూపుతూంటుం దని వ్రాయబడింది. ఈ భూగోళానికి ఆవలిప్రక్క అగాధమైన అంధకారపూరిత బిలము, భూగర్భ కుహరంలోనికంటూ, పాతాళానికంటూ, నరకలోకానికి వ్యాపించి వుంటుంది.

నరకంలో పాపాత్ముల ఆత్మలు తమతమ పాపాలకు శిక్షల ననుభవిస్తూ, దుఃఖిస్తూ వుంటాయి. వాటికొక్క క్షణమైనా శాంతి యుండదు. అక్కడ మహా ఝంఝా మారుతాలు యీ పాపుల ఆత్మలను యెండుటాకులనువలె అటునిటు యెగుర గొట్టేస్తూంటాయి. మరికొందరు మహానరకాగ్ని జ్వాలల్లో

పడి, దగ్ధమైపోకుండానే వేగిపోతూంటారు. వీరు తమతమ పాపాలను బట్టి వివిధ వర్గాలుగా విభజించబడి వుంటారు. అందరికంటెనూ మహాపాపాత్ములు, దేశద్రోహులు, కృతఘ్నులు భూగోళపు నట్టనడిమి భాగంలో, మంచులో బాధల నొందుతూ బంధితులై వుంటారు. వారెంత అధిక పాపాత్ములైతే అంత లోతున వున్న నరకవలయంలో ఉంచబడుతూంటారు.

దాంతే కవి ఒడిస్యూస్ * యోధుణ్ణి నరకంలోని ప్రథమ వలయంలోనే వుంచేడు! ఎందువల్లనో తెలుసా? పైన మనం చెప్పుకున్న మహాసముద్రములోనికి, హెర్క్యులిస్ రక్షితమైయున్న పర్వత ద్వారము నతిక్రమించి పోగలననే దుర్వార మహాగర్వం కలిగివున్నందుకే ఒడిస్యూస్ యీ నరక శిక్ష ననుభవించాల్సి వచ్చింది!

"హెర్క్యులిస్ వీరుడు హద్దుల నిల్పినట్టి
సన్నటి యీ జలసంధిని దాటగోరి."

---

* గ్రీకులకూ—ట్రోజనులకూ జరిగిన మహాయుద్ధంలో పాల్గొన్న గ్రీకు వీరుడు. ఈ యుద్ధగాథనే హోమర్ మహాకవి 'ఇలియడ్' అనే మహాకావ్యంగా రచించేరు, వాల్మీకి మహర్షి రచించిన రామాయణం వంటి కావ్యమిది. ట్రోజను యుద్ధానంతరం ఒడిస్యూస్ తన అనుచరులతో పది సంవత్సరాలు సముద్రాలమీద నానావస్థలూ పడి, పరిభ్రమించుతూ చివరకు తన మాతృభూమియైన గ్రీసులోని ఇథాకాకు చేరుకుంటాడు. ఇథాకా దేశాధీశ్వరుడు, ఒడిస్యూస్. ఇదంతా 'ఒడిస్సే' అను మరొక మనోహర కావ్యంగా హోమర్ మహాకవిచేతనే రచించబడింది. అర్జునుని ప్రవాసగాథను పోలివుంటుం దీ గాథ.

ఒదిస్స్యూస్ పీరుడు నరకమును చూడాల్సివచ్చింది! దాంతే మహాకవి మానవుని ఆత్మను, మన స్తత్వాన్ని తెలుసుకొన్నవాడు. మానవుని ఆత్మ మహోన్నత్యమును పొందగలదనిన్నీ, అదే కృతఘ్నతా మహాకూపంలోనికి కూలబడిపోగలదనిన్నీ దాంతే కవి గ్రహించేడు. విజ్ఞాత ప్రపంచపు హద్దులను దాటి అజ్ఞాన ప్రపంచంలోనికి యీడ్చుకుపోయే మానవ జిజ్ఞాసాశక్తియొక్క బలాన్నికూడా యీ మహాకవి గుర్తించేయున్నాడు. కాని, దాంతే మహాకవికూడా తన కాలమునకు వారసుడే. మహాకవీ, పండితుడూ, జిజ్ఞాసాపరుడూ ఐనను, విజయకిరీటాన్ని ధరించిన తన మస్తకమును ఆతడు యింకనూ అదృష్టశక్తులకు వంచియే వున్నవాడు! మానవుని కోరికలకు ఒక పరిమితి గలదనిన్నీ, హెర్క్యులిస్ మూసిన ఆ ద్వారాన్ని మానవు డెన్నడూ తెరువజాల డనిన్నీ దాంతే మహాకవి భావించేవాడు!

ఆయన అట్లు విశ్వసించక యేమి చేయుగలడు?

అప్పటిలో నావికులు అట్లాంటిక్ మహాసముద్రమును 'అంధకార సముద్ర'మని పిలిచేవాళ్ళు. అక్కడి నీటిమీద ఆవిరి మేఘాలు లేస్తుంటా యనీ, దట్టమైన పొగమంచువల్ల సూర్యుడే కనబడడనీ, జంఝామారుతములు వీచి మేఘాలను చాపలాచుట్టి అటునిటు విసిరివేస్తా యనీ వాళ్లు చెప్పేవాళ్లు, నమ్మేవాళ్ళు! అక్కడి నీరు చిక్కగా జిగటగా, తారులా

వుంటుందనీ దానిలో ఓడలు కదలజాలవనీ, చిక్కువడిపోతా యనీ కూడ అనుకునేవాళ్ళు.

మానవ మేధస్సు దారి చేసుకోలేని, అధిగమించలేని ఆటంకా లెక్కడైనా వున్నాయా ?

ఒకానొకప్పుడు నావికులు ఒక సముద్రంలోనుంచి మరొక సముద్రంలోనికి పోవడానికి భయపడేవారు. ఎర్రసముద్రంనుంచి అరేబియా సముద్రంలోనికి ప్రవేశించాలంటే సన్నని సింధు శాఖను దాటిపోవాలి. అరబ్బు నావికులు ఆ సింధుశాఖను 'బాబ్-ఎల్-మాండెబ్' అని పిలిచేవారు. 'నౌకాభంగ ద్వారం' అని యీ మాటకు అర్థం! ఐనా అప్పుడు కూడా యీ ద్వారం దాటి వెళ్ళే సాహసులైన అరబ్బునావికు లుండేవారు. ముందు యెవరైనా దారి తీస్తే వెనుక వచ్చే వాళ్ళు బోలెడంతమంది! అల్లాగే జిబ్రాల్టర్ జలసంధిని దాటి, అట్లాంటిక్ మహాసముద్రంలోకి ప్రవేశించే సాహసులూ బైలు దేరేరు. హెర్క్యులిస్ పరిరక్షిత శిలాద్వారంకూడా మానవునిచే భేదించబడిపోయింది!

అరబ్బు నావికులను ఎర్రసముద్రంలోంచి అరేబియా సముద్రంలోనికి ఆకర్షించిన దేది? హిందూదేశంతో వ్యాపారమే. అట్లాంటిక్ మహాసముద్రంలోనికి మానవుణ్ణి ఆకర్షించినదో? ఆఁహా! ఈ సందర్భంలోనూ హిందూ దేశమే! హిందూదేశానికి పోయేందుకు కొత్తసముద్ర మార్గాన్ని అన్వేషిస్తూన్నారు, యీ నావికులు. పశ్చిమ

ప్రపంచాన్ని ప్రాగ్దేశాలకు చేరకుండా చేయగలశక్తి యేదీ లేదు. *

ఐతే, పాతమార్గాలు, అష్టు త్రోవలు యిప్పుడు యేమైపోయినాయి? అవి వుండనే వున్నాయి. అవి లేకను గాదు. వార్తక బిడారులు స్థలమార్గాన సిరియా, పాలస్తీనా, మెసపొటేమియా, బాగ్దాదు నగరాలమీదుగా పెరిష్యన్ సింధుశాఖలోనికీ, అక్కణ్ణుంచి అరాబియా సముద్రంమీదుగా హిందూదేశానికీ పోయేవాళ్ళు. మరొక సులభమార్గమూ వుండేది. సముద్రంమీదుగా అలగ్జాండ్రియాకూ, అక్కణ్ణుంచి ఎర్రసముద్రంలోంచి 'నౌకాభంగద్వారం' దాటి హిందూ మహాసముద్రంలోకీ, హిందూదేశానికీ పోవచ్చు. ఈ సముద్రమార్గాన నిరంతరం ఓడలు అటునిటు పోతూండేవి, ప్రాచీనకాలాన్నుంచీ. నీటిమీాద ఓడల చాళ్లు స్థిరంగా వుండేవే ఐతే ఆ సముద్రాలన్నీ అసంఖ్యాకములైన ఓడచాళ్ళతో అల్లిబిల్లిగా వుండేవే! సముద్రఫేనంతో ఆ చాళ్ళు పూలుపరచినట్లుగా భాసించేవి!

---

* భారతదేశపు యీ ఆకర్షణ ఎందుకో ఉంది? ఇచ్చటి సంపదల్లోనా? ఇచ్చటి శాస్త్రాల్లోనా? సంస్కృతిలోనా? లేక వీటన్నిటిలోనూ ఉన్నదా? నేటికీ ఎంత తెలుగు మీాఱపోయినా హిందూదేశం, సంస్కృతి, సంస్కృతం,- వీటి ఆకర్షణ సభ్యజను లందఱపైనా ఉంది. ఆ ఆకర్షణను అనుభూతి గాంచనివారు యింకా జంతుదశను దాటని జాతులు మాత్రమే; వాటిని భగ్నం చేయాలనేవాళ్లు అసురులున్ను.

కాని, ఆ పాతదారు లన్నీ కట్టుపడిపోయినాయి. వాటికి కంచె కొట్టేసేరు. ఐతే, సముద్రాలకే కంచె వేసిన ఆ ఘను లెవరు చెప్మా?

## 2 సముద్రాలకు కంచెవైచిన వారిని గూర్చి

శతాబ్దముల నుంచీ కూడా అలగ్జాండ్రియా ఒక చేతిని పశ్చిమానికీ, రెండో చేతిని ప్రాగ్దిశకూ చాచి వుంచుతూంది. ప్రాక్పశ్చిమాలనుంచి యెడతెగకుండా ఓడలు వచ్చి, అలగ్జాండ్రియా నౌకాశ్రయంలో విడిసి వుంటూండేవి. అటువంటిది యిప్పుడు దశ తిరిగిపోయింది. సముద్రములోనికి కట్టిన గోడ మీద యిప్పుడు గడ్డి మొలిచిపోయింది! అలగ్జాండ్రియాలోని గొడాముల్లోనూ, కొట్టముల్లోనూ పక్షులు గూళ్ళు కట్టుకుని సుఖంగా కాపురం చేస్తున్నాయి! ఏమిటి కారణం?

ఓడల తాలూకు పాతపగ్గాలు రేవుల్లో చప్టాలమీద చీకుతూ పడివున్నాయి. రేవుల్లో నేలాది పడవలచే ఆటంక పరుపబడకండా పెద్దపెద్ద తరంగాలు యిప్పుడు విశృంఖలంగా విరుచుకు పడుతూన్నాయి. ఇప్పుడు సముద్రంలో తెరచాపలు అరుదుగా మాత్రమే కనబడుతూన్నాయి. దాదాపు అన్ని దేశాలనుంచీ వచ్చి రేవుల్లో కలుసుకొనే ఓడలు, జెండాలు, యిప్పటికి చాలకాలంగా అదృశ్యమైపోయినాయి. ఏమిటి యీ మార్పుకి కారణం?

ఒకప్పుడు మహా సందడిగా, మహా వైభవోపేతంగా వుండిన అలగ్జాండ్రియా రేవును యే ప్రళయ ఝంఝూమారుతమైనా నాశనం చేసిందా? అబ్బే! సముద్రం మీది తుపాను కాదు. కాని మానవుడు చేజేతులా తెచ్చుకొన్న తుపానే అలగ్జాండ్రియా పతనానికి కారణం......

క్రీస్తు శకం 1453 వ సంవత్సరమును ఒక్కసారి చూద్దాం, నడవండి. ఆ యేట మహాయుద్ధాలు, మహా ప్రళయాలు సంభవించినాయి.

...మళ్ళా తూర్పుదిశనుంచి, ఆశియానుంచి మూకలు దండెత్తి వస్తున్నాయి. కాన్‌స్టాంటినోపుల్ వీధులగుండా ముష్కరులైన తురుష్క ఆశ్వికయోధులు స్వారీచేస్తున్నారు. బైజాంటైనులపై సుల్తాన్ మొహమ్మద్ విజయం గాంచేడు. విజయోత్సవంలో సుల్తాన్ విందు బల్లమీద సుప్రసిద్ధులైన శత్రువుల విదళితమస్తకాలు రక్తసిక్తములై పడివున్నాయి.

బైజాంటియంనుంచి కాందిశీకులు గుంపులుగా పశ్చిమాభిముఖులై బాటలన్నీ నింపుతూ పోతున్నారు. తమతో పిల్లలనూ, మోయగలిగిన సామానులనూ మోసికొని పోతున్నారు. ఇప్పుడు మళ్ళా గ్రంథనిధులకు ముప్పు దాపురించింది. ఈ బర్బర మూకలనుంచి, మానవుడు యింతవరకూ సంచిత మొనర్చిన జ్ఞానభాండారములను సంరక్షించాల్సిన అవసరం వచ్చింది. పండితులు, విజ్ఞాన ప్రియులు తమ గ్రంథనిధులను తురుష్క బర్బరుల కండ్ల బడనీయకండా దాచడానికి తొందరగా

పోతూన్నారు, దేశంవదలి, చీమల పుట్టను పాడుచేసినప్పుడు గ్రుడ్లసంచులను మోసికొనిపోవు చీమలవంటివారు, యీ పండితులు.

మళ్ళా యిప్పుడు గ్రీకు తత్త్వవేత్తల గ్రంథాలు తలదాచుకొనే తావునకై, ఆశ్రయస్థానానికై యెదురుచూస్తూన్నాయి. ఈ సారి ఇటలీలో వాటికి ఆశ్రయం లభించింది. తురుష్కమూకలు నల్లసముద్రం వెంబడే ఉత్తరానికీ, దక్షిణంగా సిరియా, ఐగుప్తులకూ పురోగమిస్తూనే వున్నాయి.

జెనోవా వర్తకులు క్రిమియాలో కఫ్ఫా అనే దుర్గాన్ని నిర్మించుకొని వుండేవాళ్ళు. దానిచుట్టూ అగాధమైన అగడ్త, చుట్టూ యెత్తైన ప్రాకారాలు, బురుజులు ఉన్నాయి. గాని అవేవీ దానిని తురుష్కులనుంచి రక్షించలేక పోయినాయి. అక్కడివా రందరూ బందీలుగా పట్టుకోబడి, విదేశాల్లో బానిసలుగా విక్రయించబడ్డారు.

మూడు శతాబ్దములు నల్లసముద్రము నిర్మానుష్యమై పోయింది. తిరిగి 18 వ శతాబ్దంలో అంటే దాదాపు నాలుగు వందలేండ్లకు పిమ్మట రష్యనుల ఓడలు నల్లసముద్రంమీాద ప్రయాణం గావించునప్పుడు, మార్గదర్శులు యెవ్వరూ లేకపోయేరు. నీళ్ళలో మునిగియున్న పర్వతముల చహరా; గాలుల దిశలు మొదలైన వాటి భోగట్టా; వడులు, ప్రవాహాలు గురించిన గురుతులు మొదలైనవి అన్నీ చెరిగిపోయినాయి. పటము లు (మ్యాప్‌లు) తిరిగి వ్రాయవలసి వచ్చింది. నౌకలను

కర్ణధారులు గుడ్డి వేటుగానే నడిపించాల్సి వచ్చింది. ఎన్నెన్నో నౌకాభంగాలు, ఆస్తి ప్రాణనష్టాలు మూల్యంగా చెల్లించి, అనేక తరాల కాలంలో సంపాదించిన సముద్రమార్గ పరిజ్ఞానం అంతా వృథాయైపోయింది. మళ్ళీ యిప్పుడు అంత మూల్యమునూ మానవజాతి చెల్లించి తీరాల్సిందే! పురాణ కాలములో గ్రీకు, రషియను నావలు పాంతసు (నల్లసముద్రం) జలాల్ని దున్నుతూ కూడబెట్టిన జ్ఞానం, యెంతో మూల్యమును చెల్లించి సంపాదించినట్టి జ్ఞానం నీళ్ళపాలై పోయింది.

తురుష్కులు నల్లసముద్ర తీరముల వెంబడే ముందుకు త్రోసుకొనిపోతూన్నారు. పడమటి దేశీయులు ప్రాగ్దేశాలకు బోవు మార్గాలు, హిందూదేశానికి వెళ్ళే దారులు బంధించబడిపోయాయి. తురుష్క అశ్విక యోధులూ, జానిస్సరీలూ (పదాతులు) సిరియా దేశపు సమృద్ధ నగరాలనూ, ఐగుప్తులోని పిరమిడ్లనూ చేరుకున్నారు.

అలగ్జాండ్రియా నగరం నిర్మానుష్యంగా, ప్రశమితంగా చేసి, విడిచిపెట్టబడింది. అంతకుముందే అక్కడి జీవితపు సందడి చల్లబడిపోవ నారంభించింది. క్రైస్తవులు మహమ్మదీయులతో వ్యాపారాదులు చేయరాదని రోమన్ పోప్ (క్రైస్తవలోక గురుపీఠం) నిషేధమును విధించేడు. ఐగుప్తు సుల్తానులు విమతస్థులు తెచ్చిన సరకులపై పన్నులు హెచ్చించేరు. అలగ్జాండ్రియా పతనానికి యివన్నీ కారణములేయైననూ సముద్ర వ్యాపార కేంద్రమైన ఆ నగరంపైన చావుదెబ్బ కొట్టినది ఆట్టోమన్ తుర్కులు. భూమిని నిజమైన దైవ

విశ్వాసులకును (మహమ్మదీయులు), సముద్రాలను అవిశ్వాసులకును (క్రైస్తవులు) ఆ దేవుడే పంచి యిచ్చేడని తురుష్కులు అకారణంగా చెప్పియుండ లేదు! మహమ్మదీయులు ఓడ తట్టుమీద నున్నప్పటి కంటె గుఱ్ఱపుతట్టుమీద వున్నప్పు డెక్కువ ఆత్మవిశ్వాసం గలిగి వుండేవాళ్ళు.

తూర్పు పడమరలను కలుపు మార్గా లన్నీ ఒకటొకటిగా మూయబడిపోయినాయి. కాని, తూర్పు దేశాల సంపదలనుంచి దృష్టిని మళ్ళించుకోడం వర్తకుల కేమంతి సులభం కాదుగదా! ఇటలీ రేవు పట్నాలైన వెనీసు, జినోవాలలో రెండు మహా ప్రవాహాలు, ధన సంపదల ప్రవాహాలు సంగమమయ్యేవి. తూర్పు దేశాలనుంచి వెలలేని రాళ్ళు, మంచిముత్యాలు, సుగంధద్రవ్యాలు, మజిలినులు మొదలైన సంపదల ప్రవాహమున్నూ, పశ్చిమ దిశనుంచి డ్యూకట్‌లు, ఫ్లోరిన్‌లు, రియల్‌లు మొదలైన బంగారు వెండినాణెముల ప్రవాహమున్నూ; తూర్పునుంచి చిత్రవర్ణశోభితములైన పట్టు పుట్టములు; పశ్చిమాన్నుంచి ప్రకాశవంతమైన ఫ్లోరెన్సు వస్త్రాలు; ఈ ప్రవాహాల కన్నిటికీ సంగమ స్థానములు వెనీసు, జినోవా రేవు నగరాలు.

ఏటి పొడుగునా విసుగూ విరామం లేకుండా విశ్రాంతి నెరుగని మానవహస్తాలు అంతకంత కధిక నేర్పుతో కృషి సాగిస్తూనే వున్నాయి. నూలు వడుకుటకు కదురు పోయి, వడుకు యంత్రం, రాటము వచ్చింది; కాలితో త్రొక్కుతూ

నేయు కొత్తమర్గం కనిపెట్టేరు. సరకుల ప్రవాహం, స్వర్ణ ప్రవాహం అంతకంతకు పెద్దవై, అధికతరవేగంతో పరువిడ జొచ్చేయి.

ఈ ప్రవాహాలు వున్నట్టుండి ఒకరోజున యింకి, వట్టిపైపోతే యేమి జరుగుతుందని జనుల మనములలో సంశయాలు కలుగ నారంభించినాయి. మధ్యధరా సముద్రతీర నగరాల్లో వ్యాపారం మందగించవచ్చు; కర్మాగారాలు ఆగిపోయి, వేలగొలది నిపుణకార్మికులు, వారి సహాయులు నిర్వ్యాపారులు కావచ్చు. అప్పుడు బజారులు, సంతలు నిర్మానుష్యంగా వుంటాయి. అంతకుముందు యుగంలో రాజులు వలెనే యిప్పుడు మహాధనికులూ, అత్యధిక శక్తివంతులూ నైన వణిక్ప్రభువులున్నూ ప్రకాశహీనులై, పతనమవుతారు.

వణిక్ప్రభువుల దివ్యభవనాలలో సంచితములై యున్న పురాతన శిల్పఖండాలు, వర్ణచిత్రాలు, అపురూప గ్రంధాలు మొదలైన వన్నీ దురాశాపరులైన పురాతనవస్తువ్యాపారుల చేతుల్లోకి వెళ్ళిపోతాయి. గొప్పచిత్రములు, నగిషీపని చేసిన బంగారు పానపాత్రలు, వెనీసు నగరపు స్ఫటికపాత్రములు, అపురూపమైన వ్రాతప్రతులు మొదలైనవన్నీ వృకోదరులైన యీ వ్యాపారుల చేతుల్లో పడతాయి. ప్రభుత్వ బొక్కసం కూడా వట్టిదైపోతుంది. పన్నులు, విదేశసుంకాల వల్లా వచ్చే రాబడిచే నింపబడేదే కాదూ, ప్రభుత్వ బొక్కసం?

అందుచేత కిరీటధారులైన రాజులూ, కిరీటములు ధరించని వణిక్పుంగవులూ ధనార్జనకూ, తూర్పు దేశాల సంపదల దరిచేరుటకూ ఉపాయాంతరాలను అన్వేషించ నారంభించేరు. ఓడలను సుసజ్జిత మొనర్చి, నౌకాధిపత్యమును తగిన కుశలుర కప్పగించి సముద్రాంతరాలకు పంపేవారు. ఓడల కధిపతులైన కప్తానులతో యిల్లా చెప్పేవాళ్ళు :

"తూర్పు దేశాలకు నూతన మార్గాల నన్వేషించండి! తీరముల వెంబడే పోయి గాని, సరాసరి మహాసముద్రంలోనికే ఓడను పోనిచ్చి గాని చూడండి. తుపానులే రానీ, జలస్తంభాలే అడ్డురానీ, అంధకారమయమైన తారు సముద్రంలోనికే గానీ, భగ్గున మండే భూమధ్యరేఖా మండలానికే గాని, నరక ద్వారంలోనికే గానీ, మరెల్లాంటి కఠినతర పరిస్థితుల్లోనికే గానీ, మీా నౌకలను పోనియ్యండి. గమ్యం దొరకేవరకూ ముందుకే, మున్ముందుకే పోయి, అన్వేషణ సాగించండి!"

సరే, యజమానుల ఆజ్ఞలు శిరసావహించి, విశాల సాగరముల మీాదకు నావికులు తమ ఓడలలో బైలుదేరేవారు.

తుపానులు వచ్చి యెన్నో ఓడలు వినష్టమైపోయేవి. అయిపూ ఆనవాలూ లేకండా జనం నశించిపోయేవారు. అసంఖ్యాక స్త్రీలు భర్తలను గోల్పోయి, విధవరాండ్రై దుఃఖసూచక వస్త్రాలను ధరించి, శోకదేవతలవలె తయారయే వాళ్ళు. కాని, యింకా యింకా ఓడలు అదనపు సాధన సామగ్రితో సహా సాగర గర్భంలోనికి పంపబడుతూనే

వున్నాయి! రాజులు తమ కిరీటములనూ, రత్నాభరణము లనూ, వణిక్ప్రభువులు తమ కడపటి ఆస్తిపాస్తులనూ కూడా కుదువబెట్టి, కొత్తనౌకాదళాలను మార్గాంతరాన్వేషణకై పంపుతూనే వున్నారు.

అందరికీ సముద్రంమీాదికి బోవాలని తహతహగానే ఉండేది. కుర్రాళ్ళు యిళ్ళనుంచి పరుగెత్తిపోయి, ఓడల్లో సరకుల మధ్య దాగుకొని, తమ ఆశలు సఫలమయ్యే ఆ స్వాప్నిక భూమికి పోవ నారాటపడేవాళ్ళు. ఓడ తర్వాత ఓడ అంధకార సముద్రంమీాదికి జిబ్రాల్టరు జలసంధిని దాటి, హెర్క్యులస్ స్థంభాలను దాటి వెళ్లిపోతూనే వుంది.

అట్లాంటిక్ మహాసముద్రానికి వెనీస్, జినోవానగరముల కంటె సమీాపస్థములైన దేశాల రేవు నగరాలూ వున్నాయి. ఈ రేవు నగరాల్లోకూడా జనులు సముద్ర మార్గాన్వేషణలో ఆసక్తి చూప నారంభించేరు. జనులను మహాసముద్రం రా రమ్మని ఆహ్వానిస్తూన్నట్లు కనబడుతూంది. పచ్చబొట్లు పొడిచిన శరీరాలుగల జనులను మోసికొని దోనెలు కొట్టుకొని వచ్చి, అజోర్ దీవులమీాదకి చేరుకునేవి. సరంగులు నీళ్ళ ల్లోంచి, చక్కని నగిషీపని చేసిన కొయ్యముక్కలను తీసేవాళ్లు. అవి యినుము లేకండానే చెక్కబడినట్లు, అతి నిపుణంగా చెక్కబడినట్లు తెలుస్తూనే వుంది. ఏవేవో పేర్లు తెలియని వృక్షాల తాలూకు పెద్ద పెద్ద మ్రానులను జలప్రవాహములు తీరాలకు గెంటుతూండేవి. వాటిలో కొన్ని దోనెలుగా

తొలువబడినవీ వుండేవి. అసీమితమైన యీ మహాసముద్రానికి కూడా ఆవల యేదో తీరం వుండే వుండాలి!

మహాసముద్రాని కవ్వల నున్న ఆ అజ్ఞాతతీరంనుంచి నావికులు తమ దృష్టిని మరల్చుకోలేక పోయావాళ్ళు. ఈ జలవ్యాప్తికి ఆవల నున్న యేదో అదృశ్యశక్తి యీ జనులను ఆకర్షించేది, వారిని సాహసకార్యాలకు పురిగొల్పేది! ఈ సాగరమున కావలి తీరాన్నే వీరికి హిందూదేశపు దేవాలయాలూ, చీనాదేశపు స్వర్ణప్రాసాదాలూ, భావవీధిలో గబగబా తిరిగిపోయావి.

హెర్క్యులిస్ రక్షితమైన ఆ ద్వారం దాటి, మహాసముద్ర జలాల్లోకి యీ రీతిగా దండ్లు దండ్లుగా నౌకలు నిర్గమించుతూనే వున్నాయి.

## 3. మూడు అగ్రాలు

జిబ్రాల్టర్‌ను దాటి కొన్ని ఓడలు కుడివైపుగా, మరికొన్ని ఎడమవైపుగా, యింకా కొన్ని సరాసరియెదురుగా పోతూన్నాయి.

జినోవా ఓడలు కుడివైపుగా, యూరోపు తీరాన్ననుసరించి పోయేవి. అవి ఆంట్వెర్పు రేవువరకూ ఉత్తర భూములకు పోయి, అక్కడి బజారుల్లో తమ సరకులను విక్రయించుకుని, జయప్రదంగా యింటికి మరలి వచ్చేవి.

రెండు జినోవా ఓడల్లో దోరియా, వివాల్డో సోదరులు సరాసరి మహాసముద్రంలోకి పోయేరు. హిందూదేశాన్ని చేరగల మని వారి యాశ. కాని అంధకార సముద్రం వాళ్ళనీ, వాళ్ళ ఓడల్నీ, నావికుల్నికూడా పొట్టను పెట్టుకుంది.

ఇక పోర్చుగీజులు యెడముకు తిరిగేరు. వారి మార్గం కొంత వరకు భద్రంగానే వుండేది. ఆఫ్రికా ఖండపు పడమటి తీరరేఖ ననుసరిస్తూ, బొజోదోర్ అగ్రంవరకూ వెళ్ళేయి, పోర్చుగీజు నౌకలు. ఇక్కడ తుపానులు భయంకరంగా వుంటాయి. భయభీతులై వారక్కడ ఆగిపోయేరు. సముద్రం వారిని బెదిరిస్తూన్నట్లనిపించింది. "ఊఁహూఁ! ఇంక ముందుకి వెళ్ళవద్దు!" అందుచే పోర్చుగీజువారా అగ్రానికి 'వద్దు!' అగ్ర మని (కేప్ నో) నామకరణం చేసేరు.

ఇంకా ముందుకు తోసికొనిపోవడం వారికి ఉపయుక్తమా? కాదా? "ఇంక ముందుకు దక్షిణాభిముఖంగా పోవడం అసాధ్యము. అక్కడ చాలవేడిగా వుండి, జీవితం దుర్భర మైపోతుంది. అక్కడ మొక్కలు గాని, జంతువులు గాని లేవు!" అని టాలమీ కాలాన్నుంచీ పండితులు, విజ్ఞానులూ ప్రకటించేవాళ్లు. ఇంకా దక్షిణంగా వెడితే ఆఫ్రికాతీరం గోడలా లేచి మార్గము నడ్డగించి, దక్షిణ ధృవంవరకూ వ్యాపించివుంటుం దనీ, ఆ మార్గాన హిందూదేశానికి వెళ్ళడం అసాధ్య మనీ వారు వెల్లడించేరు. హిందూదేశానికి వెళ్ళలేక పోతే యిక యీ ప్రయాణానికి ఫల మేమిటి? ఆఫ్రికాను

కనిపెట్టి వెల్లడించడానికి ప్రయత్నించడంలో. యిక అర్థమే లేదు. ఆఫ్రికా అంటే మరేమీ గాదు. తూర్పు దేశాలకు, హిందూదేశానికి బోనీయకుండా పాశ్చాత్యుల మార్గంలో అవరోధంగా నిలబడినట్టి వ్యర్థ నిరర్థక భూఖండం మాత్రమే నని ఆ నాటి పండితులు చెప్పేవాళ్ళు.

ఏదేమైనప్పటికీ కొందరు సాహసులు 'వద్దు' అగ్రమును దాటి ముందుకు బోయిరి. దానితో 'వద్దు' అగ్రమే 'సరే !' అన్నట్లయింది !

వారు దక్షిణదిశగా వెళ్ళి, అత్యుష్ణప్రదేశమైన భూమధ్య రేఖాప్రాంతాన్ని చూచి, టాలమీ చెప్పింది పొరబాటని తెలుసుకున్నారు.

భూమధ్యరేఖాప్రాంత విచిత్రాలను గూర్చి పోర్చుగీజు వాళ్ళు పరిహాసంగా అనేవారట : 'టాలమీ మహారాజా అనుమతితోనే యిదంతా మీతో మనవి చేస్తున్నాము. ఏ దేశములు నిర్మానుష్యమైన యెడారులని ఆయన చెప్పేరో వాటిల్లోనే వేలకొలదీ నల్లజాతుల మనుష్యులు నివసిస్తూ న్నారు; ఆ ప్రదేశాల్లో చెట్లు మహాద్భుత పరిమాణాలకు పెరుగుతాయి !"

దేశపటములమీద మరొక కొత్తపేరు కనబడజొచ్చింది. అదే కేప్ వెర్డి, దీనికి అర్థం 'పచ్చని అగ్రము' అని. టాలమీ పండితుని కథనం ప్రకారం యెక్కడ అంతా కూడా నిర్జీవమైన యెడారిగా, పసిమిరంగుగా వుంటుందని భావించేరో అక్కడ

సమస్తమూ కూడా, భూమీ చెట్లూ కూడా పచ్చగానే వున్నాయి! ఈ పచ్చని అరణ్యమధ్యంనుంచి నూతనాగంతుకుల వైపు యేనుగులు చూస్తూండేవి. ఏనుగుల చర్మము చెట్ల బెరడువలె మోటుగనూ, వాటి చెవులు పెద్ద ఆకులవలె విశాలములుగనూ వుండేవి!

కొంచెం కొంచెంగా ధైర్యం తెచ్చుకుంటూ నావికులు ముందుకు సాగుతూనే వున్నారు. ఆనవాళ్లుగా తీరం పొడుగునా అక్కడక్కడ రాతి స్తంభాల్ని నిలుపుతూ వాళ్ళు ముందుకు పోతూన్నారు. ఆ రాతి స్తంభాలమీద పోర్చుగీజు రాజలాంఛనాల్ని చెక్కిపెట్టేవాళ్ళు. తాము వెళ్ళిన ప్రదేశాలను దేశపటాలమీద శిలువ, జెండాలతో గుర్తు పెడుతూండేవాళ్లు.

మైలు తరువాత మైలుగా యీ శిలువ-జెండాలు దక్షిణానికి జరుగుతూన్నాయి. ఒకదగ్గర హఠాత్తుగా ఆఫ్రికా తీరరేఖ తూర్పుగా తిరిగింది. కాని, అక్కడికి దక్షిణధ్రువం యింకా కొన్ని వేలమైళ్ళు దూరం వుంది! ఇక్కడనుంచి ఆఫ్రికాను చుట్టుతిరిగి వెడితే చాలు, హిందూదేశానికి పోవచ్చును. వాళ్ళు చేయాల్సినదింతే. కాని, అదేమంత సులభంకాదు. వ్యతిరేకపవనాలనూ, తుఫానులనూ యెన్నింటినో వారు యెదుర్కొంటూ ప్రయాణం చేయాల్సి వుంటుంది.

ఇంకా ముందుకు పోయిన ఒక పోర్చుగీజు నౌకాదళం దేశపటంమీద యింకో అగ్రమును కూడా గుర్తుపెట్టేరు. దానికి వాళ్ళు 'తుఫాను అగ్రము' అని పేరు పెట్టేరు.

ఇదివరలో గుర్తించిన వాటన్నిటికంటెనూ దక్షిణంగా వుందిది. కాని, వారుకూడా అది దాటి ముందుకు బోవ నిష్టపడలేదు వారు అక్కడినుంచి తిరిగి వెనక్కి పోయేముందు ఆ నౌకాదళ నాయకుడు బార్థొలోమ్యూ దియాజ్, అక్కడ తాము నిలిపిన స్మారక శిలా స్తంభమునకు జేరగిలబడి, చాలసేపు ఆలోచనా ధీన మనస్కుడై ఉండిపోయేడు. పోర్చుగీజు రాజలాంఛనములను చెక్కిన ఆ శిలా స్తంభమును వదలిపెట్టి పోవడమంటే యెవరో ఆత్మబంధువును వదలిబోతూన్న ట్లనిపించిం దాతనికి. అక్కడి నుంచి తూర్పుదిశకు, హిందూదేశ తీరములకు తన ఓడను నడుపక, వెనుకకు తిరిగి పోవాల్సివస్తూందే యని ఆతని విచారం.

ఈ అగ్రమునకు 'తుపాను అగ్రం' అనే పేరును తొలగించి 'సదాశా అగ్రం' (కేప్ ఆఫ్ గుడ్ హోప్) అను పేరు బెట్టమని పోర్చుగీజు రాజు ఆజ్ఞాపించేడు. ఇంక యిప్పుడీ అగ్రం తమ పురోగమన మార్గంలో ఆటంకంగా నిలవదని వారు భావించజొచ్చేరు.

సంవత్సరాలు గడుస్తూన్నాయి. మానవుని ఆశలు ఫలోన్ము ఖములయే తరుణం యేతెంచింది. వాస్కో-ద-గామా ఆధి పత్యాన ఒక నౌకాదళం ఆఫ్రికాను చుట్టుతిరిగి, యెదురు గాలులనూ, బలమైన ప్రవాహాలనూ యెదుర్కొంటూ తూర్పుదిశగా ప్రయాణం సాగించింది. ఎట్టకేలకు నావికులు దిఙ్మండలంమీద తీరరేఖను, పర్వతశ్రేణులను చూచినపుడు

వారి సంతోషానికి హద్దులే లేకపోయినాయి. అదే మలబారు తీరం, హిందూదేశములోనిది! తరువాత అనతికాలంలోనే పోర్చుగీజు ఓడలు హిందూదేశపు ఓడలరేవు 'కలకత్తా'లో* లంగరు దించినవి. ఈ ప్రయాణమునుగూర్చి వాస్కో ద గామా అనుయాయులలో ఒకరు యిల్లా వ్రాసేరు.

"1497 లో పోర్చుగీసు రాజు ఎమ్మాన్యుయల్ నాలుగు ఓడలను సంసిద్ధం చేసి, హిందూదేశము నన్వేషించడానికిన్నీ, సుగంధద్రవ్యములను తెచ్చుటకును పంపేరు. ఈ నౌకాదళానికి అధిపతి వాస్కో-ద-గామా. 1497 జూలై 8 వ తేదీ ఆదివారం రోజున మేము లంగరుల నెత్తుకొని, రాస్టెల్లో నగరంనుంచి బైలుదేరేము. పరమప్రభుని పేరున బైలుదేరిన మా యాత్ర జయప్రదమగుగాక! అని ఈశ్వరునికి ప్రార్థనలు సల్పి బైలుదేరిన మేము 1498 మే 17 న తిరిగి భూదర్శనము గావించేము. కాళికట్టు రేవుపట్టణమునకు మా ఓడలు చేరినాయి. మా అధిపతి మాలో నొకణ్ణి పట్టణంలోనికి పంపించేడు. అక్కడి వారు మా మనిషి చెప్పేది తెలియక, ట్యూనిస్ దేశీయులైన యిద్దరు మూరుల దగ్గరకు ఆతనిని తీసికొని వెళ్ళేరు. ఆ మూరులకు జినోవా భాష, కాస్టిలియన్ భాష కూడా వచ్చును. వారు మాట్లాడిన మొదటిమాట లేవంటే, "నిన్ను

---

* ఈ రేవు 'కాలికట్టు' గాని 'కలకత్తా' కాదు. వీటి పేర్లలోని సామ్యమునుబట్టి విదేశీయులు పొరబడిరి. దీని అసలుపేరు 'కొళికోడు' మలబారులో యిక్కడే ప్రప్రథమంలో వారు దిగింది.

యిక్కడికి యే పిశాచాలు తీసికొనివచ్చేయి?" అని. కాని, ఆ తరువాత వా రాతనిని స్వదేశాన్నుంచి యింతదూరం రా గారణ మేమని అడిగేరు. ఆతడుకూడా 'సుగంధద్రవ్యముల కోస' మని జవాబు చెప్పేడు.

"కాలికట్ రాజుగారు మా నౌకాదళాధిపతి వాస్కో-ద-గామాకు దర్శన మిచ్చేరు. అతి సుందరమైన సింహాసనం మీద, హంసతూలికా తల్పములపై కూర్చుని వున్నారు. రాజుగారు. మా రాజున కొక లేఖను తాటియాకుమీద వ్రాయించేరు. ఆయన. 'మీ దేశపు కులీనవంశజుడైన వాస్కో-ద-గామా మా దేశమునకు వచ్చినందులకు చాల సంతసించితిమి. మా దేశంలో దాల్చిన చెక్క, లవంగములు, మిరియములు, అల్లం మొదలైన వన్నీ పుష్కలంగా వున్నాయి. వజ్రములు, వైడూర్యములు మొదలైన వెలగల రాళ్ళుకూడా సమృద్ధములుగా నున్నాయి. వాటికి మారుగా మీ నుంచి వెండిబంగారములు, ముత్యములు, యెరుపుగుడ్డ కావాలి, మాకు."

"1498 ఆగస్టు 29 ని మేము వచ్చిన పనులు పూర్తిచేసుకుని, స్వదేశాభిముఖులమై అధిపతి ఆజ్ఞానుసారంగా బైలుదేరేము. మేము సాధించిన దానితో సంతుష్టులమై స్వదేశానికి పోతూన్నందుకు సంతోషముతో వుంటిమి. ప్రాక్పశ్చిమదేశాలన్నిటిలోనూ, పోర్చుగల్ మొదలగు దేశాల్లో జనులు కొనియాడుచుండు సుగంధద్రవ్యాలన్నిటినీ కాలికట్‌నుంచి

మాతో తీసికొని పోతూన్నాము. గాలి ఆడకపోవడంవల్ల సముద్రంమీదనే మూడు మాసాలు గడపవలసివచ్చింది. పైగా వ్యతిరేకపవనాలు కూడా మాకు అవరోధం కలిగించినాయి. తిరుగుప్రయాణంలో మా నావికులందరూ తీవ్రంగా జబ్బుపడ్డారు. మా యిగుళ్ళు బాగా వాచి, ఉబ్బిపోయి, పళ్ళను కప్పివైచి, నోరంతా ఆక్రమించేయి. మే మెవ్వరమూ ఆహారమునే నోట బెట్టుకొనజాలకుంటిమి...

"మా తిరుగుప్రయాణంలో ముప్పదిమంది చనిపోయేరు. బైలుదేరడానికి పూర్వం ముప్పది మంది చనిపోయేరు. ఆఖరుకి ఓడమీద పనిచేయడానికి తగిన స్థితిలో వున్నవాళ్ళు ఆరేడుగురు మాత్రమే మిగిలేరు; వాళ్ళయినా బాగున్నారని చెప్ప లేము...అన్ని ఓడలకూ కావలసిన జనం లేరాయిరి..."

ఈ కథనం హఠాత్తుగా యిక్కడ ఆగిపోయింది. అందువల్ల యీ లేఖకుడు కూడ తన జన్మభూమినుంచి బహు దూరంలో యెక్కడో చనిపోయి వుంటాడని ఊహించవచ్చును.

పోర్చుగీజులు యూరోపునుంచి హిందూదేశానికి సముద్ర మార్గాన్ని కనుగొన్నారు కాని, బహు విశాలమైన అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటినవాళ్ళు మరొకరు పోర్చుగీజు నౌకలు మెల్లగా ఆఫ్రికా ఖండాన్ని చుట్టి ప్రయాణం చేస్తూంటే, మరొక ప్రక్క స్పెయిన్, ఇంగ్లాండు దేశీయులు పశ్చిమాభిముఖంగా తమ నౌకలను పంపుతూన్నారు. భయంకరమైన అంధకార సముద్రంగుండా ప్రయాణం చేస్తూన్నప్పుడు వారు,

తాము సరాసరిగా హిందూదేశానికే పోతున్నా మనుకొంటూండేవారు!

నౌకా దళాధిపతులు తమ ఓడలమీదికి అనుభవజ్ఞులూ, పరోధికులూ ఐన నావికులను జెనోవా, వెనీసు నగరముల నుంచి తీసుకుంటూండేవాళ్ళు. మహాసముద్రాలను జయించా



క్రిస్టాఫర్ కొలంబస్

ల్సినవాళ్ళకి తగిన శిక్షణ నిచ్చే స్థలం మధ్యధరా సముద్రమే. క్రిస్టాఫర్ కొలంబస్ అనే జెనోవా నావికుడు స్పెయిన్ దేశానికి వెళ్ళి, కాస్టిల్లీ, లియోన్ నగరముల కధిపతియైన రాజును సందర్శించేడు. అల్లాగే వెనీసు నావికుడైన గియోవన్ని కబోటో ఇంగ్లాండుకు పోయి, బ్రిస్టల్ నగరంలో

ఓడల కంపెనీ స్థాపించేడు. స్పెయిన్ రాజు కొలువులో కొలంబస్, అడ్మిరల్ దాన్ క్రిస్టోబల్ కొలోన్ * అయేడు. ఇంగ్లాండులో కబోటో తన్ను మిస్టర్ జాన్ కాబొట్ అని పిలుచుకొనేవాడు.

వీరిలో ఒకడు మహాసముద్రాన్ని తరించి, పడమటి ఇండియా దీవుల వరకూ పోయేడు. ఆ తరువాత కొద్దియేండ్లలోనే రెండోవాడు ఉత్తర అమెరికాను కనుగొన్నాడు. మానవజాతి యీ రెండు తేదీలను చిరకాలం జ్ఞాపకం ఉంచుకొంటారు. ఈ మార్గదర్శకుల వెనువెంటనే యితరజనులనేకులు కొత్త ప్రపంచానికి ధారావాహికంగా వెళ్ళేరు.

## 4. మహాబలుడొక నూతన ఖండాన్ని కనుగొంటాడు.

మహాబలుడైన మానవుడొక పెద్ద అంగ వేసేడు. అతని పాదం అమెరికా సమీపమందున్న పడమటి ఇండియాదీవుల్లో పడింది. ఒక దీవినుంచి యింకో దీవికి అంగలు వేస్తూ, యీ మహాబలుడు ఆమెరికాఖండం చేరుకున్నాడు. తీరం వెంబడే నడుస్తూ, అరణ్యములు, పచ్చిక మైదానములతో నిండిన

---

* నామవాచకములు కూడా ఆ యా భాషల్లో రూపాంతరం పొందుతూనే వుంటాయి ఒక్కొక్క దేశీయులొక్కొక్క స్వరాన్ని పలుకలేరు, కొన్ని స్వరాల్ని తరచుగా వాడుకుంటారు. దీన్ని బట్టే ఆ యా దేశాల్లోని, ప్రాంతాల్లోని భాషాభేదాలు ఏర్పడినవి. మనం శ్రీ యనీ, ఆంగ్లేయులు మిస్టర్ అనీ, ఫరాసులు ముష్యూర్ అనీ ప్రతి నామవాచకానికీ ముందు వాడినట్లె పోర్చుగీసువారు దాన్ అని చేరుస్తారు.

మహా విశాలభూఖండాన్ని గాంచి సంతుష్టుడయేడు. అతని ముందు కొత్తప్రపంచం వుంది. తాను చూచిన పాతప్రపంచం కంటె యిది అన్నివిధములా విభిన్నమైనట్టిది!

ఇక్కడ మహానదులు మెలికలు తిరుగుతూ ఆదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్య ప్రదేశాలలో ప్రవహిస్తూన్నాయి. మహావృక్షముల మొదళ్ళూ, ఆకు జొంపములూచే యేర్పడిన సొరంగములగుండా నదీ జలములు పొంగులు వారుతూ సుడులు చుట్టుకొని పోతూన్నాయి. మహోన్నత వృక్షపంక్తులపై సన్నని లతిలు, పసరిక నాచుతీగెలు జాలరుల వలె వ్రేలాడుతూ అలంకరిస్తూన్నాయి. దట్టమైన ఆ ఉష్ణ మండలారణ్యములు నదిని తమ కౌగిటిలో నలిపేస్తూన్నాయి. కాని, ఆఖరికి నదే జయం గాంచింది. అరణ్యప్రాంతాన్నంతనీ నీటితో ముంచి జలమయం గావించేసింది. శతాబ్దాల వయసు గల మహావృక్షాలు కూడా కూకటివ్రేళ్ళతో సహా పెల్లగించ బడి, పూతికపుల్లలవలె అటునిటు ఖేలనగా విసరివేయబడీవి, నదీజలములచే!

నదీ ముఖద్వారం అక్కడికింకా వందలకొలది మైళ్లుంది. కాని, సముద్రపు పాటుపోటులు యింత దూరంవరకూ వ్యాపిస్తూన్నాయి. సముద్రం చాల దూరంవరకూ నదిలోనికి తన కెరటాల్ని పంపుతూంది. కాని, నదికూడా సముద్రుని అప్పు అట్టేబెట్టుకో లేదు. నదీముఖద్వారంనుంచి చాల దూరం వరకూ సముద్రంలో కూడా నదీప్రవాహం తగులుతూనే

వుంటుంది. తీరానికి రానక్కరలేకుండానే నౌకలు సముద్రంలోనే యీ నదుల మంచినీటిని పీపాల్లోకి పట్టుకోవచ్చును!

ఈ కొత్త ఖండపు ఉత్తరభాగంలో చాలా పెద్ద సరస్సులున్నాయి. అవి రాక్షస కంకాళాల్లా వున్నాయి. ప్రపంచంలోకల్లా పెద్దదైన జలపాతం ఒకటి మేఘనిర్ఘోషంతో యీ సరస్సులోనే పడుతూంటుంది.

మహాబలుడు యీ నూతన ప్రదేశాల్లో సంచరించేడు.

మేఘమండలాన్ని దాటిన పర్వతశ్రేణులు; మహోన్నతములైన ఓకువృక్షాలకు నాలుగింతలున్న వృక్షజాతులు యీ పర్వతశ్రేణులమీద, చరియలపైన పెరుగుతూన్నాయి. వేల సంవత్సరముల వయస్సుగల మహావృక్షము లెన్నో అక్కడ వున్నాయి.

మహాబలుడు యింకా ముందుకు బోయేడు. రాకాసి నాగలితో దున్నిన చాలువలె కనిపించే కొండ కనుమదగ్గరకు వచ్చేడు. పైనుంచి చూస్తే కనుమక్రిందికి ఒక మైలు లోతుంది. కనుమలోనుంచి ప్రవహిస్తూన్న నదీప్రవాహం నీకు కనబడడమే కష్టం!

మహాబలుడు వేస్తూన్న ప్రతి అడుగుకూ బెదరిపోయి, యెగురుతూన్న పక్షులు ఆకాశాన్ని కప్పివేస్తూన్నాయి. వాటి నంతవరకూ మానవమాత్రుడు బెదిరించనేలేదు. పెద్ద పెద్ద మూపురాలుగల బైసనులు (అడవిదున్నలు) అతని చుట్టూ

మూగుతూంటే, కర్రలూ, రాళ్ళతో వాటిని తరుమవలసి వుండేది!

మహాబలుడైన మానవుడు ముందునకే మున్ముందునకే పోయి, యీ నూతన ఖండాన్నికూడా స్వాధీనం గావించుకొంటూన్నాడు.

## 5. కనుగొన్నందుకు మూల్యం

మనం 'మహాబలుడు' అంటున్నాము. కాని, యీ యేక వచనప్రయోగంవల్ల ఒక్క వ్యక్తి అనుకోకండిసుమా! దీనికి అర్థం మానవసంఘం అంతాననే. మనం వెనుకతిరిగి గత చరిత్రలోనికి పారజూచినట్లైతే కనబడే దేమిటి? అరణ్యాల్లోనూ మైదానాల్లోనూ, పర్వతగుహల్లోనూ యెందరెందరో మహా సాహసులూ, ధైర్యశాలురూ, మేధావంతులూ, ఉపాయ శాలురూయైన మానవుల సమూహాలు చెదురు చెదురుగా వుండడం చూస్తాం.

చరిత్ర కందని ప్రాచీనజాతుల విషయం అల్లా వుంచండి. ప్రాచీన గ్రీకుల నటుంచండి. కేవలం యిటీవలి వారని చెప్ప దగిన వారిలో కూడా యెందరో మహాపురుషులు కనబడతారు. అడుగో! గొంజాలో పైజ్జారో! అతడు దక్షిణ అమెరికా లోని ఆండిస్ పర్వతాల మీాద, హిమాచ్ఛాదిత శృంగముల మీాదకు తన బృందమును నడిపించుకు పోతూన్నాడు. అంతా

మంచుమయం. మంచు మెట్లనే మెల్లగా యెక్కుతూ పోవాలి, వారు. కాని, వాళ్ళు వెనుదీయకండా ముందుకు సాగుతూనే వున్నారు. తూలి పడిపోకండా చేతులు బారజాచి, తూకం నిలుపుకుంటూ నడుస్తూన్నారు. మహోన్నతమైన ఆ ప్రదేశాల్లో వాతావరణం అతి పల్చగా వుంటుంది. ఊపిరిపీల్చడమే కష్టం! ప్రాణులు ఉక్కిరి బిక్కిరై పోయి, ప్రాణవాయు ప్రసారం లేక రక్తప్రవాహం నిలిచిపోతుంది; బలం క్షీణించి, స్మృతితప్పిపడి, చనిపోతారు. పైజ్జారో తన అనుచరు లొక్కరొక్కరుగా స్మృతి విహీనులై పడిపోవడం చూస్తూనే వున్నాడు......

మరొక దృశ్యం...క్వెసాడా అదుగో! దక్షిణ అమెరికా లోని గహనారణ్యాలలోంచి అతను తన బృందంతో దారి చేసుకుంటూ సాగిపోతూన్నారు. అడుగడుగునా వారు అల్లిబిల్లిగా అల్లుకున్న తీగెలు తగుల్కొని, కాలుజారి క్రింద పడిపోతూన్నారు; పైన క్రిక్కిరిసివున్న కొమ్మరెమ్మలు, ఆకు లలములు వాళ్ళని ఊపిరాడనీకండా ఉక్కిరి బిక్కిరి చేసేస్తూ న్నాయి; రాత్రింబగళ్ళు వారిని విషసర్పాలూ, సాలీళ్ళూ, కందిరీగలూ మృగాలూ ముట్టడిస్తూనే వున్నాయి; ఇక చీములు, దోమలు, విషకీటకాలూ పెట్టే బాధ చెప్పనే అక్కరలేదు! ప్రతి ముందడుగూ అమానుషశ్రమనూ, బాధనూ కలిగిస్తూనే వున్నాయి. వీటికితోడు చెట్లమాకుల్లోంచి దారిని నరుక్కుంటూ పోవాల్సిందే!

మహా పర్వతశ్రేణులు, గహనారణ్యా సీమలు, – వీటితో పోలిస్తే యీ మానవులు యెంత అల్పంగా కనిపిస్తారు! పర్వతాల ప్రక్కగా, మహావృక్షాల క్రిందుగా నడిచిపోతూంటే మానవుని అల్పత్వం, వామన అవతారం మనోగోచర మవుతుంది. కాని, యీ వామనులే యెంతటి బ్రహ్మాండమైన బలాన్ని దార్ఢ్యాన్ని ప్రదర్శిస్తూన్నారు! తాము సాధించ దలచిన పనిని పూర్తిచేసేందుకు యీ మానవులు యెంత ధైర్యం, సహనం, పట్టుదల, తెలివి చూపుతున్నారు!

స్పానిష్ అన్వేషకు లిద్దరు, – పాన్ఫిలో దీ సర్వాయెజ్, కబెజో దీ వాకా అనువార లిద్దరు ఫ్లోరిడా ప్రాంతారణ్యాము లను ఛేదించుకొని మెక్సికో అఖాతపు తీరానికి చేరుకొన్నపుడు తమ ఓడలు వెళ్ళిపోయినట్లు తెలుసుకున్నారు. వేలమైళ్ళ దూరంలో, మహారణ్యాలలో తాము ఒంటరిగాళ్ళుగా, నిస్సహాయులుగా దిగబడిపోయినప్పుడు వాళ్ళు భయపడలేదు. సముద్రమును తరించేందుకు సాధనములు వాళ్ళదగ్గర యేమీా లేవు. కాని, దాదాపు రిక్తహస్తాలతోనే వాళ్ళు ఒక పడవను కట్టడానికి పూనుకున్నారు. ఓడను కట్టడం సాధ్యంగాదు గనుకనే వాళ్ళు చిన్న తెరచాప దోనెను తయారుచేయ దలచేరు!

వాళ్ళదగ్గర పరికరా లేమీా లేవు. చేగొడ్డలి, సుత్తి, మేకులు మొదలైన వేవీ వాళ్ళదగ్గర లేవు. తమ బూట్లనున్న ముళ్ళు, గుర్రపుజీనుమీాద నున్న రికాబులు, తమ సామాన్లలో నున్న

యినుపముక్కలు అన్నిటినీ తీసి పోగులు పెట్టేరు. వాట్లని మూసలో వేసి, అగ్నిని తిత్తితో ఊదనారంభించేరు. అగ్నిని వూదడానికి తిత్తుల్ని లేడి చర్మంతో తయారు చేసేరు. ఇనుమును కాల్చి, కొట్టి, సుత్తినొకదాన్ని యెల్లాగో తయారు చేసేరు! మరికొంత యినుముతో మేకులు, బందులుకూడ తయారు చేసేరు. ఇంక తెరచాపలు; తమ చొక్కాలు చించి, ఆ గుడ్డతో తెరచాపల్ని తయారుచేసేరు. పడవ(తాళ్ళు కావాలిగదా. దానికోసం యేవో కొన్ని అడవితీగలు తెచ్చి పగ్గాలుగా పేనేరు. ఆఖరి కెల్లాగైతే నేమి పడవను పూర్తిచేసి, బాహాటమైన మహాసముద్రంమీాదికి బైలుదేరేరు!

రాబిన్‌సన్ క్రూసో కథ విన్నారుకాదూ? అతడుకూడా వీళ్ళ దగ్గిరనుంచి నేర్చుకోవలసింది బోలెడు వుందిగదూ?

మహాబలుడైన మానవుడు యీా నూతన భూఖండంమీాద సాహసంగా, ఆశాపూరితుడై పరిభ్రమించ నారంభించేడు. కాని, ప్రతి చిన్న విజయమూ ఒక్కొక్క వ్యక్తికి యెంతెంత శ్రమ, కష్టం కలిగించిం దనుకున్నారు!

ఉష్ణమండలారణ్య ప్రదేశాల్లో తేమకి అతడి కవచం త్రుప్పుపట్టి, రాలిపోయేది. చిత్తడి నేలల్లోని పొగమంచు అతని శిరోవేష్టనాన్నీ, ఉడుపుల్నీ చీకబెట్టేసేది. అరణ్య భూముల్లో విషసర్పా లాతనిని బాధించేవి. నదీ జలములలో మొసళ్లు అతన్నిపట్టి పల్లార్చేవి.

క్రూరమృగాల బారినుంచి రక్షించుకోడానికై జనులు చెట్లనుంచి వ్రేలాడుతూన్న ఊయల తొట్టెల్లో నిద్రించవలసి వచ్చేది. పోనీయంటే చెట్టుమీదా వాళ్ళకి రక్షణ ఉండేది గాదు. జాగువార్‌లు అనబడే అమెరికా పులులు చెట్ల నవలీలగా యెక్కగలవు. ఎందరో జనులు తిండి దొరక్క నానాతిప్పలూ పడి, శుష్కించి చనిపోయివాళ్ళు. తిండిలేక మాడిపోతూ, ఆకలిక తాళజాలక వాళ్ళ నడుము పటకాలు, కాలిజోళ్ళు తీసి, వాటి చర్మాన్ని ఉడక బెట్టుకుని నమిలేవాళ్లు!

అంతేగాదు. ఈ ఆంగతుకులు అమెరికాఖండంలో అదివరకే నివసిస్తూన్న మనుష్యుల్ని చూసేరు. వాళ్ళతో యీ నూతనులు పోట్లాటలకూ, యుద్ధాలకూ దిగేరు. కొత్త ప్రపంచంలోని నదీ తీరాల వెంబడే తుపాకి కాల్పులూ, ఫిరంగి చప్పుళ్ళూ చెలరేగినాయి. అచ్చటి మైదానాల ప్రశాంతత భంగమైపోయింది. పూర్వనివాసులు విషదిగ్ధము లైన బాణాలతో నూతనాగంతుకులను పరామర్శించేవాళ్లు.

అచ్చటి పాతకాపులకు దినాలు బాగుండలేదు. వాళ్ళకు కష్టకాలం వచ్చింది. స్పానిష్‌వాళ్ళు అమెరికాల్లో నివసిస్తూన్న 'ఇండియను'లను మానవులుగా పరిగణించే వాళ్ళేగారు. అప్పటికి అక్కడ గుర్రాలు లేవు. అశ్వారూఢులైన స్పానిష్ వాళ్ళని చూసి మొట్టమొదట యిదేదో దేవతా విశేషం అనకొనేవారట, అక్కడివాళ్ళు. పశు, మానవరూపాలు కలిసిన దేవతలనీ, వీళ్లు రెండుగా కాగల శక్తిగలవారనీ

'ఇండియనులు' భ్రాంతి చెందేవాళ్లు. గుర్రం దిగిన మానవుణ్ణి చూసినప్పుడు వాళ్ళలో కలిగిన భావం యీ దేవత రెండుగా విడిపో గలదని!

యూరోపియనులు ఎర్ర యిండియనులనే భారవాహక జంతువులుగా ఉపయోగించ నారంభించేరు. ఫిరంగి బండ్లను లాగడం, భారమైన ఓడ లంగరులను, పడవ సామానులను మోయడం, భూమిని దున్నడం, కట్టెలు కొట్టడం, గనులు త్రవ్వి వెండిబంగారాల నెత్తడం,— ఒకటేమిటి, సమస్తవిధాల బండచాకిరీలనూ యిండియనులచేతనే చేయించుకునేవాళ్లు, స్పెయిన్ వాళ్లు. ఏమాత్రం అవిధేయత చూపినా, వాళ్ళను అతి క్రూరంగా, అమానుషంగా దండించేవాళ్లు. ఎర్ర యిండియను గ్రామాలు తగులబెట్టి, వాళ్ళను కుక్కల నుసికొల్పి వేటాడి, బ్రతికివుండగానే చితులమీద కట్టేసి కాల్చేవాళ్లు, యూరోపియనులు.

స్పెయిన్ వాళ్లు తమతో కూడా భయంకరమైన బుల్ డాగ్ (కుక్క) లను తీసికొని వచ్చేరు. మానవుల్ని వేటాడ్డం ఆ కుక్కలకి నేర్పేరు. యజమాని సైగచేయడంతోనే యీ బుల్ డాగ్ లు యిండియనుల మీది కురికి, గొంతుముడి దొరికించుకుని, పీకేసేవి. పాపం, ఆ నిర్భాగ్యమానవులు కాలుచేతులు కొట్టుకుంటూ గింజుకున్నకొద్దీ కుక్కలు భీకరంగా కరిచేసేవి. వాళ్ళ ఆర్తనాదాలు, అరుపులు, యేడ్పులు వినీ, చూసీకూడా స్పానిష్ వాళ్లేమీ జాలిపడేవాళ్ళుగాదు.

ఇండియనుల చావు కేకలు, మూలుగులు వినీ, చూసే ఆ రాక్షసులు విరగబడి నవ్వేవాళ్లు; అంతే! ఇదేమీ కొత్త విషయం కాదులెండి. మానవజాతి చరిత్రలో ఒకజాతి మరొక జాతిని హింసించడం, ఒక మతం మరొక మతాన్ని బాధించడం సర్వత్రా వుంటూనే వచ్చింది. ఇటలీ దగ్గరలో నున్న కార్సికా ద్వీపంమీది మనుష్యుల్ని పూర్వం రోమనులు సరిగ్గా యిల్లాగే కుక్కలతో వేటాడేవాళ్లు. కాని, రోమనుల కంటె స్పానిష్ వాళ్లు మరింత ఘోరంగా, పైశాచికంగా ప్రవర్తించేరని చెప్పక తప్పదు.

కొల్లగొట్టిన సంపదలను పంచకంలో సైనికులతో బాటు కుక్కలకుకూడా వాటా పెట్టేవారు 'లియెన్‌సికో' అనే పేరు గల సుప్రసిద్ధ శునకం తన యజమానికి వేయి ఫ్లోరిన్సు సంపాదించి పెట్టింది. మంచి గురిగల సైనికుడు కూడా తన తుపాకీతో సహా, ఆ మాత్రం సంపాదించ లేకపోయినాడు.

మానవ చరిత్రలో అత్యంత స్తవనీయమైన ఘట్టము యీ రీతిగా రెడ్ యిండియనుల రక్తంచే, కుక్కలచే చీల్చబడిన మానవుల రక్తంచే ప్లావితమై, కళంకితమైపోయింది. కాని, మానవత్వాన్ని ఉన్నతశిఖరాలకు గొంపోయే యితివృత్తాలకూ, ఉదాహరణలకూ కూడ యీ ఘట్టంలో కొదువలేదు. మానవునికి గౌరవము నాపాదించేవి యీ చరిత్రలే గదా. మొదటి యూరోపియన్ వలసదారుల్లో కూడా యిట్టి రాక్షస కృత్యాలను సహించనివాళ్లు, యీ పైశాచికత్వాన్ని యెదిరిం

చిన వాళ్లు కొందరు మహాజనులు లేకపోలేదు. మానవతకే సిగ్గుచేటైన యీ ఘోరాల్ని వారు యెదిరించేరు, యెన్ని యిబ్బందులు పడినా.

ఫెర్నాండో మోంటిసినోస్ అను పరివ్రాజకుడు తన బోధనా ప్రసంగాల్లో నిరంతరమూ యీ నరరూప రాక్షసులనూ, వాళ్ళ పైశాచికకృత్యాలనూ ఖండిస్తూనే వుండేవాడు. దుర్మార్గులెంద రెంత బెదరించినా ఆయన భయపడేవాడు గాడు. ఆ మానవోత్తముడు నిర్భీకుడై, ఉన్నతశిరస్కుడై మానవతను చాటుతూ నిలబడ్డాడు. లాస్ కాసాస్ అను రాజకుటుంబీకుడున్నూ తన యావజ్జీవితాన్ని ఎర్ర ఇండియనులను కాపాడడానికే వినియోగించేడు.

ఏ నూతన విషయాన్ని పరిశోధించేందుకూ, కనుగొనేందుకూ మానవులు అత్యధిక మూల్యాన్ని చెల్లించాల్సి వస్తూందని మానవచరిత్ర ఋజువు చేస్తూంది. అమెరికా ఖండాన్ని యూరోపియను జాతులు కనుగొన్నాయి. పాత క్రొత్త ప్రపంచాల్లోని మానవులు అపారపారావారమైన అంధకార సముద్రాన్ని తరించి, ఒకరినొకరు కలుసుకొన్నారు. కాని, దీనికి కూడా యెంతో కొంత మూల్యమును చెల్లించాల్సిందే. అమెరికా ఖండాల్లో అతఃపూర్వం నివసిస్తూ వుండిన ఎర్ర యిండియనులూ, నూతనాగంతుకులైన యూరోపియనులూ కూడ తమ రక్తమును ధారపోయవలసివచ్చింది, అమెరికా–యూరోపు ఖండాలకు సంబంధం యేర్పరచినందుకు.

మానవర క్తపు  టేరుల్లోంచి సాగింది,  అమెరికాను  కనిపెట్టిన వారి కృషి !  తమ  జీవితములు  దుర్భరములై పోయినందున ఎర్ర  యిండియను  గ్రామాలకు  గ్రామాలే  సామూహికంగా ఆత్మహత్యలు  గావించుకొన్నాయి.  నూతన  ఖండ  ప్రవేశం యూరోపియను  జాతులకున్నూ  అంత  సుఖకరంగా  వుండనే లేదు. అసంఖ్యాకులు ఉష్ణమండల  వ్యాధులచే మరణించేరు. ఎందరో విషదిగ్ధబాణములచే కూడిసేరు. ఇంకెందరో వధ్యశిలల మీాదా, ఉరికంబాలమీాదా ప్రాణాలు విడిచేరు. ఎంద రెందరో తమలో తాము కలహించుకుని చనిపోయేరు.

నూతనాగంతుకులు  తమలో  తాము  యే  పోరుపులూ లేకండా వుండగలిగేరా ? అబ్బే ! అదీ లేదు. పురుగులు పట్టిన బిస్కట్లు తినలేకనూ, తుఫానులతో నిరంతరం పోరాడలేకా, జన్మభూమి,  జననీజనకులు,  దారాపుత్రాదులమీాదా  మనసు పోయీా నావికులు తిరుగుబాట్లుచేసి,  తమ  అధికారులను  ఓడ మీాది చీకటిగదుల్లో బంధించేవాళ్లు.  ఈ  తిరుగుబాటు  సణచి వేయగలిగితే  అధికారులే  తిరుగుబాటుదార్లను  తెరచాప కొయ్యలకు వ్రేలాడదీసీ,  నిర్జనద్వీపాలమీాద ఒంటరిగా వదలి పెట్టి పోయీావాళ్ళు.

విజేతలు నిర్మించిన పట్టణాల్లో అధికారం కోసం,  లాభాల కోసం తీవ్రమైన స్పర్ధలు, క్రూరమైన పోరాటాలు పెచ్చరిల్లేవి. తా నొకప్పుడు కనిపెట్టిన  మార్గంలోనే  క్రిస్టోఫర్  కొలంబస్ శృంఖలాబద్ధుడై  స్పెయిన్ కు  గొంపోబడ్డాడు.  వాస్కో—

న్యూ నెజ్ దీ బాల్బోవా, పసిఫిక్ మహాసముద్రాన్ని చూచిన ప్రప్రథముడు. ఆయనకు మరణశిక్ష విధించేరు. తాను కనిపెట్టిన నూతన భూమిపైననే యీాయన శిరస్సు దొరలింది.

ఎన్నెన్నో కష్టాలు, అపాయాలు, ప్రమాదాలు మెడకొకాకా వాలని తెలుసుకొనికూడా యీ నూతనఖండానికి ప్రయాణమై పోతూన్న జనుల నాకర్షిస్తూన్న దేమిటి చెప్మా? దీపశిఖకు శలభములు ఆకర్షించబడినట్లుగా లేదా, యిది? కొత్త ప్రపంచంలో బంగారం దొరుకుతుందని విని, యూరోపునుంచి అసంఖ్యాకులు మహాసముద్రాన్ని తరించి యిక్కడ వ్రాలుతూన్నారు. దక్షిణ అమెరికాకు స్పెయినువాళ్ళు బంగారం కోసం, వెండి కోసం యెగబడ్డారు. వాళ్ళు తయారుచేసిన దేశపటాల్లో బంగారు దొరకని స్థలాలను మరుభూములుగా, యెడారులుగా, చిత్రించేవాళ్ళు! అమెరికా ఉత్తర భాగంలో ఇంగ్లీషు, ఫ్రెంచివాళ్ళు యీ 'మరుభూముల' నే ఆక్రమించుకుని, అక్కడి అడవుల్లో దొరికే జంతువుల చర్మాలను తీసికొనిపోయి, బంగారునకే వీటిని యూరోపు మార్కెట్లలో విక్రయించేవాళ్ళు! మార్గాలు తెలియాలే గాని సంపదలు దొరకని చోట్లు యీ భూమండలంమీద లేనేలేవు గదా?

ఎందరో జనులు మరుమరీచికల్లో జలాలను, శశవిషాణాలను అన్వేషిస్తూ, వేలగొలది మైళ్ళ ప్రయాణాలు గావించేవాళ్ళు. తమ భ్రమల్లోనూ, జన ప్రవాదల్లోనూ తప్ప యదార్థ ప్రపంచంలో అస్తిత్వం లేనట్టి సంపదలకోసం పడరాని

పాట్లుపడి, పోరానిచోట్లకు పోయి వెతికేవాళ్ళు. యీ మానవులు. కాని, యీ వృథాన్వేషణలో ఎందరి ప్రాణాలో పోయినా, అనుకున్న సంపదలు లభించకున్ననూ, యెదురు చూడని ఫలితాలు యెన్నో సమకూడినాయి.

సువర్ణసంకాశుడైన ఒక దివ్యపురుషుని గూర్చిన గాథలు విన్నారు, స్పెయిన్ వాళ్ళు. ఈ దివ్యపురుషుని పేరు ఎల్ డొరాడో. ఎర్ర యిండియనులు యీ కథలను చెప్పేవాళ్ళు. సుదూరంలో యెక్కడో ఒక దేశం వుందనీ, అక్కడి జన నాయకుడు సూర్యసన్నిభుడై ప్రకాశిస్తూంటాడనీ, ఉదయం ఆతడు బంగారు రజనుతో ఒళ్ళంతా పూసుకుని, సాయంత్రం నదీ ప్రవాహంలో అవగాహనం చేస్తాడనీ చెప్పేవాళ్ళు. యూరోపియను లీ పుక్కిటి పురాణాల నన్నిటినీ విశ్వసించే వాళ్ళు. అమెరికాలోని పర్వతాలనూ, అరణ్యాలను, యెడారు లనూ, ఒక్క బెత్తెడు మేరకూడా విడవకండా తిరిగి తిరిగి గాలించి వదలిపెట్టేరు, యీ స్వర్ణపురుషునికోసం! గొంజాలో పైజ్జారో, క్వెసేడా, ఓరెల్లనా మొదలైన స్పెయిన్ వాళ్ళూ, ఇంగ్లీషు యాత్రికుడు వాల్టర్ ర్యాలీ మొదలైనవాళ్ళూ ఎందరో ఎల్ డొరాడో కోసం అనంతయాత్రలు గావించేరు.

మరో యాత్రికుడు పోన్సీ-దీ-లియోన్ అను నాతడు నిత్య యౌవనాన్ని ప్రసాదించే దివ్యతీర్థములు గల సరస్సు కోసం అన్వేషణ సాగించేడు. ఈ దివ్యసరోవరాన్ని గూర్చిన గాథా ఎర్ర ఇండియనులు చెప్పినదే. ఆ సరస్సులో స్నానం చేసినవా

డెవ్వడైనా తిరిగి యౌవనవంతుడై, బలిష్ఠుడూ, ఆరోగ్య వంతుడూ అవుతాడట !

'ఎల్ డొరాడో' అనే దివ్యపురుషు డుండిన దేశం నిజానికి లేనే లేదు. యౌవనప్రదాయిని అయిన సరోవరము అంతకన్న ముందే లేదనుకోండి! కాని, వీటికోసం అన్వేషించటంలో యీ మనుష్యులూ, వీళ్ళ వెనకనే బైలుదేరినవాళ్లూ యెన్నో నిజమైన నదులనూ, దేశాలనూ కనుగొనగలిగేరు.

గొంజాలో పైజ్జారో, ఓరెల్లనా లిద్దరూ మహానదియైన అమెజాన్‌ను కనుగొనిరి. క్వెసాడా అను నాతను బకినాకో నది జన్మస్థానమును కనుగొన్నాడు. ఫ్లోరిడాను పోన్సీ-దీ-లియోన్ కనిపెట్టేడు. వాల్టర్ రాలీ గయానాను కనుగొన్నాడు. ఇతడే వర్జీనియా అను చోట నొక యింగ్లీషు వలస నేర్పాటుచేయ బూనుకున్నాడు. ఈ వర్జీనియా రాష్ట్రం ప్రస్తుతపు అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో ఉంది.

## 6. క్రొత్త ప్రపంచం : పాత నమ్మకాలు

మానవుడొక క్రొత్త ప్రపంచాన్ని చూసేడు. కాని, సర్వ సాధారణంగా జరిగేటట్లే, అతడు దాని నొక నూతన ప్రపంచంగా తక్షణమే గ్రహించనే లేదు. నూతన విషయము నన్వేషించుట చాల కష్టమే. కాని, దాని నర్థముచేసుకోడం అంతకంటె కష్టసాధ్యమైన విషయం. ఎందరెందరో సాహసులు

మహాసముద్రాలను తరించి, యెన్నో కష్టాల నెదిరించుతూ హిందూదేశం, చీనా భూములకు ఓడలమీద బైలుదేరేరు; కొత్త మార్గాలను కనిపెట్టా లని వారి యత్నం. ఈ నౌకా దళములలో నొకదానికి యెట్టయెదుట నొక కొత్త ఖండం కనబడినపుడు, వారికి తమ యెదుట నున్న దాని యదార్థ స్వరూపం బోధపడనే లేదు.

హిందూదేశానికి బోవడమే వరి యేకైక వాంఛ. ఏతద్వాంఛతో బైలుదేరిన వారు అమెరికా పశ్చిమతీరంలోని ఒక ద్వీపంమీద లంగరు వేసేరు. కొలంబస్ రాత్రిళ్ళు తన ఓడ పైభాగాన నిలువబడియుండి, హిందూదేశపు రేవుపట్టణ మొకదాన్ని చేరగల సుదినాన్ని ఊహించుకుంటూ మధుర స్వప్నాలు గంటూండేవాడు. తన నౌకాదళం చుట్టూ హిందువుల పడవలు, ఓడలు మూగి, కుతూహలంతో తమ వారిని ప్రశ్నలు వేస్తారు. హిందూనావికులు నిలువుటంగీలు, తలపాగలు ధరించి వుంటారు. లేక చీనా రేవునుంచి వచ్చిన నౌకలైతే దీర్ఘ చతురస్రాకారమైన తెరచాపలు, బహు దీర్ఘములైన తెడ్లుగలిగి వుంటాయి. వర్తకులు, నావికులు, మేనాలు మోసేవాళ్ళూ, దివిటీలు పట్టేవాళ్ళూ, భారవాహులూ, గుంపులుగూడి తీరంమీద బిగ్గరగా మాట్లాడు కుంటూంటారు. ఉన్నట్లుండి గుంపు విడిపోయి దారి యిస్తుంది. పారశీక హామారూఢుడై గాని, మెడలో బంగారుగొలుసు, చిరు గంటలు మ్రోగు యేనుగుమీద అంబారీలో ఆశీనుడై గాని

యెవరో శ్రీమంతుడో, రాజోద్యోగియో తమ భోగట్టా విని అక్కడికి వచ్చేడు.

కొలంబస్‌కు రాజాహ్వానం వచ్చింది. తాను రాజసభకు పోతూన్నట్లు భావిస్తాడు, ఆయన తన మనోవీథిలో. రాజుగారు రత్నఖచిత స్వర్ణసింహాసనాసీనుడై నిండు పేరోలగంబుండి తనకు దర్శన మిస్తాడు. అదివరకే అక్కడ తిష్ఠ వేసుకుని వున్న అరబ్బు వర్తకులు కుట్రలు, చాడీలు మొదలుపెడతారు. తమ ఓడలు రాత్రి అంధకారంలో బందిపోట్ల దాడులకు గురికావచ్చు. కాని, ఒక చుట్టు తుపాకులు కాలిస్తే సరి, చోరులు కాళ్ళకి బుద్ధి చెప్పి పారిపోతారు.

తమ ఓడల నిండుగా అమూల్యరత్నాలు, మంచిముత్యాలు చందనదారుఖండములు, జాజికాయ, లవంగపట్ట, లవంగాలు, పట్టు వస్త్రాలు మొదలైన వాటితో గృహాభిముఖమై బైలు దేరుతారు. అనుకూల వాయువులతో ఓడలు తెరచాప లెత్తి స్వదేశానికి బైలుదేరినాయి......

ఈ మాదిరి ఊహాప్రపంచంలో తేలియాడుతూండేవాడు. కొలంబస్. ఆయన కలలు యిల్లావుంటే, నిజంగా కొలంబస్ చూసిన దేమిటి ?

తానూహించునట్లు అక్కడి జనులు అమూల్యవసనము లను ధరించి లేరు. అక్కడి పేదలు, ధనికులు అంతాకూడా దాదాపు నగ్నంగానే వున్నారు రాజప్రాసాదాలు, చలువరాతి చప్పరములకూ మారుగా కొలంబస్ అక్కడ నికృష్టములైన

గుడిసెలను చూసేడు. మెడలలో బంగారు గొలుసులు, గంట లతో ఊరేగే భద్రదంతావళము లక్కడ అసలే లేవు బంగారు సామానులతోటి పారశీకాశ్వము లంతకుముందే గానరావు. ఆ ప్రదేశమంతా నిర్జనంగా వుంది. సముద్రశాఖలలో నావలు, నౌకలు మచ్చుకైనా లేవు.

తక్షణమే తా ననుకొన్న దేశ మిది కానోప దని కొలంబస్ అనుకున్నా డనుకుంటున్నారు కాబోలు! అబ్బే! అతడు హిందూదేశం చూడా లనుకున్నాడు. అక్కడకు చేరకపోయినా, తా నక్కడ వున్నట్లుగానే ఆతడు భావించు కున్నాడు. ఏ మాత్రం సంశయించకండా అక్కడి స్థానికులను యిండియను లని పిలిచేడు. హిందూదేశాన్ని ఇండియా అనీ, అక్కడి జనులను ఇండియను లని ఐరోపావాళ్ళు పిలవడం పరిపాటి. ప్రాచీన గ్రీకులు సింధుప్రాంతానికి వచ్చి, సింధునదిని 'హింద్' అనీ, ఆ ప్రాంతాన్ని హిందుదేశ మనీ పిలవడంచేత భారత వర్షమునకు దేశదేశాల్లో హిందూదేశ మని వాడుక వచ్చిందని మీకు తెలిసే వుంటుంది. కొలంబస్ తాను చేరిన దేశం హిందూదేశ మనుకుని, అక్కడి జనులను ఇండియను లనేశాడు. ఆ పొరబాటునే అతని తరువాతివా రందరున్నూ, నేటికీ మనమున్నూ చేస్తూనే వున్నాము. అమెరికా వాసులు యీ నాటికీ ఇండియను లని వ్యవహరించబడుతూనే వున్నారు! తీరాన కనబడుతూన్న నికృష్టపు గుడిసెలు ఏదో ఒక మహా నగరపు బాహ్యప్రదేశమందలి పేదల గుడిసె లనుకున్నా

డాయన. స్థానికజనుల్లో కొందరి ముక్కుల్లో వున్న బంగారు కాడలను, పుల్లలను చూచి, తూర్పుదేశాల అపారసంపద లిచ్చటికి సమీపంలోనే యెక్కడో వుండి వుంటా యను కున్నాడు, కొలంబస్ !

అది ఉష్ణమండలం. అరణ్యాల్లోంచి పుష్పసౌరభాలను మోసుకొంటూ మందపవనాలు వచ్చి, ఆయన ముకు పుటాలకు విందు చేస్తున్నాయి. కాని యీ వాసనలు సుగంధ ద్రవ్యాలవీ చందనదారువులవీ నని కొలంబస్ భావిస్తూన్నాడు. అక్కడి జనులు తమకు పశ్చిమంగా వున్న భూమిని గూర్చి ప్రసంగిస్తూన్నప్పుడు, కొలంబస్ 'సిపాంగో' అను మాట విని, ఆ నాడు ఆ పేరుతో పిలువబడు జపాను దేశమని భావించేడు. ఆ యిండియన్‌లు 'కరీబ్' అన్నపుడు కొలంబస్, వారేదో ఒక మంగోలియన్ జాతినిగూర్చి మాట్లాడుతున్నారనుకున్నాడు !

ఆ సాయంతనమే తన ఓడలోని గదిలో కూర్చుని కొలంబస్ తన నోటుబుక్కులో బహు నమ్మకంగా రాసేసేడు : "మహాఖానుని రాజధానీ నగరానికి నేనిప్పు డెంతో దూరంలో లేను."

కొలంబస్ క్యూబా ద్వీపంమీద దిగిన వెంటనే ఆ దేశపాలకుని దగ్గరకు అరబ్బుభాషాకోవిదులైన రాయబారుల్ని పంపేడు. వారి కాతడు సుగంధద్రవ్యాల మచ్చులను తెమ్మనీ, అక్కడ మిరియం, దాల్చినచెక్క పుష్కలంగా వుందో లేదో

తెలుసుకు రమ్మనీ, కాస్టిల్లి (స్పెయిను) రాజుతో మైత్రి గావించుకొనుటకై వెంటనే రాయబారుల నంపమని దేశ పాలకునికి చెప్పమనీ ఆదేశించేడు.

రాయబారులు దేశంలోపలికి వెళ్ళేరు. అక్కడ పెద్ద నగరానికి మారుగా యేబది కుటీరములున్న చిన్న గ్రామం వారికి కనిపించింది. అక్కడి నాయకుడు వట్టి నేలమీదనే ఆసీనుడై యీ రాయబారులకు దర్శన మిచ్చేడు. వారి సంభాషణ కేవలం సంజ్ఞలతోనే నడచింది. ఎందుచేతనంటే ఒకరికి తెలిసిన భాష రెండోవారికి సుతరామూ తెలియదాయె! స్పెయిన్ వాళ్ళు సుగంధద్రవ్యాల మచ్చులను చూపినపుడు ఆ యిండియను పెద్ద పరమాశ్చర్యసంభరితుడై పోయి, అల్లాంటి వాట్లని తా నంతకుముం దెన్నడూ చూడలేదనీ, యిప్పుడు వాటిని చూపించినందుకు చాల సంతోషంగా వుందనీ సూచిస్తూ సంజ్ఞలు గావించేడు.

ఇది బహు విచిత్రంగా వుంది! కాని, కొలంబస్‌కు మాత్రం అది హిందూదేశమే ననే నిశ్చయం కొంచెం కూడా సడలనే లేదు. ఆ పశ్చిమ యిండియా దీవి (క్యూబా) చీనాలోని ఒక రాష్ట్రమని తాను నమ్మడమే గాక, తన అనుచరు లంతా కూడ ఆ విషయాన్ని పూర్తిగా నమ్ముతూన్నట్లు ఒట్లు పెట్టించేడు! వాళ్ళు తయారు చేసిన నిబంధనావళిలో యిల్లా వ్రాయబడింది : "ఈ ఒట్టును మీరినవా రెవరైనా సరే,— వారు అధికారియైనచో నాలుక ఖండించి, జరిమానా విధిం

చాలి; సాధారణ నావికుడైతే నూరు కొరడాదెబ్బలతో దండించాలి."

కరిబియను సముద్రంలోంచి ఓడను నడుపుతూన్నపుడు అది హిందూమహాసముద్రం కాదేమో నని కొలంబసుకు అనుమాన మేనా కలుగలేదు. ఎర్రసముద్రం, అలగ్జాండ్రియాలగుండా తిరిగి స్వదేశానికి పోగలనని కొలంబసు తలచేడు. పనామా భూసంధిలో యెక్కడో అతడొక నదీముఖద్వారాన్ని చూసి, గంగానదీ ముఖద్వారమది యని భావించేడు కూడాను.

సముద్రాన్ని కొలంబసు నాలుగు పర్యాయాలు దాటేడు. ఐననూ ఆతడు జీవితాంతంవరకూ తాను యిండియాకు సమీపంలో యెక్కడనో వున్నానసీ, ఎస్పనోలా (హైటీ) ద్వీపం జపాను దీవుల్లో ఒకటనీ నమ్ముతూనే వున్నాడు!

ఈ మహానావికుని చూచి, చరిత్ర ఫక్కున నవ్వింది. ఈతడు పాతభావాలతో వెళ్ళి, కొత్త ప్రపంచంలో అడుగు పెట్టేడు. అందువల్ల తాను సాధించిన మహాకార్యాన్నాతడు గుర్తించలేకపోయేడు. నూతన శకారంభకులలోని ప్రప్రథము లలో నొకడై యుండిన్నీ ఆయన మెదడు పాతనమ్మకాల తోనే నిండివుండడంచేత కొలంబసు ముందుకు చూడజాలక పోయేడు.

ప్రపంచం చిన్నదీ, సంకుచితమైనదీ నని కొలంబస్ తలచేడు. తూర్పుదేశాలకు కొద్ది దినాల ప్రయాణం మాత్రమే నని

ఆతడు విశ్వసించేడు. పవిత్రములైన క్రైస్తవగ్రంథాలలో, ఎజ్ర పుస్తకములో సముద్రమున కొారింతలు మెట్టప్రదేశమున్న దని వ్రాసియున్నదిగదా!

భూమి గుండ్రంగా వున్నదని ఆత డెరిగియుండెను. కాని, భూమి వెలగపండువలె గాక, దోసకాయలాగున ఒకప్రక్క కొనదేలి యున్నదనీ, దాని యొక్క కొనను మహోన్నత పర్వతము తన శిఖరములతో స్వర్గలోకాని కంటూ వ్యాపించి వుంటుం దనీ కొలంబసు నమ్మకం! ఈ పర్వతంమీదనే భూలోకస్వర్గం వుంటుం దని కూడా ఆతని విశ్వాసం. తాను స్వర్గానికి సమీపంలోనే యెక్కడనో లేడుకదా! యని ఆతడు తరచు ఆశ్చర్యపడుతూండేవాడు!

నౌకాశ్రయంలోని స్వచ్ఛజలాల్లో ప్రతిఫలించియుండు తాళాదివృక్షాల నాతడు చూసేడు. నులి వెచ్చని వాతావరణ మంతా సువాసనలతో నిండివుంది. మనోహర చిత్రవర్ణ భాసితములైన చిలుకలదండ్లు పచ్చని ఆకుజొంపములలో కిలకిల లాడుతూ యెగురుతూన్నాయి. జనులు ఆదామ్, అవ్వలవలె నగ్నశరీరులై నడయాడుతూండిరి. అల్లాంటిది భూతలస్వర్గమో, దానికి చేరువలోని మరో దేశమో గాక వేరొకటి యెల్లా అవుతుంది? స్వర్గానికి చేరువగా రాగలిగినందుకు కొలంబస్, దేవునికి సహస్రవందనము లర్పించేడు.

కొలంబస్ జీవిత మంతా ఒక మహా అన్వేషణము, ఒక పొరబాటు,—వీటియొక్క కథయే నని చెప్పాలి. ఈ పొరబాటు

ఆయన కెంతో నష్టం కలిగించింది. ఆయన కనిపెట్టిన నూతన ఖండం కొలంబస్ పేరిట గాకుండా అమెరిగో వెస్పూసీ అను నాతని పేర పిలువబడింది అమెరిగో కనిపెట్టిన దేదీ లేకపోయినా ఆతడది పాతప్రపంచం గాక యేదో నూతనఖండమై యుంటుందని గుర్తించేడు. అందుచేతనే నూతనఖండం అమెరిగో పేరిట పిలువబడ నారంభించింది!

కొలంబస్ తరువాత వెళ్ళిన నావికులు అమెరికాలో రాతి పనిముట్లు నుపయోగించే ఆదిమజన గణసంఘాలనే గాక, ఉన్నత నాగరికతలను గూడ చూసేరు. మెక్సికో, పెరూ దేశాల్లో కాలువలు, డాములు, వంతెనలు, రథ్యాలు, రాజభవనాలు, దేవాలయాలు మొదలైన వాటి నెన్నిటినో వాళ్లు చూసేరు. పక్షుల, జంతువుల బొమ్మలను బంగారముతో నా దేశస్థులు చేసేవారు. ప్రకాశమానములైన చక్కని వస్త్రాలను కూడ వారు తయారుచేయుచుండిరి. లతాదులు, సాంకేతిక లిపి చెక్కబడిన కలశములు, కుండలు ఆ దేశస్థులు తయారు చేసి వాడుతూండిరి.

కాని, ఉత్తర అమెరికా అరణ్యాల్లో నివసిస్తూండిన జనులు ఆదిమ యుగాల వేటగాండ్రవలె జీవిస్తూండేవాళ్లు. మానవజాతి గతమే వర్తమానముగా వున్న దక్కడ. మంత్రయుక్తములైన నాట్యభంగిమములచే అడవిదున్నలను లొంగదీసి, వాటిని చంపి, ఆ మాంసంతో విందు లారగించడగో చేసేవాళ్ళు, ఆ తెగల జనులు!

ఏజియన్ దీవులమీది నాటు తెగల వారి యిండ్లు మాదిరి గానే వుండేవి, మెక్సికోలోని గ్రామాలూ, యిండ్లూ. నాటి మెక్సికో తెగల రాజు మాంటిజూమా తన రాజభవనంలో సింహాసనంమీద కూర్చుని కొలువుతీర్చేవాడు. గ్రీకు పురాణాల్లో క్రీట్ ద్వీపపు రాజు మినోస్ కూడ యిల్లాగే సింహాసనాసీనుడై కొలువుతీర్చేవాడని మనం చదువుతాము

మధ్య అమెరికాలోని జనులు దేవాలయాల్లో సూర్య దేవునికి ప్రార్థనలు చేయువారు. ప్రాచీన ఐగుప్త దేశంలో కూడ యిట్లే సూర్యపూజ జరిగేది. పెరూ దేశపు మహారాజులైన 'ఇంకా'లు ఐగుప్తులోని 'ఫారో'ల వలె తమ ప్రజలపై మరణశిక్ష విధించే పూర్తిహక్కూనూ, అధికారమును కలిగి వుండేవాళ్ళు.

ఈ మూడున్నూ మానవజాతి చరిత్రలో మూడు పెద్ద అంగలు.

కాని, మహాసముద్రాలు దాటి వచ్చిన యీ తెల్లవాళ్ళు చరిత్రలంటే యేమీ తెలిసినవాళ్ళూ గారు, తాము చూసిన దానిని గ్రహించినవాళ్ళూ గారు. తమతమ దేశాల్లోని రాజులవంటి వారే యీ క్రొత్తప్రపంచంలోని జనముఖ్యులు, గణపతులూ ననీ, ఆ రాజుల సభలలో నృత్యం గావించే స్త్రీల నాట్యాలవంటివే యీ తెగల నృత్యము లనీ వాళ్ళు భావించేరు. మనమైతే యీనాడు బహుభద్రంగా మ్యూజియములలో గాజు పెట్టెలలో భద్రపరచునట్టి వెండి

బంగారు విగ్రహాలు, కలశములు, ఆభరణములు మొదలైన వాట్లని యీ విదేశీయులు మణుగుల లెక్కను అంచనాలు వేసుకునేవాళ్ళు !

పాత ప్రపంచంలో, యూరోపు-ఏషియాలలో విస్మృతి పధాన బడినట్టి ఒక ప్రాచీన సంస్కృతిని కొత్తప్రపంచంలో మెక్సికో, పెరూ దేశాల పట్టణాల్లో చూచికూడా, యూరోపియనులు దానిని గుర్తించజాలక, సమూలంగా నాశనం చేసివేసేరు.

## 7. మానవుడు నౌకపై భూప్రదక్షిణం చేస్తాడు.

ప్రపంచంలో భూతవర్తమానములు యేక సమయంలో జీవించి వుంటున్నాయి. కొందరు జనులు యీ ప్రపంచం యిరుకైనదీ, చిన్నదీ, సంకుచితమైనదీ అని భావిస్తూంటే, మరికొందరు అప్పుడే యీ ప్రపంచ మెంత పెద్దదో, విశాలమైనదో చెపుతూండేవాళ్ళు.

కొలంబసు అనుచరులు హైటీ ద్వీపంమీద దిగినప్పుడచ్చటి 'ఇండియను'ల నడిగేరు : 'మీ దేశం పేరేమిటి ?' తమ భాషలోని ఒక మాటతో ఈ ప్రశ్నకు వారు జవాబిచ్చేరు. ఆ మాట కర్థం 'ప్రపంచం' అని ! అంటే తాము నివసిస్తూన్న ఆ ద్వీపమే యావత్ప్రపంచమూ నని వారి అభిప్రాయం !

మరేమో వాళ్ళూ స్పెయిన్ వాళ్ళ నడిగేరు. "మీా రెక్కడినుంచి వచ్చేరు? స్వర్గాన్నుంచి మీా రెందువల్ల పడిపోడం తటస్థించింది?" ఒకానొకప్పుడు ప్రాచీనకాలంలో ఐగుప్తు నావికులను నల్లసముద్రతీరమందలి 'పాంతస్' దేశవాసులు, ఆటవికులు యిదే ప్రశ్న నడిగేరు! పాంతస్ దేశం సువాసనలు వెదజల్లే అనేక పుష్పరాజములు గల వృక్షాలతో అలరారు చుండేది. ఆ దేశపు అరణ్యాల్లో నివసిస్తూండిన తెగలవాళ్లు ఐగుప్తునుంచి వచ్చిన నావికులను స్వర్గపతితులైన దేవతా విశేషు లని భావించేరు!

ఆ నాటు జనుల ప్రశ్నలను విని, ఒకప్పుడు ఐగుప్తు వారి వలెనే యిప్పుడు స్పెయిన్‌వాళ్ళూ నవ్వేసేరు. ఈ ప్రపంచం పెద్ద దని స్పెయిన్ వాళ్లెరుగుదురు. వారు చాల దేశాలనూ, తెగలనూ చూసేరు. ఎన్ని రాత్రింబగళ్ళు మహాసముద్ర తరంగాలమధ్య ప్రయాణిస్తే ఆఖరికి యీా హైటీ ద్వీపం చేరగలిగేరు! నాటు తెగలు యావత్ప్రపంచంగాను భావించిన యీా ద్వీపానికి వినీతమైన పేరు, 'ఎస్పనోలా' * అని పెట్టేరు. ఈ మాటకు 'చిన్న స్పెయిన్' అని అర్థము! తమకు పరిచితమైన వాటితో కొత్తవాటిని పోల్చుకొని, వాటి పేర్లను మార్చి,

* మనం స్పెయిన్ అని పిలిచే దేశాన్ని స్పెయిన్‌వాళ్లు ఎస్పనో అంటారు. 'ఎ' అనేది ఊతంకోసం చేర్చిన ఉపసర్గ మాత్రమే. స్కూలును మనం 'ఇస్కూలు' అనినట్లు. తమిళులు అనేక పదాలకి ముందు 'ఇ' చేర్చి ఉచ్చరిస్తారు. ప్రతి భాషలోనూ యిట్టి ఉపసర్గ లుంటాయి వాటిని చేర్చియే ప్రతి కొత్త శబ్దాన్ని వారు పలుకుతారు.

తమకు పరిచితమైన వస్తునామములను బెట్టడం జనుల కెచ్చటనూ వున్నదేగదా !

కాని, ప్రపంచం అతిశీఘ్రంగా, అంతకంతకు పెద్దదిగా పెరుగ నారంభించింది. జను లీ గోళం చుట్టూ ఓడలమీద ప్రదక్షిణం చేసి వచ్చేరు. ప్రాచీనకాలంలో గ్రీకు ఖగోళ శాస్త్రవేత్తయైన ఎరాతోస్థనీస్ చెప్పిన భవిష్యత్తు నెరవేరింది !

హిందూదేశానికి దారి కనుగొనడానికై పశ్చిమాభి ముఖంగా బైలుదేరిన మెగల్లాన్ ఓడలు దక్షిణ అమెరికా ఖండాన్ని చుట్టి వెళ్ళి, పసిఫిక్ మహాసముద్రాన్ని సందర్శిం చేయి. పసిఫిక్ మహాసముద్రంలోంచి ప్రయాణించి స్వదేశము నకు తిరిగి రావడానికి, తన భూప్రదక్షిణాన్ని పూర్తిగావించ డానికి మెగల్లానుకు ఆయుర్దాయం లేకపోయింది. మృత్యు దేవత ఆతనిని పొట్టను బెట్టుకొంది. ఫిలిప్పైను దీవులలో, అచ్చటి జనులతో జరిగిన ఒక యాదృచ్ఛిక పోరాటంలో మెగల్లాన్‌కు కత్తి దెబ్బ తగిలి మరణించేడు. భూప్రదక్షిణ మును పూర్తిగావించకండానే మెగల్లాను, పోరాటంలో మరణించేడు.

మెగల్లాను మరణంతో నీ కృషి నిలిచిపోయిందా? లేదు! ఒక వ్యక్తికి మరణం వుందే గాని మానవజాతికి మరణం లేదు.

ఒక మహాపండితుడు తన శాస్త్రచర్చను, వ్యాసంగమును మరణాసన్నుడై నిలిపివేసి నప్పుడు ఆతని శిష్యుడో లేదా

మరొక పండితుడో ఆ కృషిని గైకొంటాడు. తన వ్యాసంగం ద్వారా ఆ గ్రంథాన్నో, శాస్త్రమునో యింకా ముందుకు గొంపోతాడు. ఒక నావికుడు ప్రయాణంలో మరణించి నపుడు మరొకడు చుక్కానిదగ్గర తను నిలబడతాడు. మెగల్లాను విషయంలోనూ అంతే. అతని మిత్రుడు ఎల్కానో అతని స్థానములో నిలచి, దళంలోని ఐదు ఓడల్లోనూ మిగిలిన వాటిని తన దేశానికి నడిపించుకుని తీసికెళ్లేడు.

ఓడలు పశ్చిమాభిముఖంగా పయనమై వెళ్ళి, ప్రాగ్దిశనుంచి తిరిగి వచ్చేయి! సూర్యుడు పశ్చిమాన అస్తమించి, తూర్పున ఉదయించు లాగున అన్నమాట.

ఎల్కానోకు బిరుదు నిశానీలు చెక్కబడిన ఒక కోటు సమర్పించబడింది. ఆ కోటుమీద ఒక గోళమున్ను, దానిపైన 'నన్ను చుట్టివచ్చిన ప్రథముడవు నీవే!' అను వాక్యమున్నూ చిత్రితములై వున్నాయి. నిజముగా యిది సంతోషగర్వములకు కారణమే!

ఈ ప్రపంచపు అంచులకంటా పోయి చూడాలని యెప్పటి నుంచో మానవుడు కలలు కంటూనే వున్నాడు. ఇప్పటికి ఆతడు ఖగోళాన్ని చుట్టు తిరిగి వచ్చేడు. కాని, తీరా చూస్తే, యీ గోళం అదివరలో తా నూహించిన రీతిగా లేనే లేదు! నగరాలకు హద్దు లున్నాయి. ద్వీపాలకు, దేశాలకు పరిమితు లున్నాయి. కాని భూగోళానికి అంచులు లేవు. అది అసీమితము! దాని క్షేత్రమితి సూత్రాలు వేరు!

కొలంబస్, మెగల్లాన్‌ల యాత్రా ప్రదక్షిణముల తరువాత జనులు భూగోళంమీదా, మహాసముద్రాలమీదా అనంతంగా ప్రయాణాలు సాగించ నారంభించేరు. అమెరికానుంచి యూరోపుకి వెండిబంగారాలతో నిండిన ఓడలు తిరిగి రా నారంభించేయి. వాటికి అభిముఖంగా కూడా యెన్నెన్నో ఓడలు సరకులతో పోతూండేవి. అవి ఆఫ్రికానుంచి అమెరికాకు సజీవమైన సరకును తీసికొనిపోయావి. సజీవమైన సరకు అంటే ఏమిటో తెలుసా ? మానవులే ! నీగ్రోలు ! పాప మీ దుర దృష్టవంతులైన మానవులు బానిసలుగా యూరోపియనుల చేతనూ, అరబ్బులచేతనూ నూతన ప్రపంచానికి కొంపోబడే వాళ్ళు. అదే సమయంలో ప్రాచీనకాలాన్నుంచీ సాగుతూన్న సుగంధద్రవ్య వ్యాపారంకూడా అభివృద్ధిగానే వుంది. హిందూ దేశాన్నుంచి సుగంధద్రవ్యాలు, వస్త్రాలు మొదలైన సరకులను తీసికొని యెన్నో ఓడలు హిందూమహాసముద్రం గుండా, ఆఫ్రికా ఖండాన్ని చుట్టు తిరిగి యూరోపు చేరుతూనే వున్నాయి.

అంధకార మహాసముద్రమైన అట్లాంటిక్ సముద్రం యిప్పుడు మధ్యధరా సముద్రమైపోయింది. నాలుగు వైపులా భూమి వుండడంచేతనే అది 'మధ్యధరా' సముద్రం అని పిలువ బడేదిగదా ? ఐనప్పుడు అట్లాంటిక్ సముద్రానికి మాత్రం నాలుగువైపులా భూమి లేదా ? ఉంది ! తమ దేశాలను కలుపుతూన్న మధ్యధరా సముద్రజలాల మీద యెవరి

ఆధిపత్యం ఉండాలా ? అని ఇటలినగరము లింకా తుర్కులతో యుద్ధాలు సాగిస్తూనే వున్నాయి. కాని, అంతలోనే యీ సముద్రమే మధ్యధరా సముద్రంగా వుండడం మానేసింది! విస్తృత మవుతూన్న ప్రపంచానికి యిది యిప్పుడింక మధ్యలో లేదు గనుక !

మానవ తెగలు, గణములు ఒకదానితో మరొకటి నదీ ప్రవాహాల చేతనే అనుబంధించబడియున్న కాలం 'నదీ యుగం'గా వుండేది. మానవుడు సముద్రయానం చేసి, క్రమంగా వాటిని జయించేడు. అది 'సముద్ర యుగం.' మరేమో యిప్పుడు మహాసముద్రాలే చుట్టివచ్చి, మానవుడు వాటిని సరస్సులుగా చేసేసేడు! సముద్రయుగం గడిచి, 'మహాసముద్ర యుగం' ప్రవేశించింది! ఇప్పుడు ఖండాలు, జనులు కూడ మహాసముద్రాల చేతనే అనుబంధించబడి వున్నాయి.

అటుతరువాత యుగం యేదై వుంటుందో? లియోనార్డో–దా–విన్సీ యీ ప్రశ్నకు జవాబెరుగును. కిటికీదగ్గర నిల్చుని, యెగురుతూన్న పావురాల్ని చూస్తూన్నప్పుడు ఆయన మనోవీధిలో యీ ప్రశ్నా, దానికి జవాబూ కూడ స్ఫురించక పోలేదు.

## 8. భూగోళం పోటీదారుల క్రీడాకందుకం అవుతుంది ?

హిందూదేశానికి కొత్తమార్గం కనిపెట్టబడిందన్న వార్త మధ్యధరా సముద్రదేశాలకూ, రేవులకూ వెళ్ళింది. ఇది

అక్కడివారికి చావుకబురు, మరి. వెనీసు వర్తకులు గుండెలు కముకునట్లు హడావుడిగా రియాల్టోకు పరుగెత్తేరు. అక్కడ పెద్దకాలవ వంతెనమీద, యిరుప్రక్కలా దుకాణాలతో నిండివున్న ఆ విశాలమైన పెద్ద వంతెన మీదనే వర్తకులు ఉదయం లగాయితు రాత్రివరకూ సందడిగా వుంటూంటారు. ఆ ప్రదేశమే రియాల్టో. అదే అక్కడ చతుష్పథం. అక్కడ నీ కెప్పుడూ సుగంధద్రవ్యాల ధరవరలు, డ్యూకట్-ఫ్లోరిన్‌ల మారకపు రేట్లు తెలుస్తూంటాయి. అంతకు ముందు దినమున పట్టణంలో జరిగిన విశేషాలూ, విదేశాలనుంచి వచ్చిన వర్తకులు తెచ్చిన కడపటి వార్తలూకూడా అక్కడే తెలుస్తూంటాయి.

అక్కడ రేవు కూలీలు భారమైన మూటలను బుజాలమీద నుంచి దించుతూంటారు. సారియూవాళ్ళు ఒకరిని మించి ఒకరు బిగ్గరగా కేకలు వేస్తూంటారు. గుల్లచేపలు, చేపలు, యింకా బ్రతికిఉండి కదులుతూనే గుట్టలు గుట్టలుగా పోసివుంటాయి. గృహిణులు వీటిని గుచ్చి యెత్తుతూ, బేరాలు చేస్తూంటారు. మారుబేరాలు సాగిస్తూంటారు, వర్తకులు. వీళ్ళందరితోటీ ఆ ప్రదేశమంతా కిటకిట లాడుతూంటుంది. ఈ వర్తకులదగ్గర సరకు లేమీ హాజరుగా ఉండవు. ఫలానా సరకు, ఫలానా ధర, యింత పరిమాణం సప్లై చేయగలను; అని బిగ్గరగా ఘోషించడమే వారు చేసేది ఇప్పటి సంతలూ, స్టాకు

మార్కెట్లూ మాదిరి అన్నమాట! వాళ్లు చెప్పే అంకెలు వింటే యెవరికైనా బుర్ర తిరిగి పోతుంది.

గండోలా ఒకటి గట్టుకు చేరుకుంది. ఒక వర్తకు డందు లోంచి దిగి, గండోలా * నడిపేవాని టోపీలోకి ఒక నాణెం విసిరివైచి, కాలవపైన యెత్తుగా లాజుగా అమరివున్న వంతెన మీాదికి నడిచిపోతాడు. ఆ వంతెన పైభాగ మంతా కప్పుతో కుశలమై, చక్కని భవనంలా వుంది. తొందరగా నడుస్తూనే అతడు శత్రుమిత్ర భేదం లేకండా, కనబడ్డవాళ్ళ నందర్నీ కుశల ప్రశ్నలతో పలకరిస్తాడు. నిజం చెప్పాలంటే, తూర్పు దేశాలతో వర్తకం మీాద ఆధారపడి వున్న మధ్యధరా సముద్రపు రేవు నగరమైన వెనీసులాంటి నగరాలకు మహాప్రమాదం దాపురించి నప్పుడు యింకా యీా పట్టింపు లేమిటి? గతంలో వున్న శత్రుత్వచిహ్నా లన్నింటినీ సన్నిహితమై వున్న ఆపద తుడిచి పెట్టేసింది.

"ఏమిటి విశేషాలు?" అని అత డడుగుతాడు.

---

* వెనీసు నగరం నీటిలో నిర్మించ బడినట్టిది. రోడ్లకు బదులుగా కాలువలే అక్కడి వీథులు. శకటాలకు బదులుగా పడవలే అక్కడి యానసాధనాలు. ఆ పడవలనే గండోలా లంటారు. వెనీసువారు సముద్ర యాన కుశలురు. ప్రాచీన యుగాలలో, ఇండియాతో వారే వ్యాపారం చేస్తూండేవాళ్లు. మన దేశాన్నుంచి సుగంధద్రవ్యాలు, వస్త్రాలు, రత్నాలు మొదలైనవి గొంపోయి యూరోపియనులకు విక్రయించుతూ, మన దేశానికి ముత్యాలు, వెండిబంగారాలు, గోరోజనం, అంబరు, ఊదారంగు మొదలైనవి తెచ్చి యిస్తూండేవారు, వీరు శతాబ్దాలపాటు.

"పరిస్థితులేం బాగా లేవు. లవంగాలకి గిరాకీ లేదు!" అంటాడు, ఒకడు.

"జాజికాయకీ అంతే!" అంటాడు, ఇంకొకడు.

"ఐతే, పోర్చుగల్‌లోని మన రాయబారి ఏం చేస్తూన్నట్టు? అత డేమీ వ్రాయలేదూ?"

"అదే చిక్కు! ఉత్తరాలు వస్తూనే వున్నాయి. కాని, వాటిలో నష్టజాతకం తప్ప మరేమీ కనబడడంలేందే!..."

పగలంతా గొడవలు, విచారాలు వల్ల ఆందోళనతో వేగిపోయి, రాత్రి ప్రొద్దుపోయేక యింటికి చేరి, కొవ్వొత్తి దీపం వెలిగించి, ఓ పెద్ద పుస్తకం తెరచి, దాంట్లో వ్రాసేవాడా వర్తకుడు.

"24 వ తేదీని పోర్చుగల్‌లోని వెనీసు రాయబారినుంచి జాబువచ్చింది. హిందూదేశానికి నూతన సముద్రమార్గాన్వేషణకై పోర్చుగీసు రాజు పంపిన నౌకాదళం సాధించిన ఫలితం విషయమై యదార్థం తెలుసుకోడం నిమిత్తమే యితను పంపబడ్డాడు. వెనీషియనులకు తుర్కులతో జరుగుతూన్న యుద్ధంకంటె యీ విషయమే మనకు అత్యంత ప్రధానమైనది. పంపిన ఓడలలో యేడు మునిగిపోయినా మిగిలిన ఆరు ఓడలూ అత్యధిక పరిమాణంలో సరకును తెచ్చినాయనీ, వాటి ఖరీదును అంచనా వేయడంకూడా అసాధ్యమనీ అతడు వ్రాస్తూన్నాడు! ఇల్లాంటి ప్రయాణమే గనుక మళ్ళా జరిగితే పోర్చుగల్ రాజు ధనరాజు ఐపోతాడు. ఎందుకంటే సుగంధద్రవ్యాలు కొ[illegible]ం

దుకు అన్ని దేశాలవాళ్ళూ యిక పోర్చుగల్‌కే పోతారు. డబ్బంతా యిక ఆ దేశంలోనే మిగిలిపోతుంది."

"ఈ వార్త వెనీసు నగరానికి చేరగానే ప్రతివారూ ఆశ్చర్యపడిపోయేరు. అదివరలో యెవరికీ తెలియని దారి నొక దానిని, ప్రాచీన కాలంలో మన పూర్వుల కెవ్వరికీ తెలియని మార్గ మొకటి నూతనంగా కనిపెట్టబడిం దనే వార్త విని అంతా విభ్రాంతులై పోయేరు. వెనీషియన్ రిపబ్లిక్‌నకు యిది అత్యంత దుఃఖకరమైన వార్త యని సినేటర్లుకూడా అంగీకరిస్తూన్నారు. స్వాతంత్ర్యం కోల్పోవడ మొక్కటే యింతకంటె అశుభకరమైన వార్త! వెనీసు రాజ్యం యిల్లాంటి పేరు కీర్తులను సంపాదించగల్గిన దంటే సముద్రయానం సముద్ర వ్యాపారం,- వీటి మూలముననేగదా. తూర్పు దేశాలతో మన సంబంధంవల్లనే మనకీ ఘనత వచ్చిం దనడం నిస్సందేహం."

"లిస్బన్ రేవునుంచి కాలికటు రేవుకు మార్గం స్థిరపడినట్లయితే యిక వెనీషియను ఓడలకు, వ్యాపారానికీ సరిపడిన సుగంధద్రవ్యాలు లభించవు. వెనీసుకు యీ వ్యాపారం గనుక పడిపోతే, చంటిబిడ్డకు స్తన్యం లేనట్లుగా వుంటుంది!..."

ఇటాలియను రేవు పట్టణాలకు గట్టి దెబ్బయే తగిలింది. సుదూరంలో పశ్చిమాన అట్లాంటిక్ మహాసముద్ర తీరస్థ పట్టణాలను సంపదుదయం అరుణరాగరంజిత మొనరుస్తూంది. మానవాభివృద్ధిలో వేయబడిన ప్రతి ముందడుగూ తాత్కాలి

కంగా కొందరికి బాధ, అవనతి కలిగించక తీరదు! కాని, మొత్తంమీద ప్రతీ అభివృద్ధీ మానవసమాజానికి అభ్యున్నతినే కలిగిస్తుంది. అప్పటినుంచీ సముద్రజలాలమీద ఆధిపత్యం, ఆధిక్యత యెవరిదా? యని పోటీ, స్పర్ధ ప్రారంభమైంది. వివిధ దేశాలు సాగించే పోరాటాలకు రంగస్థలి యివ్వాడు మహా సముద్రం ఐంది......

మహా నావికుల, సాహసుల అన్వేషణలు యీ భూమి గోళాకారంగా, కపిత్థాకారంగా అంటే వెలగపండువలె వుందని అతిసంశయాత్ములైన వాళ్ళుకూడా విశ్వసించేటట్లు చేసింది. నూరెంబర్గు వర్తకుడు మార్టిన్ బెహైమ్ అను భూగోళశాస్త్ర పండితుడు తయారుచేసిన మొదటి భూగోళమును రాజులు, మంత్రులు, పోప్‌లు, కార్డినల్‌లు మొదలైన పెద్దవాళ్లు పరిశీలించేరు. ఆ గోళం మీద ఖండాలు, మహాసముద్రాలు, సముద్రాలు పర్వత శ్రేణులు మొదలైన వాట్లను గుర్తుపెట్టి, మార్టిన్ యీ క్రింది వివరణను యిచ్చేడు.

"ఆపిల్ పండువంటి యీ గోళంమీద ప్రపంచ మంతా లెక్కప్రకారంగా గుర్తించబడింది. ప్రపంచంలో ఎవరూ యిది అసామాన్యవిషయ మని భావించకుండులాగున దీనిని తయారు చేయడమైనది. దీనిమీద గుర్తించిన రీతిగా యెక్కడికైనను జనులు నడిచి గాని, పడవలమీద గాని, పోవచ్చు నని తెలుసుకొందురుగాక!"

మార్టిన్ బెహైమ్ భూగోళశాస్త్రంలో పండితుడే గాని రాజకీయవేత్త మాత్రం గాడు. ఆ విషయం స్పష్టంగా తెలుస్తూనే వుంది! ఇప్పుడింక సర్వజనులూ యీ గోళంమీద తమ కిష్టం వచ్చిన చోటికి నిరభ్యంతరంగా పోవచ్చునని అనుకున్నాడు. అమాయకుడు! ఈ ప్రపంచం ఆత డనుకున్నట్లు అడ్డు ఆటంకాలు లేని సర్వసులభ గాదు. భూగోళమును కపిత్థాకారంలో తయారుచేయడమే ఆయన వంతు. మరి కొందరు దానిమీద అనేక హద్దులూ, అడ్డుగోడలూ కట్టి, దాన్ని విభజించి పారేశారు. ఆ అడ్డుగోడలు మన కళ్ళకి కనబడకపోయినా, యెవరూ వాటిని అతిక్రమించి పోలేరు!

స్పెయిన్, పోర్చుగీసువాళ్ళు సముద్రాలమీదే గాక నేలమీదకూడా తీవ్రపోరాటాలు చేస్తూండేవాళ్లు. వాళ్ళకి సానురస్యం కలుగచేయడానికి పోప్ అలగ్జాండర్ బోర్జియా ఒక ఉపాయం ఆలోచించేడు. భూగోళపు ఉత్తర దక్షిణ ధ్రువాలను కలుపుతూ సముద్రాలమీదుగా ఆయ నొక గీత గీసేడు. అంటే భూగోళం ఉత్తరదక్షిణాలకు రెండుగా విభజించబడిం దన్నమాట. పశ్చిమార్థభాగం కాస్టిల్లి రాజుకున్నూ, ప్రాగర్థభాగం, హిందూదేశంతో సహా పోర్చుగీసు రాజుకున్నూ పోప్ మహాశయుడు ధారాదత్తం గావించేడు! పోప్‌నకు ఆత్మసంతృప్తికలిగింది. పుత్రప్రేమగల తండ్రి పోట్లాడుకొంటూన్న తనయు లిద్దరకు ఆపిల్ పండును నిలువునా చెరిసగం చేసి, యిచ్చినట్లు యిచ్చి పోట్లాటలు లేకుండాచేయా లనుకున్నాడు.

కాని, యిక్కడ యింకో చిక్కు వచ్చింది. పోప్ అలగ్జాండర్ బోర్జియా రాజకీయవేత్తయే గాని భూగోళశాస్త్ర పండితుడు గాడు, మరి! భూగోళమనే ఆపిల్‌ను రెండుగా చేయడం అంత సులభమా? బొమ్మగోళంమీద గీత గీయడం సులభమైనది గాని నిజమైన భూగోళంమీద, సముద్రాల మీదుగా సరిహద్దు గీతగీయడం మాటలా? అక్కడ సరిహద్దు రాళ్ళూ, సరిహద్దు స్థంభాలూ నిలబెట్టే అవకాశాలేవీ? సముద్రాలమీద అదృశ్యమైన హద్దుగీతలను కొన్ని పరికరాల సాయంతోనూ, గణనపట్టికల సాయంతోనూ మాత్రమే భావించి కనుక్కోగలము! రేఖాంశములు, అక్షాంశములు, అను మాటల కర్థం తెలుసుకోవా లన్నమాట. ఇది చాల క్లిష్టమైన విషయమే, మరి. మన మీ నాడు రేఖాంశరేఖలను ఖచ్చితమైన 'క్రోనోమీటర్ల' సాయంతో, అంటే కాలగణన యంత్రాల సాయంతో గుణించి సరిగ్గా నిర్ణయించగలము. మామూలు మాటల్లో చెప్పాలంటే మంచి గడియారంతో యీ పని సాధ్య మన్నమాట. కాని, ఆ కాలంలో గడియారా లన్నిటికీ ఒకే ముల్లు, గంటలముల్లు మాత్రమే వుండేది. ఓడల మీద నీటి గడియారాలూ, ఇసుక గడియారాలూ, మాత్రమే వుండేవి. వాటి సాయంతోనే ఓడలమీద గంటలు కొడు తూండేవాళ్ళు. అవి అంత ఖచ్చితంగా పనిచేస్తా యని చెప్ప లేముగదా.

నావికులు ఖగోళవేధ ద్వారానే రేఖాంశాలను నిర్ణయిస్తూండేవాళ్లు. కాని, ఆ పద్ధతి చాల చిక్కులతో గూడినట్టిది. దానిలో చాల తేడాపాడాలు వస్తాయి కూడాను. తామెక్కడ నున్నదీ సరిగ్గా ఖచ్చితంగా తెలియకండానే జనులు సముద్రాలపై ప్రయాణం చేస్తూండేవాళ్లు. తమకు చెందని గోళార్థంలోకి స్పెయిన్ వారూ, పోర్చుగీసులూ కూడ తరచు పోతూండేవాళ్లు. ఒక్కొక్కప్పుడు పొరబాటునన్నైనా, తరచు



నీటిగడియారం

బుద్ధిపూర్వకంగానే యిల్లా చేస్తూండేవాళ్లు! పోర్చుగీసు, స్పెయిన్ వాళ్లు యిద్దరుకూడా యీరీతిగా పోప్ చే తమకు యీయబడిన భాగాన్ని అతిక్రమించి, యెదుటి వారి అర్థ భాగంలోకి ప్రవేశిస్తే ప్రమాదం యేమి టంటారా?

ఏమీ లేదు! అల్లాంటప్పుడు సముద్రంమీదనే ఫిరంగి గర్జనలు చెలరేగేవి. కాల్చేవాళ్లు ఫిరంగి గొట్టాల్లోకి మందును-

గుండ్లను దట్టించి, మందుపాత్రలు ముట్టించేవాళ్లు. శత్రుఓడల సమీపంలో పడిన గుండ్లు నీటిని ఉవ్వెత్తుగా లేపేవి ఓడ మీద పడితే యిక చెప్పాల్సిందే లేదు. భూగోళం మీది రేఖాంశ నిర్ణయమనే అతిక్లిష్ట కార్యం, యెవరు బలాధికులో? అనే దానిమీద నాధారపడి తేల్చివేయబడేది!

సముద్రంమీద బలం తేల్చుకోవడమనేది యెవరికెక్కువ ఓడలు, ఫిరంగులు వున్నాయి? అనే దానిమీద ఆధారపడి వుండేది. అందుచేత నౌకా నిర్మాణ స్థానాల్లో యెడతెగకండా పని జరుగుతూండేది. అక్కడ సమ్మెటపెట్లు అంతకంతకు బిగ్గరగా వినబడుతూండేవి. స్పెయిన్ వారు ఒకటొకటిగా ఓడల్ని జలప్రవేశం చేయిస్తూండేవాళ్లు. వాళ్ళతో సమంగా సాగేందుకు పోర్చుగీజు వాళ్ళూ ప్రయత్నిస్తూండే వాళ్లు. పోతే యిక మిగిలిన దేశాల్లో, ఇంగ్లాండు, ఫ్రాన్సు, హాలండుల్లో కూడా నౌకానిర్మాణకుశలురు ఊరికే ఉండలేదు.

ఓడలకు మంచి కలప కావాలి. అందులోనూ తెరచాపల వల్ల నడిచేవి గనుక చాపకొయ్యలకు శ్రేష్ఠతరమైన కర్ర కావాలి. అరణ్యాల్లో నూరేళ్ళ వయసుగల దేవదారువు లన్నీ కూలిపోతూన్నాయి. మొదళ్ళు, రాలి యెండిన ఆకులూ, కాయలు తప్ప మరేమీ మిగిలేవి కావు. ఓడలకు యినుమూ అవసరమే. లంగరులు, గొలుసులు, మేకులు, ఫిరంగులు మొదలైన వాటికి యినుము, యితరలోహాలూ బోలెడు కావాలి. అందుకోసం గనుల్లో పనివాళ్ళు అంతకంతకు

హెచ్చుగా పనిచేస్తూనున్నారు; యింకా యింకా లోతుకు పోతూనున్నారు. నీటి చక్రాలు వణుకుతూ, పగుల్చుతూ, ఉక్కిరి బిక్కిరి అవుతూ, గనుల్లోంచి ఊరుతూన్న నీటిని పైకి తోడి పోస్తూనే వున్నాయి.

రాజకింకరులు దేశం నలుమూలలా తిరుగుతూ వుండేవాళ్లు. గుఱ్రాలమీదనుంచి ఉరికి, సంభ్రమంగా వెళ్ళి పొగచూరిన గుడిసెల ద్వారములను తట్టి, కమ్మరులను లేవగొడుతూన్నారు.

"రాజుగారికి ఫిరంగులు, రవ్వలు, గుండ్లు, కవచాలు, ఖడ్గాలు, బరిసెలూ కావాలి! త్వరగా! తొందరగా పూర్తి కావాలి! హుషార్!"

రాత్రింబగళ్లు కమ్మరి కొలుములు భగ్గుమంటూనే వున్నాయి. దాగళ్ళమీద భారమైన పెనుసమ్మెటలు మోత పెడుతూనే వున్నాయి.

యుద్ధనౌకలకు తెరచాపలు కావాలి. వేలాది గజాల గుడ్డ! అంతేకాదు, సైనికుల దుస్తులకై మొత్తపాటి గుడ్డ కావాలి! బట్టల కార్ఖానాల్లో కూడ పనివాళ్ళకి గిరాకీ యేర్పడింది. ఎక్కడ చూసినా పనివాళ్ళకు గిరాకీగానే వుంది. ప్రతికుటీరం లోనూ రైతుల, నావికుల భార్యలు వడుకుతూ, నేస్తూ వున్నారు. ఆఖరికి చిన్న పిల్లలు కూడా రాట్నచక్రం త్రిప్పుతూనున్నారు. కాలితో త్రొక్కే మగ్గాన్ని నేస్తూ, రాత్రింబగళ్లు సందడిగా వుంటున్నారు, అందరూ. రాట్నముల

ఝూంకారమూ, మగ్గాల టక్కుటిక్కులూ ప్రతి గుడిసెనుంచీ వినిపిస్తూన్నాయి.

సర్వత్రా మరింత నారగుడ్డా, ఫ్రాలూ తయారవుతూంది. ప్రతిచోటా వర్తకుల, కర్మాగారాధిపతుల భోషాణాల్లో అధికాధికంగా బంగారం, వెండి ప్రోగులు పడుతూన్నాయి. రాజుల పటాలాల్లోకీ, నౌకాదళాల్లోకీ నూతనంగా చేర్చుకోబడిన సైనికులు, నావికులు తమ కొత్తదుస్తుల్లో బడాయిగా ప్రతి సారాపాకలోనూ, చౌక హోటళ్ళలోనూ కోడిపుంజుల్లా నడయాడుతూన్నారు. నౌకాశ్రయాల్లో తెరచాప ఓడలమీంది కొయ్యలు, దూలాలు యింకా గుగ్గిలపు వాసనలు కొడుతూన్నాయి. తేమగా వున్న ఉప్పుగాలులు ప్రప్రథమంగా అప్పుడే యెత్తుతూన్న కొత్త తెరచాపల బింకపొంకములను పరీక్షిస్తూన్నట్లు వీస్తూన్నాయి. రేవు ప్రాంతాలన్నీ చీకుతూన్న దేవదారుముక్కలు, పొట్టుతో నిండి, ఓరకమైన వాసన కొడుతూన్నాయి.

నౌకాదళములు ఒక్కొక్కటే సముద్రంలోకి బైలుదేరుతూన్నాయి. నౌకల పార్శ్వభాగాల్లో చతురస్రములైన రంధ్రాల్లోంచి ఫిరంగుల మూతులు పొడుచుకువచ్చి, బెదరిస్తూన్నట్లున్నాయి. ప్రతీదీ, ప్రతివారూ పనిచేయాల్సిందే,–ఫిరంగులు, తెరచాపలు, నావికులు,– అన్నీ, అందరూ.

పోటీ, స్పర్థ, మరింత తీవ్రతరమైంది. ఇప్పుడింక ఒక ఓడ యింకో ఓడతో యుద్ధం చేయడం సమస్య కాదు. ఒక నౌకా

దళం మరొక నౌకాదళంతోనూ, ఒక దేశం మరొక దేశం తోనూ యుద్ధం చేయడంలోకి వచ్చింది, పరిస్థితి.

ఐతే వీరు యుద్ధం చేస్తున్నది దేనికోసం? సముద్రమార్గాలు, సముద్రాంతర సంపదలు, – వీటికోసం.

స్పెయిన్ వాళ్ళు అట్లాంటిక్ మహాసముద్రంమీద ఆధిపత్యం సాగిస్తూంటే, పోర్చుగీజులు హిందూమహాసముద్రం మీద పెత్తనం చెలాయించేవారు. భూగోళంలోని తూర్పు భాగం సగమున్నా హిందూదేశంతో సహా పోప్ మహాశయుడు పోర్చుగీజు వారికి ధారపోసేడు కదూ, మరి!

పోర్చుగీసు వర్తక స్థావరాలు సింహళం, జావా, సుమత్రా మొదలైన దూరస్థ ద్వీపాల్లో కనబడ నారంభిం చేయి. లిస్బన్‌నుంచి వెళ్ళిన వర్తకులు పాలకీల్లో కూర్చుని, బోయీలచే మోయించుకుంటూ, ఏలకి, లవంగి, జాజికాయ తోటల్ని అజమాయిషీ చేస్తూండేవాళ్ళు. తూర్పు దేశాలనుంచి సుగంధద్రవ్యాలను చెక్క పూటుగా వేసుకుని, సువాసనలను విరజిమ్ముకుంటూ పోర్చుగీజు ఓడలు యూరోపు దేశాలకు పోతూండేవి.

తూర్పు దేశాల్లో స్థానిక ప్రజలను పోర్చుగీజు వర్తకులు, ఉద్యోగులు నిర్దాక్షిణ్యంగా దోచుకుంటూ, వాళ్ళని చిత్రవధల పాలు చేస్తూండేవాళ్ళు. హిందూదేశీయులు పోర్చుగీజువాళ్ళని గురించి యేమనేవారో తెలుసా? "ఈశ్వరుడు కరుణామయుడు; గనుక నే, ఆ జాతిని అత్యల్ప సంఖ్యాకులుగా జేసేడు. సింహ

శార్దూలాదు లెప్పుడూ అల్పసంఖ్యలోనే వుంటాయిగదా! అట్లే గానియెడల యీ క్రూరాత్ములు యావత్తు మానవ జాతినీ కూడ కడుపున బెట్టుకొని వుండేవాళ్ళు!"

కాని, యీ దోపిడిగాళ్ళకు కూడ వారిని మించిన వాళ్ళు కొందరు శత్రువులు లేకపోలేదు. డచ్చి వర్తకులు తమకు కావాల్సిన సుగంధద్రవ్యాలను అసలుకు మూడు రెట్లు వెల చెల్లించి, లిస్బన్‌లోని దళారీలనుంచి కొనుక్కుంటూండేవాళ్లు. అది వాళ్ళ కెంతమాత్రం సమ్మతంగా వుండేదిగాదు.

డచ్చివాళ్ళ ఓడలుకూడా హిందూ మహాసముద్రంలో తరచుగా కనబడజొచ్చినాయి. డచ్చి తూర్పు ఇండియా కంపెనీ సముద్రాంతర ద్వీపాలమీద వర్తకస్థావరాల్ని మాత్రమే గాక దుర్గాల్నికూడా స్థాపించ నారంభించింది. డచ్చి వర్తకులకు రూకలు లెక్కించుటయందే గాక ఫిరంగులు కాల్చుటయందు కూడ అద్భుతకౌశల్యం వుండేది! డచ్చి ఓడలు తరుచుగా సముద్రయుద్ధాలలో పోర్చుగీసువాళ్ళ ఓడల్ని పట్టుకొని కొల్లగొడుతూండేవి. అతి శీఘ్రకాలంలోనే లవంగాలు, ఏలకులు, జాజికాయ మొదలైన సుగంధద్రవ్యాలన్నీ పూర్తిగా డచ్చి వర్తకుల హస్తగతమైపోయినాయి. డచ్చి తూర్పిండియా కంపెనీకి ఒక ప్రభుత్వాని కున్నంత ప్రాబల్యం యేర్పడింది. ఆమ్‌స్టర్‌డామ్ నౌకాశ్రయంలోని డచ్చి వర్తకుల గోదాములు సుగంధద్రవ్యాలతో పిటపిట లాడుతూన్నాయి. ధరలను వీలైనంత హెచ్చుస్థాయిలో నుంచడానికి గాను వర్తకులు

సాధారణంగా ఏలకి, లవంగ, జాజితోటలను తూర్పు దేశాల్లో నాశనం చేస్తూండేవాళ్ళు. "దేవుడు సృష్టించిన లోక మంతా కలిపినా 500 పౌనుల లవంగాలకంటె హెచ్చు కొనలేదు!" అంటూండేవాళ్ళు, డచ్చి వర్తకులు. వాళ్ళు లవంగాల్ని 500 పౌనులకు నిలువలు మించకండా చేయడానికి తగులబెట్టేవాళ్లు! దగ్ధమవుతూన్న సుగంధద్రవ్యాల వాసనలతో చుట్టూ కొన్ని మైళ్ళదూరంవరకూ వాతావరణమంతా సురభిళంగా వుండేది...

ఈ భూగోళ మనే ఆపిల్ పండులో సగభాగాన్ని పొందిన పోర్చుగీజు వాళ్ళకి దాన్ని నిలిపివుంచుకోడానికి చచ్చినంత పని అవుతూంది. రెండో సగాన్ని పొందిన స్పెయిన్ వాళ్ళ గతీ అంతంత మాత్రంగానే వుంది! దురాశాపరులైన వాళ్ళు వెండిబంగారాల నింకా యింకా ప్రోగుచేసుకోడానికి మహా తాపత్రయం పడిపోతూండేవాళ్ళు. వాళ్ళకి కాలుచేతులు పనిచేస్తూన్నాయా ? లేదా ? అనిపించేది, చూసేవాళ్ళకి. వాళ్ళు అసలు యే పనీ చేయరు. పనిచేయడ మంటే పరువు తక్కువ అని వాళ్ళ అభిప్రాయం! నైట్స్ అంటారు అక్కడ యోధుల్ని. వాళ్ళు ఆయుధోపజీవు లన్నమాట. వీళ్ళ వారసులైన కాస్టిలియను 'హైడల్గో'లు, తా మంతగా అభిజాత్యులు గాకపోయినా "పనిచేయడం, రేపటి సంగతి ఆలోచించుకుని చింతించడం స్పానిష్ వారికి పరువు తక్కువ!" అంటూండేవాళ్ళు. సరే; పరిస్థితు లింతవరకూ వచ్చేయి. పను

లన్నిటినీ చేసే యూదులూ, అరబ్బులూ తరిమివేయబడ్డారు. పశ్చిమ యిండియా దీవులనుంచి ప్రముచ్చిలి తెచ్చిన బంగారంతోనే యింక యే పనీపాటూ చేయనక్కర లేకండా సుఖంగా, వైభోగాలతో తులతూగుతూ వుండగల మని ఆ స్పానిష్‌వాళ్ళనుకునేవాళ్ళు. కాని సోమరిపోతులైన వాళ్ళ హస్తాల్లోంచి* యెంత బంగారమైనా యిట్టే జారిపోయీది! హరించిపోయీది! ఇంగ్లీషు, ఫ్రెంచి, డచ్చివాళ్లు తయారుచేసిన సరకుల మూల్యం క్రింద స్పానిష్ వాళ్ళ దొంగబంగారం కర్పూరంలా హరించి మాయమైపోయేది!

విదేశాలనుంచి దొంగ సరకులు చేరవేసేవాళ్ళు. పశ్చిమ యిండియా దీవులతో వ్యాపారం చేసి, కుబేరు లయేరు. స్పానిష్ ప్రభుత్వపు రేవుసుంకముల ఉద్యోగులలోనూ, చివరకు మాడ్రిడ్‌లోనూ కూడా యీ దొంగవ్యాపారులకు మిత్రు లుండేవాళ్ళు. వీళ్ళ కెల్లాంటి యిబ్బందులూ రాకుండా చేస్తూ, వీళ్లు తినే దొంగ గడ్డిలో కొంత వాళ్లూ మేస్తూండేవాళ్ళు.

స్పానిష్ రాజులు (హైడల్గోలు=యోధులు) తమ బంగారు నంతనూ ఆడంబరములకూ, విందువినోదాలకూ వ్యర్థంగా వెదజల్లుతూంటే, మరోకచోట ఆంగ్లవర్తకులూ,

---

* శ్లో. అర్థానా మార్జనం కార్యం । వర్ధనం రక్షణం తథా ।
భక్ష్యమాణో నిరాదాయః । కుబేరు రపి హీయతే॥

పనివాళ్ళూ యెంతో కష్టిస్తూ, ఓడలు నిర్మిస్తూ, వలసలు స్థాపిస్తూ వుండేవాళ్ళు. ఇంగ్లీషు ఓడలు అంతకంత కధిక సంఖ్యల్లో అమెరికాకు వెడుతూన్నాయి. భూగోళంలో పశ్చిమార్థభాగం స్పెయిన్‌వారికి చెందినదనే విషయాన్ని ఇంగ్లీషువాళ్ళు గుర్తించ నిరాకరించేరు. సముద్రాంతర వ్యాపారాన్ని ఆంగ్లేయులు మానుకోవాలని స్పెయిన్ రాజు దబాయించేడు. కాని, అటువంటి భ్రమలు పెట్టుకో వద్దని యింగ్లాండు హెచ్చరిక చేసింది.

ఇప్పు డీ పేచీకూడా పరిష్కారం కావలసి వచ్చింది. దీనికోసం మళ్ళా ఓడలూ, ఫిరంగులూ కావల్సివచ్చేయి. వాటితో పరిష్కారం గాని పేచీయే లేదనుకోండి. సరే. స్పెయిన్‌వారి 'ఆర్మడా' అనబడే మహా నౌకాదళం ఓడించ బడి, సర్వనాశం చేయబడింది. అట్లాంటిక్ మహాసముద్ర మార్గం నిష్కంటకమైంది.

కాని, సముద్రమార్గాలకోసం యుద్ధం ఆగిపోలేదు. స్పెయిన్ వాళ్ళు రంగంమీంచి పోయినా, యుద్ధం సాగుతూనే వుంది. డచ్చివారు ఆంగ్లేయులతో యుద్ధానికి తలపడ్డారు...

ఏతావతా భూగోళ మనే ఆపిల్ పండుకోసం మానవ జాతులమధ్య పోరాటాలు సాగుతూనే వున్నాయి. ఫలాశయే కదా సర్వపోరాటాలకూ మూలం!

## 9. మూడు ఓడల కథ - గొప్పదైన ఉత్తరదేశపు గాథ !

కొందరు ఓడ అధిపతులు హిందూదేశం, చీనాదేశం చేరేందుకు పశ్చిమదిశగా బైలుదేరి మార్గాన్వేషణ గావిస్తూంటే, మరికొందరు ఈశాన్యదిశగా బైలుదేరి ఆ మహా దేశాలను చేరుకోలేమా ? అని అన్వేషిస్తూన్నారు.

1548 లో లండన్ నగరంలో ఒక సంఘం స్థాపించబడింది. దాని పేరు 'వ్యాపార-అన్వేషకుల కంపెనీ.' దాని ఉద్దేశ్యం 'ఇంతవరకూ అజ్ఞాతములున్నూ, సముద్రమార్గాన అగమ్యాములున్నూ ఐన దేశాలు, ద్వీపాలు, రాజ్యాలు, ప్రాంతాలు కనుగొనుట.'

సుప్రసిద్ధుడైన నావికు డొకడు, సెబాస్టియన్ కాబొట్ యీ కంపెనీకి జనరలు మేనేజరుగా యెన్నుకోబడ్డాడు. ఉత్తర అమెరికాను కనిపెట్టిన జాన్ కాబొట్ కుమారుడే యితడు. జాన్ కాబొట్ చనిపోయి చాలా కాలమైంది. సెబాస్టియన్ కాబొట్ కూడా యిప్పుడు వృద్ధుడే. సెబాస్టియను ఓడమీదకు అడుగుబెట్టి యిప్పటికి చాలకాలమైంది. ఆతనిలో కార్యోత్సాహంమాత్రం యింకా పెరుగుతూనే వుంది ! తూర్పున వున్న దేశాలకు, దివ్యసుగంధ వాసనా వాసితములైన పుణ్యభూములకు కొత్త మార్గాన్ని కనిపెట్టా లని ఆత డింకా కలలు గంటూనే వుంటున్నాడు.

చిత్రకారుడు హోల్‌బీన్ ఆతని పటమును రాసేడు. దీర్ఘకాయం, తెల్లని గడ్డం; ఛాతీమీద బంగారు గొలుసు; నల్లని టోపీ ధరించి, లండను నగరంలోని స్వగృహములో కిటికీదగ్గర నిలబడి వుంటాడు. అంచులలో బొచ్చుతో వున్న చర్మం వేసి కుట్టిన పెద్ద కోటును ధరించి, ఒకచేత గ్లోబ్‌ను, రెండోచేత కంపాస్‌ను పట్టుకుని వుంటాడు. ముడుదలుపడిన కనుబొమ్మల క్రింద ఆయన నేత్రాలు జాజ్జ్వల్యమానంగా వున్నాయి. ఎట్ట యెదుట నాతడు థేమ్స్ నదిలోని పడవలు, తెప్పలు గాక ఆర్కిటిక్ మహాసముద్రంలో పోతూన్న మహానౌకల దళమును చూస్తూన్నట్లుంది.

ఆతడిదివరలో వాయువ్యమార్గాన వెళ్ళి, హిందూదేశానికి చేరాలనీ ప్రయత్నించేడు. అప్పుడే ఆతడు న్యూఫౌండ్‌లాండ్‌ను కనిపెట్టినది. ఇప్పుడాతడింకొక మార్గాన్నిగూర్చి యోచిస్తూన్నాడు. వాయువ్యదిశలో గాక ఈశాన్యదిశగా బైలుదేరేడాయన. ఈ ప్రయాణానికి ఓడలప్పుడే సంసిద్ధమొనర్పబడినాయి. ఆ ఓడలన్నీకూడా మంచి బలమైన కర్రతోనే కట్టబడినాయి. పద్దెనిమిది నెలలకు సరిపడిన ఆహారం వాటిలో భద్రపరచబడి వుంది. ఓడలు దొంగలనుంచి రక్షించుకోడానికి ఫిరంగులు, మందుగుండూ కూడ వాటిలో సిద్ధంగా వుంచబడి వుంది.

సెబాస్టియన్ కాబొట్ యీ అన్వేషణ దళాధిపత్యం స్వీకరించేటందుకు పరమసంతోషంతో అంగీకరించేవాడే గాని

అతడు చాల వృద్ధుడైపోయేడు. ఈ నౌకాదళాన్ని అతడు కేవలం ఆలోచనలతో మాత్రమే అనుగమించగలడు. అంతే గాదు, వాటిని అనుగమించడం కాదు; వాటిని అధిగమించి, అతిక్రమించి, యెంతో ముందు పోగలడు, ఆలోచనా ప్రపంచంలో.

ఓడ లింకనూ యెక్కడా లంగరు వేయనేలేదు. కాని, అప్పుడే సెబాస్టియన్ తన మనోనేత్రంతో బర్బరులు నివసించే యెడారిభూముల్ని చూస్తూన్నాడు అక్కడ ప్రకృతీ, దానితో బాటు మానవుడూకూడా బహుకర్కశంగా వున్నాయి. తుపానులు, నీటక్రింద కొండలు, యుద్ధాలు. విషదిగ్ధబాణాలు, ఒక టేమిటి? నావికుల నెదుర్కొననున్న అపాయాల నెన్నింటినో ఆతడు ముందుగానే ఊహించేడు.

అన్వేషకదళం ఆయుధాలతోను, ఆహారపదార్థాలతోనూ సుసంపన్న మొనర్చబడింది. కాని, అంతమాత్రాన చాలదు. ఎల్లాంటి పరిస్థితులనైనా యెదుర్కొనే సంసిద్ధులుగా నున్న విశిష్టవ్యక్తులతో, విశేషమైన లోకజ్ఞానం, అనుభవంగల వాళ్ళతో ఆ దళం పూరింపబడినప్పుడే సత్ఫలితాలను సాధించ గలుగుతుంది.

సెబాస్టియన్ కాబొట్ టేబిలుముందు కూర్చుని, కలం పట్టుకొని, నోటుబుక్కులో వ్రాయ నారంభించేడు.

"పేరా 28. సముద్రతీరాలలో రాళ్ళు, బంగారు, లోహములు మొదలైనవి ప్రోగుచేయబడుతూన్నట్లు చూస్తే మీరు

ఓడను దరికి పట్టించి, జరుగుచున్న పనిని పరిశీలించాలి. అదే సమయంలో అక్కడి జనుల దృష్టిని ఆకర్షించేందుకై ఢంకా ప్రయోగించండి. ఆ జనులలో కుతూహలమును రేకెత్తించాలి. కాని, మీరు మాత్రం అపాయానికి దూరంలో నిలిచి యుండాలి; వారిపట్ల యెల్లాంటి విరోధభావాన్నీ క్రూరత్వాన్నీ ప్రదర్శించరాదు."

..........................................................

"పేరా 30. వాళ్లు సింహశార్దూల భల్లూకాదుల చర్మములను గనుక ధరించివుంటే, పొడవైన ధనుర్బాణాదుల్ని చేతబట్టి వుంటే, మీరేమీ భయపడబోకండి. మీకంటె వాళ్లే అధికభయాకులితులై వుంటారు..."

..........................................................

సెబాస్టియన్ కాబొట్ సముద్రనావికుడుగా తాను సంపాదించిన అపారానుభవాన్నంతనూ యీ సూచనలలో పొందుపరచేడు. ఆతడు అన్వేషణా దళాల్లో పోయే ఓడలకు కెప్టెనులను, సరంగులను తయారుచేస్తున్నాడు. కొలంబస్ గావించిన పొరబాటు నీతడు చేయదలచలేదు. సముద్రాంతరాల్లో సంపద్వంతములూ, బలవంతములూ నైన నాగరిక రాజ్యాలను చూడగలనని ఆశించిన కొలంబస్, ఆటవిక జనులు నివసించే ద్వీపాలను చూసేడు.

సెబాస్టియన్ యదార్థానుగుణ్యమైన, ఖచ్చితమైన ఊహాపోహాలు గలవాడు పగటి కలలు కనువాడుగా డాయన. తన

అన్వేషణాదళం నిర్జనప్రదేశాలకు, యెడారి భూములకూ, ఆట విక దేశాలకూ వెడుతుందనీ, యీ దీర్ఘయాత్రలో తటస్థించే ప్రమాదా లన్నిటినీ యెదుర్కోడానికి యేర్పాటు చేసుకోవా లనీ ఆయన ముందే వూహించేడు. ఈ అన్వేషణా ఫలితాలు మంచివిగా వుంటా యని ఆశిస్తూ, ఆయన యీ సూచనలను ముగించేడు. పశ్చిమ యిండియా దీవులకు స్పెయిన్ వాళ్ళూ, తూర్పు యిండియా దీవులకు పోర్చుగీసువాళ్ళూ గావించిన నౌకాయానములవల్ల గలిగిన ఫలితాలకంటె తక్కువ ఫలి తాలు తమ నౌకా యాత్రలవల్ల కలుగవని ఆతని నిశ్చితాభి ప్రాయం.

"భగవంతుడు తన అవ్యాజానురాగమును చూపి, యాత్రీ కుల నందరనూ సంరక్షించుగాక !" యను ప్రార్థనతో నోట్సు పూర్తిచేసి, క్రింద చేవ్రాలు చేసేడు, సెబాస్టియన్ కాబొట్. కంపిత హస్తుడై, ఆఖరున క్రింద సంఘముద్రను కూడ వేసి, పూర్తిచేసేడు.

క్రీస్తుశకం 1553 మే 11 వ తేదీని, ఇంగ్లాండు రాజు ఆరవ ఎడ్వర్డు పరిపాలనలో ఏడవయేట, యీ అన్వేషణాదళము, సర్ హ్యూగ్ విల్లోబీ నాయకత్వంక్రింద బైలుదేరింది. లంగరు యెత్తి, ఓడలు నదీతీరం వెంబడే మెల్లగా సాగిపోయినాయి ప్రత్యక్షంగా చూసినవాళ్ళు చెప్పినదాన్నిబట్టి, నదీతీరాల వెంబడే వేలాది ప్రేక్షకులు బారులు తీరి నిలబడి చూస్తూ న్నారు. గ్రీన్ విచ్ రాజభవనపు వాతాయనముల నుంచీ,

గోపురగవాక్షములనుంచీ రాజోద్యోగులు చూస్తూన్నారు. ఓడల ఫిరంగులు రాజుకు వందనపూర్వకంగా ఫిరంగులు పేలుస్తూంటే చుట్టుపట్లనుంచి ప్రతిధ్వను లీనుతూన్నాయి. నావికులు నీలాకాశవర్ణపు దుస్తులు ధరించి, డెక్కులమీద బారులుతీరి నిలుచుని, మేఘమండల మంతా ప్రతిధ్వనించేటట్లు జయజయ ధ్వానాలు చేస్తూన్నారు.

ఈ దళంలో మూడు ఓడ లున్నాయి. వాటి పేర్లు గుడ్ హోప్, గుడ్ ఫెయిత్, ది ఎడ్వర్డు లేక గుడ్ ఎంటర్‌ప్రైజ్.

ఉత్తరాభిముఖంగా నార్వే తీరంవైపుగా అవి ప్రయాణమై పోతూన్నాయి. వ్యతిరేక పవనములచే అవి చాలసార్లు ఆగిపోవాల్సి వచ్చేది. మరెన్నోసార్లు తుపానులు వచ్చినప్పుడు నావికులే తెరచాపలు చుట్టి వేయాల్సివచ్చింది.

ఫిన్‌మార్క్ తీరంలో ఒకచోట వుండగా మహాభయంకరమైన తుపాను వీచింది. ఆ ఓడలను దారి తప్పించి, దూరంగా తీసికొనిపోయి, విడదీసి చెదరగొట్టేసింది. గుడ్ హోప్, గుడ్ ఫెయిత్‌లు రెండూ చాలాకాలంవరకూ మంచుకొండలలో చిక్కుకుని పరిభ్రమిస్తూ, ఆఖరికి ఒక అజ్ఞాత నదీముఖ ద్వారంలో రక్షణ తీసికొన్నాయి. సర్ హ్యూగ్ విల్లోబీ ఆ శీతువువం దచ్చట నిలచిపోయి, అన్ని దిక్కులకూ వేగులను పంపడానికి నిశ్చయించేడు. కాని, వేగు లందరూ కూడ యెక్కడా జనసంచారం గాని, జనావాసాలు గాని కనుక్కో లేక తిరిగి వచ్చేసేరు.

ఇక మూడో ఓడ, గుడ్ ఎంటర్‌ప్రైజ్ అజ్ఞాత దేశముల నన్వేషిస్తూ పోయింది.

ఆ ఓడ యే యే దేశాలు కనుగొన్నది? క్లెమెంట్ ఆడమ్స్ అను ఆంగ్లేయుడు చెప్పిన యీ కథ వినండి.

"ఈశ్వరుడు కరుణామయుడై ఓడనొక అఖాతంలోనికి తీసికొనిపోయేడు. అది నూరుమైళ్ళో, లేక యింకా అధికమో పొడవు గలిగినట్టిది. ఆ అఖాతంలోనికి ప్రవేశించి ఆ ఓడ లంగరు వేసింది. చుట్టూ చూడగా దూరంలో వారికొక జాలరి పడవ కనిపించింది.

"కెప్టెన్ ఛాన్స్‌లర్ కొంతమందిని వెంటతీసికొని ఆ జాలరుల వద్దకు బైలుదేరేడు. వారెవరో, ఆ దేశమేదో, వారి జీవిత విధాన మెట్టిదో తెలుసుకోవాలని ఆయన తలంపు. కాని, ఆ జాలరులు ఓడయొక్క పరిమాణం, ఆకారం చూసి, సంభ్రమాశ్చర్యముల నొంది, పరుగెత్తిపోయేరు!..."

ఇంతవరకూ అంతా సెబాస్టియన్ సూచనల ననుసరించే జరిగిందనుకోండి. ఆయన సూచనల ప్రకారం తరువాతి కర్తవ్యం, ఢంకా వాయించి, తత్ప్రాంతవాసుల దృష్టి నాకర్షించడం. కాని, ఢంకా వాయించడం జరుగనే లేదు. మంచి సలహా ఒక యెత్తూ, దాని ననుసరించడం మరొక యెత్తూను. మంచి సలహాల ననుసరించడం యెప్పుడూ జరుగదుగదా!

ఆ జాలరు లన్నివైపులకూ చెదరిపోయి, యెవరో కొత్త వాళ్ళు వచ్చే రనే వార్తను తమవారికి అందచేసేరు. ఓడను చూడ్డానికి స్థానిక జనులు పడవలలో బైలుదేరి వచ్చేరు. వారిలోనే ఆ ప్రాంతపు పరిపాలకుడు కూడా వున్నాడు.

క్లైమెంట్ ఆడమ్స్ మళ్ళా యిల్లా వ్రాసేడు

"ఆ దేశం పేరు రష్యా యని మావాళ్ళు తెలుసుకున్నారు. దానినే 'మాస్కోవీ' అని కూడా అంటారు. ఆ దేశపు రాజు పేరు ఇవాన్ వాసిలియేవిచ్. (ఇది అప్పటి రాజు పేరు) సముద్రతీరాన్నుంచి చాల లోపలికంటా వున్న భూముల కన్నిటికీ ఆయనే పరిపాలకుడు..."

కెప్టెన్ ఛాన్సలర్ దేశంలోపలికి వెడుతూన్న కొద్దీ 'మాస్కోవీ' అనాగరక, ఆటవిక దేశాలవంటిది గాదని తెలిసిపోయింది. సెబాస్టియన్ హెచ్చరించిన బర్బరజాతులు గారు, అక్కడి జనులు.

కెప్టెన్ ఛాన్సలర్ యిల్లా వ్రాసేడు.

"దేశమంతా బాగుగా సాగుచేయబడివుంది. ధాన్యాదులు పంటబెట్టబడి యున్నాయి. ప్రతి ఉదయమూ ఆరేడు వందల సరుగుడు బండ్లు ధాన్యాదులు, చేపలుతో పిటపిటలాడుతూ, వస్తూ పోతూండడం చూస్తాము.

"మాస్కో ఒక పెద్ద నగరం. లండను, దాని పరిసరాలు కంటె యీ పట్టణం పెద్దదై వుంటుందని నేను అంచనా వేసేను."

ఛాన్సలర్ మాస్కోలో ఒక చక్కని కోటను చూసేడు. దాని చుట్టూ యెత్తైన గోడ లున్నాయి. కోటలో సుందరము లైన మేడు చెర్చి లున్నాయి. అక్కడ పాలకుని జార్ అంటారు. జార్ ప్రాసాదము ప్రాచీన ఆంగ్ల రాజభవనాల మాదిరిగా వుంది.

ఆ దేశాంతర్భాగంలోనికి పోతూ కెప్టెన్ ఛాన్సలర్ అచ్చట బంగారును చూడ నభిలషించేడు. నిజంగానే అక్కడ ఆతనికి బోలెడంత బంగారం కనబడింది. ఆ ఆంగ్లేయుని మాస్కోలో ఒక గదిలోనికి గొంపోయేరు. దాని పేరు 'స్వర్ణమందిరము.'

దానిలోపల టేబిల్సు, గోడబల్లలు మీద స్వర్ణపాత్రలు దొంతులుగా పేర్చివున్నాయి. అక్కడనుంచి యీ విదేశీ అతిథులను మరొక గదిలోనికి గొంపోయేరు. అది భోజనాల గది. దీనిని స్వర్ణమందిర మని పిలువకపోయినా దీనినిండా కూడ బంగారమే వుంది. అక్కడ బంగారు గిండీలు, గజం యెత్తుండే 'ఆశ్వికకలశములు' వున్నాయి! వడ్డించే పరిచారకులు బుజాలమీద తువాళ్లు వేసికొని, గోడబల్లలవద్ద నిల్చుని వున్నారు. ఒక్కొక్కని చేతిలో ఒక్కొక్క బంగారు కలశము వుంది. ఆ బంగారు కలశముల చుట్టూ ముత్యాలు, వజ్రాలు తాపి వున్నాయి! ఈ పాత్రకలశాదు లన్నీ జార్ పాలకునివే. ఆయనకే గాక అతిథు లందరకూ కూడా భోజనం బంగారు పళ్లెరముల్లోనే వడ్డించబడింది. ఆ విందులో రెండువందలమంది అతిథు లున్నారు. అందరకూ సరిపడిన స్వర్ణపాత్రాదికము

లచ్చట వున్నాయి! రాజబంధువుల పరిచారకు లంతా బంగారు సరిగ దుస్తులను ధరించేరు.

ఈ విదేశీయులు జార్ ప్రాసాదాన్ని గూర్చి, అక్కడి విషయాన్ని గూర్చి గావించిన వర్ణన మిది.

ఈతని నోట్సు మాత్రమే ఐతే మన కానాటి మాస్కో రాజ్యాన్ని గూర్చి అంత హెచ్చుగా తెలిసివుండేదే గాదు. కాని, అదృష్టవశాత్తూ, మాస్కో వాస్తవ్యులే తమ నగరమును గూర్చి చెప్పిన విషయాలు మనకు లభించేయి. వాటినిబట్టి జారు భవనం వెండిబంగారాలకే గాక మరెన్నో వాటికి ప్రసిద్ధి కెక్కిన దని తెలుస్తూంది.

స్వర్ణమందిర కుడ్యము లన్నీ బహు సుందరములైన చిత్రములతో నిండివున్నాయి. వసారాల్లో ఇస్రాయెల్ సైన్యాలు జోషువా చీన్‌నూన్ నాయకత్వమున సాధించిన విజయముల, గావించిన యుద్ధముల చిత్రము లనేకములు చిత్రించబడి వున్నాయి. ఇవిగో! ఈ పది చిత్రములూ రషియనులు తార్తారులపై యిటీవల సాధించిన విజయముల నందరకూ జ్ఞప్తికి దెచ్చునవి! మందిరపు సరంబీమీద ఖగోళములూ, క్రీస్తూ, చుట్టూ అనేక యితర చిత్రాలచే పరివేష్టించబడి వుంటాయి. వివేకం – అవివేకం, భూతాలు, వాయువు – అగ్ని, పవనములు, నాలుగు ఋతువులు – యిల్లాగే వివిధ విషయాలమీద సాంప్రదాయిక విజ్ఞానమును యీ కుడ్య

చిత్రాలద్వారా ప్రబోధించేవారు. ఆఖరికి గోడలమీదనే గాక కలశములమీదా, కుంభములమీదా కూడా పురాణ చిత్రములు మొదలైనవి, సంఘటనలు, ప్రసిద్ధులైన రాజుల చిత్రములు మొదలైనవి వ్రాయబడివున్నాయి మహారాజు వ్లాడిమిర్‌తో యీ రాజ వంశావళి ప్రారంభించబడింది. విదేశాగతులైన అతిథులు వీటి నన్నిటినీ గాంచి అద్భుత ప్రమోదాలను పొందేరు.

రష్యను ప్రభుత్వాధికారులు, బోయరులు * లౌకికమైన చిత్రముల వైపు చూడకుండుటకే యత్నించేవారు. వెనకటి కాలంలో దైవాంశ సంభూతులైన మహాజనులే, పవిత్ర ఋషి పుంగవులే చిత్రించబడే వాళ్ళు. కాని, యిప్పుడు చిత్రలేఖనం కొత్త సాంప్రదాయాల ననుసరిస్తూంది. ఒకప్పుడు పవిత్ర చిత్రములే, దివ్యచరిత్రలే కుడ్యములపై కనబడేవి. అటువంటి దిప్పుడు ఈశ్వర పుత్రుడైన ఏసు క్రీస్తుతో బాటు, నాట్య భంగిమలో ఉత్సాహంగా నున్న సాధారణ స్త్రీ మ్యూజీషియన్ కూడా కుడ్య చిత్రాల్లో కనిపిస్తూంది!

ఇదంతా మానవుడు సత్యమునుంచి పతితు డగుటవల్లనే నని బోయర్ల అభిప్రాయం. లౌకిక కావ్యాది గ్రంథపఠనం వల్లనూ, మతధర్మ విరుద్ధములైన శాస్త్ర గ్రంథ వ్యాప్తి

* బోయరులంటే భూస్వామ్య లన్నమాట. వీళ్ళే జమీందారులు. వీళ్ళ కుటుంబాల వాళ్ళే ప్రభుత్వాధికారాల్లో యెక్కువగా ఉండే వాళ్ళు.

వల్లనూ మానవులు క్రమంగా తెలుగుమీరిపోయి, పతితు లవుతూన్నారు. జార్ కూడ యిల్లాంటి శాస్త్రగ్రంథములపట్ల దభిమానం గలవాడే. బోయర్లు పొడవైన తమ గడ్డాలనూ, ఎత్తైన టోపీలను అడ్డంగా ఆడిస్తూ, తమలో తాము మెల్లగా గొణుక్కునేవాళ్లు: "అబ్బే! బొత్తిగా ధర్మవిరుద్ధంగా వుంది! ప్రమాదకరమైన సనాతన విరుద్ధమే కనిపిస్తూంది, అన్నిచోట్లా! శాస్త్ర గ్రంథపఠనం వల్ల జనించిన జాడ్యమే, యిది!"

ఇల్లాంటి సంభాషణాల నా పరదేశులు విన్నారో లేదో తెలియదనుకోండి. కాని, బహిరంగంగా మాత్రం బోయరులు కూడా జార్‌ను ఎంతో శ్లాఘించేవాళ్లు. "ఆఁహాఁహాఁ! మహా రాజావారెక్కడండీ? ఆయన బుద్ధి పాదరసంలాంటిది కాదుటండీ! బృహస్పతే అని చెప్పాలి! సమస్త శాస్త్రాల్లోనూ నిధేనండీ! దేన్ని గురించి మాట్లాడినా ఆయనకి మంచినీళ్ళ ప్రాయంగదా!" అని యెత్తుకొనేవాళ్ళు.

జార్ ఇవాన్‌ను 'ది టెరిబుల్' అనగా 'అతిభయంకరుడు' అని పిలిచేవారు. ఆయన విషయంలోమాత్రం పైనుదహరించిన శ్లాఘన సత్యదూరం కాదు. ఆయన చాల విజ్ఞానవంతుడూ, బహుశ్రుతుడూను. పవిత్ర ఈశ్వర గ్రంధాలనుంచీ, ఋషుల నుంచీ, చర్చి పితరుల (ఫాదరుల) నుంచీ యెన్నెన్నో సూక్తు లాయనకు కంఠస్థములు. ఆయన తాను చెప్పే విషయాలన్నిం టినీ యూదు, గ్రీకు, రోమక, గోధు, ఫ్రెంచి యితిహాసాల నుంచి తీసిన యెన్నెన్నో ఉదాహరణలతో సమర్థించుతూండే

వాడు. ఆయన వ్రాసే లేఖ లన్నీ పాత నిబంధనలోని రాజుల, వీరుల,- దావీదు, సోలమన్, జోషువా, చీన్‌నూన్ మొదలైన మహనీయుల నామధేయములతోనే గాక అన్యమతస్థులూ, క్రైస్తవేతరులూ ఐన వారి దేవుళ్ళు. వీరులు - జ్యూస్, అపోలో, అయేనియాస్ మొదలైన వారి పేర్లతో కూడ నిండివుండేవి. వారి బోధనలు వాటిలో అనుగుణంగునా ఉల్లేఖించబడి వుంటూండేవి.

జార్ ఆజ్ఞానుసారంగా మాస్కో పట్టణంలో నొక ముద్రణ శాల కూడ స్థాపించబడింది. ముద్రాపకుడైన ఇవాన్ ఫియోడొరోవ్, అందులోని యాంత్రిక కార్యములనే గాక ప్రకరణాదుల ముందుంచు సాలంకారవర్ణమాలను కూడ చెక్కుతూండేవాడు.

అచ్చువేయుట యెంత ఉపయుక్తమైనదో జార్ గ్రహించినవాడు. జను లందరూ 'అపరిచితులున్నూ, బుద్ధిమందపరిష్కృతులున్నూ' ఐయుండుటచే వారిని విజ్ఞానవంతులుగా జేయుటకున్నూ, రష్యారాజ్యమును దృఢపరచుటకున్నూ గ్రంథముల నచ్చువేయుట యెంతో అవసరమని ఆయన గుర్తించేడు.

అచ్చుకూటం వుంచడానికి విశాలమైన భవనం కడుతూన్నారు. దాని సింహద్వారం మంచి నగిషీపనితో నిండివుంది. ఎత్తైన గోపురంకూడా ఆ భవనానికి శోభనిస్తూండేది. ఇంకా బోలెడు పని మిగిలి వుండేమో, పరవంజాలు దానిచుట్టూ క్రమ్ముకుని వున్నాయి. ఆ పీఠపు గోప్ప బోయిరులు యీ అట్ట

హాసం అంతా చూసి, అసంతుష్టితో శిరఃకంపం గావిస్తూండే వాళ్ళు. ఇల్లాంటి నూతన విషయాలేవీ బోయరులకు రుచించవు. తన భూఖండంమీద ప్రతిబోయరూ సర్వాధికారిగా నుండిన గత దినములను వారు మరిచిపోనే లేదు.

పూర్వకాలంలో ఒకానొకప్పుడు చారణులు ప్రజలయొక్క 'ఏక మనస్కత'ను గూర్చి గానం చేసేరు. 'ఇగోర్ రాజుకథ'ను పాడు చారణులు తమ కథలో రాజులనూ, సామంతులనూ, వాళ్ళ సంకుచిత భావాలనూ తూర్పారబట్టేవాళ్ళు. తమలో కజ్జాలు, కావేషీలు పెంచుకుని, కలహించుకుంటూ రష్యా దేశాన్ని బైటి శత్రువులకు లోబడజేసినది యీ రాజులే గదా?

మరేమో యిప్పుడా కాలం గడచిపోయింది. రష్యాదేశాని కంతకూ జార్ రాజాధిరాజు ఐనాడు. సమర్థుడైన పరిపాల కుడుగా జార్, రష్యను రాజసామంత వంశీకులకు ప్రత్యేక దయాదాక్షిణ్యాలు గాని, అభిమానాదరణలు గాని చూపటం లేదు. స్వార్థపరులూ, సంకుచిత స్వభావులూ ఐన యీ మూర్ఖరాజులను అదుపాజ్ఞల్లో పెడుతున్నాడు, జార్ చక్రవర్తి. రూస్ దేశానికి బహు సంఖ్యాకులైన పాలకులకు మారుగా యిప్పుడు ఒకడే పాలకుడు. రూస్ దేశం ఐక్యతతో, బలాఢ్యమైనదిగా వుంది, యేకాధిపత్యంక్రింద.

పాతకొత్తలకు పోరాటం నడుస్తూనే వుంది. రాజులు, సామంతులు పురాతన సామాజిక విధానాన్ని బలపరచేవాళ్లు. చిన్న

భూస్వాములు, సైనికులు మొదలైనవా రందరూ నూతన విధానాన్ని, యేకచ్ఛత్రాధిపత్యాన్ని సమర్థించేవాళ్లు.

ఈ రెండు పక్షముల మధ్యా జరిగేపోరాటం కత్తితోటీ, కూటనీతితోటీ మాత్రమేగాక కలంతోకూడా కొనసాగించ బడుతూండేది. ఇందులోని యాథార్థ్యాన్ని ఆ నాటి గ్రంథాలు, లేఖాపత్రాలు విస్పష్టం చేస్తాయి. ఉదాహరణకు ఇవాన్ పెరిస్వెతోవ్ గ్రంథాలు చూడండి. జార్, ఇవాన్ వాసిలియే విచ్ పాలనా ప్రారంభంలో, సామంతరాజులు అధికారాన్ని హస్తగతం గావించుకున్న దినాల్లో ఈ గ్రంథాలు రచించ బడినాయి.

ఇవాన్ పెరిస్వెతోవ్ రాజసభలోని సలహాదార్లలో నొకడు. సామంత రాజులు 'ధనవంతులైన సోమరు'లని అతడు ఖండించేవాడు. మోసం, అసత్యం ద్వారానే వారు సిరిసంపద లను ప్రోగుచేసేరు. రైతులను తమక్రింద బానిసలుగా చేసి నందుకు సామంతప్రభువర్గాన్ని ఆయన తన గ్రంథాల్లో ఆడిపోసేడు.

"జనులు బానిసలుగా చేయబడిన దేశంలో వారు ధైర్య శాలురుగా వుండరు. శత్రువులతో యుద్ధంచేయడంలో అటు వంటివాళ్ళు బాహుబలం, పరాక్రమం చూపలేరుకూడాను. బానిస యెప్పుడూ అవమానానికి వెరువడు. అతడు బలహీనుడు గానీ, బలవంతుడు గానీ, మర్యాదను, ఆత్మగౌర వాన్నీ సంపాదించబోడు. 'నేను బానిసను. అలా వున్నంత

కాలం నాకు మరొక పేరు ప్రతిష్ఠ లేముంటాయి ?" అంటాడు, బానిస."

ఇవిగాక మరొక తరహా గ్రంథాలూ వ్రాయబడేవి. వాటిలో పాతకాలమునాటి విధానాలు సమర్థించబడతాయి. జార్ కు, కుర్బ్‌స్కీ-రాజుకు మధ్య నడచిన ఉత్తర ప్రత్యుత్తరాలు మనకు లభిస్తూన్నాయి. యరోస్లావ్ రాజులవంశీకుడీ కుర్బ్‌స్కీ-రాజు. మాస్కో జార్ యిప్పుడు రష్యాకంతకూ రాజరాజు అనే యదార్థాన్ని ఆతడు అంగీకరించ నిరాకరించేడు. కుర్బ్‌స్కీ-రాజు దేశాన్నుంచి పారిపోయి, శత్రువులతో చేతులు కలిపేడు. తన యీ పనిని సమర్థించుకోడానికిగాను కొన్ని ప్రత్యారోపణలు గావిస్తూ జార్ కు ఒక లేఖను వ్రాసేడాయన. జార్ నిరంకుశంగా వ్యవహరిస్తూన్నాడనీ, సర్వాధికారాన్ని హస్తగతం చేసుకున్నాడనీ, జనుల రక్తమును పీల్చు క్రూరుడనీ, ఆయన నిందించేడు.

దానికి జవాబుగా జార్ ఒక గ్రంథాన్నే వ్రాసేడు. కుర్బ్‌స్కీ-రాజు దేశద్రోహాన్ని బైటపెడుతూ, రూస్ దేశానికి తానొక్కడే యేకచ్ఛత్రాధిపతిగా వుండేందుకు హక్కు గలదని దానిలో నిరూపించేడు.

జార్ విద్వాంసుడు. కలమును సమర్థతతో నడపగలవాడు. కాని, అతని శత్రువైన కుర్బ్‌స్కీ-రాజకూడా ఆ కాలంలోని పండితులలో యెన్నదగిన వాడే. ఆయన అరిస్టాటిల్ ను పఠించేడు, శిశిరోసు అనువదించేడు !

ఈ యిద్దరి ఉత్తర ప్రత్యుత్తరాలూ యిద్దరు మహా యోధులమధ్య ద్వంద్వయుద్ధం లాంటివి. కాని, ఒకరు పాతను సమర్థిస్తారు, రెండోవాడు నూతనమును వాంఛిస్తాడు. చరిత్ర పరిణామగతికూడా జార్ పక్షమునసే వున్నట్లుంది, మరి.

జార్ ఇవాన్‌ను అందరూ 'ది టెరిబుల్' (అరిభయంకరుడు) అని పిలిచేవారని చెప్పేనుగదూ. అతడు నిజంగానే విదేశీయులైన విజేతలకూ, దేశీయులైన సామంత ప్రభువులకూ భయంకరుడే. ఆ కాలంలో రూస్ రాజ్యానికి శత్రువుల కేమీ కొరత లేదు.

ఒకానొకప్పుడు తూర్పు పడమరలలో ద్వారాలు బాగా తెరువబడే వుండినాయి. పెద్ద రాజమార్గం, ఘంటాపథం 'వరాంగియన్‌లనుంచి గ్రీకులవరకు' రూస్ భూములగుండా పోతూవుంది. కాని, యిప్పుడు ద్వారాలుమూసి వేయబడినాయి. తూర్పుదక్షిణ ద్వారాలను తార్తారులు మూసి వేసేరు. పశ్చిమాన రష్యన్ భూములు పొరుగు రాజులచే ఆక్రమించబడినాయి. బాల్టిక్ సముద్రతీరాల్లో లైవోనియన్ వీరులు విజృంభణగా వున్నారు. ఉత్తర జర్మనీయందలి హాన్సియాటిక్ లీగ్ వర్తకులు, విదేశవ్యాపారులను గాని, కర్మకుశలురను గాని రష్యాలోనికి రానిచ్చేవారుగారు. జార్ ఇవాన్ ఒకసారి విదేశాలనుంచి నూటగురు వివిధ కళాకుశలురను, వృత్తినిపుణులను మాస్కోకు రమ్మని ఆహ్వానించేడు. వారిలో లోహకారులు, కమ్మరులు, ఫిరంగులు పోతపోసేవారు, వైద్యులు, ఔషధ

కారులు, ముద్రాపకులు మొదలైన వివిధ కర్మనిపుణు లున్నారు. వారంతా తమ సంసారములు, సామానులతో యెంతో దూరప్రయాణాలు గావించి వస్తూంటే, హాన్సియాటిక్ లీగ్ వర్తకులు వాళ్ళను ఆపివేసేరు. లూబెక్ నగర సినేటర్లు జారు రాయబారులను ఖైదుగావించి, ఆ నిపుణకార్మికులను తరిమివేసేరు.

పశ్చిమ, దక్షిణ, తూర్పు దిక్కులలోకూడ మార్గాలు బంధించబడిపోయినాయి. ఈ మార్గాలను తెరిపించేటందుకే రష్యనులు తార్తారులతోనూ, లైవోనియనులతోనూ కూడ యుద్ధాలు చేసేరు.

పశ్చిమద్వారంకంటె ముందుగా తూర్పుద్వారాన్ని రష్యనులు తెరువగలిగేరు. రష్యన్ సైన్యం కాజాన్ నగరాన్ని జయించి, వోల్గాను స్వాధీనం గావించుకొని, మాస్కోనుంచి సుదూరస్థములైన ప్రాగ్దేశాలకు మార్గ మేర్పాటుచేసేరు. వెనుక అఫనాశీ నికిటిన్ తన సహచరులతో కలసి సందర్శించినవే ఆ దేశాలు. ఈ విజయచిహ్నముగా ఏడు చెర్చిలను క్రెమ్లిన్ ద్వారంలో నిర్మింపించేడు, జార్. రష్యను రాజ్యంయొక్క బలమును స్థిరంగా జ్ఞాపకం వుండేటట్లు చేసినాయి, యీ స్మారక చిహ్నాలు.

ఈ చెర్చిలను నిర్మించినవారు పోస్నిక్, బర్మా అను యిద్దరు శిల్పులు. వారు గొప్ప మేధావంతులూ, అతినేర్పరులూను. తమకు జార్ యిచ్చిన సూచనల ననుసరించిగాక

'ఈశ్వరుడొసగిన బుద్ధ్యనుసారముగాను, ఉన్న అవకాశము లను లోబడిన్నీ' యీ చెర్చీలను వారు నిర్మించేరు !

అనుకున్నట్లు ఏడు చెర్చీలను గాక తొమ్మిది చెర్చీలనూ ఒక్క పునాదిమీదనే వారు నిర్మించేరు. అవన్నీ కలిసి ఒక్కడే బిషప్ అధికారం క్రింద ఒక్క కెథీడ్రల్‌గా యేర్పడినాయి. మధ్యలో 150 అంగుల యెత్తైన గోపురం లేచింది. దానిమీద చివర సూచ్యగ్రంగల పెద్ద కలశము నిర్మించబడింది. దీని చుట్టూ యెనిమిది చిన్నచిన్న కలశాలూ, గోపురాలూను. శిల్పులు అంతకంతకు పైకి వెళుతూ, కలశపు గోడలను క్రమంగా మూసుకుంటూ వచ్చేరు. ప్రతి లాజున్నూ బహు జాగ్రత్తగా, నిపుణంగా పొదగవలసివుంది. లేకపోతే వాటిమీద కట్టవలసిన గోపురపు భారం యే ఒక్కచోట అధికమైనా అక్కడ దిగబడిపోయే ప్రమాదం వుంది. ఈ రోజుల్లో కూడా శిల్పులు అటువంటి కట్టడాలను నిర్మించాలంటే వారు ప్రప్రథమంలోనే వాస్తు శిల్ప చలనసూత్రాల ననుసరించి బరువుభారాలు, పీడనలు వగైరాలు గుణించి, యెన్నో లెక్కలు కట్టాల్సివుంటుంది !

పోస్ట్నిక్, బర్మాలు ఈ లెక్కలు యేమైనా చేసినవాళ్లేనా ? అబ్బే, లేదనే చెప్పాలి ! ఆ రోజుల్లో జనులకు చలన సూత్రశాస్త్రం అంతగా తెలియదనే అనుకోవాలి. వారు తమ కండ్లమీదనే యెక్కువగా ఆధారపడివుండేవాళ్ళు. కేవలం బుద్ధివివేచనా బలంమీదనే ఆధారపడాల్సిన యుగం,

అది. గుణించేందుకూ, గణితానికీ అప్పు డంతగా అవకాశమే లేదు. కానైతే నేటి ఆధునిక ఇంజనీర్లకు కూడ ఆ నాటి వారి ప్రజ్ఞ వున్నదా ? యని సంశయించాల్సివచ్చే టంతటి ఘనులు, వారు ! ఈ నాటికీ ఆ కట్టడములను చూసిన వారు పోస్ట్నిక్, బర్మాల ప్రతిభకు, నైపుణ్యానికీ ముగ్ధ లవుతూంటారు.

ఈ కెథ్రిడల్ సెయింట్ బాసిల్ పేరిట నిర్మించబడింది. సెయింట్ బాసిల్ దేవునిచే అనుగ్రహించబడిన వాడని ప్రతీతి. అట్టి మహాత్ముని స్మారక చిహ్నమైన యీ కెథిడ్రల్‌లో అతి విచిత్రమైన విషయం ఒకటి వుంది. చదునైన దాని కప్పు, యిటుకలతో కట్టబడింది. రెండో అంతస్థుమీద నున్న మెట్ల మీదనుంచి చూస్తేనే యిది కనిపిస్తుంది. ఇది చాల చిత్ర మనిపించడంలేదూ ? క్రింద లాజులు కట్టి, దానిమీద యిటుకలతో కప్పును నిలిపి కట్టడం అంటే అందరికీ అర్థం అవుతుంది. కాని, క్రింద యే ఆధారమూ లేకండా, చదునైన యిటుక సరంబీ యేలాగున నిలబడుతుంది ? ఈ శిల్పులు, పై యిటుక కట్టుబడికి ఆధారంగా యినుపదూలాల నుపయోగించేరు. ఈ రోజుల్లో ఉక్కు చట్రమును కట్టి, సిమెంటు కాంక్రీటు నుపయోగించి నట్లన్నమాట ! చూసేరా, ఆ శిల్పులు, తమ కాలానికి కొన్ని శతాబ్దాలు ముందున్నా రన్నమాట !

రష్యాలో యిటువంటి నిపుణు లెందరో వుండేవాళ్ళు. పట్టణాల్లో, విహారములలో, జారు చక్రవర్తి జమీనాలలో యెన్నెన్నో కొలిమి లుండేవి. ఒక విహారమందలి కమ్మరం సాలలో యేడు కొలుములు, యేడు తిత్తులు, యేడు దాగళ్లూ వుండేవిట.

తూలా, నొవోగోరోద్ పట్టణాల్లో లోహకారులు యెంతో అనుభవంగల వాళ్లుండేవారు. వంశపరంపరగా వారి అనుభవం అందించబడేది. పురాతనఫక్కీలో ఫిరంగులు, తుపాకులు చేయుట వారికి కొట్టిన పిండి. కొత్తపద్ధతిలో దుక్క యినుముతో ఫిరంగుల్ని పోతపోయడమూ వా రెరుగుదురు. వారు చేసిన ఫిరంగులు కొన్ని వేల పౌనులు బరువైనవి కూడా వున్నాయి. అల్లాంటి వాటిని పోతపోయడ మంటే మాటలుగాదు! పైగా నున్నని ఫిరంగి గుండ్లు కూడా కమ్మరులు సుత్తులతో కొట్టే తయారు చేసేవాళ్ళు. చేతుపాకులకు కావాల్సిన ఉంగరాలు, ముక్కలు కూడా వాళ్ళు చేతి సుత్తులతోనే తయారు చేసే వాళ్ళు.

ఎంతో నేర్పూ, లోహస్వభావ పరిజ్ఞానమూ ఉంటే తప్ప కమ్మరి యీ పనులు చేయలేడు. లోహవిద్యలోని కిటుకులు వాళ్ళకి తెలిసివుండాలి. రష్యన్ కమ్మరులు, పోతపనివాళ్ళూ లోహాల గుణగణములు బాగా తెలిసినవాళ్లు. కేవలం లోహ శాస్త్రజ్ఞులేగాక వాయు భౌతిక శాస్త్రజ్ఞులు కూడాను. ఎన్నడూ యే విశ్వవిద్యాలయమందూ చదివియుండకపోయినా వారికీ

శాస్త్రాలన్నీ తెలుసునన్నమాట అల్లాగే స్ట్రాగనోవ్ సంగలి ఉప్పు కార్ఖానాల్లో ఉప్పు వండే 'వంటలవాళ్లు' రసాయన శాస్త్రజ్ఞు లన్నమాట! వివిధరకాల ఉప్పునీటినుంచి ఉప్పులను దింపు చెట్లో వారికి కొట్టిన పిండి. పటాలానికి మందుగుండు తయారుచేసి యిచ్చేవాళ్ళూ రసాయనశాస్త్రజ్ఞు లనే చెప్పాలి.

తెల్లసముద్రతీరాల్లో పురాతన కాలాన్నుంచీ లోహాపు గను లుండేవి. వాటిలోంచి యినుప చిట్టెములను త్రవ్వి తీసే వాళ్ళు, రష్యనులు. ద్వీనానది ఉత్తరభాగాల్లో మైకాయున్ను, వోల్గానదీ ప్రాంతాల్లో గంధకమున్నూ తీసేవాళ్ళు. ముడిలోహా లను కనిపెట్టడంలో నేర్పరులైనవాళ్ళు చిత్తడి నేలల్నీ, బాడవ భూముల్నికూడా అన్వేషిస్తూండేవాళ్ళు. జనులు అనేక రంగాల్లో ప్రకృతితో అవిరామంగా పోరాడుతూనే వుండేవారు. విశాల ప్రాంతాల్లో బలమైన ప్రభుత్వా లేర్పడి, వాటిని సంపూర్ణంగా అనుభవంలోనికి దెచ్చుకోవా లని ప్రయత్నించేవి.

ఇటువంటి పను లన్నింటికీ కావలసినంతమంది కర్మకారులు గాని, పరికరములుగాని అప్పట్లో వుండేవిగావు. తమ దేశంలో లేనివి రష్యనులు పశ్చిమదేశాలనుంచి దిగుమతి చేసుకో వచ్చును. కాని, పశ్చిమానికి దారి బంద్యైందిగదా. లైవోని యనులు తమ దుర్గములతో దుర్జయులై రష్యనులకు మార్గా వరోధము చేసిరి.

కేవలం ఒక్క చిన్న యిరుకుదారి మాత్రమే అదైనా ఉత్తరాన తెల్లసముద్రతీరంలో ద్వీనానదీ ముఖద్వారం దగ్గర విడిచిబెట్టబడి వుండేది. బహు ప్రాచీన కాలాన్నుంచీ రష్యను జాలరులు, వర్తకులు ఈ మార్గాన తమ నావలలో బైలుదేరి, ముర్మాంస్క్ తీరంవెంబడే నార్వే దేశానికి పోయేవాళ్ళు, ఈ ఉత్తరమార్గాననే యింగ్లీషు యాత్రికులుకూడా రష్యాకు వెళ్ళగలిగేరు...

ఇంగ్లాండునుంచి సెబాస్టియన్ కాబొట్ సుసజ్జిత మొనర్చి పంపిన మూడు నౌకలలోనూ ఒక్కటిమాత్రమే 'గుడ్ ఎంటర్ ప్రైజ్' మాత్రమే రష్యాకు వెళ్ళింది. మిగిలిన రెండూ, 'గుడ్ హోప్' 'గుడ్ ఫెయిత్' అనేవి వాటి పేర్లను సార్థకపరచుకో లేకపోయేయి.

1555 సంవత్సరం శీతకాలంలో ముర్మాంస్క్ తీరానికి దూరంలో రెండు ఓడలు నిలిచియుండడాన్ని కొందరు కరేలి యనులు చూచేరని ఒక రష్యన్ చరిత్రకారుడు వ్రాసేడు: "ఆ ఓడలు రెండూ నౌకాశ్రయంలో లంగరువేసి వున్నాయి. వాటిలోనున్న మనుష్యు లందరూ చనిపోయేరు. కాని, వాటిల్లో బోలెడంత సామగ్రి వుంది." ఆంగ్లేయులు ఆర్కిటిక్ మండల మందలి హిమశీతలములకు తాళజాలక, ధ్రువప్రాంతపు మంచులో గడ్డకట్టి చనిపోయివుంటారని తోస్తుంది. ఆ కథ కుడు మూడో ఓడనుగూర్చి యిల్లా వ్రాసేడు: సముద్రం లోంచి ఒక ఓడ ద్వీనా నదీ ముఖంలోనికి వచ్చింది. అందు

లోని వారు చిన్న పడవలమీాద తీరానికి వచ్చేరు. తమ్ము ఇంగ్లీషురాజైన ఎడ్వర్డు పంపెననీ, రాయబారి పేరు రిచర్డ్ అనీ, మిగిలినవారు కేవలం అనుచరులు మాత్రమే ననీ వారు చెప్పేరు.

రిచర్డ్ ఛాన్సలర్ తాను ఎడ్వర్డు రాజు ప్రతినిధి నని చెప్పు కున్నాడు. జార్ ఇవాన్ 'ఆంగ్లరాజ ప్రతినిధి రిచర్డ్ను, ఇతర ఆంగ్లేయ ప్రతినిధులను స్వాగతపూర్వకంగా సంభావించి, తన రాజ్యంలో వారికి సురక్షితమైన ప్రయాణ సౌకర్యాలు కల్పించ నాజ్ఞాపించేడు. వారు స్వేచ్ఛగా అక్కడ యిండ్లు కొనుక్కోడానికిగాని, కట్టుకోడానికిగాని అవకాశం యిచ్చేడు. వి దేశాల నుంచి వ్యాపారమును గొనివచ్చు వారికి సమస్త సదుపాయముల నొసగ కూర్చెను. ఆంగ్లేయ వర్తకులకు మాస్కోలో ఒక ప్రత్యేకగృహం యివ్వబడిందికూడాను.

అప్పటినుంచీ ప్రతీ యేటా ఇంగ్లీషు ఓడలు ద్వీనా నదీ ముఖద్వారంలోనికి వస్తూనే వుండేవి.

రిచర్డ్కు, ఆతని ఓడ గుడ్ ఎంటర్ ప్రైజ్కు యేమి సంభ వించిందో తరువాతి కథ రష్యను ఐతిహ్యములలో యింకేమీా కానరాదు.

శతాబ్దాలగుండా మనం గావిస్తూన్న యీా యాత్రలో మన మార్గదర్శిని మరల యింకొకసారి మార్చుకోవలసి వుంది. హెన్రీ లేన్ అను నొక ఆంగ్లేయుడు తన స్నేహితునికి వ్రాసిన జాబొకటి మనకు లభిస్తూంది. రిచర్డ్ మారొకతూరి కూడ

మాస్కోకు ప్రయాణం గావించినట్లు ఆత డా లేఖలో పేర్కొన్నాడు. ఆతడు తిరిగి యింగ్లాండుకు పోయేటప్పుడు తనతో నొక రష్యన్ ప్రతినిధిని జోసిఫ్ నెపీయా యనువానిని గొని పోయేడు. స్కాట్లండు తీరాన వున్న గుట్టమీద వారి ఓడ భగ్నమై పోయింది. రిచర్డ్ చనిపోయేడు. జోసిఫ్ యెల్లాగో చావుతప్పి ప్రాణాలతో బైటపడ్డాడు. ఆతనికొరకు మనుష్యుల నంపి లండను రప్పించుకుని, మేరీ రాణి, ఇంగ్లీషు వర్తకులు జోసిఫ్‌కు గౌరవ పురస్సరంగా స్వాగత మిచ్చేరు.

ముర్మాంస్కులో రష్యన్ విహార మతమున కనతిదూరం లోనే గుడ్ హోప్, గుడ్ ఫెయిత్ ఓడలు రెండూ మంచులో చిక్కుకుని పోయినాయి. ఇంగ్లాండునుంచి కెప్టెన్‌లూ, నావికులూ వాటికై పంపబడ్డారు. కాని, రెండు శీతకాలములు మంచు మధ్య చివికిపోయిన ఆ ఓడలు, స్వదేశానికి పోవునపుడు దారిలోనే మునిగి పోయినాయి.

## 10. ప్రపంచ మహాపటాన్ని గూర్చి పుస్తకం

ఇప్పటికి రష్యనులకు తూర్పు పడమరలకు మార్గాలు యేర్పడినాయి. పురాతన జానపదగాథలు తూర్పుదేశాలను అంటే సైబీరియానుగూర్చి యిల్లా చెప్పేవి: "మహాశైలముల అనగా యూరల్ పర్వతముల తరువాత తొమ్మండుగురు ప్రజలు నివసిస్తారు. అక్కడ వికృతాకారులైన రాక్షసులు కాపుర ముంటారు. వాళ్ళ నోళ్ళు నడినెత్తిన వుంటాయి.

అసలే తలలు లేని మనుష్యులు, కండ్లు గుండెలమీద గల మనుష్యులు, భుజములమధ్య ముఖములు గలవాళ్లు,- రకరకాల వాళ్ళు అక్కడ వుంటారు. శరీరమంతా దీర్ఘరోమములు గలవారు, నరమాంస భక్షకులు ఐన మానవజాతులు ఉంటున్నా యిక్కడ."

ఈ జను లంతా మనకు చిరపరిచితులే! హెరోడోటస్ కధనములలో, మాసిడోనియా రాజు అలగ్జాండరు కధలలో అపరిచితమైన అనేక దేశాలను గూర్చిన గ్రంథాల్లో మనం యిల్లాంటి రాక్షసుల నెందరను చూడలేదు! అస్తిత్వమే లేని యీ పుణ్యజనులు ఒక పట్టాన చావరనేది యదార్థమే గదా! అంతగా ముంచుకువచ్చి, వాళ్ళకి యీ భూమిమీద నూకలు లేనప్పుడు యే అంగారకలోకానికో పోయి కూర్చుంటారు, వాళ్ళు!

దేవతాగాథ బ్రహ్మరాక్షసిలాంటిది. అది ఓ పట్టాన వదలి పోదు. కథలు, చరిత్రలలోని ఖాళీలనూ, దేశపటాల్లోని శూన్యప్రదేశాల్ని నింపడానికి యివి నిరంతరం ప్రయత్నిస్తూ వుంటాయి. ఉదాహరణకు, ఇదిగో చూడండి! ఇదే మాస్కో రాజ్యపు పటము. ఒక విదేశీయాత్రీకుడు దీనిని 16వ శతాబ్దంలో తయారు చేసేడు. దీనిలో పశ్చిమార్థభాగం పట్టణముల, నదుల, సరస్సుల పేర్లతో పూర్తిగా నిండివుంది. పట్టణాలనూ, దుర్గాలనూ తెలుపునట్టి యీ పటంమీద చిన్న చిన్న చెర్చిలు, యిండ్లు, బురుజులకు చోటే లేదు. ఇక పటంయొక్క

పూర్వార్ధ భాగంలో నీ కిటువంటి చిహ్నాలేవీ గానరావు. పోనీ ఖాళీగా వుందా ? అంటే అదీ లేదు! ప్రదేశమంతా చిన్న చిన్న బొమ్మలతోనూ, శీర్షికలతోనూ నిండివుంది. ఈ బొమ్మలూ, పేర్లూ కూడ యదార్థ ప్రపంచంలో అస్తిత్వం లేని విషయాలకు ప్రాతినిధ్యం వహిస్తూన్నాయి. ప్రతీ శీర్షికా అందమైన వృత్తంలో వుంచబడి, ఒక్కొక్క పురాణానికి, కధకి ప్రాణం పోస్తూంది!

అదిగో! యూరల్స్ పర్వతాల తరువాత ఓబీ నది వుంది చూడండి. ఆ తరువాత నీ పటంలో నొక స్త్రీ బొమ్మ, చంటిబిడ్డను చేతుల్లో పెట్టుకున్నది వుంది. దాని శీర్షిక యిల్లా వుంది :

> స్వర్ణ దేవి. ఉగోర్లు,ఓబ్డోరులు పూజించే దేవత. ఏమి చేయాలో, మందల నెటు తోలాలో వగైరా ప్రశ్నలామెను పురోహితులడుగుతారు. ఆవిగ్రహం జవాబిస్తుంది.(చెప్పడానికి అత్యద్భుతంగా వుంటుంది) ఆమె చెప్పినట్లే జరుగుతాయి. సంఘటనలన్నీ!

కజాక్‌స్థాన్ స్టెప్పీలమీద అశ్వారూఢులైన మనుష్యులు, ఒంటెలు, గోత్రాలు వున్నాయి. వాటిక్రింద శీర్షికలో "ఇవన్నీ

ఒకప్పుడు నిజమైన మనుష్యులు, గుర్రాలు, ఒంటెలు, గొర్రెలు ఏదో శాపంవల్ల అత్యద్భుతంగా వారంతా తమ స్వస్వరూపాల లోనే శిలలుగా మారిపోయేరు. ఈ చిత్రం జరిగి మూడు శతాబ్దాలైంది." అని వ్రాసివుంది!

ఓబీనదికి తూర్పున అన్నీ బొమ్మలూ, కథలే. ఒక నది, పర్వతం, పట్టణం అన్నమాటే లేదు. ఆ నాటి యూరోపు ప్రజలకు ఓబీ నదే తూర్పు సరిహద్దు.



ఆ సరిహద్దు దగ్గరికి పోవాలంటే మహారణ్యములగుండా, గడ్డకట్టిన గొప్పనదులమీదుగా, నెలలకొద్దీ ప్రయాణం చేయాలి. దారిలో కామా నదివద్ద వోల్గా తార్తారులను యెదుర్కొని యుద్ధం చేయాలి. అక్కడికి వెళ్ళడానికి బైలుదేరిన దండులలో బహుకొద్దిమంది మాత్రమే తిరిగి వచ్చేవారు.

కాని, అక్కడికి వెళ్ళిన వాళ్ళలో బహు ధైర్యశాలురు, అదృష్టశాలురు ఐనవారు అమూల్యమైన సంపదను తెచ్చే

వాళ్ళు. శాబుల్ చర్మాలు, వాల్‌రస్ దంతాలు, కామానది ఆవలి వెండి, అనేక విచిత్ర ఆభరణములు మొదలైనవి వారు తీసికొని వచ్చేవాళ్ళు. ఈ ఆభరణాలు, పింగాణీ, పూసలు, స్ఫటికములు మొదలైన వన్నీ బొఖారా నగరమందలి కర్మ కారులు చేసినవే. సుదూరస్థమైన మధ్యాసియాలోని ఉర్ఘెంజ్ రాజ్యంలోని దీ బొఖారా నగరం. బొఖారా వర్తకులు వాటిని మధ్య సైబీరియాలోని ఆల్టాయ్ పర్వతాలవద్దకు తీసికొనివచ్చి, వాటికి మారకంగా బొచ్చు, చర్మములను తీసికొనువారు. సైబీరియను వేటగాండ్రద్వారా అవి మాస్కో ప్రభువుల హస్తగతమయేవి. సైబీరియాలోని ఓస్తియాక్, వోగుల్ మొదలైన తెగలనుంచి కప్పములను వసూలు చేసుకునేందుకు మాస్కో ప్రభుత్వోద్యోగులు యేటా వస్తూండేవాళ్ళు.

రష్యనులు అంతకంతకు తూర్పుదిశగా గదుముతూ ఆక్రమించుకుంటూన్నారు. స్ట్రొగనోవ్ అనే వర్తకుడు కామానది తీరాల్లోనూ, దాని ఉపనదులమీదా పట్టణాలను నిర్మించి, వాటిల్లో 'వేటగాండ్రను' స్థిరనివాసులుగా వుండేటట్లు చేసేడు. వాళ్ళచేత ఉప్పు చేయించడం, అడవులు కొట్టించడం, బీళ్లు దున్నించడం మొదలైన వెన్నో చేయించనారంభించేడు. చాలమంది కోసక్కులూ, స్వేచ్ఛాప్రియులైన యితరులూ మెందరో భూస్వాములనూ, బోయర్లనూ వదలిపెట్టేసి అడవులకు పారిపోయేవాళ్ళు. అల్లాంటి వాళ్ళంతా యిప్పుడు

యీ తూర్పు దిశగా పారివచ్చి, స్ట్రొగనోవ్ కొలువులో ప్రవేశించేరు.

రైతులబ్రతుకు రోజురోజుకూ దుర్భరమవుతూంది. పన్నులను జార్‌కూ, భూస్వాములకూ కూడ చెల్లించాలి, వారు. పై పెచ్చు యీ పన్నులు యేటేటా పెరుగుతూనే వుంటాయి. తన సైన్యాలను సాయుధములుగా, సుసజ్జితముగా వుంచేందుకు జార్‌కు చాలా ధనం కావాలి. తన అధికార వర్గానికి జీతాలిచ్చి పోషించేందుకు కూడా బోలెడు డబ్బు ఖర్చవుతుంది. సామంతులు గావించిన సేవలకు మెచ్చి, జార్ వాళ్ళకి జమీలు, ప్రాంతాలు యిచ్చేవాడు. * ఈ సామంతులు తమ గ్రామాల్లోని రైతుల్ని సాఫుగా దోచేసుకుని, వాళ్ళని చావకండా బ్రతక్కుండా వుంచడంవల్ల క్రమంగా దేశం దిగనారి, దుర్భర స్థితికి దిగజారిపోయింది. తమ జమీలను విక్రయించేసీ, వదలిపెట్టేసీ పోయి, యితరత్రా మళ్ళా సంపాదించుకునేవారు, సామంతులు. కాని, రైతులకు మాత్రం తమ భూమిని వదలిపెట్టి పోయేందుకు స్వాతంత్రం లేదు. వారు భూఖండాలకు బంధించబడిపోయి ఉండేవాళ్లు.

---

* భారతదేశంలో కూడా స్వార్థపరులైన ద్రోహులకు విజాతీయులైన దాడిమూకల నాయకులు అనేక ప్రలోభాలు చూపి, వారిని తమకు సాయపడేట్లు గావించుకుంటూ వచ్చారు. మహమ్మదీయ, క్రైస్తవ యుగాల్లో జరిగిన యీ దేశద్రోహ చిహ్నాలే జమీలన్నీ. రాజకీయాధికారం, పదవులు, ధనలాభం మొదలగువాటి కాశించి మన దేశంలో పలువురు విదేశీయులకూ, విమతస్థులకూ తోడ్పడి, స్వధర్మద్రోహం గావించుతూ వచ్చారు.

రైతులు తిరుగుబాట్లు చేసి, సామంతుల భూములను, ఆస్తులను నాశనం చేసేవాళ్ళు. జార్ పటాలాలు వచ్చి తిరుగుబాట్లను అణిచేసేవి. రైతులను విధేయులై యుండేటట్లు చేసేవి, జార్ సైన్యాలు. పంటపొలాలను గుర్రాలచే త్రొక్కించీ, గుడిసెలను తగులబెట్టీ, చాలమందిని నానాహింసలకూ గురిచేసీ, రైతులను హడలెత్తించేవి, సైన్యాలు. బలమైన ప్రభుత్వం కావాలంటే తగినమూల్యం చెల్లించనిదే లభ్యమవుతుందా ? సరే, ప్రజలు ఆ మూల్యమునంతనూ అణాపైసలతో చెల్లించేరు.



రైతులు తమ జీర్ణకుటీరాలను వదలి పారిపోయే వాళ్ళు. అసలే పొగపోయేందుకు కూడా దారిలేని ఆ గుడిసెలు పొగచూరి నల్లగా వుండేవి. ఆ గుడిసెల్లో బొద్దింకలకుకూడా తినడాని కేమీ వుండదు ! అల్లాంటి దుర్భరకష్టజీవితముల నుంచి పలాయనమైపోయీవాళ్ళంటే ఆశ్చర్య మేముంది ? మైదానాల్లోకీ అరణ్యాల్లోకీ పారిపోయేవాళ్ళు రైతులు. డాన్, యూరల్, వోల్గా, కామా మొదలైన నదీతీర మైదానాల్లోకి పారిపోయి, రైతులు స్వేచ్ఛను సంపాదించుకొనేవాళ్ళు.

వారు తమ జీవితాల్ని వేటాడీ, చేపలు పట్టీ, అప్పుడప్పుడు దారులు కొట్టీ గడిపేవాళ్ళు. తార్తారుల నివాసాలనూ, రష్యాను వర్తక బిడారులనూ కూడా వాళ్ళు కొల్లగొడు తూండేవాళ్ళు.

జార్ ప్రతినిధులైన రాష్ట్రపాలకులు కోసక్కుల యీ 'దొంగల ముఠా'లకు యేలాంటి శరణ్యమూ యిచ్చేవారు గారు. కాని, అటుతరువాత కోసక్కులు తమ తప్పు నొప్పుకుని, పశ్చాత్తాపపడి, జార్ కొలువులో చేరేరు. అప్పటినుంచీ రష్యను రాజ్యపు సరిహద్దులను తార్తారుదండులనుంచి వీరే కాపలా కాస్తుండేవాళ్లు. కోసక్కుపటాలాలు కామానదీతీరస్థ నగరాల్ని రక్షిస్తూ, యూరల్ పర్వతశ్రేణుల నధిగమించి తార్తారు వలసలమీద దాడులు చేసేవి. స్ట్రొగనోవ్ వర్తకుని అనుచరులు ఇర్తిష్, తోబోల్ నదీతీరాల్లో పట్టణాలను నిర్మించడానికి ప్లానులు వేస్తూండేవారు. జార్ ఇవాన్, తన్ను 'అఖిల సైబీరియా విజేత' అని పిలిపించుకొనేవాడు.

ఐననూ సైబీరియా యింకనూ రష్యా రాజ్యానికి కలుప బడలేదు !

మీరు ఎర్మాక్ పేరు యెప్పుడేనా విన్నారా ? ఇప్పుడు సోవియట్ రష్యాలో చాలమందికి ఎర్మాక్ పేరు తెలుసును. సైబీరియాను గురించి యేమీ తెలియని ఆ కాలంలో కొద్ది పడవలమీద, పిడికెడుమంది కోసక్కు సైనికులతో సైబీరి

యాను జయించబోవడానికి ఆత డెంత ధైర్యశాలీ, తెంపరీ ఐవుండాలి !

చదునైన సైబీరియా మైదానాలగుండా రైలుబండి ఇప్పుడు రోజుల తరబడిగా పరుగెత్తుతూంటే, వంతెనల క్రిందుగా ప్రవహిస్తూన్న మహానదులను ప్రయాణీకులు చూస్తారు. సువిశాలమైన యీ ప్రదేశాలను రైలుకిటికీల్లోంచి చూసినప్పుడల్లా ప్రయాణీకులకు ఎర్మాక్ పేరు జ్ఞాపకం వస్తుంది. ఇంత విశాలదేశాన్ని చిన్నగుంపు యెల్లా జయించగలిగిందో ? అనే విషయం సమస్యగానే వుండిపోతుంది. వాళ్ళ మనస్సుల్లో.

ఆ విశాల మైదానాల్లో ఎర్మాక్ దళం సముద్రంలో నీటిబొట్టు లాంటిది. కాని, యీ నీటిబొట్టు సముద్రాన్నే లొంగదీసుకొంది. అంతేగాదు, వారు లొంగదీసుకోవలసినవి, సువిశాలమైన ప్రదేశాలే గావు, ములుబంటి మంచుతోను, తీవ్రమైన మంచుతుపానులు, హిమపాతములతోను నిష్ఠురమైన సైబీరియను ప్రకృతినిగూడ యెదిరించాలి, వారు. అధిక సంఖ్యాకమైన తార్తారు మూకలు వీరిని నిరంతరం యెదిరించేవి. కొమ్మనులు బహు కొద్దిమందే. వారు వేలమీదకూడా వుండరు. తార్తారులు పదుల వేల సంఖ్యలో వుంటారు. గమ్యానులకు ఆధునిక ఆగ్నేయాస్త్రములు లున్నమాట నిజమే. తార్తారులు యిల్లా అనేవాళ్లు : "వాళ్లు మంటలు కక్కే విల్లులు పట్టుకొని వచ్చేరు. అవి మేఘాల్లాగ వురిమేవి ! అవి విసరే బాణాలు మాకు కనిపించేవే గావు. కాని, అవి మమ్మల్ని బహుతీవ్రంగా

గాయపరచేవి, చంపేసేవి. అవి విసరే బాణాలు మామకవచాల్నీ, యినపకవచాల్నీకూడా భేదించుకుపోయీవి."

ఎర్మాక్ దళం సైబీరియను నదుల వెంబడే పోతూ, యెదిరించిన తార్తారు దండులను నాశనం గావిస్తూండేవాళ్ళు. అనుకోని సమయాల్లో, అనుకోని స్థలాల్లో హఠాత్తుగా మీదపడేవాళ్ళు, ఎర్మాక్ శత్రువులు. వాళ్ళకి రాత్రింబగళ్ళు విశ్రాంతే వుండేది గాదు. స్వదేశం చాల దూరంలో వుంది. అంతేగాక రోజు రోజుకీ అది మరింత దూరమైపోతూవుంది కూడాను.

దళాన్ని సమావేశపరచి ఎర్మాక్ వాళ్ళతో యిల్లా చెప్పేడు : "మనం పోవాలన్నా యెక్కడికీ పోలేముగదా! అప్పుడే శిశిర ఋతువు వచ్చేసింది. నదీజలాలు గడ్డకట్టిపోతూన్నాయి.....మనం వెనుతిరిగి వెళ్ళడమంటే అవమానమే. మనకు అపకీర్తి కలిగేలా ప్రవర్తించవద్దు. చేసిన ప్రతిజ్ఞను తప్పగూడదు, మనం. సర్వశక్తివంతుడైన భగవంతుడు మనకు తోడుగా వుంటే మనకు యే లోటూ కలుగదు. అప్పుడే మనం యీ దేశాల్లో చిరస్థాయిగా వుండే కీర్తిని సంపాదించుతాము."

ఎర్మాక్ కోసక్కుదళం ముందుకు సాగిపోడానికే తీర్మానించుకున్నారు. దారిలో వున్న తార్తారు పట్టణా లన్నిటినీ ఒకటి తరువాత నొకటిగా పట్టుకున్నారు. ప్రజల రక్తంతో సైబెరియా భూమి తడుస్తూంది. రష్యాను, తార్తారు, ఓస్తియక్,

వోగుల్ మొదలైన యెన్నో జాతుల ప్రజల రక్తం యేరులై పారుతూంది.

ఎట్టకేలకి తార్తారుల ప్రధాన స్థావరానికి చేరుకున్నారు, కోసక్కులు. అది చాల కట్టుదిట్టమైనది. ఇర్తిష్ నది మొగువ భాగంలో వుంది. యీ తార్తారు స్థావరం. అక్కడే తార్తారు ఖాన్ తన యావత్తు సైన్యంతోనూ వీళ్ళకోసం వేచి యున్నాడు.

కోసక్కులు ఇర్తిష్‌నదిని దాటి, తార్తారు స్థావరంమీద పడి, దాని రక్షణాల నన్నిటినీ భేదించి, చిందరవందర చేసేసేరు. ఈ యుద్ధంలో రష్యనులు నూరుగురిని పోగొట్టుకున్నారు. వారికింక దేనికిగానీ మిగిలినవాళ్ళు కొద్దివందలమందే. కాని, దుర్గం పట్టుపడింది, తార్తారుఖానుడు పలాయనం చిత్తగించేడు.

వీరి కెంతో సంపద పట్టుపడింది. వెండి, బంగారములు, అమూల్య రత్నాలు, మేట్లకొలదిగా శాబుల్, మార్టెన్ చర్మాలు మొదలైన వెన్నో ఆ స్థావరంలో వారికి దొరికేయి.

ఎర్మాక్ సైబీరియాకు యజమాని అయేడు. కాని, తాను కేవలం జార్ యొక్క సేవకమాత్రుడనే యని ఆతని నమ్మకం. ఆ విషయా న్నాతడు మరచిపోలేకండా వున్నాడు. అందుచేత తక్షణమే ఆతడు ఇవాన్ కోల్ట్‌జో యను తన సహచరుని జార్ దగ్గరకు పంపించేడు, రాయబారిగా. జార్ చక్రవర్తి కోసమే తానీ సైబీరియాను జయించేననీ, ఆయన ఆజ్ఞలకోసం వేచి యున్నా ననీ తన వినయవిధేయతలను తెలిపి రమ్మన్నాడు.

'లోకమంతా కట్టుకథలతో నిండివుంది' అనే పాత సామెత విన్నారుగదా. ఎర్మాక్ దోపిడీముఠాలు సైబీరియాను స్వాధీనం గావించుకొన్న సంగతి అంతకుముందే జార్ చెవిని బడింది. దాసత్వంలోంచి పారిపోయి, స్వేచ్ఛాయుతమైన కోసక్కు జీవితమును వరించిన యీ సామాన్యజనులను బోయరులు, సామంతులు, ప్రభువర్గాలు మొదలైనవారు 'బందిపోట్లు' 'దొంగలు' మొదలైన బిరుదనామములతో పిలిచేవాళ్ళు. సరిగా ఆ సమయంలోనే ఎర్మాక్ పంపిన దూతలు మాస్కోకు చేరుకున్నారు.

జార్ ఇవాన్ వాసిలియేవిచ్ వీరికి ఘనంగా స్వాగతం యిచ్చి, ముఖ్యదూతకు తాను భుజాలమీద ధరించిన బొచ్చు కోటును బహూకరించేడు. ఎర్మాక్‌కు కోరిన సాహాయ్యమును కూడ వెంటనే పంపించేడుకూడాను.

ఎర్మాక్‌కు సాయం తక్షణావసరంగా వుంది. తార్తారులతో ఆత డతికష్టంమీద పోరాటం సాగిస్తూన్నాడు. వారు ఆతనిని ఊపిరి తీయనీయకండా యెదిరిస్తూ వేధిస్తూన్నారు.

ఒక రాత్రి ఎర్మాక్ దండు ఇర్తిష్ నదీతీరాన నిద్రిస్తూండగా తార్తారులు వచ్చి మీదపడ్డారు. నిద్రలో వున్నవారి నందర్నీ ముక్కలుగా నరికేసేరు, తార్తారులు. ఎర్మాక్ ఒంటరిగాడై పోయేడు. ఆతడు నదిలో దూకి ఆత్మరక్షణ గావించుకొనేందుకు యత్నించేడు. కాని, బరువైన కవచం మూలంగా ఎర్మాక్ నదిలో మునిగి చనిపోయేడు.

ఆతడు పోయినా యితరు లాతని ననుసరించి వచ్చేరు. కైగాలోంచీ అరణ్యాల్లోంచీ వారు దారిని ఛేదించుకుంటూ వచ్చేరు. అపరిచితములైన నదీ ప్రవాహాల్లోంచి వారు తమ పడవలను నడుపుకుంటూ వచ్చేరు. ఒక్కొక్కప్పుడు యీ నదీ ప్రవాహాలు వారిని ఉత్తర దిశగా ఆర్కిటిక్ మహాసముద్రం లోనికి తీసికొనిపోయి వదలేవి. శీతువులో భయంకరమైన మంచు జడులనూ,. గ్రీష్మంలో ఉక్కిరి బిక్కిరి గావించే వేడిమినీ వారు భరించాల్సి వచ్చేది. అడవు లన్నీ కూలిన చెట్లతోనూ, రుప్పలు - పొదలతోనూ దుర్భేద్యమై వుండేవి. అర్జునుడు ఖాండవవనమును దహనం చేసి, అందులో వుండే కాలకేయాదులను లొంగదీసుకున్నట్లుగా చేయాల్సి వచ్చింది, రష్యనులకి. చిత్తడి నేలలైన టండ్రాలు, నదులమీాద తేలిపోయే మంచు దిబ్బలూ వాళ్ళని నానా అవస్థలూ పెట్టేవి. కాని, యిన్ని యిబ్బందులనూ యెదుర్కొని వాళ్ళు సైబీరియాగుండా పోయి పసిఫిక్ మహాసముద్రాన్నీ, ఆర్కిటిక్ మహాసముద్రాన్నీ కూడా చేరగలిగేరు.

సైబీరియాలోని యాకుత్, బుర్యత్ మొదలైన తెగల వారు రష్యన్ జార్‌కు లోబడకండా సుదీర్ఘ కాలం పోరాడుతూండేవారు. వారు అమూల్యమైన విలువను చెల్లించి కూడా జార్‌కు లోబడాల్సివచ్చింది. రష్యానుంచి వచ్చిన గవర్నర్లు, వర్తకులు, ఉద్యోగులు యీ తెగలను పీడిస్తూ, దోచుకుంటూ వుండేవాళ్ళు. కాని, కంటకావృతమైనను యీ మార్గం ఆ

జాతులను ముందునకే గొంపోయింది. రష్యనులకంటె సైబీరియను లెన్నో శతాబ్దాలు వెనకబడి వుండేవాళ్ళు. ఉత్తర సైబీరియాలో వేటగాండ్రకు యినుము తెలియనే తెలియదు! వారి బాణపు ములుకులు రాతితో చేసినవి. రష్యన్లతోటి నిర్బంధసంబంధంద్వారా సైబీరియా జాతులు చరిత్ర అనే రాజమార్గంలో శీఘ్రతరంగా ముందుకు పోగలిగేరు.

ఎనభై మైళ్ళుపోయినా ఒక పిట్ట ఐనా కనబడనట్టి సువిశాలమైన సిర్జన ప్రాంతాలు జనావాసములైన దేశాలతో కలుపబడినాయి. ఆ నాటి దేశపటాలమీద నే గాక, అసలు భూగోళం మీద నే యివన్ని శూన్యప్రదేశాలు. ఈ ఖాళీప్రదేశాల్ని నింపే టందుకు రష్యనులు ప్రయత్నించేరు. వారక్కడ పట్టణాలు, గ్రామాలుకట్టి, పొలాలు దున్ని, చిత్తడి నేలల్లోంచి రోడ్లువేసి, నదులమీద వంతెనలు నిర్మించి యెంతో కృషి చేసేరు...

మాస్కోలో కొందరు లేఖకులు ఒక గ్రంథమునకు మారు ప్రతిని తీసేందుకు నియోగించబడ్డారు. ఆ గ్రంథం పేరు 'ప్రపంచ మహాపటాన్నిగూర్చిన పుస్తకం.' దానిలో మాస్కోకు వచ్చే మార్గాలన్నీ గుర్తించబడినాయి. అంతేగాక కొత్త పట్టణాలైన త్యూమెన్, తొబోల్స్కు నగరాలచుట్టూ వున్న మార్గాలుకూడ దానిలో గుర్తించబడినాయి. ఓబీ నదే ప్రపంచానికి ఆవలి హద్దుగా భావించబడిన రోజులు వెళ్ళిపోయినాయి.

క్రెమ్లిన్ లోని జార్ భవనంలో లేఖకులు రష్యా కుడ్యపటమును తయారుచేసేరు. ఉత్తర సముద్రాన్నుంచి కాశ్యప సముద్ర పర్యంతం, అరాళసముద్రంనుంచి ద్నీస్తర్ నదివరకూ రష్యా దేశం వ్యాపించియుంది. యువరాజు జారేవిచ్ తన బ్రాతు కలంతో యీ పటపు బాహ్యారేఖలను అనుసరించి లిఖిస్తూంటే ఆతని ఊహలు యూరల్ పర్వతాలను దాటిపోతూండేవి. మహానది ఓబీ, సైబీరియాలోని అరణ్యాలు, మైదానాలు, - వీటిల్లో విహరించేది, జారేవిచ్ భావవిహంగం.

జను లీ విధంగా లిస్బన్, మాడ్రిడ్, లండన్, మాస్కో మొదలైన రాజధానీ నగరాల్లో * యీ మన భూగోళం యొక్క పూర్తి పటమును తయారుచేసేరు.

—:0:—

* హిందూదేశంలో విజ్ఞానులు చిరకాలాన్నుంచీ మన యీ భూగోళం బహు విశాలమైనదనే భావిస్తూ వచ్చేరు. లోకమంటే తమ రాష్ట్ర మొక్కటే ననే భావం తొలగిపోయి, మనదేశంలో 'కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ' అనే భావమే సారస్వతంలోనికి కూడ జొచ్చుకుపోయింది. అంతేగాక 'సంఖ్యాచే ద్రజసామస్తి విశ్వానాం న కదాచన' అనునట్లు విశ్వగోళములకు కూడ పరిమితి లేదనీ, అవి నిరంతరం సృష్టిస్థితిలయములను పొందుతూనే వుంటా యనీ భారతీయులు చక్కని శాస్త్రీయ కల్పనను చేసి చాలకాలమే యైనది. క్రమంగా యీ భావమే ప్రపంచంలోని యితర దేశాలకు వ్యాపించింది. కాని ఎంత చిన్న రాజు ఐనా తనను 'చతురంభోధిపరీత భూవలయ రక్షాదక్షు' నిగానే వందిమాగధులచే పిలిపించుకునేవాడు. అట్లే యిప్పుడు బహు అల్పుడు కూడా 'మహానాయకుడు'గా యీ ప్రజాతంత్ర యుగంలో చలామణీ.

# ఎనిమిదో ప్రకరణం

## 1. చరిత్రలో కొన్ని పుటలు

గ్రీకులు – పెర్షియనులు; రోమనులు – కార్థజీనియనులు; బైజాంటైనులు – అరబ్‌లు; బైజాంటైనులు – రష్యనులు; వెనీషియనులు – తుర్కులు; వీరందరూ సముద్రాధిపత్యంకోసమై తమ తమ కాలాల్లో పోరాటాలు గావించే వున్నారు. * ఎన్నో ఓడలు వినష్టమయినాయి. సముద్రజలములు మానవరక్తంతో యెర్రనై పోయినాయి. కాని, సముద్రం వివిధజాతులను వేరుచేసి వుంచేదే కాదు; అది వివిధ జాతులకు రాకపోకల సాధనంగా యేర్పడి, వాళ్ళని కలుపుటకు కూడ తోడ్పడుతుందికూడాను. సాగరతీరస్థ నగరాల్లో అనేక జాతులు, భాషలు, ఆచారాలు, మతాలు, అలవాట్లు కలిసి మెలిసి వుంటూ విశాల మానవ సంస్కృతిగా రూపొందుతూండేవి. కుశలులైన కర్మకారులు తయారుచేసిన వస్తుసామగ్రులనే గాక ఓడలు ఒక తీరాన్నుంచి మరో తీరానికి కళలను, విజ్ఞానాన్ని, కర్మకౌశలాన్నీకూడ మోసుకొనిపోయినాయి. పండితులు, శాస్త్రజ్ఞులు ఒక దేశా

---

* ప్రాచీన కాలంలో హిందూదేశీయులు, చైనీయులుకూడ నౌకాయానం, నౌకా వ్యాపారం విస్తృతంగా గావిస్తూండినట్లు చారిత్రక ప్రమాణాలున్నాయి. ప్రొఫెసర్ రాధా కుముద ముఖర్జీ వగైరాలు ఈ విషయంమీద యెన్నో గ్రంథాలు రచించియున్నారు. కాని యెందువల్లనో మనవారు నౌకాయానాన్ని నిషేధించి, విశాల విశ్వంతో సంబంధాల్ని కోల్పోయారు.

న్నుంచి మరో దేశానికి ప్రయాణాలు చేస్తూ, వివిధజనుల అనుభవాలను ప్రోగుచేసి, అనేక జాతీయ సంస్కృతులనుంచి చిలికి తీసిన నవనీతం వంటి ఒకే ఒక విశాల సంస్కృతిని, మానవ సభ్యతను సృష్టించేందుకు పునాదులను నిర్మిస్తూండే వాళ్ళు. పరోపకారం, పరపీడనా వైముఖ్యం, తనవలెనే యితరులను చూడడం, సర్వభూతదయ, హింసారాహిత్యం, సత్యమే పలుకుట, దొంగిలించకుండుట, ఇంద్రియనిగ్రహము, పరిశుభ్రత, సహనశీలత,– యీ మొదలైన గుణములు సర్వజన ప్రతిపాద్యములు, సర్వలోక కల్యాణకరములూ నని అందరూ గ్రహిస్తూవచ్చేరు. *

అటుపిమ్మట సముద్రయుగం గతించిపోయి, మహాసముద్ర యుగం వచ్చింది.

ఇదివరలో సముద్రాధిపత్యం యెవరిదా ? అనే విషయం తేల్చడానికై సాగుతూవచ్చిన పోరాటాలు యిప్పుడు తిరిగి,

---

* ఈ విషయంలోకూడ అతి ప్రాచీన కాలాన్నుంచీ హిందూ దేశీయులు లోకానికి మార్గదర్శకు లయ్యేరు. మన సంస్కృతి అంతాకూడ మానవుణ్ణి ధర్మపరాయణునిగా చేయడమే కర్తవ్యంగా రూపొందించే.

శ్లో. ధృతిః క్షమా దమోఽస్తేయం । శౌచమింద్రియ నిగ్రహః ।
ధీర్విద్యా సత్య మక్రోధో । దశకం ధర్మలక్షణం॥

శ్లో. అహింసా సత్య మస్తేయం । శౌచమింద్రియ నిగ్రహః ।
ఏతం సామాసికం ధర్మం । చాతుర్వర్ణ్యే ఽబ్రవీ న్మనుః॥

శ్లో. సత్యం దమః తపః శౌచః । సంతోషో హ్రీః క్షమార్జవం ।
జ్ఞానం శమో దయా ధ్యానం । ఏష ధర్మ స్సనాతనః॥

మహాసముద్రాధిపత్యం యెవరిదా ? అనే విషయం తేల్చడానికి సాగుతూన్నాయి. కాని, సముద్ర మధ్యంలో కూడ లభించిన పోరాటావకాశాలను వదలక యుద్ధాభిలాషను తీర్చుకుంటూండేటందు కుపయోగించే ఓడలే జనులను, జంతువులను, ఆచారాలను, వృక్షజాతులను, లోహాలనూ, శబ్దజాలమునూ ఒక ఖండాన్నుంచి మరో ఖండానికి మోసుకుపోతూండేవి. ఒకే వస్తువు, పరికరం, వినాశానికే గాక వినియోగానికీ అభివృద్ధికీ కూడ వుపయోగించుతూ వచ్చింది. యుద్ధావసరాలకే గాక శాంత్యవసరాలకు కూడ ఒకే సాధనం పనికివచ్చింది.

అమెరికానుంచి సముద్రాలు దాటి, యూరోపుకు అతిధిగా వచ్చింది, ఉర్లగడ్డ. * అదివరకు యూరోపులో పొలాలు అన్నీ ధాన్యపుపైరుల క్రిందనే వుంటూవచ్చేవి. అవి యిప్పుడింక యీ విదేశీయ అతిధికి, ఉర్లగడ్డకు చోటీయక తీరలేదు ! ఉర్లగడ్డ, ధాన్యపు పైరులతో బాటు ప్రక్క-ప్రక్కనే పెరుగుతూ వచ్చింది. అల్లాగే నూతన శబ్దాలు, ఎర్ర యిండియను

---

* పొటాటో అనే ఎర్ర యిండియనుల శబ్దాన్ని ఆ దుంపతో బాటు యూరోపియనులు స్వీకరించారు. బంగాళాదేశాన్నుంచి మనకి వచ్చినందున దీన్ని మనం బంగాళాదుంప అంటాం. ఉర్ల కిళంగు అనగా గుండ్రని దుంప అంటారు తమిళులు. దాన్నే మనం ఉర్లగడ్డ అంటున్నాము. వివిధ వస్తువులు, వాటిపేర్లూ ఎంత వద్దనుకున్నా ప్రజల్ని పట్టుకుని వదలవు. అన్ని భాషల పదాల్నీ స్వీకరించాల్సే వస్తుంది, ఎవరికైనా. దేశకాలాల్లో భాషావికాసాన్ని మన ప్రాచీనులు పాణిని నాటికే గ్రహించేరు.

పదములు ఐరోపీయభాషల్లో స్థావర మేర్పరచుకున్నాయి! కోకో, టొబాకో, మెయిజ్ మొదలైనవే ఆ శబ్దాలు. ఎర్ర యిండియన్ తెగలను భౌతికంగా నిర్మూలించిన యూరోపియనులు, యీ శబ్దాలను యెప్పటికైనా వదల్చుకోగలరా? అహాఁ! లేరు! శబ్దప్రపంచం వస్తుప్రపంచంకంటె స్థిరమైనదని యిందుకనే చెప్పతాకులావుంది!



అమెరికానుంచి వచ్చిన టొబాకో

మెక్సికో దేశపు కోకోకు హిందూదేశపు మిరియంతో సువాసన, రుచి కల్పించబడి, పారిస్ కెఫేలలో వడ్డించబడేది. జనులు దానిని భద్రంగా, మెల్లగా చప్పరిస్తూ త్రాగుతూండే వాళ్ళు. సుగంధవాసితమైన యీ విదేశీయ పానీయం తమ కడుపులు కాల్చేస్తూందని వాళ్ళ భయం!

అమెరికాఖండ మైదానాలమీద ఐరోపానుంచి గొని రాబడిన గుర్రాలు మందలై, మేస్తూ తిరుగుతుండేవి. అంతకు కొద్ది కాలం క్రిందటనే ఎర్ర యిండియనులు గుర్రమును చూసి, దానినొక అజ్ఞాతమైన రాక్షసప్రాణి యనుకొనేవాళ్లు! అశ్వారూఢులైన యూరోపియనులను చూసి, రెండుతలల రాక్షసు

లని భావించి, మహా యోధులైన ఎర్ర ఇండియనులు వేలమంది వుండికూడా పికాపికలై పారిపోయేవాళ్ళు !



ఇప్పుడు అమెరికా ఖండ తీరస్థ రేవు పట్టణాల్లో పూర్వ కాలంలో అలగ్జాండ్రియా రేవులోవలెనే వివిధ వర్ణముల జనులను, అనేక భాషలను చూడగలము, వినగలము !

మానవుని చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభించింది...

అప్పటి చరిత్రను తెరచి, ఆ పుటలలోనికి ఒక్కతూరి చూద్దాం, పదండి...

ఇదిగో ! ఇక్కడ ఆదిమ కాలపు వేటకాండ్రు కొందరు గుంపుగా నదికి పోతూన్నారు. యెందుకు చెప్మా ? ఆఁ ! తెలిసింది. తమ కత్తులకు, గొడ్డళ్ళకు, బల్లెములకు రాతి ములుకుల నేరి తెచ్చుకునేందుకు.

కొన్ని వేల యేండ్లు గడిచిపోయినాయి. ఇప్పు డీ నదిలో పడవలు పోతూన్నాయి. జనులు, నాలంకృతములూ, సచిత్ర

ములూనైన మృణ్మయభాండములను, కలశకుంభాదులను గోంపోయి, యితర వస్తువులకై మారకం చేస్తున్నారు. ఈ



కుంభకార తెగలకు తెలుసు నీ ప్రపంచంలో తామే గాక మరికొందరు మానవ తెగలు కూడా వున్నట్లు!

మరికొన్ని పుటలు త్రిప్పుదాము......

సముద్రతీరంలో ఒక పట్టణం పెరిగింది. హార్బరులో లంగరు వేసి వున్న ఓడలు తరంగములకు లయగా నాట్యం చేస్తున్నాయి. అవి యితర దేశాలనుంచి వచ్చినాయి. వివిధ తెగల జనులను కలుపుతూన్నది యిప్పుడు నదులు గావు; సముద్రాలూ గావు; మహాసముద్రాలే యిప్పుడు వారిని కలుపుతూన్నాయి. కాని, యివే వాళ్ళని వేరుగా విడదీసి వుంచుతూన్నాయి

కూడాను. ఈ సముద్రమార్గాలను తమ తమ అధీనంలో వుంచుకునేందుకు పట్టణాలు తమలో తాము పోరాడుకుంటున్నాయి.

ఈ పుటలలో యెన్నెన్ని యుద్ధాల్ని, అన్వేషణాల్ని గూర్చి, జయాపజయాలను గూర్చి వ్రాసి వున్నాయి ?

ఆఖరికి కొలంబస్ నౌకలు (కారవెల్‌లు) అట్లాంటిక్ మహా సముద్రాన్ని దాటి, అమెరికా తీరాలకు వస్తాయి. రష్యనులు భూమార్గాన సైబీరియాను దాటి, పసిఫిక్ మహాసముద్ర తీరాలకి వచ్చి చేరుతారు.



మరికొన్ని శతాబ్దాలు గడిచేయి. ఇప్పుడు జనులు పక్షుల్లాగ గాలిలో యెగురగలరు ! వాయుయుగం ప్రారంభమైంది. ఇప్పు డింక భూమిమీదా, సముద్రాలమీదా, గాలిలోనూకూడా ఘోరయుద్ధాల ముందర వెనుకటి యుద్ధాలు

పిల్లల ఆట లనిపిస్తాయి. కాని, పరిస్థితులు పూర్తిగా మారిపోయి నాయి. గతంలో నదులు, సముద్రాలు, మహాసముద్రాలు వివిధ జనులను సన్నిహితులనుగా చేసేవి. కాని, యివేవీకూడా మానవులను సన్నిహితులనుగా చేయడంలో వాయుమహా సముద్రం వంటివి గావు. ఈ వాయుమహాసముద్రపు తీరము లన్నిచోట్లా వున్నాయి! అన్ని పట్టణాలు, పల్లెలుకూడా ఒక హార్బరుగా అంటే ఆశ్రయస్థానంగా వుండగలవు, గాలి ఓడలకు.

కాని, మనం మనలనే దాటి ముందుకు బోతూన్న ట్లున్నాము. ఇప్పుడు మనముందున్న చరిత్రపుటలలో వాయు విమానం ఇంకా ప్రత్యక్షం కాలేదు. అందాకా యెందుకు? ఇంకా ఆవిరియంత్రం దాకానే రాలేదు. జను లింకా భూమిపైన అశ్వారూఢు లయిన్నీ, సముద్రాల్లో తెరచాప పడవలమీద నున్నూ ప్రయాణాలు గావిస్తున్నారు.

## 2. ప్రపంచం గుర్తించడం కష్టమవుతుంది

జనులు తమ గ్రామాల్లోనో, జమీల్లోనో నివసిస్తూ, యితరత్రా యేమి జరుగుతూన్నదీ తెలుసుకోకుండానే, ప్రశాంత జీవితం గడుపుతూండే ఆ పురాతన వ్యవస్థ యేమైనది?

ఇప్పుడు జనులు ఒకచోటనే వుండిపోవడం లేదు. రాజ మార్గాలలో మోటబండ్లు సరకులతో నిండి, కిర్రుకర్రుమంటూ గాళ్ళలో పడి అటునిటు వూగుతూ నడుస్తూన్నాయి. అప్పు

గనక్కూడా యీ బాటలమీదుగా ఆరుగుర్రాలు పూన్చిన 'కోచి' బండ్లుకూడా కనబడుతూన్నాయి. రోడ్లు యింకనూ పాడుగానే వున్నాయి. ఆరు గుర్రాలను కట్టడం వైభవంకోసం గాదు, అవసరమయ్యే! భారమైన ఆ కోచి, అంటే రథ మని అర్థం, - బాటలోని బురదలో దిగబడిపోయినపుడు సమీప గ్రామాల నుంచి అదనపు గుర్రాలను తేవాల్సివచ్చేది.

అప్పుడవీ యివీ కలిసి, - ఓట్లు తినే రాజుగారి గుర్రాలూ, గడ్డి తిని బండచాకిరీ చేసే రైతుల గుర్రాలూ కలిసి, తమ శక్తినంతనూ ఉపయోగించి, రథచక్రాల్ని బురదలోంచి వెలికి లాగేవి. అక్కడక్కడ మాత్రం కొంచెం మంచిరథ్యాలు నిర్మించుతూండేవాళ్ళు. గుర్రపువాళ్ళ యెండిన డొక్కలు కూడా యిప్పుడు యింకొంచెం విశ్రాంతిగా వుండేందు కవకాశం దొరికింది. దారిలో మొదటి కుదుపుకే క్రిందికి దొర్లిపోతానేమో అనే భయం లేకండా సారధి కాస్తంత కునుకు తీయవచ్చు నిప్పుడు.

ఎవరికేనా తొందరపని వుంటే గుర్రంమీద పోయేవాళ్ళు. వర్తకులు తమ సరకుల నమూనాలను తీసికొని, నెమ్మదిగా పోయే గుర్రాలమీద ఆయాసపడకండా తరటుమీద ప్రయాణం చేసేవాళ్ళు. మొట్టమొదటి వార్తాహరులు, తపాలావాళ్ళు (హర్కారాలు) జాబులూ, పార్సిళ్ళూ తీసికొని, గుర్రాల్ని దౌడు తీయిస్తూ, బహువేగంగా ధాటీగా పోయేవాళ్ళు. ఇప్పుడింక జాబులు అపురూపంగా వుండడంలేదు. పోస్టుమన్

లేక కోచిమన్ లేఖలను తీసికొని వెళ్ళి ఆ యా చిరునామాలకు అందించేవాళ్ళు. పోస్టుమన్ తమ కుటీరపు తలుపు తట్టినపుడు యేదో పుట్టి మునిగిందేమోరా? బాబూ! అనుకోడం లేదిప్పుడింక జనులు. జాబులు నిత్యజీవితంలో ఒకటిగా అయి, వాటిని చూచి భయభ్రాంతులు గావడం లేదింక, యెవరూ. ఇతర నగరాల్లో సరకుల ధరవరలను వర్తకులు జాబుల ద్వారా తెలుసుకొనేవాళ్ళు. అంతేగాక ఆ యా స్థలాల్లో జరిగే ప్రధాన సంఘటనలుకూడా జాబులద్వారా వారు తెలుసుకునేవారు.

ప్రపంచంలో జనులు చాలమంది, యితరచోట్ల యేమి జరుగుతూన్నదీ తెలుసుకోకుండానే జీవయాత్రను గడుపుతూండేవాళ్లు. కాని, యిప్పుడు ఆఖరికి చిన్న పట్టణాల్లోకూడా జనులు, హార్బరుల్లోని డచ్చినౌకలను నిర్బంధంలో వుంచమని స్పెయిన్ రాజు యెందు కాజ్ఞనిచ్చేడో, అందువల్ల లవంగాల ధరలలో యెల్లాంటి మార్పు రానున్నదో, – మొదలైన వార్తలు చర్చించుకుంటూన్నారు.

జాబులద్వారానే గాక సత్రములలో బసచేసే యాత్రీకుల ద్వారాకూడా వార్తలు, విశేషాలు తెలుస్తూండేవి.

సత్రములు యెల్లా గుర్తుపట్టగలము? పెద్దయిల్లు, ముందు విశాలమైన వాకిలి; అలిసి, చెమటలు గ్రక్కుతూండే గుర్రాలను విప్పుతూంటూరు, నౌకర్లు; నీరూ మేతా పెట్టి, ఉత్సాహంగా వున్న గుర్రాలను తాజాగా తీసికొనివచ్చి, ఆ బండ్లకు

కడుతూంటారు. కొత్తగా దిగేవాళ్లు దిగుతూంటే, వెళ్ళిపోయే వాళ్ళు బండ్లలో యెక్కుతూంటారు.

బాల్గా తెరిచివున్న ద్వారాల్లోంచి కులాసా సంభాషణలూ, నవ్వులూ, పాత్రల గణగణ ధ్వనులూ వినిపిస్తూంటాయి. తృప్తిగా అప్పుడే భోజనం చేసినవాళ్ళకికూడా నోరూరి మళ్ళా తినా లనిపించేటట్లు కమ్మని వాసన వేస్తూ, వేట మాంసం భాండాల్లో ఉడుకుతూంటుంది. విశాలమైన మధ్య చావడిలో పెద్ద నెగడి జాజ్వల్యమానంగా మండుతూంటుంది. అగ్ని గుండంవైపు వీపులు త్రిప్పి, స్వారీల పాదరక్షలు ధరించివున్న ధూళిధూసరిత దేహులు నిలుచుని కాచుకుంటూ మాట్లాడు కుంటూంటారు. రాజమార్గం ప్రక్కనే ఒక స్తంభం, దాని మీద వ్రేలాడే ఒక డాలూ వుంటుంది. ఆ డాలుమీద బంగారురంగు సింహమో, రజత సంకాశమైన అశ్వమో చిత్రితమై వుంటుంది. ఇల్లాంటి సంజ్ఞాఫలకమును (సైన్ బోర్డును) చదవడానికి యెవరికీ చదువు వచ్చి వుండనక్కరలేదు. అదే ఆ ప్రాంతాల నేలే ప్రభువు చిహ్నం!

పట్టణాల్లో అంతకంత కధికంగా యిటువంటి సంజ్ఞాఫలకాలు కనబడ నారంభించేయి. నాపితుని గోడమీద మెరిసే నీళ్ళ బేసిను; రొట్టెల దుకాణంవాని ఉనికిని తెలుపుతూ ఎర్రగా వేగిన బిస్కట్లు, వాని చూరునుంచి వ్రేలాడుతూంటుంది. ఈ కాలానికే మొదటి దుకాణాలు వెలసేయి. మేకులు, మేజోళ్లు,

తెచ్చేవాళ్ళే! తమ కున్న యీనాముల పెద్దరాబడులమీదా, పట్టణాల్లో వారు వసూలుగావించే పన్నులు, కట్టుబళ్లమీదా యీ బృందం మహావైభవంగా జీవితాల్ని గడుపుతూంటారు. వాళ్ళు రాజులుగారు, సన్యాసులే. కాని, వారి ముఖ్యుడైన బిషప్పు యే చక్రవర్తితోనైనా సమవుజ్జీగా నిలబడగలడు. పారలౌకిక ప్రభుత్వం ఐహిక ప్రభుత్వానికి హోదాలోనూ, అధికారంలోనూ, భోగానుభవంలోనూ యెంతమాత్రం తీసిపోదు! పొడవైన అంగీలు ధరించిన యీ సన్యాసు లంతా బిషప్ సభాసదులు, సామంతులు. ఆయన అధికారం వీరి ద్వారానే ప్రసరిస్తుంది, జనసామాన్యంమీద.

కాని, మనం యిక్కడికి యెందుకోసం వచ్చేము? కుక్షింభరులూ, సోమరులూ ఐన యీ మనుష్యుల కొరకేనా మనం యూరోపంతా వదలిపెట్టి, ఫ్రాయెన్‌బర్గ్‌కు వచ్చింది? కాదు. పోతుతేనెటీగల పట్టులాంటి యీ దుర్గంలో మధువునకై అహోరాత్రములు శ్రమించు కూలీ యీగలూ వున్నాయి.

నన్ను వెంబడించి రాండి! చూద్దాం, యిక్కడి విశేషాలు. అర్ధరాత్రం దాటింది. కాని, వాయువ్యదిశలోని గోపురంమీది కిటికీలోంచి దీపపు వెలుతురింకా కనబడుతూంది. స్వచ్ఛమైన వినీలాకాశంగల రాత్రియైనచో గోపురంమీది గదితలుపు తెరచుకొని, ఒక వృద్ధసన్యాసి బైటకు వచ్చి, వెడల్పయిన ప్రాకారపు గోడమీద నిలబడతాడు. ఆతని ఒక చేతిలో లాంతరూ, రెండో చేతిలో నొక విచిత్ర పరికరమున్నూ

వున్నాయి ఆత డీ పరికరము నొక యెత్తైన బల్లమీద వుంచు తాడు. రూళ్ళకర్రలతో చేసిన త్రిభుజం మాదిరిగా వుంది, ఆ పరికరం. మొదట ఆ వృద్ధుడు లాంతరును క్రింద వుంచి, పరికరము నొక యెత్తుచక్రంమీద అమర్చి, తాను పిట్టగోడ నానుకొని ఆకాశంలోనికి సావకాశంగా చూస్తాడు. ఆయన నక్షత్రకూటములను చిరకాల స్నేహితులనువలె పలక రిస్తూంటే అవిన్నీ ఆయనకు చిరునవ్వులతో బదులు పలుకు తూన్నట్లున్నాయి!

ఆ వృద్ధుడు కొన్ని లెక్కలు, గణితాలు తీసుకొంటాడు. ఆతని రూళ్ళకర్రల్లో నొకటి దూరదర్శన యంత్రంగా వుపయోగపడుతుంది. దానిలో రెండు చిన్న కర్రముక్కలు దూరదూరంగా బిగించి వుంటాయి. వాటిలో రంధ్రా లుంటాయి. ఈ సాధనము నొక నక్షత్రంమీద కేంద్రీకరిస్తారు. అప్పు డాతడు చూడదలచిన నక్షత్రాన్ని యీ రెండు రంధ్రాలగుండా చూడగలుగునట్లుగా అమరుస్తాడు. ఆ రూళ్ళ కర్రను దాని యిరుసుమీదనే గిరున త్రిప్పుతూ, ఆ వృద్ధవిజ్ఞాని దానిని మిలమిలలాడే నక్షత్ర సముదాయంలోని ఒక అరుణ కణముపైన, ద్రాక్షమధుబిందువులా వున్న దానిమీద నిలిపే వాడు. ఇదే మార్స్ అనగా అంగారక గ్రహం. అప్పు డాయన లాంతరును పరికరం దగ్గరగా తెచ్చి, దాని కొలబద్దమీద సిరాగుర్తులను లెక్కించేవాడు. అంగారక గ్రహం యెంత దూరంలో వున్నదో యీ సాధనంద్వారా నిర్ణయించబడింది.

ఆ నిశాసమయం అంత నిర్మలంగా, మనోహరంగా వున్నందుకా వృద్ధశాస్త్రజ్ఞుడు పరమానందపడిపోతాడు. ఉత్తర దేశాల్లో ఆ విధంగా నిర్మలాకాశం కనిపించే సమయాలు చాలా అరుదుగా వుంటాయి. ఆ రాత్రి, ఆయనకు బాల్యదశను జ్ఞప్తికి దెచ్చి వుంటుంది. ఆతడు యువకుడుగా వున్నపుడు ఇటలీ దేశంలో ఖగోళశాస్త్రం అధ్యయనం గావించేవాడు. ఆ దినాల్లో చూచిన వినిర్మలమైన యిటలీ ఆకాశం ఆయన కిప్పుడు జ్ఞాపకం వచ్చింది. దానితోబాటు తన మొదటి గురువు, జ్యోతిశ్శాస్త్రవేత్త, డొమినికో నొవారాను కూడా భక్తి పూర్వకంగా ఆయన స్మరించకుండా వుండలేదు!

ఈ ఆచార్యుని కృషి అసిధారావ్రతంగా సాగుతూండేది. ఈయన పంచాంగాలు రచించేవాడు, జాతకములు వ్రాసేవాడు, గ్రహణము లెప్పుడో చెప్పేవాడు, మంచిదినములు - చెడుదినములు నిర్ణయించేవాడు. కాని, యీ పని ఆయన కంతగా ఉల్లాసాన్నీ, సంతృప్తినీ కలిగించేదిగాదు. ఇది కేవలం ఉదరపోషణార్థమై మాత్రమే! వీటివల్ల నాలుగు రూకలు సంపాదించి, జీవయాత్ర గడుపుతూ, ప్రతీ రాత్రినీ నక్షత్ర గణపరిశీలనార్థమై వినియోగపరచేవాడు.

ఆ వృద్ధపండితుడు తన అంగవస్త్రపు కొనలను బిగువుగా మొలకు చుట్టుకొని గదికి వచ్చేవాడు. అక్కడాతని బల్లమీద పెద్ద పుస్తకం ఒకటి వుండేది. ఈ గ్రంథమే ఆయన కనుంగు బిడ్డ! తల్లికి బిడ్డమీద వుండే ప్రేమకంటే ఆయనకు యీ

గ్రంథమునందు అధికప్రేముడి! ఆయన యీ 'తనయ'కు అప్పటికే ముప్పది యేండ్లు పైబడినాయి!

రోమను కవిపుంగవుడు హోరేస్ సలహా నా వృద్ధునకు స్మరించేడు : 'నీ రచనను తొమ్మిదోయేట ప్రకటించుము!' కాని, ఆయన గ్రంథానికి నాలుగు తొమ్మిదులు గడిచినాయి. ఆ వ్రాతప్రతి యింకా గ్రంథకర్త బల్లమీదనే వుంటూంది. దానిని వెల్లడిచేయడానికి సమయం యింకా వచ్చినట్లు లేదు!

ఆయన ఆ గ్రంథమును తిరగేస్తూన్నాడు. దాని ముఖపత్రం మీద లాటినుభాషలో 'నికోలాస్ కోపర్నికస్, ట్యూరిన్ నగరవాసి; ఖగోళముల పరిభ్రమణములను గురించిన గ్రంథ పుస్తకము.' అని వ్రాసివుంది.

మరొకసారి,— యిది యెన్నోసారో లెక్కే లేదు,— అతడు ప్రకరణం తరువాత ప్రకరణం తిరగేసేడు. దీని ప్రథమగ్రంథం భూగోళ స్వరూపాన్ని విశదీకరిస్తుంది. భూమి గోళాకారంగా వుందనే విషయం జనుల బుర్రల్లోకి యెక్కేటట్లు చేయడం యెంత కష్టతరం! తత్త్వశాస్త్రజ్ఞుడు లాక్టాన్టియస్ మాటలను కోపర్నికస్ జ్ఞాపకం వుంచుకొన్నారు : "భూమికి ఆవలివైపున గడ్డి, చెట్లు మొదలైనవి పెరుగుతాయనీ, వాటి వ్రేళ్ళు గాలిలోకి వుంటాయనీ, అక్కడి జనుల కాళ్ళు పైకీ, తలలు క్రిందికీ వుంటాయనీ కేవలం పిచ్చివాళ్లు మాత్రమే అనుకుంటారు." రోమను అలంకారికుడూ, ఉపన్యాస కళాబోధకుడూ ఐన లాక్టాన్టియస్ క్రైస్తవ మతాన్ని స్వీకరించేడు. అతడు

విజ్ఞానాన్ని గూర్చి ఆలోచించేవాడేగాడు. తనకన్న విజ్ఞానాధికులైన వాళ్ళను పరిహసించకండా ఆతనిని నిరోధించలేక పోయింది, ఆతని అజ్ఞానము. అందుచేతనే ఆతడు బాలోచితమైన కుతర్కంవల్ల తానే పరిహాసాస్పదుడైనాడు !

కొపర్నికస్ సవిచారంగా అనుకున్నాడు : "ఎన్ని శతాబ్దాలు గతించినాయి. కాని, యింకా లాక్టాన్టియస్‌ను గూర్చి విచారణా లేదు, నిర్ణయమూ లేదు. జనులు దేనినైనా అర్థం చేసుకోవాలని కోరనపుడు, నీవు వారిని ఒప్పించలేవు. చదువుకొన్న మూర్ఖులీ గ్రంథాన్ని చదివి యేమంటారు ? ఈ భూమి నిశ్చలమైనదని వారికి దృఢనిశ్చయమే. ఉన్నట్లుండి వాళ్ళీ టేబులును చూస్తారు. దీనిలో విశ్వకేంద్రంగా భూమిగాక సూర్యుడు వున్నాడు. సూర్యుడు రాజులాగ గ్రహకుటుంబాన్ని పరిపాలిస్తూన్నాడు. ఆ గ్రహకుటుంబంలోని ఆరు గ్రహాల్లోను భూమి ఒక్కటి. శుక్ర – అంగారక గ్రహముల మధ్య భూమి యితఃపూర్వమే నిశ్చితమైన కక్ష్యననుసరించి పోతూంది."

ఆ పండితుడు తన విరోధులను గూర్చి ఆలోచించనేలేదు. ఎంతో ఆప్యాయతతో తను సృష్టించిన దానిని వీక్షించేడాయన. ఖగోళ ప్రతిరూపాన్ని నిర్మించి, టేబిలుమీాద వుంచేడు. దానిని పరిశీలించేడు, ఇప్పుడు మళ్ళీ. ఆః ! ఇదీ సరైన విశ్వరూప ప్రతిబింబం ! కాని, అరిస్టాటిల్, టాలమీా మొదలైన మహాపండితుల కాలమునుంచి అందరూ అంగీకరిస్తూ వచ్చిన

విశ్వరూపం కాదిది! కోపర్నికస్ విధానంలో గ్రహకక్ష్యలను సూచించేందుకై చాలా వృత్తాలను గీయ నవసరం ఉండదు. అతని టేబిలును చూస్తూంటే గణితశాస్త్రంలో యేమాత్రం పరిచయం ఉన్నవానికైనా అంగారక గ్రహం ఒకప్పుడు పెద్దది




గానూ, మరొకప్పుడు చిన్నదిగానూ యెందుకు కనబడుతుందో అర్థ మవుతుంది. అంగారక గ్రహం తన పరిభ్రమణంలో ఒకప్పుడు భూమికి సమీపంగానూ, మరొకప్పుడు దూరంగానూ పోతూండడంవల్లనే యీ తేడా కలుగుతూంది.

కొపర్నికస్ టేబిల్స్‌లో యిట్టి పొందిక కనబడుతుంది. ఇంతకుపూర్వం యే జ్యోతిశ్శాస్త్ర పండితుని పట్టికలలోనూ యిల్లాంటి సుసంబద్ధమైన పరస్పర సంబంధం కానరాలేదు. అది వరలోని వైరుధ్యాల నన్నింటినీ యిది విడగొట్టేసింది. ఖగోళ శాస్త్రజ్ఞుల్ని గాభరా పెట్టేస్తూన్నట్టి వివిధ భేదాభిప్రాయా లన్నింటినీ యిది పరిష్కరించేసింది. అతఃపూర్వపు శాస్త్రజ్ఞులు సంవత్సర దైర్ఘ్యాన్ని సరిగా నిర్వచించలేకపోయే రంటే, స్థిరమైన పంచాంగాన్ని చేయలేకపోయే రంటే వారిలో వున్న గందరగోళాన్ని ఊహించవచ్చు! ఒక్కొక్క పండితు డొక్కొక్క విశ్వస్వరూపాన్ని సూచిస్తూ వచ్చేడు. వివిధ పటాలనుంచి తలలు, కాళ్ళు, చేతులు, మొండెం మొదలైన అవయవాలు తీసికొని, వాటిని కలిపి ఒక వికృతాకారాన్ని తయారుచేసిన కళాకారుని ధోరణిలో వుండేవి వారి ప్రయత్నాలు! ఖగోళ శాస్త్ర పట్టికలు (యాస్ట్రొనామికల్ టేబుల్స్) తమ్ము తప్పు దారిలో పెట్టడం తప్ప మరేమీ చేయడంలే దని నావికులు చెప్పేనది సత్యదూరం కాదు, మరి.

ఈ పరిస్థితుల్ని మార్చవలసిన తరుణం వచ్చింది.

తన వ్రాత ప్రతిలో ఒక్కొక్క పుటనే తిరగేస్తున్నారు, కొపర్నికస్. తన జీవితపు పుటలనే తిరగేస్తూన్నాడా? అన్న ట్లుంది! ప్రశాంతమై, సమానాంతరమై వున్న ఆ పంక్తులలో యెన్నెన్ని భయాలు, సందేహాలు యిమిడివున్నాయి! ఎన్ని రాత్రులు నిద్రాసుఖమునకు దూరుడై గడపాల్సి వచ్చింది!

లోకమంతా విశ్వసిస్తూన్న దాని కెదురొడ్డి, యేకాకిగా నిలుచు టెంత కష్టం!

ఈ గ్రంథం ప్రచురితంగాకున్నా, దీనిలోని విషయాలను గూర్చిన ప్రవాదా లెన్నో లోకంలో వ్యాపిస్తూనే వున్నాయి. లోకశత్రువుడైన ఆ జ్యోతిశ్శాస్త్రజ్ఞుణ్ణి అదుపులో వుంచడానికి ప్రభుత్వం వెంటనే కదిలి, ఫూనుకోవా లని శాస్త్రశత్రువులు గొంతెత్తి గోలచేస్తూన్నారు. సూర్యుని స్థిరంగా వుంచి, భూమిని పరిభ్రమింప చేసిన యీ తెంపరి యెంతకేనా తగును! ఇల్లాంటి అసందర్భపు వ్యక్తులను యిష్టంవచ్చినట్లు వదలిపెట్ట రాదు! కోపర్నికస్ వ్యతిరేకులు తమకు ప్రమాణంగా, సాక్ష్యంగా పవిత్ర మతగ్రంథాల్ని ఉదాహరిస్తూన్నారు. బైబిల్లో ఏమని ఉంది? నిశ్చలంగా ఉండమని జోషువా ఎవరిని ఆజ్ఞాపించేడు? భూమినే గాని సూర్యుణ్ణి గాదు! ఈ మాత్రం తెలియని వాళ్లు, తగుదునమ్మా యని పుస్తకాలు రాయడమా? పిదపకాలం వచ్చింది. కానీండి, యిల్లాంటి పిచ్చిరాతలను ఖండించి పారేయకపోతే లాభంలేదు. ఈ పుస్తకం బైటికి రానీండి, అప్పుడు చెపుతారు, దాని పని!

అబ్బే! వద్దు! ఆ పుస్తకాన్ని అక్కడే, ఆ టేబిల్ మీదనే వుండనీయండి. దేనికైనా మంచికాలం రావాలి, మరి. దానికీ మిత్రు లున్నారు. కాని, వాళ్ళు కొద్దిమందే. ఐతేనేమి? వాళ్ళు మహాపండితులు, మహావిజ్ఞానులు!

తాను ఇటలీలో గడపిన పిన్ననాటి రోజులను మళ్ళీ తలచుకున్నాడు, కొపర్నికస్. అక్కడి పండితుల వాగ్వాదా లాతని చెవులలో యింకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. చెర్చి అంటే క్రైస్తవ మతపీఠం చెప్పినదాని నెవరూ చర్చించకూడదనీ, అల్లా చర్చించేవాళ్ళు చెర్చిని ధిక్కరించే వాళ్ళలోనే లెక్క అనీ వాళ్ళు వాదించేవారు. కాని, ఎవరూ తమ ఆలోచనలన్నిటినీ కాగితంమీద పెట్టేవాళ్ళూ గారు; కాగితంమీద పెట్టినవాటిని ప్రకటించేవాళ్ళూ గారు. ఏదైనా చర్చించుకునేటప్పుడు, యెవరేనా వింటారేమో ననే భయంతో, వాళ్ళు తలుపు లన్నీ బాగా బిడాయించుకొనే వాళ్ళు కూడాను! ఎందుకంటే మతధర్మ రక్షణబాధ్యతను తమపై పెట్టుకున్న పెద్దమనుష్యుల బుద్ధికంటె చెవులు చాలా చురుకైనవి లెండి!

ఏమైనా కానీ, నూతన భావాలు తమ కార్యాన్ని తాము గావిస్తూనే వున్నాయి. ఆ చర్చలే జరగియుండనిచో నే డీ గ్రంథం వ్రాసే అవకాశమే వుండకపోవును!

కొపర్నికస్ పుస్తకమును మూసివైచి, తాను నిద్రించే చిన్న గదిలోకి వెళ్ళిపోయేడు. అక్కడ అలమారలలో యెన్నో పుస్తకాలు గుత్తంగా అమర్చి వున్నాయి. పడకమీదకూడా పుస్తకాలే. ఆ పుస్తకా లన్నీ తెల్లని చర్మంతో, పంది చర్మంతో బైండుచేసినవే. ఆయనకు అత్యంత ప్రీతిపాత్రులైన తత్త్వవేత్తలు, కవులు రచించినవి, అవన్నీ. విర్జిల్ మహాకవి గ్రంథాన్ని తీసి, తన ఆందోళనను ప్రశాంతపరచుకోడానికి

అందులోని *శాంత ప్రవచనములతో తిరుగుబాటు చేస్తున్న తనఆత్మను శాంతింప చేసుకునేందుకు ఆయన ప్రయత్నిస్తాడు.

## 2. కొపర్నికస్ గ్రంథాని కొక మిత్రుడు

సంవత్సరాలు గడిచిపోతూన్నాయి. సూర్యుని చుట్టూ భూమి తన ప్రదక్షిణములను, ఒక్కొక్కటిగా చేసేస్తూనే వుంది. భూమిమీద నివసించే ప్రాణుల్లో యెవరూ యీ విషయాన్ని యెరిగివుండకపోయినా ప్రదక్షిణాలు మాత్రం జరిగిపోతూనే వున్నాయి. అల్లుడు రాకపోయినా అమావాస్య ఆగదుగదా!

మంచి దినాలకోసం యెదురుచూస్తూ, కొపర్నికస్ గ్రంథపు వ్రాతప్రతి అల్లాగే టేబిలుమీద పడివుంది. కాని, కాలం బాగులేకపోవుటే గాదు, అంతకంతకు అధ్వాన్నం కూడా అవుతూ వచ్చింది!

ఫ్రామెన్‌బర్గ్‌లో మరొక మతాధిపతి (కానన్) అవతరించేడు. ఆయన పేరు డాక్టరు హోసియస్. జను లాయనను 'విమత జీమూత ఝంఝూనిలు' డని పిలిచేవారు. ప్రతిచోటా నాస్తిక మతాలూ, మ్లేచ్ఛ ధోరణులూ ప్రబలుతూన్నా యని ఆయన భావించేవాడు. కొపర్నికస్ యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసలనుకూడా పసికట్టి బిషప్పుకు మోసేస్తూండేవా డాయన. వయస్సులో పిన్నలైన కానన్‌లు కొపర్నికస్‌తో మాట్లాడే

టందుకే వెరచేవారు. కోపర్నికస్ అనుమానితుడే గాదు, అవమానితుడు గూడాను! ఆయనతో మాట్లాడుతూ కనబడడమంటే యేదో కొంపమీదికి తెచ్చుకోడం అన్నమాటే! స్వేచ్ఛావాయు సంచారం ఆ గోడలమధ్య సాధ్యమే గాదన్నట్లుంది!

ఆఘాతాలు అంతకంతకు దురితగతిలోనూ, తీవ్రతరంగానూ పడుతున్నాయి, కోపర్నికస్‌మీద. ఛాప్టర్ అనబడే కానన్‌ల సభలో కోపర్నికస్ మిత్రుడు ఒక్కడు మాత్రమే వుండేవాడు. మిగిలిన మూక అంతా కలిసి ఆయననుకూడా నాస్తికుడనీ, ద్రోహి అనీ నిందించి, తరిమివేసేరు!

ఇప్పుడా వృద్ధ పండితుడు తన గదిని వీడి బైటికి రావడమే లేదు; అతని బలం ఉడిగిపోతూంది. దూరపు బంధువురాలొకర్తె ఆయనకు సంరక్షణ చేస్తూంది. ఆమెయే చాల యేండ్లుగా ఆయన గృహనిర్వాహణను పొదుపుగా చేస్తూంది. ఆమెకూడా కోపర్నికస్‌ను వదలిపోవాల్సి వచ్చింది. కానన్ యింటిలో స్త్రీకి స్థానం లేదని కోపర్నికస్ గ్రహించాల్సి వచ్చేటట్లు చేసేరు. ఆయనను ఫలానా పని చేయవద్దని గాని, ఫలానా పని చేయమని గాని, నిర్బంధించడం గాని, ఆజ్ఞాపించడం గాని లేదు. కాని కేవలం 'సోదరభావం'తో సలహా నీయడం, 'పితృభావం'తో మందలించడం మాత్రమే జరిగేది. కాని, తనను 'ప్రేమించే' సోదర కానన్‌ల మధ్యను, పితృతుల్యుడైన బిషప్పు దృష్టిలోను కోపర్నికస్ యెంత

ఒంటరితనమునూ, ఏకాకిత్వమునూ అనుభవిస్తూన్నాడు! ఆతని మీద ఏదో కానరాని యమదండం పడబోతూన్నట్లే వుండేది. *

కాని, ఏదో అద్భుత సంఘటన జరిగి, కోపర్నికస్‌కు ధైర్యాన్నిచ్చి, ఆయనకు మానవునిలోగల విశ్వాసాన్ని పునః స్థాపన గావించింది! విహారమున కొకనాడొక అతిథి వచ్చేడు. ఆతడు వయోధికుడు కాడు. కాని, గణితశాస్త్రంలో చాల ఘట్టివాడు. బాల జ్యోతిషం, వృద్ధవైద్యం అన్న రీతిగా ఆ పడుచువాని బుద్ధి జ్యోతిశ్శాస్త్రంలో పాదరసంలా పోతుంది! ఆయన పేరు జార్జి జోఖిమ్ ర్హిటికస్. చదువంటే ఆయనకు మహాచొరవ. అన్న చొరవే గాని అక్షర చొరవ లేని తెగకి చెందినవాడుగా డాయన. అందుచేత, కోపర్నికస్ గ్రంథం ప్రచురణ అయేవరకూ ఆగలేక దానిని వ్రాతలోనే చదవాలని ర్హిటికస్ సుదీర్ఘయాత్ర గావించి వచ్చేడు!

ఆ పురాతన గోపురానికి నూతన జీవం వచ్చింది. బిగ్గరగా మాట్లాడే పడుచుగొంతులు ప్రతిధ్వనించేవి. యువక ఆచార్యుడు ర్హిటికస్, కోపర్నికస్ గ్రంథాన్ని చదివి విభ్రాంతుడై పోయేవాడు. ఆ గ్రంథ ప్రచురణను యింకేమాత్రం ఆలస్యం చేయవలదని ఆయిన కోపర్నికస్‌ను వేడుకొనేవాడు, ప్రాధేయపడి అడిగేవాడు. ఈ గ్రంధం చదివితే, అరిస్టాటిల్

* ఇప్పటికీ ఈ పరిస్థితులే అన్ని రాజకీయపార్టీల్లో ఉంటున్నాయి. మానవు డెంత పెరిగినా ప్రారబ్ధానికి అతీతు డెట్లు కాగలడు?

పండితుడు కూడా తన అభిప్రాయాల్ని మార్చుకొని వుండేవాడే నన్నాడు! ఇది ప్రచురించుట తక్షణకర్తవ్య మని చెపుతూ, 'దీపాన్ని కుంచంక్రింద మూసి పెట్టిన రీతిగా' వుంది దీనిని ప్రచురించకండా వుంచడం అన్నాడు, ర్హీటికస్ పండితుడు.

కొపర్నికస్ తటపటాయిస్తూ ఉండిపోయేడు. "దీనిలోని టేబిల్స్‌ను మాత్రమే ప్రచురించి వూరుకుంటే బాగుంటుం దేమో ? సాధారణ జ్యోతిష్కులు తయారైయున్న గణిత పట్టికల నుపయోగించుకుంటారు. ఎవ్వనియందు బృహస్పతి అనుగ్రహదృష్టి పడుతుందో, ఎవ్వనికి దైవానుగ్రహం వుందో, ఎవ్వ డదృష్టవంతుడో, అతడే యీ పట్టికలనుంచి నూతన విశ్వరూప నిర్ణయమును గావిస్తాడు !" అన్నా డాయన.

కాని, కొపర్నికస్ తటపటాయింపులను ఆ యువక ఆచార్యుడు పట్టించుకొనే స్థితిలో లేడు. సిద్ధాంత పోరాటంలోనికి, సంఘర్షణలోనికి తక్షణమే దూకాలని అతి ఉద్విగ్నుడై వున్నాడు. ఏమైనా పడుచురక్తం గదా !

పుస్తకాల దుకాణాల్లో ఒక చిన్న కరపత్రం గానవచ్చింది. దాని ముఖపత్రంమీద యిల్లా వుంది.

"మానవులందరిలోకీ బహుశ్రుతుడున్నూ, జ్యోతి శ్శాస్త్రజ్ఞుల్లో అద్వితీయుడున్నూ, మాన్య వయోవృద్ధుడున్నూ, మహాపండితుడున్నూ, థారన్ నివాసి యున్నూ, పాపులకు ముక్తిమార్గమును చూపువా

డున్నా ఐన నికోలాస్ రచనలను గూర్చిన ప్రథమ నివేదిక; గణితశాస్త్రంలో విద్యార్థిగా నున్న ఒక చిఱుతవయస్కునిచే తయారుచేయబడినది."

చిఱుత వయస్కుడైన యీ విద్యార్థి యెవరు ? ఆతడే ఆచార్య ర్హిటికస్, కొపర్నికస్‌కు నూతన మిత్రుడు ! ఒక మహాగ్రంథం త్వరలో వెలువడనున్నదని లోకానికి చాటుతూ, ఆ చిన్న కరపత్రం అన్ని పట్టణాల్లోనూ, పుస్తకాల దుకాణాల్లోనూ ముందు నడుస్తూంది. యౌవన సహజమైన అభినివేశంతో ర్హిటికస్ తన గురువర్యునికి అజ్ఞానశిఖామణులు, అసూయాగ్రస్తులు, అల్పప్రజ్ఞులు, కుటిలాత్ములు, కుట్రదారులుతో కూడిన మూకలోంచి త్రోవను ప్రబద్దలు చేసుకుని పోతూన్నాడు. ఈ జన సమూహంలో యెందరు మందమతులు, మరెందరు జడులు ఉన్నారని ! ఒక్కని బుఱ్రలోనూ కంచు కాగడాపట్టి వెదకినా, ఒక్క అపూర్వ కల్పన, ఒక నూతన భావం కానరాదు గదా ! బహుగ్రంథద్రష్టలైనను అవిమర్శాత్ములైనవారు, ఒక నూతనసత్యంకంటె యేదో పురాతన గ్రంథంలోంచి యిచ్చిన ప్రమాణవాక్యానికే తలొగ్గుతారు. అల్లాంటి శవులు యెందరో ! గుడ్లగూబ సూర్యరశ్మికి భయపడి నట్లు వీళ్లు నూతనమైన వెలుగును చూసి గతుక్కుమంటారు ! గతానుగతికో లోకో న లోకః పారమార్థికః । అని పండితులూరికే అనలేదు ! అసత్యములైననూ పురాతన సిద్ధాంతాలనే పట్టుకు వ్రేలాడుతూ, కేవలం భజనపరులుగా వుండే

రకం యిదంతా. చీకటిగా వున్ననూ ఆ పాత ఆశ్రయస్థానం పోతే యింకొక ఆశ్రయస్థానం దొరకదేమో ననే, వాళ్ళ భయం!

ఈ మూఢ జనసమూహాల్లోంచి ఆ యువకవీరుడు, కోపర్నికస్ మిత్రుడు, శిష్యోత్తముడు బాణంలాగ దూసుకుపోయేడు. ఆతనొక్కటే మాట చెప్పేవాడు: "ఎవ్వడు తత్త్వవేత్తగా వుండా లనుకుంటాడో ఆతడు సంకెళ్ళను ఛేదించి పారెయ్యాలి!" ఒక వస్తువు పాతది గనక సత్యమైన దని చెప్పేవారి నాయన గేలిచేసేవాడు. * జ్యోతిర్గోళాలు, విషయాలు జ్యోతిష్కుల్ని శాసిస్తున్నాయి. కాని జ్యోతిష్కులు జ్యోతిర్గోళాలను, విషయాలను శాసించడం లేదని ఆతడు వాళ్ళందర్నీ హెచ్చరించేడు. టాలమీయే యిప్పుడు సజీవుడై వుంటే తన సిద్ధాంతాల్ని వదలిపెట్టి, యీ నూతన సిద్ధాంతాన్ని చేపట్టియుండేవాడనీ ర్హెటికస్ బల్లగుద్ది చెప్పేవాడు.

## 3. గ్రంథం జైత్రయాత్రకు బైలుదేరుతుంది

ఎట్టకేలకు కోపర్నికస్ గ్రంథం, తన ఆయుధా లన్నిటినీ సన్నద్ధం గావించుకుని జైత్రయాత్రకు బైలుదేరింది. నూతన

---

* శ్లో. పురాణ మిత్యేవ న సాధు సర్వం।
న చాపి కావ్యం నవ మిత్యవద్యం।
సంతః పరీక్షాన్యతరం భజంతే। మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః॥

అన్న కాళిదాస మహాకవి వచనం సర్వజనశిరోధార్యంగా కనబడుతుంది,

సిద్ధాంతాలు, వాదనలు, కల్పనలు, గణితములు, టేబిల్స్,- యివే దాని వివిధాయుధాలు. న్యూరెంబర్గ్ నగరంలోని అచ్చుకూటములు యీ గ్రంథ ముద్రణకై సన్నద్ధంగా వున్నాయి.

కోపర్నికస్ తన తనయుతో వియోగమునకు సిద్ధపడి, ఒక నిశ్చయానికి వచ్చేసేడు. 'దాని బ్రతుకు దానిని బ్రతుకనీయి! లోకంలోని అజ్ఞానా న్నది దహించుగాక! సత్య స్థాపనము చేయుగాక!'

ఆహా! ఏమి యిది! లోకానికి నిజంగానే మంచి దినాలు వచ్చినాయా? ఏమో? కాని, ఆ సుదినములను చూచుటకై కోపర్నికస్ జీవించియుండజాలడు. ఆయన కింకెంతో కాలం ఆయుర్దాయం లేదు. అందుచే తన జీవితకాల కృషిఫలితమును తన మరణాత్పూర్వమే ఒక్కసారి కళ్ళతో చూడాలనే నిశ్చయానికి వచ్చేడు. ఒకటే వ్రాతప్రతి ఐతే సులభంగా నాశనమై పోవచ్చును. కాని, చాల ప్రతులను గనక ముద్రిస్తే ఆఖరి కొక్కటైనా బ్రతికి బట్టకట్టవచ్చును...

ఆ గ్రంథ మింకనూ చదువరులను చేరనేలేదు. అది యింకా యుద్ధంలో కాలిడనే లేదు. కాని, అప్పుడే దాని మార్గం పొడుగునా అవరోధాలు యేర్పడి, దాన్ని పడగొట్టేందుకు తయారైనాయి. 'ఆధ్యాత్మిక వేత్తలను సంతృప్తిపరచడానికై యేదో రెండు ముక్కలు వ్రాసి, దానిలో చేర్చ'మని సంపాదకుడు కోపర్నికస్‌ను ఒప్పించేందుకు తంటాలు పడుతూ

న్నాడు! తనను భ్రమపెట్ట చూచే యీ ఆకర్షణలను గమనించేందుకే నిరాకరించేడు, కొపర్నికస్. మధ్యేమార్గం, రాజీబేరం లేదని కొపర్నికస్‌కు తెలుసును. ఏదో శాస్త్ర చేర్చడమంటే సర్వనాశనం చేయడమే నని ఆత డెరుగును. తా నా పని చేయలేడు.

ఐతే, మరి, ఆ గ్రంథాన్ని రక్షించడం ఎల్లాగ?

కొపర్నికస్ తన చుట్టూ పారజూచేడు. పశ్చిమ యూరోపునందలి క్రైస్తవు లంతా రెండు శిబిరాలుగా విడిపోయి వున్నారు. ఒక ముఠా పోపు నాయకత్వం క్రిందా, మరో ముఠా మార్టిన్ లూథర్ అనే జర్మనీవాని నాయకత్వం క్రిందా నడుస్తూన్నాయి. లూథర్ ఒక థూరింజియన్ గని పనివాని కొడుకు. ఇతగాడు పోపుమీద తిరుగుబాటు లేవదీసేడు. దేనిదారి దానిదే కావచ్చు. కాని, యీ ప్రబుద్ధుడైన తిరుగుబాటుదారుడూ కొపర్నికస్ పండితుణ్ణి మూర్ఖు డనడానికి సంకోచించలేదు! కొపర్నికస్ కొత్త సిద్ధాంతాలను గురించి వినీవినక ముందే యీ 'విప్లవకారుడు' ఆతణ్ణి 'దైవద్రోహి'గా నిర్ణయించేసేడు.

అల్లాగైతే యీ గ్రంథాన్ని పోప్‌నకే యెందుకు అంకితమీయకూడ దని కొపర్నికస్ ఆలోచించేడు. లూథర్ దీన్ని ఖండించేడు. కాబట్టి, బహుశః పోపు దీనిని తన రక్షణక్రింద నుంచుకోవచ్చు ననుకున్నాడు. ఒక వేళ యీ గ్రంథం గనుక ధర్మాధర్మ నిర్ణయార్థమై మత న్యాయస్థానం ముందు నిలబడాల్సి

వస్తే, ఎవడో బిషప్పు జడ్జీగా వుండడం కంటె పోప్ నే జడ్జీగా వుండనీ యనుకున్నాడు.

కోపర్నికస్ తన మహాగ్రంథానికి అంకితం రాసేడు :

"పితరు లందరిలోకీ అతిపవిత్రుడైన వానికే దీని నంకిత మిడుచున్నాను. ఈ భూగోళానికి చలన మున్న దని నేను చెప్పిన వెంటనే యిందుకు నన్ను శిక్షించా లనే వాళ్ళు వున్నా రని నేను బాగా యెరిగియే వున్నాను......నా అభిప్రాయాలలోని నవ్యత్వం, పైకి చూపట్టు అసంగతత్వం నాయం దేవగింపును ప్రేరేపించ వచ్చు ననే భయంతో నేను నా యీ సంపూర్ణ గ్రంథాన్ని ప్రచురించకుండా అట్టే పెట్టుద మనికూడా నిర్ణయించుకున్నాను. కాని, నా స్నేహితులు, నా యీ గ్రంథం ప్రచురించబడితీరా లనే ఒత్తిడిచేసి, నన్నొప్పిం చేరు......అనేక యితర పండితులు, ప్రసిద్ధవిజ్ఞానులు కూడా నేను దీనిని ప్రకటించి తీరాలనే చెప్పేరు. సామాన్యంగా వుండే ప్రతికూల భావాలవల్ల గాభరా పడకుండా, గణితశాస్త్రవేత్తల మేలునకై యీ గ్రంథాన్ని ప్రచురణ గావించాల్సిన అగత్యం, పూచీ, బాధ్యతా నా మీద వున్నాయని కూడా వారు పట్టు బట్టేరు."

"పరమపవిత్రా! నేను ఎన్నో రాత్రులు అత్యంత శ్రమతో గావించిన పరిశ్రమాఫలితాలను ప్రకటించ

సాహసించినందుకు తాము ఆశ్చర్యపడకుండెదరు గాక! బహుశః అందరు గణితశాస్త్రవేత్తలూ భూమి స్థిరంగా వున్నదని ఘోషిస్తూండగా, మానవుని సాధారణ పరిశీలనా జ్ఞానాలకు కూడా భూమి సుస్థిరమైనదిగా కనబడుతూండగా, నాకీ బుద్ధి, భూమి కదులుతూందనేది యెల్లా కలిగిందా? అని కూడా మీరు ఆశ్చర్యపడ వచ్చును......"

సామెత చెప్పిన రీతిగా, అపవాదమువల్లనైన ఉల్లకుట్టుకు మందు లేదన్నది నిజమేమైనా, కొండెములు చెప్పువారి బారినుండి పోపు తనను రక్షించుననే ఆశను కొపర్నికస్ వెల్లడించేడు. అంతేగాక, తనపై అజ్ఞానులు, మూర్ఖులునైన జనులు తేబోవు ఆరోపణలను పరమాసహ్యాభావంతో నిరసిస్తూ, ఆయన ముందుగనే యిల్లా వ్రాసేడు :

"గణితశాస్త్ర విషయములేమియు నెరుగక పోయినను సర్వముం దెలిసిన భంగి వదరు వాగుడు గాండ్లకూ, ఉద్దేశపూర్వకముగా పవిత్ర గ్రంధముల లోని యేవో కొన్ని భాగములను నిరాకరించుటకే నే నీ సిద్ధాంతాన్ని లేవదీసే నని ఆరోపిస్తూ, నన్ను ఖండించి, శిక్షించాలనే వారికీ నేనేమీ విలువనీయను. పైగా అటువంటి కువిమర్శనలను, కుటిల ఆరోపణలను అసహ్యించుకుంటాను, నిరసిస్తాను..."

ఒక్కొక్క నెలే గడిచిపోతూంది. హేమంతపు తుపానులు వెనుకబట్టేయి. వసంతాగమమైనది. ఫ్రాయెన్‌బర్గ్ మీద నక్షత్రాలు ప్రకాశిస్తూన్నాయి. కాని ఆ వృద్ధసన్యాసి, కోపర్నికస్ పండితుడు, రాత్రులు తన గోపుర కుడ్యములపైకి వెళ్ళడం లేదు, నక్షత్రవేధకై. ఇప్పుడా వృద్ధుడు అస్వస్థుడై మంచాన పడి వున్నాడు. ఆయన గది అరమారలలో జ్యోతిశ్శాస్త్ర, గణితశాస్త్ర గ్రంథాలే గాక వైద్యశాస్త్ర గ్రంథాలుకూడా వున్నాయి. కోపర్నికస్ జ్యోతిశ్శాస్త్రజ్ఞుడే గాక వైద్యశాస్త్రజ్ఞుడు కూడాను. ఆయన ఒకప్పుడు ప్రతి ఉదయమూ, కొండ క్రిందనున్న పట్టణపు పేటల్లోకి రోగులను చూచేటందుకై వెడుతూండేవాడు. ఆ పేటల్లోని బీదలైన రైతులు, కష్టజీవుల నుంచి యెట్లాంటి ప్రతిఫలమును తీసికొనకుండానే ఆయన వారికి చికిత్స చేస్తూండేవాడు. అంతేగాదు. తరచుగా ఆయన దారిని బోతూ, బీదరోగుల కుటీరాల్లో ప్రవేశించి, వాళ్ళకు మందులనే గాక, ఖరీదైన అనుపానద్రవ్యాలను, సుగంధద్రవ్యాలతో తయారుచేసినవాటిని, – కొన్ని వెండి నాణెములనూ కూడ ఉంచి పోవుచుండెడివాడు!

అట్టి ఉదారుడు, పరార్థజీవి, మహాపండితుడు, యిప్పుడు రోగపీడితుడై, యేకాకిగా మంచాన పడియున్నాడు. ఆయనను గురించి పట్టించుకొన్నవారే లేరు! ఇంక యెంతో కాలం జీవించనని ఆయన యెరుగును. ఏదైనా ధ్వనియైనయెడల ఆతురతతో ఆలకిస్తూ, మెట్లపై వినబడే ప్రతి యడుగు సవ్వడినీ

శ్రద్ధగా వింటున్నా రాయన. మెల్లిక్కి వచ్చి, తలుపు తెరచుకొని, మంచం దరికి వచ్చి నిలబడిన ఆచార్యయువకుని, ర్హిటికస్‌ను ఆయన మనోనేత్రంతో చూచేవాడు. ఆ యువక పండితుని చేతుల్లో వున్న బృహద్గ్రంథం తనదే!......కాని, దినములు గడచిపోతూన్నాయే గాని, ఆతని జాడ గాని, పుస్తకం జాడ గాని లేనేలేదాయె!

అహాఁ! ఇంక లాభం లేదు. తన గ్రంథం చూచేదాకా కూడా తాను బ్రతికియుండనని ఆయన నిశ్చయించుకున్నాడు. ఐనసూ ఆతని మిత్రులు ఆ గ్రంథమును యెట్లో పూర్తిచేసి, అవసాన దినానికి దానిని తెచ్చి, ఆయన చేతుల్లో వుంచేరు. ఆయన తన బిడ్డనులా దానిని చేతుల్లో పట్టుకుని, దానివైపు చూసేడు. కాని, అప్పటికే ఆయన ఆలోచనలు యీ లోకపు విషయాలమీద గాక యెక్కడో దూరమున, జీవితప్రవాహపు టవ్వలి తీరమున దేనిమీదనో వ్రాలినాయి! అవి మగుడి రాలేదు. కొద్ది గంటలలోనే కొపర్నికస్ మరణించేరు...

ఏమో, తన గ్రంధపు టచ్చుప్రతిని తిరుగవేసి చూడజాల కుండుటే కొపర్నికస్‌కు మంచిదైనదేమో! దానిని తెరువ గలిగినచో, దాని మొదటిపుట మీదనే, పేరు నిశానీలు లేని పీఠికను చూసి వుండేవాడు. కొపర్నికస్ కోరికకు భిన్నంగా సంపాదకు డా గ్రంధానికి యేదో 'కొంచెం' చేర్చకుండ వదల లేదు. ఈ 'కొంచెమే' క్షీరభాండంలో విషబిందువువంటిదై,

కొపర్నికస్ విజ్ఞాని అంతిమక్షణాలను విషాదపూరితములుగా చేసివేసేది!

భవిష్యత్‌లో తన్ను నిందించువారికి అందకుండా వుండేం దుకై అత్యుపచారశీలుడైన సంపాదక మహాశయుడు తనకన్న ముందు తానే పరుగెత్తి, యిల్లా వ్రాసేడు!

> "గ్రంథకర్త ఖండనార్హమైన కార్యమును దేనినీ చేయలేదు. ఆయన బోధన లెవ్వరికీ విధులవంటివి గాజాలవు. అనంతకోటి సిద్ధాంతాల్లో యీాయనది ఒకటిమాత్రమే. గణితము సులభతరం చేయుటవల్ల యిది కొంత వీలుగా వుంటుంది, అంతే. కాని, మొత్తం మీాద ప్రామాణికమైన విషయముల నెవ్వరైన నేర్చుకో దలచినట్లయితే అట్టివాడు ఖగోళశాస్త్రంలోనికి పోనే రాదు. ఈ గ్రంథం ప్రామాణికమైనది కానేకాదు. ఈ పుస్తకంలో వ్రాయబడిన దానిని చదివి, యెవడైనా దాని నంగీకరించినచో ఆతడు పరమ మూర్ఖుడే అవు తాడు, అంతే..."

కొపర్నికస్ యువకమిత్రుడు ర్హిటికస్ దీనిని చదివి, క్రోధంతో మండిపడ్డాడు. మహాత్ముడైన ఆ పండితుని మరణం వల్ల కలిగిన దుఃఖం, ఈ మిత్రద్రోహి నీచకృతఘ్నుతా కృత్యం పట్ల కలిగిన క్రోధంతో మిళితమైంది. కాని, తాను మాత్రం చేయగల దేమున్నది? కార్యం చేయి దాటిపోయింది. ఆ

గ్రంథం ప్రచురించబడి, పుస్తక దుకాణాల్లో అప్పుడే విక్రయించబడుతూంది!

మిత్రులూ, శత్రులూ కూడ దానిని చదువుతూన్నారు. కొపర్నికస్ ముందే చెప్పినట్లు, దానికి మిత్రులకంటె అమిత్రులే అత్యధికసంఖ్యాకులుగా వుండేవారు.

జర్మనీకి 'గురువు'న్నూ, లూథర్‌కు మిత్రుడున్నూ ఐన మెలాంచ్‌థోన్ యిల్లా వ్రాసేడు : 'కొపర్నికస్ బోధనలు వట్టి చెత్త. ఇట్టి పాడు పుస్తకాల ప్రచురణ యితరులకు చెడు ఉదాహరణంగా వుంటుంది.' పైగా తన విమర్శకు ఆధారం చూపించేడు : 'భూమిచుట్టూ ఆకాశం గిరున తిరుగుతుందనీ, అదైనా యిరవై నాలుగు గంటల్లోనే ఒక చుట్టు పూర్తిచేస్తుందనీ మన కండ్లే మనకు ప్రత్యక్ష సాక్ష్యం యిస్తున్నాయి!' జర్మనీ గురువు మహామేరువులాంటివాడు. గనుక ఆయన ననుసరించి, ఆయన శిష్యపరమాణువు లెందరో ఆ గ్రంథాన్ని దూషించ నారంభించేరు.

కాని, యీ గ్రంథం యే జనులకొరకు ఉద్దేశించబడిందో ఆ జనులు దానిని తగురీతిగా, కొపర్నికస్ వుంటే ఆయనకే తృప్తి కలిగియుండు రీతిలోనే అంగీకరించేరు. మహావిద్వాంసుడైన జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు టైకో బ్రాహీ, కొపర్నికస్ గౌరవార్థమై గిరినిర్ఝరిణివంటి గీతము నొకదాన్ని ఆశువుగా రచించేడు.

టైకో బ్రాహీకి బ్రహ్మాండమైన నక్షత్రశాల, 'యురానియన్ బర్గ్' అను పేరిటిది వుండేది. జ్యోతిర్విద్యా దేవతయైన యురానియా * పేరిట నీ నక్షత్రశాల నిర్మించబడింది. జ్యోతిర్విజ్ఞాన కాణాచియైన యురానియన్ బర్గ్‌లో ఎన్నో యంత్రపరికరాలు, సంశ్లిష్ట నిర్మాణంగలవి వున్నాయి. కొపర్నికస్ తానై చేసికొన్న దేవదారు పుల్లల పరికరాల వంటివి గావు, అవి! కొపర్నికస్ మరణానంతరం ఆయన పరికరముల నాయన మిత్రుడు టైకో బ్రాహీకి పంపించేరు. టైకో బ్రాహీ గణితశాస్త్రంలో మహాపండితుడే గాకుండా కవికూడను. కొపర్నికస్‌ను నక్షత్రలోకానికి గొంపోగల్గిన ఆ దేవదారుఖండముల నాతడు కొనియాడుతూ యెన్నో గీతాలను రచించి, గానం చేసేడు !...

ఈ ప్రకరణపు ఫలశ్రుతి దగ్గరకు వచ్చేసేము. కాని, ఒక దానికి ఫలశ్రుతి చెపుతే, మరొకదానికి ప్రారంభ పూజ చేయాల్సిందే. ఒక తరంయొక్క ఫలము, తరువాతిదానికి బీజావాపనం చేయుడం సహజమేగదా. ఈ ప్రకరణాంతం, తరువాతి ప్రకరణానికి యెత్తుగడ నిస్తుంది. తథాస్తు.



* జ్యూస్ దేవునికి తొమ్మండ్రు కుమార్తెలు. వారందరూ తలొక్క కళకు, విద్యకు అధిదేవతలు. వారిలో నొకతె 'యురానియా.' ఈమె జ్యోతిశ్శాస్త్రానికి అధిదేవత—అనువాదకుడు.

# పదో ప్రకరణం

## 1. కొపర్నికస్ గ్రంథం ఒక యువపరివ్రాజకుని చేతుల్లో యెల్లా పడినది?

క్రీ శ. 1543 వ సంవత్సరం కొపర్నికస్ మరణించిన యేడే గాక ఆయన గ్రంథం జన్మించిన యేడు కూడాను. దీర్ఘనిద్రా ముద్రితుడై కొపర్నికస్ పండితుడు సమాధిలో నిశ్చలుడై వుండగా ఆయన గ్రంథం జనలోక సంచారం ఆరంభించింది.

కొందరు దానిని పరిహసించేరు, మరికొందరు పొగడేరు. కాని, యెవరూ ఉదాసీనులై వుండిపోలేదు. పుస్తకం తానైతే మార్పు చెందదు గాని, దాన్ని చేతబట్టుకొని, చదివినవారంతా మాత్రం చాలా మారిపోతూన్నారు. దానిని చదివిన వాడెవ్వడూ పూర్వం వలెగాక యెంతో భిన్నులుగా ఐపోతూ వచ్చేరు.

ప్రమాదకరమైన యీ గ్రంథం జనులవద్దకు అదృష్టదేవత లాగ వచ్చేది. నిద్రిస్తూన్నవాళ్ళ నది మేల్కొల్పేది. శక్తి హీనులైన వాళ్ళనకూడా ఆ గ్రంథంలోని భావాలు సాహసిక ఆలోచనలు చేయునట్లు ప్రోద్బలించేవి. వారిలో పూర్వ భిన్న-మైన స్వతంత్రభావాలను కలిగించేవి. చెర్చి, మతం ఆజ్ఞాపించిన రీతిగా గాక స్వేచ్ఛగా ఆలోచించడంలో ఆనందం వుంది. *

---

* చెర్చి, మతం ఆజ్ఞాపించిన రీతిగానే కాదు ప్రభుత్వాలు, పార్టీలు కూడ ఆజ్ఞాపించినరీతిగా గాక స్వేచ్ఛగా ఆలోచించడం అవసరం.

అది ఉన్నతమైన, విలక్షణమైన అనుభూతి, ఆనందం. కాని, యీ ఆనందము ననుభవించాలంటే అత్యధికమైన మూల్యా మును చెల్లించాల్సి వుంటుంది. గొప్ప శక్తి, త్యాగము గలవారే యీ ఆనందాన్ని పొందగలుగుతారు.

అటువంటి వాళ్ళలో ఒకడే గియోర్దనో బ్రూనో. ఆత డొక యువకుడు, పరివ్రాజకుడు. నేపుల్స్ నగరమున కనతి దూరంలో వున్న ఒక చిన్న పట్నంలో నివసిస్తూండేవాడు. ఆయున మఠంలో యెన్నో గ్రంథా లుంటూండేవి. కొన్నిటిని మాత్రమే బీరువాల్లో పెట్టేవారు గాని మరెన్నో పుస్తకాలను భద్రంగా దాచి వుంచేవారు. కుతూహలంతో చూచేవాళ్ళూ, కూపీ లాగాలనేవాళ్ళూ కొల్లలుగానే వుంటారు. గనుక వాళ్ళ దుర్మార్గపు కళ్ళు బడకండా వుంచేందుకే కొన్ని గ్రంథాలను చాటున దాచాల్సివచ్చేది.

గియోర్దనో భ్రాతరుని * గదిని కనుక యెప్పుడేనా మఠాధి పతి వెతికితే, అందులో అరిస్టాటిల్ గ్రంథాలే గాక, - యీాయన గ్రంథాలను చెర్చి ఆమోదించింది లెండి,-స్వేచ్ఛా భావములు గల రోమక పౌరుడు లుక్రీషియస్ రచించిన పద్యకావ్యమును కూడ చూడగలిగి వుండేవాడు. దాని పేరు

* క్రైస్తవమతంలో పరివ్రాజకులు, సన్యాసులు మొదలైన వారు వివిధ సంఘాలుగా యేర్పడి వుంటారు. వారిని భ్రాతరులు (బ్రదర్స్) అంటారు. ఒకరికొకరు సోదరు లన్నమాట. మఠములు, విహారములు కెథెడ్రల్స్ వగైరాలు వీరి అధీనంలో వుంటాయి. — అనువాదకుడు.

'దీ రేరమ్ నాచురా' అంటే 'విషయముల ప్రకృతిని గురించి' అని. 'దైవాంశ సంభూతుడైన పండితుడు' థామస్ అక్వినాస్ రచించిన పదునెనిమిది పత్రములతో బాటు రోటర్డామ్ నివాసియైన ఎరాస్మస్ రచించిన ప్రమాదకర గ్రంథం 'అవివేక స్తుతి స్తబకము'ను కూడ అక్కడ చూసి వుండేవాడు.

ఏ చాపక్రిందనో, చేలమీాది బల్లకూర్పులోని యే చెక్క క్రిందనో గియోర్దనో బ్రూనో వ్రాసిన నోటు బుక్కులూ అవీ దొరుకుతాయి. వాటిలో దేన్ని తెరచి చూసినా, మఠాధిపతి మొహం మాడి మసిబొగ్గులా ఐ వుండేది!

ఆయన హాస్య వ్యంగ్యనాటకాల్ని రచించేడు. 'కొవ్వొత్తి' అనే హాస్యనాటకం గాని, 'అమితోత్సాహులైన యోధ వర్యులు' అనే ప్రహసనమును గాని చదివితే ఆయన భావాలు తెలుస్తాయి. అజ్ఞానాన్ని పవిత్రత యనీ, మౌఢ్యమును భక్తి యనీ, పాపాచరణను ఆచారశీలసంపత్తి యనీ పిలుస్తూ, లోకాపచారం గావించే వారిని పరిహసించే యీా నాటకాలు డొమినికన్ సంప్రదాయానికి (ఆర్డరుకు) చెందిన ఒక సన్యాసి వ్రాయడం అనూహ్యమైనది! ఇల్లాంటి భావాలుగల బ్రూనో కాషాయవస్త్రాలను ధరించడం యెందుకనేది నిజంగా పెద్ద సమస్యే!

ఐతే యిల్లాంటి స్వేచ్ఛాస్వాతంత్ర్య భావములు గల వ్యక్తి సన్యాసిగా యెందుకైనాడు?

సెయింట్ డొమినిక్ విహారంలో ప్రవేశించే టప్పటికి బ్రూనో పది హేనేండ్ల పిల్లవాడు. పరమపవిత్రులుగా వుంటూ, భక్తితో స్వీయమత విశ్వాసాలను కాపాడుకొంటూ రనీ, విమత భావములకు పరమశత్రువు లనీ డొమినికన్ సన్యాసులు చిరకాలంగా పేరుపడినవాళ్ళు. పవిత్ర ధర్మ విషయాలలో నేరవిచారణ, నిర్ణయము గావించవలసి వచ్చినపుడు మత న్యాయస్థానాల్లో జడ్జీలుగా కూర్చునేవాళ్ళు వీరే. వీళ్ళ ధ్వజం మీద కాగడను కరచి పట్టుకొనివున్న కుక్కతల చిత్రించబడి వుండేది. శునకం యజమాని విరోధులను పసికట్టడంలో యెంత విశ్వాసంతో వుంటుందో అంత విశ్వాసంతోనే యీ సన్యాసులు విమత ధర్మములను, భావములను సర్వత్రా పసికట్టి పట్టుకుంటూండేవాళ్లు. ఈ మరస్థులు బాగా డొక్క శుద్ధిగలవాళ్ళు కూడాను. మారుమూలల్లో, గుంటచిక్కులుగా వుండే వాదనల్లో కూడా నీహారలేశాలు వెతికి తీసి, విమత భావాలను, సంప్రదాయ వ్యతిరేక ధోరణులను ఉడుముల్లా పట్టుకుని బైటికి లాగేవాళ్లు, వీళ్లు. 'దైవాంశ సంభూతుడైన పండితుడు' థామస్ అక్వినాస్ వీళ్ళ కోవకు చెందినవాడే. ఏ మానవుడైనా సరే యే పద్ధతిలో ఆలోచించాలో, యే పద్ధతిలో ఆలోచించరాదో విపులంగా సూత్రీకరిస్తూ 'సమ్మా థియొలాజియే' అనే నిబంధనావళిని తయారుచేసి, తద్వారా అనేక తరాలవరకూ డొమినికన్ సన్యాసులను తయారుచేసే శిక్షాసూత్రాల నొసంగిన బుద్ధిశాలి, యీయనే.

అటువంటి డొమినికన్ సన్యాసులకు పుట్టవంటి యీ మఠం లోకి వచ్చిపడ్డాడు, యీ కుర్రవాడు, బ్రూనో. అతనిలోని విజ్ఞానతృష్ణకు మితం లేదు. థామస్ అక్వినాస్ ఆచార్యత్వం క్రింద వుండిన యీ విహారంలోనే, సెయింట్ డొమినిక్ విహారంలోనే ప్రవేశించేడు, బాల బ్రూనో. అతనికి గ్రంథ పఠనమందు బహుతీవ్ర వ్యసనం చిన్నతనాన్నుంచీ వుండేది. సంపన్నమైన యీ విహార గ్రంథాలయంలో తప్పితే ఆతని తృష్ణను తీర్చే గ్రంథజాలం మరెక్కడ దొరుకుతుంది?

ఆ బాలుడు విజ్ఞానంకోసం ఆరాటపడుతూ, విహారమఠంలో ఆ రాతిగోడల లోపలి ప్రశాంతతలో తన ఆరాధ్య దేవత ప్రత్యక్షము కాగల దని ఆశించేడు. ఔను! నిజంగా విజ్ఞాన దేవత ఆ మఠంలోనే వుంది! ఏ నాడు ప్రప్రథమంగా రోమక వృద్ధుడు, పురుషశ్రేష్ఠుడు, కాసియోడోరస్ ప్రాచీన విజ్ఞాన సంస్కృతులను విహారమఠంలోనికి ప్రవేశపెట్టేడో ఆ నాటి నుంచీ మఠవిహారాలు వీటికి నిలయాలుగానే వుంటూన్నాయి.

విహారాల్లోని ప్రశాంత వాతావరణంలో మానవ సంస్కృతి సుఖతరంగా అభివృద్ధి చెందుతుందని అందరికివలెనే బ్రూనో కూడా అనుకున్నాడు. ఒకప్పుడు హెల్లాస్ (గ్రీసు) కొండల్లో తన యెనమండుగురు అప్పచెల్లెండ్రతో * కలిసి ఆడుతూ పాడుతూ తుళ్ళింతలాడిన యీ దేవకన్య విజ్ఞాన [illegible]

* జ్యూస్ దేవుని తొమ్మండుగురు కూతులు 'మ్యూజెస్' అనే వాళ్లు తొమ్మిది విద్యలకు, కళలకు అధిష్ఠాన దేవతలు. వీరు హెల్లాస్ కొండ కోనల్లో విహరిస్తూండేవాళ్లు. — అనువాదకుడు.

డీ విహారపు గోడలమధ్య యెంత పాలిపోయి వుంది! ఆ స్త్రీక వాదమునకు అనుగులకు మడుగు లొత్తుతూ, కలహాకంఠికి చంద్రమతి వలె సేవచేస్తూ, అణిగిపడివుంటూంది. గణగణ మని మోగే దేవాలయ ఘంటానాదములలో, ప్రార్థనా గీత ఘోషలలో విజ్ఞానదేవి కంఠస్వరం వినబడడమే లేదు! ఐహికవిషయములను త్యజించి, అసిధారావ్రతంగా జీవించే సన్యాసులే యిప్పు డీమెకు రక్షకులు, పర్యవేక్షకులూను. మహామహోపాధ్యాయుడు థామస్ అక్వినాస్, విజ్ఞానశాస్త్ర దేవతయొక్క హక్కులు, బాధ్యతలు, పరిమితులు యిల్లా వుండాలని విధించేడు.

"నీ యజమానురాలైన పరావిద్య లేక ఆత్మజ్ఞానం ముందు వినీతురాలవై, తల యొగ్గి సేవచేస్తూ వుండు. ఈశ్వరీయ జ్ఞానం కంటె మానవ బుద్ధిబలం తక్కువది గనుక తత్ఫలితమేమైన విజ్ఞానంకూడ తక్కువ తరహాదే. ఓ విజ్ఞానమా! నీవీ గోడలు దాటవద్దు. ఈ గడప దాటి బైటికి పోవద్దు! మానవుని కారణ నిరూపణాశక్తికి, తార్కిక శక్తికి పరిమితులున్నవి గనుకనే, మానవుడు సర్వమును చూడజాలడు గనుకనే నీవీ నిషేధాన్ని ధిక్కరించేవంటే, పోయిన నీ స్వేచ్ఛను తిరిగి పొందాలని ప్రయత్నించేవంటే నిన్ను కఠినంగా దండిస్తాము. స్వధర్మ ద్రోహికి, పరధర్మ ప్రియునికి మృత్యుదేవతయే స్వాగత మిస్తుంది......"

ఇల్లాంటి సూత్రాలుగల యీ విహారంలో నాలుగు గోడల మధ్యలో గియోర్డనో వుంటున్నాడు. బైటి ప్రపంచపు

సందడి, ఉల్లాసం వదలిపెట్టి, యీ గోడల మధ్యకు, నిరుత్సాహ కర వాతావరణంలోనికి యెందుకు వచ్చేడు? ఒక వీరయోధుని, కవియైన వాని పుత్రుడు బ్రూనో. ఈ ఉన్నత వంశీకుడు సన్యాసిగా ఎందుకైనాడు? దానికి జవాబు ఒక్కటే, విజ్ఞానం కోసం అన్వేషిస్తూ, బ్రూనో, యీ మఠానికి వచ్చి చేరుకున్నాడు.

మానవనేత్రం కొద్దిదూరం మాత్రమే చూడగలదు. కాని, మానవమేధ అంతకంటె యెక్కువ దూరానికి చూడగలదు. మేధోజన్యమైన విజ్ఞానంద్వారా తీక్ష్ణదృష్టిని సంపాదించి, యితరులెవ్వరూ చూడనివాటిని చూడాలని ఆతని అభిలాష! ఆ విజ్ఞానం యీ విహారాల్లోనే వుందాయె! విహారంలోని గ్రంథాలయంలో నేలనుంచి మిద్దెవరకూ బీరువాల నిండగా అసంఖ్యాకమైన గ్రంథా లున్నాయి. వాటిల్లోనే దాగివుంది, విజ్ఞానం....

ఏండ్లు గడిచిపోతున్నాయి. బ్రహ్మచారి బ్రూనో ఒకటొకటిగా గ్రంథాలు చదివేస్తూన్నాడు. బీరువాలోని పై అరలో ఒక పెద్దగ్రంథం వుంది. చాలకాలంగా దాని నెవరూ ముట్టుకోనేలేదేమో, అది దుమ్ము కొట్టుకొని వుంది. ఊగిసలాడుతూన్న నిచ్చెనమీంచి మెల్లగా యెక్కి పై మెట్టున నిల్చొని, దుమ్ము చరచివున్న ఆ గ్రంథాన్ని తీసేడు, బ్రూనో.

గ్రంథాలయంలో దీర్ఘకాలం గడపడంవల్ల బ్రూనో యెంతో లాభాన్ని పొందేడు. ఎన్నో శతాబ్దాలుగా, యెన్నెన్నో

దేశాల్లో పర్యటించి, యెందరో మహా విద్వాంసులతో మాట్లాడిన ట్లయింది! మహాకవులు, తత్త్వవేత్తలు గావించిన ఉపదేశాలను విన్నట్లయింది! అనాదికాలాన్నుంచి యింతదనుక మానవజాతి గావించిన సుదీర్ఘయాత్రను, మహాప్రస్థానాన్ని,- దేశకాలావచ్ఛిన్నమైనదే కానిండు,- ఆ మహాయాత్రానుభవాలను బ్రూనో మనోఫలకంమీద యీ గ్రంథాలు స్ఫుటంగా ముద్రించేయి. గ్రీకు తత్త్వవేత్త లాతనిని మనీషుల మార్గంలో, పండితుల పథంలో ముందుకు గొంపోయి, ప్రపంచపు ప్రాకారాల నంతకంతకు దూరదూరంగా నెట్టివేస్తూ వచ్చేరు. ఆరబ్బులు, యూదులు వారిని వెంబడించేరు. అవెర్రోస్, యీ ప్రపంచం అనంతమైన దనీ, ఆత్మ అనేది మానవ సముద్రంలో బిందు మాత్రమే ననీ బోధించేడు. మానవ వ్యక్తి మరణించవచ్చు గాని మానవజాతి అమరమైనది.

కథొలిక్ చర్చి ఫాదర్ల రచనలలోనికి లోతుగా పోయి బ్రూనో పఠనం గావించేడు. ప్రాచీన గ్రీకుపండితుల, తాత్త్వికుల తేటయైన తెలివి, తర్కబద్ధమైన కార్యకారణ వివేచన చూచిన తరువాత నీ క్రైస్తవ పరిశుద్ధ, దివ్య, సుందర, నిరాక్షేపణీయ పండితుల బోధన లెంత మసకగా కనిపిస్తాయి! పొగమంచు అంతకంతకి దట్టమవుతూంది. చుట్టూ వున్న గోడలు అంతకంతకీ దగ్గరకు మూసుకొని వస్తూన్నాయి. విశ్వమంతటా మానవేతర శక్తు లేవో నిండివున్న ట్లనిపించేది. ఆకాశంలో దివ్యులు వుండి, ఖగోళాలను త్రిప్పుతూ వుంటారు.

పాతాళంలో పిశాచాలు, యములాళ్లు వుండి, తుపానుల్నీ, యేవో అపదలనూ లోకంమీదికి పంపుతూంటారు. పోతే యింక దేవు డెక్కడ వున్నాడు? ఈ అదృశ్యశక్తుల, దివ్యలు-పిశాచాలు, వీళ్ళ పరస్పర పోరాటంలో దేవుని ఆత్మ విభక్తమై ఉండిపోయింది.

బ్రూనో, థామస్ అక్వినాస్‌ను ప్రక్కకు పెట్టేశాడు. తిరిగి ప్రాచీన పండితుల గ్రంథాల్లో మునిగిపోయేడు. అతడు అరిస్టాటిల్‌ని పరించేడు. కాని బ్రూనో చూచినది సజీవుడైన అరిస్టాటిల్‌నుగాదు; సత్యాన్వేషణోత్కంఠుడై తిరిగిన అరిస్టాటిల్‌ను, దారి తప్పుతూ, తిరిగి మార్గాన్ని కనుగొంటూ వచ్చిన అరిస్టాటిల్‌ను అతను పరించేడు. థామస్ అక్వినాస్ బుర్రలో నున్న వేదలాది ప్రశ్నలు. ఉపప్రశ్నలు, విభాగాలుతో చివరికి అరిస్టాటిల్‌నుకూడా శుష్కప్రాయునిగా, నిర్జీవమైన కట్టె క్రింద తయారు చేసేడు. అందుకనే థామస్‌ను 'దివ్యజ్ఞాని' అన్నారు!

అరిస్టాటిల్‌కి యీ ప్రపంచం యెంత సంకుచితంగా కనబడింది! భూమి జలంగా మారింది; జలం వాయువుగా, వాయువు అగ్నిగా, అగ్ని ఆకాశంగా మారినాయి. అంతా ప్రోగుచేస్తే లోకమంతా యింతే! కడపటి గోళం, తారకలచే ప్రకాశించేది యిదే. దీని తరువాత యిక లోకాలు లేవు, జీవం లేదు!......

ఊపిరి సలపక ఉక్కిరి బిక్కిరవుతూన్నాడు, తన గదిలో బ్రూనో. చుర౦గోడలే ఆతనిని మూసివైచి, నలిపేస్తూన్నాయి.

తన ఆరాధ్యదేవత, యిష్టదైవం, విజ్ఞానంకోసం యిక్కడికి వచ్చేడు, బ్రూనో. కాని, తీరావచ్చి చూస్తే, యీ మఠంలో విజ్ఞానదేవత కూడా నిర్బంధాల మధ్య నలిగి, శుష్కించి, జీవచ్ఛవంగా వున్నట్లు తెలుసుకున్నాడు.

రోజులు గడుస్తూన్నకొద్దీ ఆ విహారంలో గాలి పీల్చడమే దుర్భరమైపోతూంది, బ్రూనోకి. ఎటు చూచినా తావళపు పూసలను వ్రేళ్ళతో జారుస్తూ త్రిప్పుతూన్న సన్యాసులే. వాళ్ళని చూస్తూంటే బ్రూనోకి మహా చిరాగ్గా వుండేది. ఇక్కడ తానొక పరాయివాడు. సోదర సన్యాసులు, బ్రహ్మచారులు తన్ను అనుమానంతో కనిపెట్టి చూస్తున్నారు.

విహారంలోని ఫ్రయర్లలో (సన్యాసి సోదరులు) ఒకడు గియోర్డనో బ్రూనో భ్రాతరునిమీద నేరారోపణ గావించేడు. "అనఘమైన పవిత్రకన్య యొక్క సప్తసంతోషాలను బ్రూనో యెగతాళి చేసేశు." అనేదే బ్రూనో నేరం! మరొక సన్యాసి వచ్చి చెప్పేడు : "మహాప్రభో! చెప్పడానిక్కూడా నోరు రావడం లేదు. తన గదిలో శిలువమీాది జీసస్ ప్రతిమనొక్కదాన్నే దిగవిడిచి, మిగతా ఋషుల విగ్రహాల్ని బైటికి గొంపోయేడు!"

బ్రూనో విమతభావాలు గలవాడుగా అనుమానించబడ్డాడు. అతన్ని అనుక్షణం వెన్నాడుతూన్నా యింకా యెవరూ బ్రూనోను బాధించడంలేదు. కాలక్రమాన బ్రూనో పురోహితుడైనాడు. గుడిలో పూజా ప్రసాద కైంకర్యములు

చేయించడం, మంత్రాలు చదవడం, పుట్టినవాళ్ళకి నామకరణా దులు చేయించగం, మరణించినవాళ్ళకి అంత్యక్రియాకలాపం చేయించడం, – యిల్లాంటి నిత్యవిధు లన్నీ నెరవేరుస్తున్నా డాత డిప్పుడు.

అతడు తరచు విహారాన్ని వదలిపెట్టి, నేపుల్స్‌కు పోవాల్సి వస్తూంది. ఈ అవకాశాన్ని సద్వినియోగపరచుకోడానికి ఆత డిప్పుడు ఆతురతగా వున్నాడు. ఎందరో పండితుల్ని కలుసు కోడం; నిషిద్ధగ్రంథాలు సంపాదించడం మొదలైన కార్య క్రమంలో వుంటున్నాడు, బ్రూనో.

సరిగ్గా యీ రోజుల్లోనే కొపర్నికస్ గ్రంథం బ్రూనో చేతుల్లో పడింది. విశాలాకాశపు లోతులు కండ్లయెదుట స్పష్టంగా విప్పారుతూంటే చూస్తూ అతడు పరమానందంతో పరవశుడై పోతూండేవాడు.

నక్షత్రాలు అనంతాకాశ పథంలో యిసుక రేణువుల్లా వున్నాయి. “అసంఖ్యాకమైన తారకల్లో మన భూగోళం ఒక చిన్న చుక్కమాత్రమే! పురాతన సంప్రదాయిక భావాలను బట్టి మన భూమికి పైన స్వర్గం, క్రింద అగాధమైన నరకం వున్నాయి. ఆ రెంటి యిరుకునా పడివుంది, భూమి! ఆ భావం మరుగున పడిపోయింది. భూమి విశాలమైంది. దీనిని చుట్టుకొని దిగంతాలవరకూ అనంతమైన ఆకాశం వుంది. ఇంకా యేమిటో తెలుసా? మన భూగోళం, పక్షిలాగ, యీ అనంతాకాశంలో,

తోటి గ్రహాలతో, అసంఖ్యాక తారకలతో బాటు తేలియాడు తూంది!

అత్యంతాతురతతో కొపర్నికస్ టేబిల్స్‌ను బ్రూనో పరించ నారంభించేడు. మధ్యలో సూర్యుడు, చుట్టూ దూర దూరంగా నక్షత్రగోళాలు వున్నాయి, కొపర్నికస్ పటం ప్రకారం.

ఈ ప్రపంచపు హద్దుల్ని కొపర్నికస్ నక్షత్రమండలంవరకూ గెంటేసేడు. కాని, అక్కడికి వెళ్ళేసరికి ఆయన బెదరిపోయి, జంకుతో నిలిచిపోయేడు. ఆయన అక్కడ నిలబడిపోడానికి కారణమేమిటి? నక్షత్రాలకు వెలుపల యింకేమీ లేదని కొపర్నికస్ యెందు కనుకున్నాడు? ఎందుకు అనుకోవాలి? అరిస్టాటిల్ యిల్లా చెప్పేడనేనా? కాని, డెమోక్రిటస్, ఎపిక్యురస్, లుక్రీషియస్ మొదలైన ప్రాచీన పండితులు యీ విశ్వ మనంత మని బోధించలేదా? వారందరూ యీ సృష్టిలో యెన్ని ప్రపంచా లున్నాయో యెవరూ యెరుగ జాలమనిరే?

ఈ కడపటి హద్దుగోడను పడగొట్టడానికే తాను నియోగించబడ్డాననీ, తన కర్తవ్య మిది యనీ బ్రూనో భావించేడు. ఆత డీ రీతిగా తర్కించుకో నారంభించేడు, "ఈ ఆఖరిగోడను, ప్రాకారాన్ని కూలగొట్టాలి, పగులగొట్టి పారెయ్యాలి! ప్రపంచం అంటే మనది ఒక్కటే కాదనీ, గోళాలు అనంతము లనీ రుజువుచేసి, అందరినీ ఒప్పించాలి. సూర్యుని వలెనే

మిగిలిన నక్షత్రాల్ని కూడా అందరూ చూడగలిగేటట్లు తలుపులను తెరవాలి. ప్రతిదానికీ కారణాన్వేషణ గావించి చూపించాలి!"

. అంతే! దానితో మఠం గోడలూ, ప్రపంచపు గోడలూ కూడా అదృశ్యమైపోయేయి! చుట్టూ యెటు చూచినా అనంతావకాశం! అత డెక్కడ చూసినా అసంఖ్యాకములైన నక్షత్రాలు కనబడుతూన్నాయి. ఈ నక్షత్రాల చుట్టూ గుత్తులు గుత్తులుగా గ్రహాలు పరిభ్రమిస్తూన్నాయి. మరేమో వాటిమీదకూడా ప్రాణికోటు లున్నాయి! అక్కడ ప్రాణు లున్నట్లు మనం యెరుగనట్లుగానే, వాళ్ళూ మన వునికిని ఎరిగి వుండరు!

ఎదురుగా విస్తరించివున్న యీ బ్రహ్మాండమైన విశ్వాన్ని బ్రూనో చూచేడు. అసంఖ్యాకమైన యీ గోళాల్లో తన నివాసస్థలమైన భూగోళాన్ని గుర్తించడమే కష్టంగా వుంది! అసీమమైన ప్రదేశంలో మన గోళం మినుకు మినుకు మనే బహు చిన్న కణంగా, పరమాణువుగా వుంటుంది!

బ్రహ్మాండ పరిమాణాలు గల అనంత విశ్వంతో పోల్చి చూస్తే మానవు డెంతవాడు? ఏమీ కానేకాడా? అహాఁ! మానవుడు యీ అనంత విశ్వస్వరూపాన్ని గుర్తించిన చైతన్య స్వరూపుడు! ఒక్కసారి చూచి, దాన్ని గ్రహించినవాడు; స్వీయ బుద్ధిబలంతో ఈ విశ్వాన్ని అర్థం చేసుకున్నవాడు!

బ్రూనో సంతోషానికి పరిమితి లేకపోయింది. తన బుద్ధి, మేధస్సు విశాల మవుతూన్నట్లు, విస్తృత మవుతూన్నట్లు అతనికి తోచింది. రెండు అనంతలోకాల మధ్య తన ఆత్మ పయనిస్తూన్నట్లు తోచింది. బృహత్తర తారలూ, సూక్ష్మతర అణువులూ, బృహద్గోళాలూ, పరమాణు ప్రపంచం,— యీ రెండింటి మధ్యా తన ఆత్మ రెక్కలు చాచి, పయనిస్తూంది!

## 2. ఈ పృథ్విపై తనకు స్థానం లేదని బ్రూనో పండితునికి నమ్మకం తోచింది.

ఐనా యదార్థానికి తాను యీ భూమిమీద, ఇటలీ అనే దేశంలో, నేపుల్స్ నగరంలో, ఒక విహారమందలి గదిలో వున్నాడు. ఆతని మనస్సు ఆకాశవిహారం చేస్తూన్నా తన భౌతిక కాయం విహారంలో నాలుగు గోడలమధ్యనే వుంది!

అనంతాకాశ పథాల్లో యెగిరిపోతూన్న బ్రూనోను తోటి సన్యాసుల తీవ్రదృష్టులు వెంటాడుతూన్నాయి. ఆతడు మాట్లాడే సంగతులు వినుట మాత్రమే గాక ఆతని మనోగత భావాలను కూడా వారు పసికడుతూన్నారు. బ్రూనో సోదరుని మీద నూటముప్పై నేరాలు ఆరోపించబడినాయి. కాథొలిక్ చెర్చి బోధనల నాతడు నూటముప్పది సార్లు అతిక్రమించే డన్నమాట!

తనను సమర్థించుకోడానికై నేపుల్స్‌నుంచి రోమునగరానికి తొందరగా బైలుదేరేడు. కాని, బ్రూనో వెళ్ళిపోయిన తరువాత సన్యాసు లాతని గదిని శోధించేరు. వారి కందులో మంచి సాక్ష్యమే లభించింది. బ్రూనో ప్రయాణపు తొందరలో మరిచిపోయిన పుస్తకం, రోటర్‌డామ్ నివాసి ఎరాస్మస్ రచించిన గ్రంథం, వాళ్ళకు దొరికింది.

బ్రూనో సన్యాసి దుస్తులను వదలి, యోధునివలె అంగీని, టోపీని ధరించి, నడుముకు పటకా బిగించి, ఖడ్గాన్ని మొలలో పెట్టుకున్నాడు. సన్యాసుల 'కస్సాక్' కంటె యోధుల దుస్తులే బ్రూనోకు తగినవని చెప్పవచ్చు!

సింద్రిల్లాను రక్షించ వచ్చిన దివ్య రాజకుమారునివలె వున్నాడు, బ్రూనో. నేపుల్స్ హార్బరులో ఓడనెక్కి బైలుదేరే డాతడు. స్వచ్ఛమైన సముద్రపు గాలి సేదతీరుస్తూ వీస్తూంది. అతనికి ముందే వుంది స్వేచ్ఛ!

ఈ అవకాశం తీసికొని, బ్రూనో వివిధ దేశాలు నగరాలు పర్యటించ జొచ్చేడు. ఎవరికేనా యీ ప్రపంచం పెద్దదిగా కనిపించవచ్చును గాని బ్రూనోకి మాత్రం యిది చాల చిన్నదే!

తనకూ, తన ఆరాధ్యదేవతయైన విజ్ఞాన దేవికీ తలదాచు కొనే శరణ్యం యెక్కడేనా దొరుకుతుందేమో నని ఆతడు ఆలోచిస్తూన్నాడు. ఆల్ప్స పర్వతాలు దాటి వెళ్ళి, సిటర్లాండ్ ప్రవేశించితే స్వేచ్ఛ లభించకపోతుందా? అని బ్రూనో

భావించేడు. నిజమే! డొమినికనుల సుదీర్ఘహస్తం స్విట్జర్లాం డుకు చేరలేదు! నిశ్చయం!

బ్రూనో జినీవా నగరానికి వెళ్ళేడు. అచ్చటి స్వేచ్ఛా వాయువులను పీల్చడం యెంతి హాయి యనిపించింది! స్వేచ్ఛా భావాలు ప్రియతమమైనవే గాని, ప్రాణం అంతికంటె తీయనిది! కాని, కొన్ని దినాలు గడచుసరికి ఆశాదేవత తనను మోస గించిం దని బ్రూనో తెలుసుకొన్నాడు. రోములోని మత విశ్వాసాలకంటె జినీవాలోని మతవిశ్వాసాలు విభిన్నమైనవే గాని పరమతసహనం, స్వేచ్ఛాభావములూ యిక్కడకూడ అపురూపమైన సుగుణాలే. చుట్టూ యెటుచూసినా యిక్కడ సన్యాసులూ, పూజారులూ, బ్రహ్మచారులూ గాక చిన్న దుకాణదారులే కనబడతారు. ఆధ్యాత్మిక మతి సంబంధమైన సుగుణాలకు గాక వాణిజ్య సంబంధమైన సుగుణాలకే యీ దేశంలో పూజార్హతి వుంది! ఇక్కడ ధనవంతుడైనవాడే పవిత్రుడు, దివ్యుడు, పూజార్హుడు! ఇదే భేదం తప్ప మిగిలిన దంతా సమానమే. దురభిమానాలు, మూర్ఖవిశ్వాసాలు యితంచోట్లకి వలెనే, అంత హెచ్చుగనూ యిక్కడా వున్నాయి!

అక్కడి జనులతో మాట్లాడే టప్పుడు బ్రూనో వాళ్ళ కళ్ళలో నిగూఢమైయున్న విద్వేషాగ్నిని చూసేవాడు. ఏదీ తమ దృష్టినుంచి తప్పిపోనీయకండా నిఘా వేయడం, ప్రతీ వారిని పరీక్షించడంలో శ్రద్ధా గలవాళ్ళున్నా రని బ్రూనో

తెలుసుకున్నాడు. ఆ పట్టణంలో కొందరు ప్రత్యేకోద్యోగు లున్నారు ఎవరైనా క్రమరహిత జీవితాన్ని గడుపుతూన్నా, సంప్రదాయ మర్యాదల నతిక్రమిస్తూన్నా కనిపెట్టి మందలిం చడం వారి పని. ఈ ధర్మసంరక్షకులు పట్టణం అన్నిమూలలా వుండేటట్లూ, వాళ్ళ దృష్టి అందరిమీదా ప్రసరించేటట్లూ ఎంచుకోబడతారు. ఆదివారం యెవరేనా అటునిటు షికార్లు కొడుతూంటే చాలు, చెర్చికి బోయేవేళ దాటిందని అతనిని వారు కఠినంగా మందలిస్తారు! అంత ఖచ్చితంగా వుంటుంది, అక్కడి కట్టుబాటు!

ప్రశాంతమైన, పవిత్రమైన ఈ పట్టణంలో ప్రతీదీ యెంతో ధ్యాన యుక్తంగా, శాంతగంభీరంగా, మర్యాదాయుతంగా వుంటుంది. చిత్రవధ గావించబడిన శర్విటస్ ఆత్మ యింకా యిక్కడనే పరిభ్రమిస్తూండి వుంటుంది! శర్విటస్ ఎవ రంటారా? ఈయన స్పెయిన్ దేశీయుడు. వైద్యశాస్త్ర వేత్త. ఆదర్శప్రాయుడైన యీ శాస్త్రజ్ఞుడు, మానవశరీరాన్ని సమగ్రంగా పరిశీలించి, రక్తప్రసరణారహస్యమును కనిపెట్టాలని ప్రయత్నించేడు. మతధర్మవిరుద్ధమైన యీ పనిని శిక్షార్హంగా ప్రకటించేరు, ఇంక్విజిషన్ అనే ధర్మనిర్ణాయక సమితివారు. స్పెయిన్‌లో యీ ధర్మనిర్ణేతల బారినుంచి తప్పించుకొన దలచిన శర్విటస్ స్విట్జర్లాండుకు పలాయనమై వచ్చేడు.

రక్తప్రసరణను గూర్చి శర్విటస్ రచించిన గ్రంథానికై ఆయనను సజీవంగానే ధర్మకాష్ఠంమీద దహనంచేయడం

ఉచితమని జినీవా నివాసులైన పరమపావన ప్రజానీకం తీర్మానం గావించింది! ఆతనిని కేవలం ఒక్కసారిగా దహించి వేయడం గాకండా, వధ్యశిలకు కట్టిపెట్టి, మెల్లగా రెండుగంటల సేపు ఆతనిని వేగించి మరీ చంపేరు! విమతభావములను సహించని అట్టి చరిత్రగల దేశంలో తలదాచుకో బోవడం, దొంగబోయి తలారి యింటికి బోయిన రీతిగా వుంది. బ్రూనో పండితుడు యింకొంచెం జాగ్రత్తగా ఉండియుండవలసింది. ఆతడు మాట్లాడేటప్పుడు కూడా నాలుకను కట్టుబాట్లలో వుంచ వలసింది. తన భావాల్ని గుప్తంగా వుంచుకోడానికి బ్రూనో యత్నించనూ లేదు, యత్నించే అభిప్రాయాన్ని హర్షించనూ లేదు. ఎవడో అజ్ఞాని పండిత పరివ్రాజక వేషంలో రావడం చూసి, బ్రూనో బిగ్గరగా అందరూ వినేటట్లు చెప్పేవాడు :

"ఈతడొక వేషధారి! మోసగాడు! వీని డొక్కచించి చూచినా అక్షరంలేదే? వీడికి విజ్ఞానం ఏమిటి?"

బ్రూనో చేరిన కొద్దిమాసాలకే అతని కరపత్రమొకటి జినీవా పుస్తకశాలల్లో కనబడింది. దానిలో జినీవా వాసియైన ఒక పండిత వేషధారియొక్క మోసం, అజ్ఞానం బైట పెట్టబడి నాయి. ఇది చాలు! బ్రూనో జినీవా జైలులో బొండ కొయ్యలు రుచిచూడాల్సి వచ్చింది.

అదృష్టవశాత్తూ, బ్రూనో యింతకంటె పెద్ద తప్పు చేయు డాని కవకాశం లేకపోయింది. అందుచేత ఆతడు త్వరలోనే విముక్తిచెంది బైటపడగలిగేడు. కాని, యీ దెబ్బతో అతనికి

తెలిసివచ్చింది, జీనీవా వాస్తవ్యుల అతిధిసత్కారం మీద ఆధారపడి వుండడానికి అవకాశాలు పూజ్యమని! సరే, విశ్రాంతిరహితుడైన యీ అతిధి జినీవాను వదలిపెట్టేడు.

తౌలౌస్ (Toulouse) నగరం చేరుకుని అక్కడి విశ్వ విద్యాలయంలో ఆచార్యుడుగా కుదిరేడు, బ్రూనో. విజ్ఞాన దేవతారాధకుడైన బ్రూనో పండితునికి తౌలౌస్ విశ్వవిద్యాలయంలో గానిచో మరెక్కడ ఆశ్రయం లభిస్తుంది లెండి. అంతవరకు బాగానే వుంది.

ప్రాతఃకాలం యింకా చీకట్లుండగానే విద్యార్థులు పుస్తకాలూ, కొవ్వొత్తులూ పట్టుకుని తొందరగా ఉపన్యాస మందిరానికి వెడుతూండేవాళ్లు. యువకుడైన యీ క్రొత్త ఆచార్యుని ఉపన్యాసాలను శిష్యులెంతో ఆప్యాయంగా వింటూన్నారు. వృద్ధులైన ఆచార్యులవలె గాక యీతడు బహు పసివాడు. చింతనాశీలి. బోధనా సమర్థుడూను. వృద్ధపండితులు, ఆచార్యులు పాడిందే పాడుతూంటారు. చిలుకల్లా వల్లించడం తప్ప కార్యకారణ సంబంధమును వారు బోధించరు. స్పష్టంగా వున్నదికూడా అస్పష్టమయేలాగున పాత ధోరణిలో ఆ పండితులు బోధించేవాళ్లు! "నీటిపంపు నీళ్ళ నెందుకు తోడుతుంది? ఏ స్థలమూ ఖాళీగా వుండడం ప్రకృతికి యిష్టంలేదు గనుక. నల్లమందు యెందుకు మత్తు కలుగచేస్తుంది? మత్తెక్కించే స్వభావం, గుణం దానిలో సహజంగా వుంది గనుక." ఇదీ వాళ్ళ వరస! అంతా అయోమయపు అడవిదారి!

పాఠాలు వింటూంటే విద్యార్థులకు నిద్రవచ్చేది తమ్ము నిద్రబోగొట్టే సహజగుణం ఆ వృద్ధపండితుల ఉపన్యాసాల్లో వుందని వాళ్ళకి తోచేది! ఖాళీ యేర్పడుతుందనే భయం యిక్కడేమీ లేదు కాని, నిద్రబుచ్చే గుణమే వుంది!

ఈ కొత్త గురువు విషయం అల్లా కాదు. ఈతడుపన్యాసిస్తూంటే విద్యార్థుల కలములు పుస్తకాలమీద పరపరలాడుతూపాగేవి. బ్రూనో వాగ్ధాటితో సమానంగా ఆ కలములు పరుగెత్తగలవా? ఆయన మాటలే అల్లా వుంటే యింక ఆయన భావాల మాట చెప్పాలా? బ్రూనో భావాలు అంబరవీధిలో స్వేచ్ఛావిహారం చేస్తూ, విశ్వరూపమును ప్రదర్శించేవి!

త్రోసివేయరాని వాని నన్నిటినీ, అట్టివని భావించబడుతూన్న వాటి నన్నింటినీ ప్రశ్నించడం, సందేహించడం శిష్యులకాతడు బోధించేవాడు. అరిస్టాటిల్ కు, ఆఖరికి ప్లేటోకుకూడ విరుద్ధంగా పోవడానికి అతడు జంకువాడుగాడు.

వేయేండ్ల తరువాత యిప్పుడు మళ్ళీ దెమోక్రితస్, ప్లేటోల అనుయాయులమధ్య పోరాటం నూతనావేశంతో పెచ్చరిల్లింది. ప్లేటో గ్రంథాలు శతాబ్దులయినా సురక్షితంగానే వున్నాయి. ఆధ్యాత్మికవాదులు, మతాధిపతులూ, మతేతరశక్తులూ, ప్రభుత్వాధికారులూ అందరూకూడా ప్లేటోపండితుని గ్రంథాలను భద్రంగా వుంచుతూ వచ్చేరు. ఎందువల్లనంటే క్రైస్తవ ధర్మశాస్త్రవేత్తలవలెనే, ప్లేటో తత్త్వవేత్త విగ్రహారాధకుడైననూ, యీ ప్రపంచాన్ని దేవుడు సృష్టించేడనిన్నీ,

ఈశ్వరోద్దిష్టమైన ధర్మపథానువర్తులకు పరలోకములలో సత్ఫలములు లభించుతా యనీ బోధించేడు గనుకను.

కాని, డెమోక్రితస్ నాస్తికవాది. ఆయన గ్రంధాలపట్ల కాలపురుషునికి అనుగ్రహం కలుగలేదు. ఆ గ్రంథములలోని వాక్యాలు, భాగాలు మాత్రం అచ్చటచ్చట మిగిలేయి. ప్రత్యర్థులు ఖండనార్థమై ఉటంకరించిన చోట్లలో మిగిలిన వాక్యాలు మాత్రమే నేడు డెమోక్రితస్ బోధనలలో మనకు లభిస్తూన్నాయి. విగ్రహారాధకులూ, విగ్రహారాధకులు కాని వాళ్ళూ కూడా డెమోక్రితస్ గ్రంధాల్ని తగులబెట్టేవాళ్ళే. క్రైస్తవులూ, తదితర మతస్థులూ కూడా ఆయన బోధనలను కంటగించుకున్నవారే. *

* భారత దర్శనములలో చార్వాక దర్శనమునకు కూడా యిట్టి అవస్థే కలిగింది. చార్వాకుని భావాలను ఖండించేందుకు యితర తత్త్వవేత్తలు చార్వాకునివిగా చెప్పే కొద్ది వాక్యాలే మనకు లభిస్తున్నాయి. చార్వాకుడు కూడ భౌతికవాది లేక లోకాయతవాది. మరణానంతరం యేమీ లేదనీ, పరలోకం లేదనీ, పునర్జన్మ అసలే లేదనీ వీరి వాదముల సారాంశం. వీరి వాదనాక్రమం పూర్తిగా తెలిపే గ్రంథాలు లేవు.

శ్లో. యావజ్జీవం సుఖం జీవేత్ । ఋణంకృత్వా ఘృతం పిబేత్ ।
భస్మీభూతస్య దేహస్య । పునరాగమనం కుతః॥

శ్లో. పశుశ్చేన్నిహత స్స్వర్గం । జ్యోతిష్టోమే గమిష్యతి ।
స్వపితా యజమానేన। తత్ర కస్మాన్న హింస్యతే॥

శ్లో. పిబఖాదచ జాత శోభనే। యదతీతం వరగాత్రి తం నతే ।
నహి భీరు గతం నివర్తతే। సముదయమాత్ర మిదం కళేబరం॥

ఇత్యాది శ్లోకము లచ్చ లచ్చట లభిస్తున్నాయి.

అటువంటి దిప్పుడు వాటికి హఠాత్తుగా జీవం వచ్చినట్లైంది. భస్మంలోంచి అవి తిరిగి లేచినట్లైంది. దెమోక్రితస్ యిప్పుడు తిరిగి ప్లేటోతో వాగ్యుద్ధం సాగిస్తూన్నాడు. ఇప్పుడు మళ్ళా దెమోక్రితస్ అనుయాయులు, నాస్తికులుగా దూషించబడుతూన్నారు.

బ్రూనో తౌలాస్ నగరాన్ని వదలి, పారిస్ పోయేడు.

పారిస్‌లో హ్యూజినాట్లు హత్యగావించబడి యింకా యెంతో కాలం కాలేదు. హ్యూజినాట్‌లు పరధర్మావలంబులని నేరారోపణ గావించి, కేథలిక్ క్రైస్తవులు వారిని వధలకు పాల్జేసేరు. హ్యూజినాట్ల గృహకవాటాలమీద వ్రాసిన శిలువ గుర్తు లింకనూ చెరిగిపోనేలేదు. సీనీ నదిమీది వంతెన ప్రాంతంలో యిప్పుడిప్పుడే తిరిగి వర్తక వ్యాపారాలు చురుకుగా సాగుతూన్నాయి. ఈ ప్రాంతంలోనే యిటీవల కేథలిక్ క్రైస్తవులు, తమ దౌర్జన్యములకు వెరచి పారిపోతూన్న హ్యూజినాట్‌లను చిత్రవధలు గావించి, వారి శరీరాల్ని సీనీ నదిలోనికి విసరివైచినది! రాజభవన గవాక్షాలనుంచీ, పరిసర సౌధోపరి భాగాల నుంచీ వనితామణులు యీ దారుణ హత్యాకాండను చూసి ఆనందించేరట! అనన్యపూర్వమైన యీ రాక్షస కృత్యాల్ని కళ్ళారా చూచేందుకు ఆ స్త్రీలు అర్ధరాత్ర మప్పుడు లేచేరు. ఈ పుణ్య కార్యాన్ని చూడ్డం పడకపోతుందేమో నని వాళ్ళ భయం! మానవరక్త తర్పణ లిచ్చిన ఆ పంగగదినం, ధర్మము పేరిట పైశాచికత్వం తాండవ

మాండిన రోజు, అసహన సంకుచిత తత్త్వములకు విజయోత్సవం జరిగిన దిన మది! 1572 ఆగస్టు 23 తేదీ రాత్రి, సెయింట్ బార్తలోమ్యూ పవిత్ర దినోత్సవపు రాత్రి, కేథలిక్కులు పారిస్‌లో కూడా వేలమంది హ్యూజినాట్‌లను దారుణంగా హత్య గావించేరు.

కనీసం యీ విషయాన్నైనా బ్రూనో జ్ఞాపకం పెట్టుకుని వుండాల్సింది. అంతేగాదు. పారిస్ కీర్తి యింకా వుంది. మహా ధైర్యశాలీ, తత్త్వచింతకుడూనైన 'పీర్రీ-డీ-లా రామీ'ని పారిస్ నడివీధుల్లోనే హంతకులు చిత్రవధ గావించేరు! ఈ హంతకుల్ని డబ్బిచ్చి పురమాయించేరు. మొట్టమొదట రామీ గ్రంథాలు తగులబెట్టబడినాయి. అధికారిక మత విశ్వాసాను గుణ్యములైన అరిస్టాటిల్ బోధనలను ఖండిస్తూ, రామీ వ్రాసిన గ్రంథా లివి! గ్రంథాలను తగులబెట్టిన తరువాత గ్రంథరచయితను హత్యగావించేరు!

మొట్టమొదట అదృష్టదేవత బ్రూనోపట్ల సుముఖురాలై వున్నట్లు కనిపించింది. బ్రూనోమీద నామె చిరునవ్వు వెన్నెలలు చిందించినట్లైంది! ఆతనిని ఫ్రెంచి రాజుకు పరిచయం చేసేరు. పడుచువాడైన రాజుకు క్రొత్తది యేదైనా మంచిదే ననే భావం అస్పష్టంగా వుంది. ఆయనలో యిది కేవలం బలహీనతే గావచ్చు. విజ్ఞాన చర్చలనే యీ అపూర్వ కాలక్షేపం పట్ల ఆయన అత్యంతాసక్తి చూపేడు. రాజుగారు బ్రూనో పండితుణ్ణి ఆచార్యునిగా నియమించేరు. ఆతడు

చెర్చిలో నిత్యప్రార్థనలకూ, స్వస్తివాచకానికీ కూడా రానక్కరలేదని రాజు అనుమతించేరు !

రాజసభలో ప్రధానపండితుడై, ఉన్నతపదవినీ, బహుమానములనూ పొందగల అవకాశాలు బ్రూనో యెట్టయెదుట వున్నాయి. కాని, బ్రూనో సన్యాసియైననూ యోధలక్షణాలు గలవాడు గాని బానిసబుద్ధి గలవాడుగాడు ఇటువంటివాళ్ళకి నటించడం చేతగాదు. 'బానిసకి బడాయి వచ్చింది, బాగా పట్టరా బాకా!' అన్న సామెత విన్నారుగదూ? బానిస ప్రవృత్తి గలవాడైతే బ్రూనోకు లభించిన యీ రాజాదరణాను స్వార్థానికుపయోగించుకొనేవాడే. బ్రూనో కోరిక ఒక్కటే. విజ్ఞాన శాస్త్రములను యీ ప్రపంచంలో ప్రథమ గణ్యములుగా చేయాలనేదే ఆయన వాంఛ. విజ్ఞానదేవతను బ్రూనో అందరి యెదుటా, యెల్లప్పుడూ పొగడుతూండేవాడు. విజ్ఞానదేవతను సగౌరవంగా చూడనివారి పట్ల బ్రూనో తీవ్ర నిరసనను చూపేవాడు. అటువంటి అజ్ఞానిమీద బ్రూనో ధడీ యెడమాగా దెబ్బలు కొట్టేడన్నమాటే !

ఐతే నేమైంది ? బ్రూనో ఒంటరి, ప్రతిపక్షంలో చాలమంది వున్నారు. ప్రతికక్షులు తన్ను కటకటాల లోపల బంధించక ముందే 'శీఘ్రబుద్ధిః పలాయనం' అని ఆత డొక ఓడ నెక్కి, ఇంగ్లీషు ఛానల్ దాటి, బ్రిటన్ ద్వీపాలకి వెళ్ళిపోయేడు....

ఇప్పుడు బ్రూనో ఆక్సుఫోర్డులో వున్నాడు. ఆక్సుఫోర్డు అంటే గోత్రం. ఇది విద్యలకు నిలయం. ఆతడు యిక్కడా

ఆచార్యపీఠం మీద నే కానవచ్చేడు. బ్రూనో యిక్కడా యుద్ధములను సాగించుతూనే వున్నాడు! ఐతే యీ యుద్ధాలు కేవలం వాగ్యుద్ధాలే సుమండీ. వీటిలో కత్తులను గాక యుక్తుల నుపయోగించు తారు. దెబ్బ కొట్టాలన్నా, దెబ్బ కాచుకోవా లన్నా యిందులో శాస్త్రప్రమాణాలు, యుక్తితర్కాలు ప్రయోగించగలిగి వుండాలి! పెద్ద సభలు జరిగేవి. వాటికి బ్రిటన్‌లోని ప్రభువు లంతా, కలీను లందరూ, రాజోద్యోగులు, విదేశ రాయబారులు, పండితులు అంతా వచ్చేవారు. ఆఖరికి రాణిగారుకూడా వీటిని చూడ్డానికి వచ్చేవారు. బ్రూనో పండితుడు పదమూడు పూర్వపక్షాలు గావించి, ప్రతిపక్షులను పదమూడు సార్లూ తీవ్రంగా దెబ్బతీసేడు. ఈ యుద్ధంలో బ్రూనో ప్రతిద్వంద్వి యెవరో తెలుసా? ఆక్సుఫోర్డులోని ఆచార్యులలో ప్రప్రథముడు; ఆయన మహా పండితుడూ, బహుశ్రుతుడూ నని ప్రతీతి.

ఆక్సుఫోర్డులోని ఆచార్యోత్తముడు బ్రూనో యెదుట నిలువ లేకపోయేడు. ఆయన దగ్గర నున్న అస్త్రాలన్నీ ఐపోయినాయి. ఇక మిగిలిన దొక్కటే. 'శేషం కోపేన పూరయేత్' అన్నట్లుగా ఆయన బ్రూనోమీద అనుచిత నిందాదూషణలను కురిపించ సాగేడు. శిష్యులైన ఆయన అనుచరవర్గంవా రంతాకూడా అక్షరాలా ఆయననే అనుసరించేరు. కోపావేశంలో వాళ్ళు అంగవిన్యాసాలు గావిస్తూంటే, ఆచార్యవర్యుల శిరోవేష్టనాలు వికృతంగానూ, పొడవైన అంగీలు తటపటలాడు

త్తూనూ, ముఖములూ బూతుకూతలతోనూ సభాసదులకు విస్మయం కలిగించేయి.

చర్చ ముగిసింది. యోగ్యులైన సభికులంతా యెవరి దారిని వారు పోయేరు. కాని, విజయుడైన బ్రూనో, తన సామగ్రిని తానే ప్రోగు చేసుకోవలసి వచ్చింది. ఆతడు సభాభవనాన్నుంచి వెళ్ళిపోతూంటే కేకలూ, బెదిరింపులూ వెంబడించేయి. "పో పో! ఊరూ పేరూ లేని నీ వెవడవోయ్! అరిష్టాటిల్ కంటె పండితుడవేం? ప్లేటోకంటె విజ్ఞానివా? నీ పొగరుబోతుతనం చాలించి, దయచెయ్! నిన్ను గురించి యెవ డెరగడు? కుర్రకుంక! పొగరుబోతుతనం వదలందే! అక్కడి తరవాయి జరగాలా? ఏటి కెదురీదుట నీ తరమటలే! పో! పోరా!"

అబ్బే! ఈ ప్రపంచం అదివరకటి కంటె ఎంతో పెరిగి, విశాలమైన దన్నమాట నిజమే. కాని, యెంత పెరిగినా అది యింకా బ్రూనోవంటి వాళ్ళకు చోటు కల్పించదగినదిగా లేదు! అది యింకా సంకుచితమైనదే! ఇరుకే! బ్రూనోకు యిందులో చోటులేదు. ఐతే, ఆతడు యెక్కడికి పోవాలి?......

లండన్, పారిస్, మాగ్డిబర్గ్, విట్టెన్‌బర్గ్......

దూరంగా, యింకా దూరంగా, ఒక దేశాన్నుంచి యింకో దేశానికి, ఒక సరిహద్దునుంచి మరో సరిహద్దుకి ఈ ప్రపంచంలో యెన్ని సరిహద్దులున్నాయి? ప్రపంచ మంతా పరస్పర శత్రువుల కూటములుగా, నిరంతరం సంఘర్షించే రాజ్యాలుగా, జనులుగా విభజించబడి పోయివుంది!

బ్రూనో పండితుడు యీ మతాలలో దేనికీ చెందినవాడు గాడు. ఆయన యీ మతాతత్త్వాలకు అతీతుడు. అందుచేత అన్ని మతాలవాళ్ళూ ఆయన్ని పరాయివాణ్ణిగానే యెంచేవారు! అందరకూ ఆయన విమతస్థుడే, అన్యుడే! ఎట్ట ఎదుట అనంత విశ్వరూపాన్ని చూడగలిగిన ఆ మహాజనునికీ భూగోళంమీద కొంచెం చోటైనా లేదు! బ్రూనో, మానవుని మహాత్మ్యాన్ని గూర్చి ప్రబోధించేడు. కాని, ఆయన చుట్టూ జను లొకరి నొకరు క్రూరమృగాలకంటె హీనంగా హింసించుకుంటున్నారు!

కాని, జ్ఞానియైనవాడు తన ఆత్మ చైతన్యానికి విరుద్ధంగా, తనకంటె భిన్నుడుగా ఉండలేడు. బ్రూనో కూడ అల్లా వుండదలచుకోలేదు. రానీ, పోనీ, ఒక మానవుడు విస్పష్టంగా చూడనారంభించిన తరువాత తిరిగి అంధుడుగా జీవించడానికి యిష్టపడనే పడడు!

బ్రూనో దేశాటనం సాగుతూనేవుంది. ప్రాగా, హెల్మ్ స్టాడ్ట్, ఫ్రాంక్ ఫర్ట్,......

నగరాన్నుంచి నగరానికి, దేశాన్నుంచి దేశానికి. సాహసికులైన మేధావుల, మహాపండితుల గ్రంథాలను జనసంఘాలు నగారా నౌబత్ లతో, బాకా భోంకారాలతో నగర చతుష్పథాలలో పరశురామప్రీతి గావిస్తూన్నారు. అల్లాంటి చోట్లలో కూడ బ్రూనో నిర్భయంగా శాస్త్రవిజ్ఞానాన్ని కీర్తిస్తున్నాడు, స్వస్తివాచకాలు పాడుతూన్నాడు!

జన్మభూమి ఆకర్షణ గొప్పది. అందులోనూ తన శాస్త్ర వ్యాసంగానికి యెట్టి అంతరాయాలూ లేకండా నిర్విఘ్నంగా సాగుతుందనే ఆశ మరీ ఆకర్షవంతమైనది! బ్రూనో వెనీస్ నగరానికి వచ్చేడు. డొమినికన్ సోదరుల ధృతరాష్ట్ర కౌగిలిలో పడ్డాడు.

## 3. మానవుడు భవిష్యత్తులోనికి వీక్షిస్తాడు

ఇటలీదేశపు ఆకాశశోభను చూచి ఆనందించే అవకాశము బ్రూనో యెంతో కాలం అనుభవించలేకపోయేడు. ఆయనను వెనీస్ నగరంలోని మఠం తాలూకు ఖైదులో నిర్బంధంలో వుంచేరు. ఆ చిన్న ఖైదుకొట్టుకి ఒకటే చిన్న కిటికీ. దాంట్లోంచి చూస్తే విశాల వినీల సుందరాకాశంలోని చదరంత మేర మాత్రమే ఆయనకి కనిపించేది.

ప్రశ్నించేందుకు బ్రూనోను బైటికి తీసేవాళ్ళు. ఆయన నొక బల్లమీద కూర్చోబెట్టి, చేతులు వెనక్కి విరిచి కట్టేసేరు. ఎదురుగా ఎత్తైన వేదికమీద ధర్మాధికారులందరూ కూర్చుని వుండేవాళ్ళు. వారందరిలోకీ అగ్రేసరుడుగా, శిరోభూషణంగా, ధర్మపరీక్షకుడైన ప్రధానఫాదరు సుఖాసీనుడై వుండేవాడు. వీరు జనులకు 'ఫాదరు' లు అంటే పితరు లన్న మాట; తమలో తాము 'బ్రదరు' లు అంటే భ్రాతరు లన్న మాట. వీరు యెల్లాంటి భ్రాతరులో దేవునికే తెలియాలి!

పైతృక ధర్మం, భ్రాతృ వాత్సల్యం పేరిట వాళ్ళు యెల్లాంటి అఘాయిత్యాలను, అమానుషకృత్యాలను గావిస్తారో !

అంతా కొట్టినపిండిగా, మామూలు ధోరణిలోనే సాగింది. మొదట్లో బ్రూనోను ప్రశ్నలు మాత్రమే వేసేరు. ఆ తరువాత బాధించుటతో బాటు ప్రశ్నించడం జరిగింది. తా మెన్నడూ చేసి యుండని పనులను కూడ చేసిన ట్లంగీకరింప జేసే విధానాలు ఆ 'ధర్మరక్షకు' లకు తెలిసినట్లుగా యితరులకు తెలియవు. * భౌతిక కాయాన్ని చిత్రవధ చేయడం ద్వారా దృఢమనోనిశ్చయాన్ని శిథిలపరచి, మానవుల మనస్సులను వంచించు టెట్లో సుదీర్ఘానుభవం వల్ల యీ డొమినికన్ సన్యాసు లెరుగుదురు. అదొక ప్రత్యేక కళగా వారు అభివృద్ధి పరచేరు ! మొట్టమొదట దోషి చేతులు త్రాళ్ళతో చుట్టబెట్టి సులభంగా మెలిత్రిప్పడానికి వీలుగా కర్రను ముడిలోంచి పెట్టేవారు. దోషాంగీకారం గావించమని ఖైదీని అడిగేక, అతడు నిరాకరిస్తే కర్రను త్రిప్పి త్రాడు మెలిపెట్టేవాళ్ళు. త్రాడు బిగిసి, మాంసంలోకంటా నరదలు కోసేసి, బాధిస్తూంటుంది.

బంధితు డింకా మౌనంగా వుంటే మరో చుట్టు, యింకో చుట్టు, మరింకో చుట్టు; ఐదు, పది, యిరవై చుట్లు. దేవుని

---

* ఈ విషయంలో మతమౌఢ్యం గల వారికంటే కూడా రాజకీయ వాదులు విశాలహృదయులు గారు. ఇప్పటికీ మానవుల స్థితి యిదే. మత భావాలకి కాకుంటే మరో దానికోరకు యీ హింసాకాండ సాగవలసినదే నేమో !

యెదుట నేరాంగీకారం చేయమని బంధితుణ్ణి మళ్ళీమళ్ళీ హెచ్చరిస్తూండేవాళ్ళు. అత డింకా బింకంగా వుంటే నీటినీ, నిప్పునూ ప్రయోగిస్తారు. బాల్చితో నీరూ, కుంపటితో నిప్పులూ తీసుకొచ్చేవాళ్లు. బాల్చినీళ్లు బంధితుని గొంతులో



గెలీలియో

వుక్కిరిబిక్కిరయేలా పోస్తూ 'చస్తే నీదే తప్పు!' అనేవారు. ఎర్రగా కాల్చిన యినుప కడ్డీలతో ముఖంనిండా వాతలు పెట్టే వారు. 'వాడు దోషాంగీకారం చేయడంలేదు గనుక వాడి మీద దయాదాక్షిణ్యాలు చూపనక్కరలేదు!'

రకరకాల చిత్రవధలు, ధర్మరక్షకులైన ఫాదరులు రాత్రిం బగళ్ళు అక్కడే వుండిపోయేవాళ్ళు. తినడం, తాగడం వగైరాలన్నీ వాళ్ళకక్కడే యేర్పాటు. చిత్రవధాగారం వాళ్ళకి విశ్రాంతి గృహం, చిత్రవధలు వాళ్ళకి ఆటలు!

ఈ విధంగా బ్రూనోను చిత్రవధ గావిస్తున్నారు.



గ్రిగరీ మెండెల్యేవ్

వారం మీద వారం, ఎనిమిది వారాలు గడిచేయి.

ఆయన శరీరం మహాబాధలు పడిపోతూంది. ఖైదు కొట్టు మీద కప్పు సీసపు రేకుతో చేయబడింది. కొట్టులో దారుణమైన వేడి, తాపం, ఉక్కగాను వుండేది. శీఘ్రంగా యీ యాతనా దేహంలోంచి ప్రాణాలు పోతే యెంత సుఖంగా వుంటుంది!

కాని, ధర్మరక్షకులైన ఆ డొమినికన్ ఫాదరులకు బ్రూనో శరీరాన్ని చంపేస్తే చాలదు. వాళ్ళకి అంతటితో తృప్తిలేదు. ఆతని ఆత్మ, మనస్సు నాశనం గావాలి. వాళ్ళకు అదీ ముఖ్యం.

బ్రూనో బాధామయగాథ యింతటితో ముగిసిపోలేదు. వెనీస్‌లోని ధర్మరక్షకుల (ఇంక్విజిషన్)కు బ్రూనోలాంటి పెద్ద వేటను వదలిపెట్టడం, రోమునగరంలోని ధర్మరక్షకులకు యిష్టంలేదు. ధర్మరక్షకుల కందరకూ పెద్ద, రోమను పోప్. ఆయన ఆజ్ఞానుసారంగా బ్రూనోను రోముకు తీసికొని వెళ్లేరు. అక్కడ ఆయన శరీరాన్ని బాధిస్తూంటే ఆరు దీర్ఘవత్సరాలు గడిచిపోయేయి. బ్రూనో మనస్సు యెంత దృఢమైనదో, ఆయన విజ్ఞాన మెంత గాఢమైనదో ధర్మరక్షణా బాధ్యతను మీద పెట్టుకున్న డొమినికన్ పీఠాధిపతులకు తెలుసును. వాదనలో ఆయనను ఓడించగల తత్త్వవేత్త అప్పటికింకా పుట్టనేలేదు. అందుచేత తన్ను తానే ఖండించుకొనేటట్లు చేయాలి, బ్రూనోను. చనిపోయేముందు తన బోధనలను తానే నిరసించేటట్లు చేయించాలి! విజ్ఞాన దేవతను బ్రూనో పోగడేడు. సమర్థించేడు, ఆమె పక్షాన పోరాడేడు. అందుచేత యిప్పుడాతడు స్వయంగా అందరి సమక్షంలోనూ ఆమెను తిరస్కరించాలి, మొగాన ఉమ్మేయాలి, శాశ్వతంగా వదలివేయాలి. ధర్మరక్షకులకి కావలసిన దిది ఒక్కటే.

కాని, బ్రూనో చేత యీ పని చేయించగల చిత్రవధ లేనే లేదు! ఆయన చాలకాలాన్నుంచీ యిల్లాంటి అగ్నిపరీక్షలకు సిద్ధం

గానే వున్నాడు. అనేక పర్యాయము లాయన తన మనస్సును హెచ్చరించుకున్నాడు : "స్థిరంగా వుండుసుమా! హృదయమా! ధైర్యాన్ని కోల్పోవద్దు. వెనుకంజ వేయవద్దు. అంధకార ప్రియులైన ఈ అజ్ఞాన రక్షకులు నిన్నెంత బెదిరించినా, నీ అమూల్యకృషి ఫలించి తీరుతుంది. నిశ్చలంగా వుండు!"



చార్లెస్ డార్విన్

"చీకటినీ - వెలుతురునూ, న్యాయాన్నీ - అన్యాయాన్నీ గుర్తించగల మహోన్నత న్యాయస్థానం, కారణ వివేచన చేయగల ధర్మ నిర్ణయస్థానం ఒకటి వుంది! అక్కడ సత్య వచస్కులు, ధర్మాభిరతులు ఐన పురుషులు సాక్షిభూతులై నిలబడగలరు. నీ శత్రువులు తమ అంతరాత్మలలోనే ప్రతీకార శక్తులను చూచి గతుక్కుమంటారు!"

వసారాలో అడుగుల సవ్వడి మళ్ళా వినబడింది. తలుపు తెరచుకొని బ్రూనో యెదుట నొక ముసలి సన్యాసి నిలుచబడ్డాడు. డొమినికన్ సన్యాసుల సోదర బృందానికి నాయకుడితడు. ఆయన బ్రూనోను పిలిచి, సానునయంగా చెప్పేడు.

"నాయనా! నీ బోధన లన్నీ భూతప్రేరితములైన విమత సిద్ధాంతాలే! తప్పును అంగీకరించు. ముందు యిల్లాంటి దుష్ట సిద్ధాంతాలను బోధించనని ప్రమాణం చెయ్యి. నీ పాపాలు క్షమించుతాడు, దేవుడు."

బ్రూనో మహాధైర్యంతో జవాబిచ్చేడు :

"నేను బోధించిన సిద్ధాంతాల్లో విడిచిపెట్టాల్సిన వేవీ లేవు. ఈశ్వరుని దృష్టిలో నేను తప్పేమీ చేయలేదు. దోషాంగీకారం చేయాల్సిన పని నాకేమీ లేదు. చేయను."

ధర్మ నిర్ణేతలు తమ కడపటి సమావేశం ప్రారంభించేరు. మహారాజభవనాన్ని తలదన్నే పోప్ భవనంలోనే న్యాయ స్థానం యేర్పాటైంది. మహాధర్మాభిరక్షకుని వేదిక ముందర బ్రూనోను మోకరిలజేసి, ధర్మసభా నిర్ణయాన్ని చదివి వినిపించేరు :

"గియార్డనో భ్రాతరుని ఐహికశక్తులకు వప్పగిస్తూన్నాము. అతి ప్రశాంత విధానంలో, రక్తం చిందించకండానే వ్యవహరించవలసినదిగా ఆజ్ఞాపిస్తూన్నాము."

ఈ వాక్యాలు అతి సామాన్యంగా, అమాయికంగా, నిరపాయకరంగా కనిపిస్తూన్నా, వీటిలోని అంతరార్థం అతి భయంకరమైన దని బూ్రినోకు తెలుసును.

ధర్మరక్షకుల చల్లని మాటల మూల్యము చాలా అధిక మైనది. వీళ్ళు అతి నెమ్మదిగానే చిత్రవధలు చేస్తారు; కోపం లేకండానే గొంతులు కోసేస్తారు; కరుణతోనే కాలుస్తారు !



లనోయ్ షీర్

బూ్రినో లేచి నిలబడి, తల యెత్తేడు. ఆతని కండ్లలో తృణీకారం, నిరసనా కనబడుతూన్నాయి. వాళ్ళ నుద్దేశించి ఒక్క టే మాటన్నాడు :

"మీరు విధించిన యీ శిక్షను వినడానికి నేను పడే భయం కంటె మీరే అత్యధికంగా భయభీతులుగా వున్నారు!"

ఔను! అతనికంటె వారే అధిక భయభీతులుగా వున్నారు. తాను చనిపోతాడు. కాని, దేనికోసం తాను చనిపోతున్నాడో అదిమాత్రం జీవించే వుంటుంది. ఆయనను చిత్రవధ గావించిన వాళ్ళు కూడా యెప్పుడో ఒకప్పుడు మరణించక తప్పదు. కాని, వాళ్ళ దారుణకృత్యాలు, దుర్మార్గాలు భవిష్యత్తులో తీవ్రంగా నిరసించబడతాయి, ఖండించబడతాయి.

బ్రూనోకు మరణశిక్ష విధించబడింది. కాని, అప్పటికే యీ పోరాటంలోనికి యితరయోధులు ఉరికేరు. గెలీలియో విజ్ఞానశాస్త్ర సిద్ధాంతాల్ని సమర్థిస్తూ, తిరుగులేని వాదనలను తయారు చేస్తున్నాడు. "అరిస్టాటిల్ కంటె దెమోక్రితస్ వాదనలే తర్కయుక్తంగానూ, బాగానూ వున్నాయి." అని బల్లగుద్ది చెపుతూన్నాడాయన. నేర్పరులైన పనివాళ్ళు గాజుబిళ్ళల నరుగదీసి, నునుపుజేసి కటకములు (లెన్సులు) గా తయారు చేస్తున్నారు. ఈ గాజు బిళ్ళలను కొన్నిటిని చేర్చి సూక్ష్మదర్శిని యంత్రాన్ని, దూరదర్శినీ యంత్రాన్ని నిర్మిస్తూన్నారు, శాస్త్రజ్ఞులు. ఊహాసిద్ధాంతాల కాలం వెళ్ళిపోయింది. తిరుగులేని ఋజువులు, సాక్ష్యాధారాలు చూపించాల్సిన యుగం ఉదయించింది. ఇంతదనుక మహాజనులు తమ మనోనేత్రాలతో గాంచిన వాటిని నేడు జనులందరూ తమ భౌతిక దృష్టితోనే చూడగలుగుతూన్నారు...

క్రీస్తుశకం 1600 వ సంవత్సరం, ఫిబ్రవరి 17 వ తేదీ.

లక్షలాది రోమను పౌరులొక విచిత్ర దృశ్యాన్ని చూడ్డానికి పోతూన్నారు. అదేమిటో తెలుసా? లోకప్రసిద్ధుడైన పాపండుడు, నాస్తికుడు, విధర్మి యొకడు సజీవంగా దహించబడతాడు. పోప్, క్రైస్తవ లోకపిత, స్వయంగా, యాభై



ఇస్సాక్ న్యూటన్

మంది కార్డినల్స్‌తో సహా ఆ దహనస్థలంలో హాజరుగా వుంటాడు. క్రైస్తవ చెర్చి గావిస్తూన్న యీ మహా పుణ్యకార్య నిర్వాహకమును కన్నులారా చూడ్డానికై యెన్నెన్నో దేశాల నుంచి యాత్రికులు బైలుదేరి వచ్చేరు. వీధు లన్నీ, రోడ్లన్నీ, జనులతో నిండి, సమ్మర్దంగా వున్నాయి. ఇళ్ళ కప్పులమీద కూడా జనులు గుమిగూడి చూస్తూన్నారు.

ప్రాచీనకాలంలో మహా మైదానంలోని సర్కస్ సోపానాల మీాదికి లక్షోపలక్షలుగా రోమను పౌరులు బారులుదీరి వచ్చి కూర్చుని, క్రైస్తవులను సజీవంగా దహనం గావించడం చూస్తూ ఆనందిస్తూండేవాళ్ళు. ఇప్పుడు వారి సంతతివారే ఒకరినొకరు త్రోసుకుంటూ వచ్చి, మరో నూతన సత్యాన్ని ప్రబోధిస్తూన్న మహాజనుల్ని, దీర్ఘదర్శుల్ని తగులబెట్టడం చోద్యంగా చూస్తూన్నారు! దేవదూతలు, దివ్యపురుషులు తమ దేశంలో, తమ సంఘంలో, తత్కాలీనంగా గౌరవించబడిన దెప్పుడు? తా మెవరిని చూసి సంతసించదగునో, ఎవరు తమలోకల్లా మహోన్నతుడో అట్టి ఉత్తమవ్యక్తిమీాదనే రోమనులు తిట్లు, దూషణలు, శాపనార్థాలు గుమ్మరించేవారు, వాళ్ళనే చిత్రవధలు గావించేవారు.

ఇదిగో! ఇప్పుడు అట్లాంటి సందర్భమే మళ్లా వచ్చింది. సజీవంగా నేడు దహించబడనైయున్న యీాత డెవడో మహా ధైర్యంగా తానై నడిచిపోతున్నాడు!

బూ్రనో వదులైన అంగీ ధరించివున్నాడు. ఆ అంగీమీాద నప్పుచ్ఛములైన భూతప్రేత పిశాచాలు, నాలుకలతో నరకాగ్ని కీలల్ని వెలిగ్రక్కుతూన్నట్లు చిత్రించబడివున్నాయి. ఆయన తలమీాద వికటంగా నొక విడ్డూరపు కుళ్లాయిని వుంచేరు. ఈ విమతస్థుని జనుల దృష్టికి పరిహాసాస్పదునిగానూ, అల్పజీవిగానూ కనబడేటట్లు చేయడానికే యిల్లాంటి వేషం వేయించేరు. కాని, బూ్రనో ముఖంలో వెల్లదనం వున్నా ఆయన చూపులు

దుర్నిరీక్ష్యములై యెదుటనున్న వస్తువుల్ని వేటినీ చూడక, వాటిమీాంచి అనంతాకాశంలోనికి ప్రసరిస్తూన్నాయి. ఆయన్ని చూచేసరికి జనుల అట్టహాసాలూ, వెడవెడ నవ్వులూ అణిగి పోయినాయి.

బూ్ౕరనో బహు గంభీరుడై ప్రశాంతంగానే వున్నాడు.



మైకేల్ ఫేరడే

జనసమూహంలోంచి యెవడో అజ్ఞాని, అల్పబుద్ధి కేకేసేడు;

"అతడు కనిపెట్టిన నూతనప్రపంచాల్లోకి త్వరలోనే యెగిరి పోతాడులే! ఎంత అదృష్టవంతుడు! సుఖపడతాడు, పోనీ!"

కాని. యీ పరిహాసోక్తిని విన్నా యెవరూ పకపకలించలేదు.

బ్రూనో పండితుడు గంభీరంగా, నెమ్మదిగా నిచ్చెన మీదుగా యెక్కి వెళ్ళి, చితిమీద నిలుచున్నాడు. తలారివాడు ఆయనను వధ్యశిలకు కొంచెం వదులుగానే బంధించేడు. తలారి ముఖాన్నంతనూ కప్పుతూ ముసుగులాంటి కుళ్ళాయి వుంది. కళ్ళదగ్గరమాత్రం రెండు రంధ్రాలున్నాయి, దానికి. చంపబడనై వున్న ఆ త్యాగి, జ్ఞాని, మహాజనుడు నిర్భయంగా జనానీకాన్ని ముఖాల్లోకి సూటిగా చూస్తూంటే, ఆయన ప్రాణాల్ని హరించనున్న తలారివాడు ముసుగులో మొహం దాచుకోవాల్సి రావడం చిత్రంగాదూ?

కట్టెల గుట్టకు, చితికి, నిప్పు ముట్టించబడింది. అగ్నికి వాయువు తోడైనాడు. మంటలు నాలుకలు చాచుకుని, బ్రూనో పాదాలమీంచి వెళ్ళి, ఆయన వస్త్రాల్ని పరామర్శిస్తూన్నాయి.

సమీపంలోనే చుట్టూ నిలుచున్న సన్యాసులు, ఫాదరులు, బ్రదర్‌లు ఆతురతగా ఒళ్ళంతా చెవులుచేసికొని వినసాగేరు. బ్రూనో నోటమ్మట ఈ ఆఖరి క్షణాల్లోనైనా కరుణాక్రందనం. ఆత్మవిగర్హణం లేదా బాధతోటి జాలిమాటలు వెలువడక పోతాయా? ఏమో? కాని, వాళ్ళ ఆశలు అడియాసలైనాయి. దయకోసం ప్రాధేయబడు దీనవాక్కులను వారు వినలేదు. బ్రూనో పెదవులను దాటి ఒక్క మూలుగుకూడా బైటికి రాలేదు.

బాధతో గొంతు పగల్చుకుని వచ్చే కేకలను ఆయన యెల్లా నిరోధించుకో గలిగేడో? ఆ కడపటి క్షణాల్లో బ్రూనో దేనినిగూర్చి చింతించేడో మనకేమీ తెలియదు. కాని, తన కిటువంటి బాధలు కలుగుతా యని ఆయనకు తెలుసును. గనుకనే ఆయన ముందుగానే యీ మాటలు వ్రాసేడు: "విజయము తప్పక కలుగుతుందనే నేను ధైర్యంగా పోరాటం



బెంజమిన్ ఫ్రాంక్లిన్

సాగించేను. కాని, ఆత్మకు సహజమైన శక్తి, భౌతికశరీరానికి నిరాకరించబడింది......ఏ దేమైనను, భవిష్యత్తు నానుంచి తీసివేయజాలని దేదో నాలో ఉంది, నాకీ శక్తి నిస్తూంది."

భవిష్యత్తరాల జనులు యిల్లా అనుకుంటారు:

ఇప్పుడు మన కథానాయకుణ్ణి నూతనశాస్త్రవిజ్ఞానోదయ ప్రాంగణంలో వదలిపెట్టి వచ్చేసేము. ఆతనిని సమీపంలో నుంచి విస్పష్టంగా చూడలేదు, మనం. సూక్ష్మ కణప్రపంచాన్నీ, బ్రహ్మాండ గోళాల్నీ చూచేటందుకై నూతన సాధనాలను,- సూక్ష్మదర్శినిని, దూరదర్శినిని గెలీలియో చేతుల్లో చూచి వచ్చేసేము.



లెనిన్

ఈ గ్రంథంలో మనము ఇటలీలోని పునరుజ్జీవనము (రినై జాన్సు) ను ఊరకే స్పృశించి వదలేసేము. ఇటలీ దేశపు మహా

వదో ప్రకరణం

పురుషుడైన కాంపనెల్లా ఖైదుకొట్టులోని చీకటి కోణంలో వుంటూనే 'సూర్యనగరము'ను గూర్చి కలలు గన్నాడు! ఆయనను గురించి మనం ఒక్కమాటైనా చెప్పుకోనే లేదు. అంతేగాదు. షేక్స్పియర్, న్యూటన్, వాల్టేర్, లవోయ్‌షీర్, లీబ్‌నిట్జ్, ఫ్రాంక్లిన్, గెథే, మార్క్సు, డార్విన్ మొదలైన మహాజనుల్ని గూర్చికూడా మనం మాట్లాడుకోవాలి.

ఇందులో నూతన ప్రపంచం కనిపెట్టడం వృత్తాంతం మాత్రమే వుంది. దాని భవిష్యత్ అంతా యింకా ముందే వుందామె!

రష్యను జనులు చరిత్రరంగంమీదికి వచ్చిన దెట్లో, తమ దేశంలోని కఠోర ప్రకృతి శక్తులతో పోరాడి, యెట్లు స్వాధీనం గావించుకున్నారో చూచేము. కాని, మన మింకా యిక్కడి మహత్తరకృషిలో పురోగాములైన మహావిజ్ఞానులు లోమొనోసోవ్, పుష్కిన్, లొబచేవ్‌స్కీ, మెండెలేయేవ్, మిఛూరిన్, పాలోవ్, లెనిన్ మొదలైన వాళ్ళనిగూర్చి తెలుసుకోలేదు.

ఎన్నెన్ని పేర్లు, ఎన్నెన్ని రకాల అదృష్టాలు ఉన్నాయో, యీ పుస్తకంలో! ఎందరు మహాజనులు, ఎన్నెన్ని దేశాలు, యెన్ని జాతులు!

మానవజాతిగాథ యనే వస్త్రాన్ని కాలపురుషుడు వెయ్యి తంతువులతో నేసేడు. ప్రతి దారానికీ దాని వర్ణం దానికి వేరే వుంది! ప్రపంచమానవసంస్కృతి యనే జిలుగువస్త్రంలోనికి

ప్రతి ఒక్క ప్రజా తన ప్రత్యేక వర్ణరంజితమైన తంతువును కలిపి పెనవేస్తూ వచ్చింది. మొత్తంమీద అంతా చేసి, దీనిని బహుసుందరంగా, మనోహర వర్ణాంచితంగా తయారొనర్చేరు.



ఐన్‌స్టైన్

మనం యీ కథనాన్ని యిప్పుడు నిలిపివేస్తూన్నాము. కాని, మానవసంస్కృతి యనే యీ రమ్యవస్త్రాన్ని మగ్గమునుంచి యింకా తీసివేయలేదు. దీనికి పూర్తిగావడమంటూ లేదు. ప్రకృతి సరాసరిగా నిత్యనూతన సృష్టి గావిస్తూ పోతూ వుంటుంది. అల్లాగే మానవుని కృషీ, తత్ఫలితమైన సంస్కృతీ కూడా అనంతమైనట్టివే.

మనం తిరిగి మళ్ళా మన కథానాయకుని కడకు రావాల్సి వుంటుంది. ప్రతి శతాబ్దంతోనూ అతడు ముందుకు పోతూనే వుంటాడు. అంతకంతకు సత్యానికి సమీపంగా, ప్రకృతి రహస్యములను స్వాధీనం గావించుకుంటూ పురోగమిస్తూనే వుంటాడు. ఆదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్యసీమల గుండా నిశిత మేధాశక్తి యనే పరశువుతో మార్గం ఛేదించుకుంటూ సాగుతాడు, మానవుడు! ఆతని యీ కృషిని గురించిన గాథలు మనకెంతో ఉత్తేజకంగా వుంటాయి. కనుకనే మన కథానాయకుని దగ్గరకు మనం తిరిగి రావాల్సి వుంటుంది!

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.



# విశేష పదానుక్రమణిక